శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

50

సంపుటము ౪3 { జయ సంవత్సరము / చైత్ర.........భాద్రపద మాసములు } సంచిక ౧-3




# జయా!

శా. శ్రీ రంజిల్లెడి యాంధ్రమాత ప్రథిత ✤ శ్రీనొప్పు తద్వాణి, నా
పేరు ల్గాంచిన నన్నయాది కవితా ✤ విద్యుల్లతాజ్యోతులన్
పారోదారుల నాంధ్రరాజ్యపదవీ ✤ సంస్థాపనాచార్యులై
తారావీథి నలంకరించిన మహా ✤ త్యాగాత్ముల న్గొల్చెదన్.

చ. ముదమున మూఁడు కోటులకు ✤ ముద్దగు బిడ్డను నిచ్చి చల్లగా
నదె విజయాబ్ద మేఁగె నిఁక ✤ నర్భకుఁ బెంపఁగ దివ్యదుగ్ధముల్
బ్రిదుకు! జయా! భవత్పదము ✤ బిట్టుగఁ బట్టిన చిట్టికూనకున్
రదనము లొందుదాఁకఁ గని ✤ రక్షణసేయఁగ గట్టు మధ్యమున్.

ఉ. కన్న దినల్వదేండ్ల కిటు ✤ కాన్పులఁదప్పిన కాలమం దెటో!
నన్ను నిబిడ్డ దోఁచె నది ✤ సందును గొట్టక చిందుచిందుగా
జన్నులఁ జేపి యా విజయ ✤ చక్కఁగ దాఁటెను గాలగర్భమం
దన్నిట నిన్ను జూపి! యిఁక ✤ నన్నము గుడ్డయుఁ బెట్టవే! జయా!

చ. విజయమె గాంచుఁగాక! జయ - వింపుగఁ బెంచినఁ గాని యింతలో
రుజలఁ దొలంగి యర్భకుఁడు - రూఢిగఁ బాదము భూమి మోవఁగా
నిజముగ నేర్చునా యనుచు - నిత్యము సందియ మందె డెందముల్
విజయముఁగూర్చి రాష్ట్రశిశు - వేదనఁ దీర్చుము శీఘ్రమో జయా!

ఉ. ఉన్నది చెప్పినాఁడ నిఁక - నూరును బేరును గాంచ నెందఱో
మిన్నగ నిన్ను గొల్వ నిదె - మే లగు రాజ్య ధురీణు లీగతిం
బన్నుగ వచ్చి నీదు పద - పంకజ మానఁగఁ దచ్ఛిరంబులన్
దిన్నగ మ్రొక్కి వేడెదరు - తియ్యని దీవన లియ్యవే! జయా!.

భమిడి సత్యనారాయణ శర్మ.

---



# భావగణపతి

## అనంతపంతుల రామలింగస్వామి

ఉ. సుందరమూర్తి కృత్య మెట సుందర మౌ నట - నిన్ను బార్వతీ
సుందరి యిట్లొనర్చు టొక చోద్యము - సుందరరూపధారులై
యుందురు వేల్పు లంద, అటు లుందువు నీవ వికారరూపివై
యిం దెదియో రహస్యము వహింతు నటంచుఁ దలంపఁ జెల్లదే 1

శా. ఏ సత్కార్యము నాచరించినను మా యిష్టాప్తి కారంభమం
దాసన్ ని న్భజియింపఁ గావలయునం చాదేశమా, నేతద
భ్యాసం బే లోకో? నీ విశిష్టత యెదో? యాది న్నినుం గొల్చుచో
నో సామీ! ఫల మేమి చేకురునో మే మూహించుటచే యుక్తమా. 2

మ. పరమావశ్యక మాత్మశోధనము కైవల్యాప్తికిన్ దొల్త నే
పరిణామక్రమగామివై తుదకు సంపాదించెనో శ్రేష్టమౌ
నరజన్మంబు, నిఁ కేదియో యవధి, రాణ న్మానవుం డద్ది తాఁ
బరికింపం దగుఁ గాన నిన్నుఁ దొలిఁ గొల్వం జెల్లె లంబోదరా! 3

మ. దహరాకాశము దప్ప వే ఱెదియుఁ దొల్తం దోఁచుటే లేదు, త
ద్దహరాకాశమునుండి పుట్టె నతిహృద్యంబైన యోంకార, మీ
యిహలోకాదిసమస్తలోకములు హాయిం దోఁచె నోంకారమం
దహ మయ్యోన్,మహమయ్యో,నయ్యారె!సముద్యద్విశ్వమం దెయ్యెడన్.

చ. గఱిక జనించెముందు, లతికాదికుజాంతవనప్రపంచము
ర్వర నటుపై జనించెఁ, గ్రిమివర్గముఁ దత్సమజీవు లన్నియున్
వరుసగఁ దోఁచె, వెన్కఁ బశువర్గము నాఖువుమున్నగాఁగఁ ద
త్కరిదమున్ జనించె, వెనుకన్ జనియించె నరప్రపంచమున్. 5

క. నీ యాకారం బారయ
"ఓ"యను నక్షరము తోఁచి యోంకారంబుౙ
ధ్యేయముగా నొనరించెదు
నా యోంకారంబ మూల మంత్రకు నగుటౙ.

శా. ఆదిం దోఁచిన ధారణిందెలుపు నూహం జేయ నీ దేహ, మా
మీఁదం బచ్చని దూర్వలుౙజివురులుౙ మేల్కాయలుం బండ్లు భూ
శాదంబందునఁ దోఁచుటం దెలుపుఁ బూజాద్రవ్యముల్, వెన్క స
ర్వాదుల్ దోఁచుటఁ దెల్పు నీకడుపుపై వాసించు నాగ మ్మొగిౙ.7

క. ఎలుకను నీ వాహనముగఁ
గలభశిరము నుత్తమాంగకముగాఁ గని యా
యెలుక మొద లేన్గు దనుకౙ
వెలసిన పశుసక్రమాభివృద్ధి నరయనో.

క. కరిశిరము నరశరీరము
నరయుచుఁ బ్రాథమికనరున కారంభమునౙ
గరిసహజమాంద్య ముండుట
సరిగా నూహించి తెలియఁ జాలుట కనువో. 9

చ. పదపడి సత్కళల్ విబుధవర్గమునుండి యొకండొకండుగా
మదిఁ గొని మానవుం డిలఁ గ్రమంబుగ విద్యల కెల్ల నొజ్జయై
పొదలు నుదంత మంతకుఁ బ్రభూతకళల్ విబుధాళి నీకు న
భ్యుదయమునం దొసంగెనను పూర్వకథాంశము సాక్ష్య మయ్యెడుౙ

మ. నరజన్మోత్తరమం దెసంగెదు సదానంద స్వరూపం బటం
చరయుం దత్పరిణామసూత్ర, మది సత్యం బంచు నీ వొందు నీ
నరరూపంబును నీశ్వరత్వమును నాన్యప్రకియం జాటుఁ, ద
ద్గిరిజాంతర్యము నీదు నిర్మితిని దర్కింపంగ నిట్లొప్పదో. 11

ఉ. ఆపరిణామసూత్రమున కద్భుతరూపము గొన్న వ్యాఖ్యలా
నోపు త్వదీయమూర్తిని సమున్నతపీఠిక నుంచి ధ్యానమున్
శ్రీ పరమేశ్వరుండ వని సేయుట, మానిసి సృష్టితత్త్వవి
ద్యాపరుఁ డౌచు నైజపరమావధి సంస్మరియించుటౌఁగదా! 12

సీ. ఓకార దివ్యాక్ష రాకారతను వుర్వి
యోంకారభవ మన్న యూహ నొసఁగు
ఉర్విపై నొగిఁదొల్లి యుదయించు సస్యమున్
నీదు పూజా ద్రవ్య నికర మాదుఁ
దదుపరిఁ గ్రిమిసముత్కరజన్మముం జాటు
నీ యుదరోపరి నెగడు నాగ
మాజంతుపరిణామ మావెన్క నొగి నోట
నెలుకత్తడి యెన్గుతలయుఁ జాటు.

గీ. తుదను నరపరిణామము పొదలెనంట
నురము నుదరముఁ గాల్చేతు లరయఁ జాటు
ప్రకృతిపరిణామ బోధక భవ్యమూర్తి!
గణపతీ! నీకు నా నమస్కార శతము ! 13



# సాహి

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు

శా. స్వస్త్యస్తు ప్రథమాన దేశకవితా సాహిత్య సంపత్తియే
స్వస్త్యస్త్వాంధ్ర జనైకమత్య సుచిరప్రాప్తాంధ్రరాష్ట్రశ్రియై
స్వస్త్యస్త్వద్భుత వీరవిక్రమ విభాస్వన్నాయక శ్రేణయే
స్వస్త్యస్త్వార్యపథోపపన్న భరత స్వాతంత్ర్య లక్ష్మ్యైశ్చిరం.

చ. అమరెను నేటికిన్ సువిపులాంధ్ర వసుంధరకున్ స్వరాష్ట్ర భా
గ్యము, ఘనసాహితీమయ వికాసమునన్ భరతోర్వి నెల్ల నా
దిమ మగు కీర్తిఁ గొన్న మన తీయని బాసకు దాపురించు న
క్రమములు బాసిపోయె శుభకాలము చేకుఱెఁ దెల్గుజాతికిన్.

శా. వాచాతత్త్వ మెఱింగి ధర్మగతి సంభావించి వ్యంగ్యార్థపున్
వైచక్షణ్యము నెంచి సద్రస పరీపాకమ్ము లక్షించి శ
య్యా చాతుర్యము నాకళించి గుణదోషాకార మూహించి లో
కాచారమ్ముఁ దలంచి వ్రాయఁ దగుఁ గావ్యమ్ముల్ పవిత్రాకృతిన్.

ఉ. మానవజీవితమ్ము సుఖమార్గము గోరున యేని ధర్మ ని
ష్ఠానియమమ్ము లం గొనక సాగ దిఁకెన్నటిఁ కైన, నట్టులే
మానిత మౌ కవిత్వమును మానవజాతి సముద్ధరించు మే
ల్పూనిక నిష్ఠయున్ నియమమున్ గొనితీరును శాశ్వతమ్ముగా.

శా. దేశీయాభ్యుదయైక హేతువు ధరిత్రిన్ భాష; యా భాష నా
దేశించున్ గవిశేఖరుం;డతని శక్తిశ్రీ రసజ్ఞాదర
ప్రాశస్త్యమ్మున వాసిఁ గాంచు; రసికత్వంబున్ స్వధర్మానుగం
బై శోభిల్లును ; ధర్మమార్గమతె రమ్యంబౌట భాగ్యంబిలన్.



# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## 42 వ వార్షిక మహాసభలు

( 30-1-54; 31-1-54 )



దేశ భాష లందుఁ దెలుఁగు లెస్స

## ఆహ్వాన సంఘాధ్యక్షుని
## స్వాగతోపన్యాసము.



# స్వాగతము.

పుంజీభవించిన సాహితీస్వరూపముగఁ బ్రత్యక్ష మగుచున్న పండిత సదస్సునకు నమోవాకములు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు నలుబదిరెండవ వార్షిక మహాసభలకు మీ మెల్లర నిటకు నాహ్వానించు మహదవకాశము లభించినందులకు స్వాగతసంఘము తమ కృతజ్ఞతను దెల్పుకొనుచున్నది.

ఏ జాతి కైన నేకముగ నొనరించు ముఖ్యసూత్రము భాషయే. భూతభవిష్యద్వర్తమాన సంస్కృతులకు నన్యోన్య సంబంధములు నిల్పునదియు నయ్యదియే. ఒక యుగపుభావము మఱియొక యుగమునకు, నంతయేల, నొక వ్యక్తిభావములు వేఱొక వ్యక్తికి ద్యోతక మగుటకును భాషయే సాధనము. కాన నెల్ల కాలమునకు, నెల్ల ప్రాంతములకు నొక భాష యొకే యర్థసూచక మగునదియై యుండవలెను. అట్లు నిరవధికప్రయోజనము కల్గియుంటచే భాష నియమ బద్ధమై యుండవలసిన యావశ్యకత యే నాఁడో గుర్తింపఁబడి శాసింపఁబడినది. సంస్కృతభవము లగు నుత్తరదేశీయభాషలు పెక్కు లేర్పడుటయు, ద్రావిడభాషాభవము లగు దక్షిణదేశభాష లనేకము లేర్పడుటయు, నొకే భాషను భిన్న భిన్న ప్రాంతీయులు వాడుకొను మార్పులవలనఁ గల్గినవను సిద్ధాంతమును భాషాశాస్త్రజ్ఞులు నిర్వచించియున్నారు. అట్లేర్పడిన వివిధ భాషలలోను మఱల విచ్ఛిత్తి యేర్పడకుండుటకై ప్రతిభాషకు వ్యాకరణము, నర్థనియమములు నేర్పడినవి. తెల్గుజాతి ఛిన్నభిన్నములు గాక, యొకే జాతిగ సంవర్ధిల్లవలె నన్నను, భాషాప్రయోజనము నిరర్థకము గాకుండవలె నన్నను, భాషా స్వరూపమును సరి యగు నియమముల నుంచుట యావశ్యక మనునది యెల్ల రెఱింగినదియే.

ప్రపంచమున నన్నిరంగములలోను విపరీత పరిణామములు, విప్లవములు గమనించుచున్నాము. భాషా విషయికముననువాని ప్రభావము లేక పోలేదు. అన్యభాషా సంపర్కమువలన నేమి, విశేషించి యాంగ్లేయ భాషాప్రభావమువలన నేమి, మన వాఙ్మయమునను గూడ నూతన వికాసోదయ మైనది. సంస్కృతేతిహాసముల భాషాంతరీకరణముతోఁ బ్రారంభించి, పురాణ ప్రబంధ రచనలతో నడలు సాగిన యాంధ్ర సాహితీరంగమున నించుమించు నూరేండ్ల నుండియు నాటకములు, నవలలు, చరిత్రలు, పాటలు, పదములు, సాంఘిక, రాజకీయాధ్యాత్మిక వ్యాసంగములు, విజ్ఞాన విషయిక వ్యాస రచనలు, బాల రచనలు, కథలు, కథానికలు, ఖండకావ్యములు-ఎన్నెన్నో నవ్య స్వరూపములఁ దాల్చి యాంధ్ర భాషా స్రవంతి జాతి జీవితౌన్నత్యమునకు సహకారిణి యగుచున్నది.

మా చిన్ననాఁట, దేశభాష లభ్యసించుటయుఁ, దెన్గు గ్రంథములఁ జదువుటయు సభ్యతాదూరు లగు పల్లెటూరి ఛాందసుల లక్షణముగఁ దృణీకరించుచుండెడివారు. అదృష్టవశమునఁ గొన్ని యేండ్లనుండి జాతీయ స్వాతంత్ర్యాభిమానములతోఁ బాటు, స్వభాషాభిమానావశ్యకతయు గుర్తింపఁబడి నేఁటికి విశ్వవిద్యాలయములును దానికిఁ బ్రాధాన్యమిచ్చుచున్నవి.

పాశ్చాత్య నాగరికతా ప్రభావము సోఁకిన పట్టణము లెట్లున్నను జాతిజీవనము ప్రతిబింబించు పల్లెలు మన వాఙ్మయమును, మన భాషను ముల్లెగట్టి మన కప్పగించినవి. ముద్రాశాలలు లేని దినములలో, కాగిత మెఱుఁగని దశలలో, భావియుగములకై రాజరాజుల మన్ననలఁ గన్న వాఙ్మయమును, రాయలచే "దేశభాష లందుఁ దెల్గు లెస్స" యను మెప్పు నార్జించుకొన్న సాహిత్యమును, బర భాషా ప్రాంతముల యేలికలై నివసించు చుండియు నాంధ్ర భాషా పక్షపాతమును విడలేక స్వయముగఁ గబ్బముల రచించియుఁ బండితులను గవులను

బోధించియు, ననేకోద్గ్రంథములు వెలయించిన దక్షిణాంధ్రనాయకులు భాషాపోష కొనరించిన సేవయుఁ దాళపత్త్రముల నెట నెటనో పడియుండి యస్మదాదు లగు సామాన్యులకు దుర్లభముగ నుండెడిది. అట్టి తాళ పత్త్రముల నెల్ల సేకరించి, యముద్రితములు, దుర్లభములు నగు నుత్కృష్ట రచనలను జనసామాన్యమునకు నందునటుల ముద్రించి ప్రకటించుట యత్యావశ్యకము. భాష కొక సమగ్ర మగు నిఘంటువు ముఖ్యము. జాతిచరిత్ర, భాషాచరిత్ర, వాఙ్మయ చరిత్ర, వ్యాకరణము, భాషాభివృద్ధికిని, వాఙ్మయాభివృద్ధికిని, దోహద కర మగు వ్యాసంగముల కను వగు సభలుఁ, బ్రత్యేక పత్త్రిక, మున్నగువాని యావశ్యకతను గుర్తించిన శ్రీ జయంతి రామయ్య పంతులుగారు, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు, శ్రీ కొమరారాజు వేంకట లక్ష్మణరావు గారు మున్నగు పండిత ప్రకాండులుఁ బండిత పోషకులు, విద్యాభిమానులుఁ బండిత ప్రభువులు నగు శ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ మహారాజా రావు వేంకట మహీపతి సూర్యారావు బహద్దరు వారు; వేంకట గిరి సంస్థానాధీశ్వరు లగు శ్రీ శ్రీ శ్రీ మహారాజా వెలుగోటి రాజగోపాల కృష్ణయాచేంద్ర బహద్దరు వారు, బొబ్బిలి సంస్థానాధీశ్వరు లగు శ్రీ శ్రీ శ్రీ రావు శ్వేతాచలపతి బహద్దరు వారు మున్నగు దేశాభిమానుల సత్సంకల్ప ఫలితమే యీ యాంధ్రసాహిత్య పరిషత్స్వరూపము దాల్చినది. ఆ నాఁడు మన నాఁటఁ గల జమీందారు లెల్లరు భాషాభిమానముతోఁ బాటు పరిషదుద్ధరణమునకై పూనుకొనిరి. అపూర్వ మగు లక్ష్మీ సరస్వతుల సాహచర్యము సమకూడినది. పరిషద్వ్యవజ్జీవాధ్యక్షు లగు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర సంస్థానాధీశుల నిరవధి కౌదార్యాభిమానముల వలన, వ్యుత్పత్తి నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థము వివరించు సమగ్ర మగు సూర్యరాయాంధ్ర నిఘంటు రచన పూర్తి యై నాల్గు సంపుటములు ముద్రితము లై, తక్కినవియు

ముద్రణములో నున్నవి. తెల్గుదికిఁ జైంగా సముద్రితము లగు నపూర్వగ్రంథము లీ పరిషత్తుచేఁ బ్రకటింపఁ బడినవి. దేశచరిత్రకును, భాషకును సంబంధించిన యమూల్యము లగు శాసనము లెన్నియో యంథకారము నుండి వెలికిఁ దేఁబడినవి. ఆంధ్ర చరిత్ర సంస్కృతి భాషా సంబంధము లగు పరిశోధనలకు, విమర్శనలకు, నముద్రిత సారస్వత ప్రకటనలకుఁ బరిషత్పత్రిక చేయుచున్న సేవ యనల్పము.

మహా సంగ్రామ కాలమున జాతిజీవితమునం దన్ని రంగములఁ గల్గిన యాఘాతముపలెనే, భాషావిషయిక కృషియందుఁ గూడఁ గొంత మాంద్య మేర్పడినది. అది తాత్కాలికమే. జాతీయస్వాతంత్ర్య మేర్పడి జాతీయాభివృద్ధికరము లగు పదకములు పెంపొందించుటతోఁ బాటు, జాతీయభాషాభివృద్ధికి నుత్సాహముఁ జైతన్యముఁ గల్గినది. సంస్థానములలోఁ గల్గిన మార్పులవలన నార్థికముగఁ గ్లిష్టపరిస్థితు లేర్పడినను సూర్యరాయాంధ్ర నిఘంటువునఁ దక్కుంగల సంపుటముల నతిత్వరలో ముద్రింపించి, పరిషత్తున కొసంగుటకై, యీ పరిషద్వ్యావజ్జీవాధ్యక్షుల కృషియుఁ గార్యదీక్షయు, నాంధ్రజాతియెడను, దెల్గుభాషయెడను వారికిఁ గల నిరవధిక ప్రేమాదరములు సూచించుచున్నవి. అట్టి మహామహులగు భాషాభిమానుల యవలంబనము లేకున్న నిట్టి మహాత్కార్యముల సాధించుట దుర్ఘటము. కాలవాహినితోఁ గల్గిన మార్పులతోఁ బాటు నిట్టి సంస్థలకు నికఁ బ్రభుత్వపోషణముఁ బ్రజాదరణము నత్యావశ్యకము.

ఆంధ్రరాష్ట్రావతరణముతో నాంధ్రజాతి జీవితము విశిష్టతను బొందు దినములు వచ్చినవి. నేఁడో రేపో మద్రాసు ప్రాచ్యలిఖితభాండాగారము నందలి తెల్గువాఙ్మయమును,తంజావూరి సరస్వతీమహాలునందలి తాళపత్త్రరూపమున నున్న మన సారస్వతమును విడదీసి మనకు నప్పగింపవలసియున్నది. అట్టివానిని సాధ్యమైనంత త్వరలో మన రాష్ట్ర

మునకుఁ దరలించి, భద్రపఱచి, పత్రికటితము లొనరింపకున్న నిర్లక్ష్యమున శిలమై పోవు దుర్గతి వాటిల్లును. వానిని దెచ్చుకొన్నను,దత్పరిశీలనమునను, సంరక్షణమునను బత్త్యేకానుభవము గల సంస్థల యధీనమున లేకున్నఁ బెంటప్రోగుల పా లగుటయు సంభవించును. నలుబది రెండేండ్ల నుండియుఁ దాళపత్త్రగ్రంథసంపాదనమున, నేతత్సంరక్షణమున, వానినుండి వ్రాఁతప్రతులు సిద్ధపఱచుచు సాధ్యమైనన్నిఁటిని ముద్రించు కార్యమునఁ దమ సర్వశక్తుల వినియోగించుచున్న యీ యాంధ్రసాహిత్యపరిష త్తొకటియే యీ కార్యనిర్వహణమునకు దక్షత కల్గియున్నది. ఆంధ్రరాష్ట్రప్రభుత్వ మమూల్య మగు నా ప్రాచీన తాళపత్త్రభాండాగారము దెప్పించి, యాఁధ్రసాహిత్యపరిషత్తునకు నప్పగించి, దాని సంరక్షణమునకును, బ్రచురణమునకును సముచితరీతి సాహాయ్య మొనరింపకున్న నాంధ్రసంస్కృతికి మూల మగు నొక ముఖ్య విజ్ఞానఖని నాశమందును. ముద్రణవ్యయములు విపరీతముగఁ బెరుగుటవలన, ముద్రింపవలసిన గ్రంథములన్నియు వెలువడుట కష్టసాధ్యముగ నున్నది. అందు కవసరమగు ధన సాహాయ్యము ప్రభుత్వమును బ్రజలును గూడ సమకూర్పవలెను.

వాఙ్మయవీథిలోఁ గూడ, మానవజీవితమున వివిధ విషయముల వలెనే కొన్ని యేండ్లనుండియు విప్లవములు గమనించు చున్నాము. భాష సుబోధకముగ నుండవలె నను విషయ మంద ఱంగీకరించునదే. రుచిభేదమును బట్టి నారికేళ, కదళీ, ద్రాక్షాపాకము లనాదినుండియుఁ బ్రచారమున నున్నవే. అందే యొక్కటియో విశిష్ట మైన దని కాని, మిగిలినవి దుష్టము లని కాని యనుట సమంజసము కాదు. వ్యక్తి శక్తి సామర్థ్యముల బట్టియు, సహృదయత ననుసరించియు, సాహిత్యమునందలి విశిష్టానుభూతి నొందుచుందురు. సౌలభ్యము పేరిట వాఙ్మయమును నిర్జీవముఁ, బేలవము, నిరర్థకముఁ జేయఁదగదు. శృంగారమో ప్రణయమో మాత్రమే కథావస్తువుగాఁ గొన్న పూర్వరచనలు గాని, యాధునిక వాఙ్మయములు గాని సాహిత్యపూర్ణ స్వరూపములు గావు. జీవిత వికాసమునకు, మానవౌన్నత్యమునకు, జాత్యభ్యుదయమునకు, దోహద

కరములగు రచన లన్నియు సాహిత్యాంగములే. అపురూప మగు సత్య ములను బ్రకటించు రచనలు మధుయుత మగు తిక్తౌషధము వలె రస మయము లైన నాఁడే స్వాద్యము, హృద్యము నగును.

భాషా సేవలోఁ బద్యము లల్లువారికిఁ దావు కలదు. కథలు చెప్పు వారికి స్థానము కలదు. నాటకములు నిర్మించు వారికిఁ జోటు కలదు. సాంఘిక రాజకీయ చారిత్రి కార్థి కాధ్యాత్మిక వైజ్ఞానిక వ్యాసంగ ములు ముఖ్యములే. గేయములు, పదములు, పాటలు, విమర్శనములు భాషాంగములే. వివాదములే లేకున్న విజ్ఞానాభివృద్ధియే లేదు. 'స్పర్ధ యా వర్ధతే విద్యా' అని కదా యార్యోక్తి. వే యేల? వాఙ్మయ మున సర్వతోముఖాభివృద్ధి కావలయును. భాషావిషయక పరిశోధనల కుపయుక్త మగు సాధన సంపత్తి యితోఽధికముగ సేకరించి కృషి చేయు నేకైక సంస్థ యగు నాంధ్రసాహిత్య పరిషత్తున కా రంగమున సాధింప వలసిన కార్య మింక నెంతయో యున్నది. దాని కవధి లేదు. నిరంతరముగా నా కృషి జరుగు చుండవలసిన దే.

సామరస్యము, కార్యదీక్ష, యభివృద్ధికి ముఖ్యము లగు నంగ ములు. భిన్న భిన్న వాదముల వారలు వాదోపవాదములకే కాలమును, దమ సామర్థ్యములను రిత్త పుచ్చుటకన్న దేశ సౌభాగ్యమునకు, భాషాభివృద్ధికి, వాఙ్మయ సౌష్ఠవమునకు నుపకరించు రీతిని సామరస్య ముతో మెలఁగుట యత్యంతావశ్యక మని విజ్ఞప్తి చేయుచున్నాను. ఎన్నియో వేనకు వేలుగా గ్రంథములు వెలువడుచున్న నే కాలక్రమ మున నుత్కృష్టము లగు కొన్నిఁటి కేని చిరజీవత్వము లభించును. భాషాభి మాను లెల్లరును మన భాష, మన సారస్వతము, మన జాతి చిరంజీవులై పుష్టికర మగు నట్లు తమ సర్వశక్తులను ధారవోయుదురు గాక యని వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను.

కవిసార్వభౌములు, మహామహోపాధ్యాయులు, నాస్థాన కవీశ్వ రులు, నీ పరిషదధ్యక్షులు నగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు, సాహిత్యసంగీత రంగముల ప్రఖ్యాతులు శేముషీధురంధరులు నగు శ్రీరాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారు, విశ్వవిద్యాలయ భాషా

శాఖాధ్యక్షులు, భాషాశాస్త్రవేత్తలు శ్రీగంటి జోగి సోమయాజులు గారు, చారిత్రిక పరిశోధన తపస్వులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, ఈ సభల కధ్యక్షతల కంగీకరించుట మన యదృష్టము.

ప్రభుత్వ కార్యకలాప నిమగ్నులయ్యు, మాతృభాషాభిమాన మున, రసైకపక్షపాతమున, ఆర్థికామాత్యులు శ్రీ తెన్నేటి విశ్వ నాథముగారీ విద్వత్సభలకుఁ బ్రారంభకులుగ విచ్చేయుట మఱల నొక మాఱు లక్ష్మీ సరస్వతుల సాంగత్యము పరిమత్తున కబ్బిన ట్లానం దించుచు నందఱి పక్షమున మా కృతజ్ఞతాపూర్వక స్వాగత మందఁ జేయుచున్నాను.

మా యాహ్వాన మంగీకరించి కేవల భాషాభిమానమున నెంతె యో దూరప్రదేశములనుండి యీ సభలకు విచ్చేసిన మహామహుల కందఱకు హృదయపూర్వక మగు

స్వాగతము

విధేయుఁడు,
దంటు సూర్యారావు.
ఆహ్వాన సంఘాధ్యక్షుఁడు.

కాకినాడ,
30-1-54

ఆంధ్రప్రచారిణి ప్రింటింగువర్క్సు, కాకినాడ.

  

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## 42 వ వార్షిక మహాసభలు

### 30-1-54 ఉదయము



దేశ భాష లందుఁ దెలుఁగు లెస్స

## సభాప్రారంభకుల యుపన్యాసము



# ప్రారంభకోపన్యాసము.

అధ్యక్షా! మహాజనులారా!

ఆంధ్రరాష్ట్రావతరణ శుభ సంవత్సరమున నీ యాంధ్రసాహిత్య పరిషదుత్సవము, కార్యస్థానమైన కాకినాడ పురమునందే జరుగుట ఆంధ్రసాహిత్యముయొక్క భావిభాగ్యోదయమును బొడసూపుచున్నది. ఆంధ్రసాహిత్యపరిషత్తు 1911 వ సం॥రము మే నెల 12 వ తేదీని చెన్న పట్టణమునందుఁ బ్రతిష్ఠింపఁబడినది. అనఁగా నలువదిమూఁడు సంవత్స రముల పూర్వముననే యీ పరిషత్తు స్థాపింపఁబడినది. ఆంధ్రసాహిత్య మును బెంపొందింపఁజేయుటకై స్థాపింపఁబడిన మొదటిసంస్థ యిదియే. దీనిని స్థాపించుటకై సకల ప్రయత్నములు చేసి, కృతకృత్యులైనవారు శ్రీ జయంతి రామయ్యపంతులు గారు. ఈ పరిషత్తు స్థాపించుటకుఁ బెక్కు రాంధ్ర మహాపురుషులు విశేషముగాఁ దోడ్పడిరి. అట్టివారిలో నగ్రగణ్యులైనవారు పిఠాపురం మహారాజావారు, వెంకటగిరి మహా రాజావారు, బొబ్బిలి మహారాజావారు మున్నగు జమీందారులును, కందుకూరి వీరేశలింగం పంతులుగారు, వేదం వేంకటరాయశాస్త్రిగారు కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, కిళాంబి రాఘవాచార్యులుగారు, మోచర్ల రామచంద్రరావుగారు మున్నగు కవి పండితులు విశేషముగాఁ దోడ్పడిరి.

ఈ పరిషత్తుయొక్క ముఖ్యోద్దేశములు కొన్ని—

1. తెలుఁగు వాఙ్మయము నభివృద్ధి నొందించుట.

2. తెలుఁగు భాషలో లక్షణసహితముగా నర్థమును వివరించు సమగ్రమగు నిఘంటువు నొకటి ప్రచురించుట.

3. తెలుఁగు భాషయందొక పరిపూర్ణమైన వ్యాకరణమును బ్రచురించుట.

4. తెలుఁగు దేశ చరిత్రమును బరిశోధన చేయించి, సవిస్తర ముగా నాంధ్రుల చరిత్రమును బ్రకటించుట.

5. ఆంధ్ర భాషలోని మంచి గ్రంథములను బండిత పరిష్కారము చేయించి, నిర్దుష్టముగాఁ బ్రకటించుట.

6. తెలుఁగు వాఙ్మయమునకు, చరిత్రకు సంబంధించిన విషయములను జర్చించు పత్త్రికను బ్రకటించుట.

7. తెలుఁగు వాఙ్మయమునకు సంబంధించిన విషయములను గూర్చి చర్చించుటకుఁగాను, సాంవత్సరిక సభల నేర్పాటు చేయుట.

దీనిని బట్టి చూడఁగా నీ పరిషత్తాంధ్రభాషాసేవ చేయుటకై మహత్తర మైన యాదర్శములపై స్థాపింపఁబడినది.

సమగ్ర మైన తెలుఁగు నిఘంటువును వ్రాయించుటకుఁగాను, ఆంధ్రభోజ బిరుదాంకితులగు శ్రీ పిఠాపురం మహారాజావారు దేశమునందలి గొప్ప పండితులను రప్పించి, పీఠికాపురమున నొక పెద్ద భవనమున నిఘంటు నిర్మాణకార్యస్థానమును స్థాపించి, ఒక గొప్ప నిఘంటువును వ్రాయుట కేర్పఱచిరి. అది యిప్పటికి 25 సం॥ల పైఁబడి యారంభమైనది. అది యిప్పటివఱకు 'స' వఱకు నాలుగు పెద్ద సంపుటములుగాఁ బ్రకటింపఁబడినవి. దీనికిఁ గాను శ్రీ పిఠాపురం మహారాజావారు రమారమి రెండు లక్షల రూపాయిలు వ్యయపఱచిరి. ఇట్టి యపార భాషాసేవ చేసిన శ్రీ పీఠికాపుర మహారాజావారు ప్రశంసనీయులు. తక్కుంగల నిఘంటువును శ్రీ పీఠికాపుర మహారాజావారచ్చువేయించి, ఆంధ్రభాషాయోష కొక యమూల్యాభరణముగా సమర్పింతు రని యాశించుచున్నాను.

తెలుఁగునఁ గొన్ని వ్యాకరణము లున్నను,అవి సమగ్రముగా లేనందున, సత్కవికృత గ్రంథములను జక్కఁగాఁ బరిశీలించి, సమగ్ర మైన వ్యాకరణ మొక్కటి రచియింపవలసియున్నది. అందులకుఁగా, నీ పరిషన్మతాను సారముగాఁ బరిషత్తువారు నియమించిన పండితులచే నీ కార్యము నెఱవేరవలసియున్నది.

ఆంధ్రుల చరిత్రను వ్రాయుటకు బెక్కురు చారిత్రిక పరిశోధకులు విశేష పరిశ్రమ చేసి గ్రంథములను బ్రకటించిరి. కాని, యింత వఱకు సమగ్ర మైన చరిత్ర యేదియుఁ బ్రకటింపఁబడలేదు. ఇంకను

నాంధ్రి చరిత్రగుఱించి విశేష పరిశోధన చేయవలసియున్నది. ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము ప్రప్రథమముగా మనకుఁ గావలసినది యాంధ్రుల చరిత్ర. ఇట్టి చరిత్రను వ్రాయించుటకుఁ బ్రభుత్వమువారు సంకల్పించి, వ్రాయించుట కేర్పాటు చేయవలెను. ఇట్టి మహత్తర కార్యము నీ పరిషత్తువారి యాధ్వర్యముననే జరుగవలసియున్నది. మఱియు, నాంధ్రవాఙ్మయ చరిత్ర,ఆంధ్రరచయితల చరిత్ర గూడ మిక్కిలియావశ్యకము. శ్రీ కందుకూరి వీరేశలింగంగారు, శ్రీ చాగంటి శేషయ్యగారు మున్నగువారు తెలుఁగు కవుల చరిత్రను విశేష పరిశోధన చేసి వ్రాసినను,ఒక సమగ్రమైన యాంధ్రవాఙ్మయ చరిత్ర యీ పరిషత్తువారిచే వ్రాయింపఁబడవలసియున్నది.

ఈ పరిషత్తు పూర్వ మముద్రితములుగా నుండిన గ్రంథములను బ్రకటించి యాంధ్రసాహిత్యమునకు విశేషసేవ చేసినది.అట్టి గ్రంథములలోఁ గొన్ని- విప్రనారాయణ చరిత్రము, కవిజనాశ్రయము, శివతత్త్వసారము, శివరాత్రి మాహాత్మ్యము,జైమినీ భారతము, ఆంధ్రశబ్దచింతామణి, కావ్యాలంకార చూడామణి మున్నగునవి. మఱియు,నీపరిషత్తువారు ప్రాచీన శిలాశాసనములం దిమిడియున్న 287 తెలుఁగు పద్యములను బ్రకటించిరి. అట్టిపద్యముల నింకను పరిషత్తు సేకరించినది.ఇంకను సేకరించుటకుఁ బ్రియత్నము సేయుచున్నది. ఇట్లు సేకరించిన పద్యములను బ్రకటించుటకు విశేష ప్రయత్నములు చేయుచున్నది. ఈ పరిషత్తనేకాముద్రిత గ్రంథములనే గాక, తాళ పత్త్రి గ్రంథములను గూడ ననంఖ్యాకముగా సేకరించి యొక పెద్ద పుస్తకభాండాగారము నేర్పాటు చేసినది. ఇట్లు సేకరించిన తాళపత్ర గ్రంథములయిదు వేలవఱకు నున్న వన్న మిక్కిలి యాశ్చర్యకరమైన విషయము. ఈతాళపత్ర గ్రంథములలోఁ గొన్ని యమూల్యములైన గ్రంథములు గూడఁ గలవు. ఇట్టి గ్రంథములను బరిషత్తువారు దీక్షతో మిక్కిలి శ్రమపడి ప్రకటించుచున్నారు. ఇట్లు సంపాదించిన గ్రంథములలో 371 భారతప్రతులు గలవు. ఆంధ్రవాఙ్మయమునకు నాంధ్ర మహాభారతము పునాది వంటిది.

ఇప్పుడు ప్రకటింపఁబడిన భారతగ్రంథములలోఁ బెక్కు పాఠభేదములు కనఁబడుచున్నవి. ఈ మహాభారతసంపుటములను బరిషత్తువారు పరిశోధించి నిర్దుష్టమైన యొక మహాభారతగ్రంథమును బ్రకటింప సమకట్టిరి. మొదట నుద్యోగపర్వమును బ్రకటించిరి. ఈ విధముగా పరిషత్తువా రాంధ్ర మహాభారతమునకు సరియైన పాఠమును నిర్ణయించి, ప్రకటించినచో నాంధ్ర వాఙ్మయమునకు గొప్ప సేవ చేసినవా రగుదురు. ఈ కార్యము నెఱవేర్చుటకై విశేషధన సాహాయ్య మవసరము.

ఈ పరిషత్తువారు చేయుచున్న పరిశోధనలను బ్రకటించుటకై పరిషత్తువా రాంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక యను నొక పత్త్రికను బ్రకటించుచున్నారు. ఇందుఁ బెక్కుమూల్యము లైనవ్యాసములు, అముద్రితగ్రంథములు ప్రకటింపఁబడుచున్నవి. ఈ పత్త్రిక ఆంధ్రభాషలో వెలువడు పత్త్రికలలో నగ్రగణ్యమైన దని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఇప్పటిలో నిది రెండు నెలల కొకసారి మాత్రమే వెలువడుట మిక్కిలి శోచనీయము. ఈపత్త్రిక కనీసము నెల కొకమారైనను బ్రకటింపఁబడవలెను. అందులకుఁగాను, ధనసాహాయ్యము గూడఁ గావలసియున్నది.

మఱియు నీ సాహిత్యపరిషత్తు చరిత్ర చూచినచోఁ దెలుఁగు భాష బహుభంగుల మాఱిపోయి, పతనాభిముఖమై పోవునపుడు స్వచ్ఛమైన గ్రాంథికభాష పునాదులపైననే నిల్పి, ఆంధ్రసాహిత్యమును గాపాడిన విషయ మెల్లరకు విదితమే. గ్రామ్య, వ్యావహారిక, భాషలకుఁ బ్రాధాన్య మీయవలయు నని పెక్కురు గట్టి ప్రయత్నము చేసినను, వారి వాదములను ఖండించి, గ్రంథములందు గ్రాంథికమే యుండవలయు నను వాదమును సర్వజనామోదముగాఁ జేయఁగలిగిరి. వీని నన్నింటిని బట్టి చూడఁగా, నీ యాంధ్రసాహిత్య పరిషత్తాంధ్రభాష కపారమైన సేవ చేసిన దని చెప్పక తప్పదు. ఈసంస్థకు పెక్కు జమీందారులు తోడ్పడి యాంధ్రభాషకు గొప్పసేవ చేసిన విషయ మెల్లరకుఁ దెలిసినదియే. కాని, జమీందారీలను బ్రభుత్వమువారు స్వాధీనము చేసికొనుటచే జమీందారు లిపుడు, పూర్వమువలె భాషాసేవ చేయుట కిట్టి సంస్థలకు ధనసాహాయ్యము చేయలేకపోవుచున్నారు. తమ యాస్థానము

లలో నున్న కవులను బోషింపలేక పోవుచున్నారు. ఇందువలనఁ దెలుఁగు భాష క్షీణించిపోవుటకు సూచన లేర్పడుచున్నవి. జమీందారీలను స్వాధీనము చేసికొనునపుడా జమీందారులచేఁ బోషింపఁబడు విద్యా సంస్థలుకూడ ప్రభుత్వమువారు స్వాధీనపఱచుకొని, వాటిని బోషించుట సముచితము. అట్లు పోషింపఁదగిన సంస్థలలో నాంధ్రసాహిత్య పరిషత్తగ్రగణ్యమైనది. దేశభాషలను బెంపొందించుటకై యఖిలభారత సాహిత్య పరిషత్తొకటి ప్రభుత్వమువారిచే స్థాపింపఁబడినది. ఈ పరిషత్తు దేశభాషల సంస్థల ననుబంధసంస్థలుగా నామోదించుటకుఁ దీర్మానించినది. అట్టి యామోదమును బడయుటకై కొన్ని భాషాసంస్థలు యత్నించుచున్నవి. కొంద ఱొక భాషా సంస్థను స్థాపించి యఖిల భారత సాహిత్యపరిషత్తువారి యామోదమును బడయుటకుఁ బ్రయత్నించుచున్నారు. కాని, నలువదిమూఁడు సంవత్సరములనుండి యాంధ్ర భాషకు నకుంఠిత దీక్షతో సేవచేయుచున్న యీ యాంధ్రసాహిత్యపరిషత్తున కేదియు సాటి రాదు. మఱియు, నీ పరిషత్తులో మహాకవులు, మహాపండితులు సభ్యులై యాంధ్రభాష క్షాలిత్యము చెందకుండఁ గాపాడుచు ననేకోద్గ్రంథములను వ్రాసి భాషను బెంపొందింపఁజేయుచున్న విషయము సువిదితమే. ఈ విషయములను బ్రభుత్వమువారు గుర్తించి, దీని కా గౌరవస్థాన మిచ్చెద రని నమ్ముచున్నాను.

ఈ యాంధ్రసాహిత్య పరిషత్తును బ్రశంసించుచు, మహాకవీశ్వరు లనేకపద్యములను వ్రాసిరి. అందొకటి—

"ఉ. నీవు తెలుంగుభూమిని జనించితి వాంధ్రులపాలి కల్పకం
బై విలసిల్లినావు మహిమాస్పద మైన తెలుంగు బాసకుం
జీవముఁ బోసినావు చెడి జీర్ణము నై చను వాఙ్మయంబు నీ
వీవలఁ దీసినావు గను లేఱిన రత్నచయంబు పోలికన్."

కాకినాడ,
30-1-1954.

ఇట్లు,
ఎం. కబీర్ షా, బి. ఏ., బి. ఎల్.

---

ఆంధ్రప్రచారిణి ప్రింటింగువర్క్సు, కాకినాడ.



# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## 42 వ వార్షిక మహోత్సవము

## 31-1-54 ఉదయము



భాష లందుఁ దెలుఁగు లెస్స

ఆంధ్ర విశ్వకళాపరిషదాంధ్ర భాషాప్రధానాచార్య

భాషా చరిత్ర చతురానన

విద్వాన్ శ్రీ గంటి జోగిసోమయాజి, ఎమ్. ఏ., ఎల్. టి. గారి

# అధ్యక్షోపన్యాసము




భాషావ్యాకరణ మహాసభ

# అధ్యక్షోపన్యాసము

ఆర్యులారా!

ఆంధ్రసాహిత్య పరిషత్తాంధ్ర భాషకు గొప్ప సేవఁ జేసిన సంస్థ. పీఠికాపురాధీశ్వరుల సాహాయ్యమున శ్రీ జయంతి రామమూర్తి పంతులు గారు మొదలగు మహానుభావులచేఁ బ్రవర్తింపఁ జేయఁబడి యనేక పండితప్రకాండులచేఁ బోషింపఁ బడినది. నేఁటికిఁ గొంచెము వెనుకఁబడి నను మరల స్వకీయ మయిన తేజమును బొందుచున్నది. ఈనాఁడు నన్ను భాషావ్యాకరణ శాఖకు నధ్యక్షుఁడుగా నుండవలసిన దని కోరి గౌరవించి నందులకు నమస్కారములు. కృతజ్ఞత.

ఇట్టి సందర్భములలో భాషావిషయమును గూర్చి పౌర్వాపర్య క్రమమున భూతము వర్తమానము నగు స్థితులను వివరించి భావిని సూచించుట యధ్యక్షుని విధి. భావి వర్తమానము యొక్క పరిణతి. భూతార్థజ్ఞానము భావిమార్గదర్శి.

మన యాంధ్రభాష పదునొకండవ శతాబ్దిని వాగనుశాసనుని ప్రయత్నమున నుత్తమ సారస్వత స్థితికి వచ్చినది. అంతకు ముం దుండిన తెనుఁగు భాష దారి తెన్నులు లేక మాండలికావస్థలో నుండినది. దాని స్వరూపము శాసనముల నుండి గుర్తింపవచ్చును. అది నేఁటి మన భాషకంటె మిక్కిలి భిన్నముగాఁ గనుపట్టును. చాల పట్టులయం దర్థముకాదు. వాఙ్మయమే లేని యా నాఁడు వ్యాకరణము లే దని చెప్ప నక్కఱ లేదు. వ్యాకరణ మనఁగాఁ బ్రకృతి ప్రత్యయ విభాగము చేసి యీరూపము సాధువు, ఇది యసాధువని చెప్పునట్టి గ్రంథమని యిచ్చట నుద్దిష్టము. నన్నయకుఁ బూర్వము భాషాప్రయోగము తాత్కాలిక మయిన ఫలము గలది. దేశాంతరమునను, కాలాంతరమునను, ననేక భిన్నవ్యక్తుల యందును సమన్వితము కావలె నను నుద్దేశము పలువురి యందు స్థిరపడవ లేదని సై యభిప్రాయము.

నన్నయ భారతరచనావసరమునఁ జాల చిక్కుపడినాడు. విష యము గంభీరము. ధర్మశాస్త్రము, వేదాంతము, నీతి, ఇతిహాసము, కావ్యము, అను రీతిని బహుముఖముల వెలయు భారతీయ విజ్ఞానరత్న మును దెలుఁగు బంగారమునఁ బొదగవలయును. వన్నెయందును, తూకముసను, విరివిని, నది తక్కువ పడినది. అట్టి పరిస్థితులలో నన్నయ్య యాంధ్రభాష కపూర్వాలంకార మయిన భారతామ్నాయ మును రచించెను. నన్నయ మహాకవి. కవికుల గురువు. శబ్దస్రష్ట. తెలుఁగు భాషలో నేక్రొత్త మార్గములు వెడలుచున్నవో, యే ప్రత్య యములు తలసూపుచున్నవో, యే ప్రకృతులు ప్రబలుచున్నవో, యెట్టి వాక్యనిర్మాణము తెలుఁగునకు స్వాభావికమో యాతఁడు గ్రహించి, వాని నన్నింటిని బహుముఖముల విరివి చెందునట్లు భాషా వాహినికి మళ్లించెను. సంస్కృత ప్రకృతులను వాడుట, సంబంధబోధక సర్వనామప్రక్రియ నుపయోగించుట, కర్మార్థక ప్రయోగమును విశాల ముగ వాడుట, సమాక క్రియను ప్రధానముగ వాక్యరచనయందు స్థాపించుట మొదలయిన యనేక నవీనపద్ధతులను భాషలో నెలకొల్పెను. ఛందస్సున సంస్కృతమున నున్న విధానమును దెచ్చి, తెలుఁగుఁ దన మచ్చుపడు లక్షణముల నందుఁ జేర్చి పద్యబంధమును హృద్య ముగా నిబంధించెను. కవితామార్గమునను నంతకుముందు లేని నూతన రచనలను జూపి తెలుఁగు నాగరకభాష, కావ్యరచనోపయోగి యని స్థిరపఱచెను. ఆ నాఁ డాతఁడు నిర్మించిన యఖండాంధ్రగౌతమీసేతువు నుండియే యనేక కుల్యలవలన నాంధ్ర మహాకవి మానసిక కేదార ములు ఫలవంతములై తెలుఁగు వారికి భోగ్యము లయినవి. ఆ నాఁడు కట్టిన కట్టే నేఁటికిని నిల్చియున్నది. ఈ విషయముల నెఱింగినవాఁడు గావుననే యాంధ్రకవితా సామ్రాజ్య పట్టభద్రుఁ డయిన తిక్కన మనీషి తనకు గురుప్రాయుఁడై మార్గదర్శకుఁడై, తన భావకేదారము పండుటకు జీవన సంపాదన మార్గమును గల్పించి తన్నుఁ గృతకృత్యునిఁ జేసిన నన్నయ నొక్కనినే, యాంధ్రకవిత్వవిశారదుండు, విద్యాదయి

తుండు, మహితాత్ముఁడు, నయిన కవికులగురువు, దక్షత నొనరించిన కార్యమని స్మరియించి మ్రొక్కెను. ఇతరుల నెవ్వరిని పేర్కొనలేదు.

అట్టి తెలుఁగు భాషకుఁ బ్రజాపోషణ, పరిపూర్ణము, నియతము. అది జనసామాన్యమున కైకైక మానవత్వ సంపాదనసాధనము. పండితులును రాజులును నిభాషను బోషించుచుండిరి. వారు సమర్థులు. బహుభాషోపేతులు. సంస్కృతప్రాకృతముల మీఁది పక్షపాత మనేక కారణములచే బలముగఁ గన్పట్టుచుండెను. పందొమ్మిదవ శతాబ్దివఱకు నన్నయ వేసిన మార్గముననే భాషానది ప్రవహించెను. ఆ శతాబ్దిని నధికారోన్నతి నుండి క్రిందికి దిగుచు, విజ్ఞానవిశేషమున, కావ్యగౌరవమున విజాతీయతచే విశిష్ట మయి, దూరాగత మగుట రమణీయమైన యాంగ్లభాషాస్రవంతి తాకిడి తెలుగునకుఁ దగిలినది. మరలనారాజమహేంద్రవరనగరముననే వాఙ్మయసేతువును శ్రీ వీరేశ లింగముగారు పునర్నిర్మాణమునకుఁ బాల్పఱచి శాఖోపశాఖలయిన కొంగ్రొత్త కుల్యల నేర్పఱచి వాఙ్మయక్షేత్రమును వివిధసస్యములచే బహువర్ణ విభ్రాజిత మొనర్చిరి. ఈ యుపన్యాసమున భాషావ్యాకరణములే విషయము గావున నేను వాఙ్మయపరిణామ వివరణము పోంతఁబోను.

ఆంగ్ల సంస్కారముచే మార్పు నొందినది వాఙ్మయ మొక్కటియే కాదు. భాషయును మాఱినది. అదియే యిచ్చట పేర్కొనఁదగినది. తన కాలమున వివిధములుగ వక్తలే, ప్రమాణములుగ, భిన్న ప్రదేశములు శరణ్యములుగ నుండి, యైక్యము లేని తెలుఁగున కైక్యము కల్పించి, ప్రామాణికత్వమును నన్నయ సంపాదించెను.

భాష సాంఘికమయిన సంస్థ మాటలాడువారి సొమ్ము. దీనిని బాగుపఱచుటకు గాని, చెఱచుటకు గాని యందఱికిని హక్కును నవకాశమును గలదు. అఖండ గోదావరిలో నెవ్వరేమిచేసినను నెవ్వరును వద్దనరు. కాని నీటిరేవులయందు జలము స్వచ్ఛమై పానీయముగ నుండవలెనని కోరుదురు. దానికి ప్రతిబంధము కల్పించువారిని గొంతమంది యైనను నదలింతురు. తొలఁగిన వారు తొలఁగుదురు. లేనివార స్వేచ్ఛానుసారము మెలఁగుదురు.

నన్నయ్య యంగీకరించిన ప్రామాణిక భాష నాటినుండియు పండితైక ప్రయోజనమయినది. జనసామాన్యమునకు విద్యలేదు. భాషా ప్రయోజనము దైనికచర్య గడపుకొనుటయే యని సామాన్యుల యెడ స్పష్టము. పండితులు కావ్యరచనకొఱకు నుపయోగించుచుండిన యీప్రా మాణిక భాషాప్రవాహము గ్రీష్మకాలమందలి యేకవేణివలె వ్యావహారిక భాషాసైకతమండలముల నడుమ నొక్క రూపముననే ప్రవహించి, వాఙ్మయపిపాస గలిగి తన్ను సేవింపవచ్చినవారికి మాత్ర ముపయోగపడుచుండినది.

ఆంగ్లేయుల యవతరణముతో సి. పి. బ్రౌను దొరగారు బందరులోఁ దెలుఁగు భాషోద్ధరణమునకుఁ బూనుకొనిరి. పదునెనిమిది వందల యిరువదియారవ సంవత్సరమున ఆయన యవలంబించిన గ్రంథముద్రణ విధానమే యాంధ్రభాషాభ్యుదయ పథములో నొక క్రొత్తఘట్టముగా నేర్పడినది. అంతకుముందు తెలుఁగుగ్రంథములను తనకు లభించిన ప్రతిని నాధారముగఁ జేసికొని యొక్కొక్క వ్యక్తి వ్రాసికొనుచుండెడివాఁడు. ఇందు రెండు చిక్కులు. మొదటిప్రతి దుష్టము కావచ్చును. అదియే యాతనికి బ్రమాణము. ఇట్లు వ్యక్తులకు ప్రమాణ వైవిధ్యము దుర్వారము. పైగా గ్రంథవ్యాప్తియు సంకుచితము. గ్రంథము కావలెనని మఱియొకరి దయ ననుసరించి కొన్ని వారములో మాసములో శ్రమపడి స్థలాంతరమున నొక్కొక్క గ్రంథమును సంపాదింపవలసిన యవసరముండినది. గ్రంథముద్రణమువలన ముద్రిత ప్రతులు దేశమున నెల్లరకును నేకరూపమున సులభసాధ్యము లయినవి. ప్రామాణిక భాషలో నుండునట్లు గ్రంథములు సంస్కరింపఁబడినవి. అనేకులకు సులభముగా లభించుటచేత నా భాషకు ప్రచార మధికమయినది. అనేక గ్రంథములు సంస్కరింపఁబడి ముద్రింపఁబడినవి. ఏకరూపత వెలసినది. అట్లు ముందునకు వచ్చిన ప్రామాణిక భాషకు వచన వ్యాకరణములును బయల్వెడలినవి. బాలప్రౌఢ వ్యాకరణముల రచనతో ప్రామాణిక భాషాప్రాభవము వెల్లి విరిసినది. అముద్రితగ్రంథ చింతామణి, సాహిత్య పరిషత్పత్త్రిక, కృష్ణాపత్రిక, శారద, ఆంధ్ర

పత్రిక, భారతి, మున్నగు పత్రికల కన్నిటికిని ప్రామాణిక భాషయే యాలవాలమయినది.

సృష్టిక్రమము విభేదమునుండి నైక్యము. ఐక్యమునుండి విభేదము. మరల నదేరీతి. "ధాతాయథాపూర్వ మకల్పయత్" ఒకేరీతిని చక్రము తిరుగుచుండును. ఇట్లైక్యరూపమయిన ప్రామాణిక భాష ప్రచురము కాగానే కొన్ని చిక్కులు బయటపడినవి.

భాష మారుచుండును. ప్రామాణిక భాషయు మారును. వ్యావహారిక భాష మఱియు వేగముగ మారుచుండును. పదునొకండవ శతాబ్దిని బయలుదేరిన భాషాస్రవంతి పందొమ్మిదవ శతాబ్దిని చేరునరికి రెండు ప్రక్కలను మారినది. ఒక ప్రక్క వ్యావహారికము, రెండవ ప్రక్క గ్రాంథికము. ఈ రెండింటికిని భేద మధికమయినది. ఇంకఁ బ్రామాణిక భాషను ముద్రింపవలసిన గ్రంథములు సంస్కారమునకుఁ బాత్రము లయినవి. ఆ సంస్కర్తలకు నందుబాటులో నుండిన వ్యాకరణము లనెడి యుపకరణములు పరిమితప్రయోజనములు. వారి యధికారమును నాత్మీయ కించిద్జ్ఞతచే పరిచ్ఛిన్నము కావలసివచ్చినది. తలకొక రీతిగ దిద్ద మొదలిడిరి. ఏది యొప్పో, యను విషయమున భిన్నాభిప్రాయములు బయలుదేరినవి. సామాన్యులలో రచనాభిలాష నవనవోన్మిషితమగుచు వెలయుచుండినను, వ్రాసినది తప్పేమో యనెడి భయము చేతను, పండితులవలన భీతిచేతను, అది కుంఠితమయినది. ఇంకొక చిక్కేమనగాఁ బ్రామాణిక వ్యావహారిక భాషలలో ప్రత్యయములకును సుబంత తిజంతరూపములకును, ప్రకృతుల వర్ణక్రమ విషయమునను, విశేషభేద మేర్పడుటచేత దీనివలనఁ గలుగు క్లేశ మైక్యసంపాదన క్లేశముతోఁ జేరి వ్రాయువారలు చాల తబ్బిబ్బులు పడఁజొచ్చిరి. దానితో నైక్యమునకుఁ బ్రాముఖ్యము పరాకాష్ఠనుండి పతనోన్ముఖము కాఁజొచ్చినది. రచయితలు స్వేచ్ఛావిహారమునకుఁ బ్రతిబంధకములయిన వ్యాకరణ నియమములనెడి యినుపసంకెలలచేఁ గుంటువడుచుండిరి. తాము వ్రాసినది యొకరిచే దిద్దించుకొనఁ దప్పెడిదికాదు.

ఇట్టి పరిస్థితులలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషావాదమును లేవఁదీసి రచయితల కుత్సాహమును బురికొల్పిరి. వీరి వాదమునకు విశేషము ప్రతిఘటనము బయలుదేరినది. అట్లు ప్రతిఘటించినవారలలో ముఖ్యమయిన సంస్థ యీ యాంధ్ర సాహిత్య పరిషత్తు. వాదోపవాదములవలన రచనాపద్ధతిలో మార్గాంతరము ననుసరింపవచ్చునని ప్రజలకు స్పష్టమయినది. వ్యావహారిక భాష వ్రాయ మొదలిడిరి. నేఁడు గ్రాంథిక భాష యనదగుభాషలో వ్రాయు పత్రికలు గాని, వ్యాసములుగాని మిక్కిలి స్వల్పసంఖ్యాకములు. వ్యావహారిక భాషావాదముయొక్క ప్రయోజనము పరాకాష్ఠనందినది.

ఇఁక వర్తమానావస్థను వర్ణింపవలసియున్నది. ఒక పత్రికలోనే యిద్దఱు వ్రాయు వ్యాసములలో, భాష యొక విధముగఁ జూపట్టదు. ఎవ్వరికిఁ దెలిసిన రూపములను వారు వాడుచున్నారు. ఇట్టి స్వేచ్ఛా వాతావరణమున వ్యాకరణము ననుసరింపవలయునన్న పట్టుదల తగ్గినది. భాషకు మరల మాండలికావస్థ యేర్పడుచున్నది. సర్కారుల వారికంటె మా భాష భిన్నమయినది, వారు వాడు రూపములతోఁ బుస్తకములు నిండుచున్నవి యను రాయలసీమవారి మాటలు చెవులఁ బడుచున్నవి. శబ్దరూపము తప్పని చెప్పువారుగాని వినువారుగాని తగ్గిపోయిరి. ఎవరయిన చెప్పుచో మేమిట్లే మాటాడుదుమని సమాధానము చెప్పువారు లేకపోలేదు.

భాషలో మఱియొక చిక్కేర్పడినది. తెలుఁగుభాషలో పదములల్పసంఖ్యాకములు. ఉన్నతభావము లన్నింటికిని సంస్కృతపదములనే వాడుచున్నాము. ఆ భాషయందు పాండిత్యము దేశమున తగ్గిపోవుటం జేసి యనేకములయిన యపశబ్దములు సృజింపఁబడుచున్నవి. నవ్యప్రపంచమున విజ్ఞానవ్యాప్తి, ప్రసారక కేంద్రములందు మిక్కిలిగా జరుగుచుండుటచేత, తదధికృతులు తమశక్తి ననుసరించి, నూతన పదములను సృజించి యుపయోగించుచున్నారు. దానివలనఁ గలుగు ప్రయోజనమనునది పరీక్షణీయము. సుమారు ఆరుసంవత్సరములక్రింద మనకు పారతంత్ర్యశృంఖలలువిడినవి. అంతవఱకును దేశమున నాంగ్లభాషయే

రాజకీయ వైజ్ఞానిక భాష. దేశభాషల ప్రయోజనము మిక్కిలి పరిమితము. ఈ యయిదు సంవత్సరములలో బరిస్థితులు మిక్కిలి మారినవి. దేశభాషలకుఁ బ్రాముఖ్యము వచ్చినది. ప్రజాయుత్తమయిన ప్రభుత్వము స్థిరపడుటచేతఁ బ్రజలభాషకు ముఖ్యస్థానము లభించినది.

ఆంధ్రరాష్ట్ర సంసిద్ధితో మఱియొక గొప్పమార్పు గల్గినది. ప్రభుత్వము వారు రాజకీయ వైజ్ఞానిక రంగములయందు దెలుఁగును ముఖ్యభాషగా నంగీకరించి యున్నారు. అట్టి తీర్మానమును నీక నమలులోఁ బెట్టవలసియున్నది. నన్నయకాలమునఁ దెలుఁగునకు నభివృద్ధిలో నెట్టిమార్పు వచ్చినదో నేఁడట్టిమార్పు మరలవచ్చినది. రాజకీయముగ నధికార ప్రయోగము కొఱకు, ధర్మాధికారులు న్యాయము దీర్పుచెప్పుటకు, పండితులు ప్రాపంచిక శాస్త్రవిజ్ఞానము బాలురకందు బాటులోనికిఁ దెచ్చుటకు, దెలుఁగే సాధనము కావలసియున్నది. దీని వలన నేర్పడిన సమస్యలు ఒకటి:—విదేశీయ భావములను నాపదములలోనే దెచ్చుకొనవలయునా? లేక, మనపదములను మనము కల్పించుకొనుటయా? యనునది. పదము శక్తమయినఁ గాని యర్థబోధకము కానేరదు. మనము గ్రొత్తగాఁ గల్పించు పదములు శక్తములుగావు. ఎన్ని పదముల నయినను మనము పయి భాషనుండి గ్రహింపవచ్చును. ఒకవ్యక్తి కల్పించిన నూతన పదముకంటె పరిచితమైన యన్యభాషాపదము వలన ప్రయోజనము మనకు రెండువిధముల సిద్ధించును. అది యిదివరకే శక్తము గావున కొందఱికైన నర్థబోధయం దుపకరించును. ఇంతియకాక యాశాస్త్రమునందలి యితర పదార్థబోధయందును, ప్రాపంచిక విజ్ఞానరాశియందుఁ బ్రవేశించుటకును ననుకూలమగును. ఐక్యము గొంతవఱకైనను సిద్ధించును. ఈ యభిప్రాయము ననుసరించియే నన్నయ తనగ్రంథమున సంస్కృత పదములను విరివిగా వాడెను. ఆమార్గమునే యితరు లనుసరించిరి. భాష యనగా పదసమూహమాత్రమే కాదని మన మెఱుంగవలయును. ప్రత్యయములు, పదయోజన విధానము, వాక్యనిర్మాణము, నన్వయ పద్ధతి, మొదలయినవియే భాషకుఁ బ్రధానలక్షణములు. సంస్కృత

పదము లెన్ని వాడినను వానిపైఁదెలుఁగు ముద్రవేసినచో నభ్యంతరము లేదు. కాబట్టి యన్యభాషాపదములను దత్సమములుగాను, దద్భవములుగాను దెచ్చుకొనుట ఋజుమార్గము గాని, క్రొత్తపదములను గనిపెట్టుట క్లేశకరము నల్పఫలము నయి యున్నది. ఈ సమస్య ప్రభుత్వమును మిగుల కలవర పెట్టుచున్నది. అనేక పండిత సంఘములు దీనికొఱకుఁ బనిచేయుచున్నవి. ఇఁక నాంధ్రమునను నిట్టిసంస్థ బయలుదేరి ప్రభుత్వాధికృత మయి వారికి సలహాల నీయవలయును.

రెండవ సమస్య :— నేటిభాషలోని వైవిధ్యము నెంతవఱ కంగీకరింపవలయునను నదియది. సుమారు రెండువేల సంవత్సరములకుఁ బూర్వము వింధ్యకు దక్షిణమున నొక్కటే భాషయుండినది. అట్టిభాషయే నేటి తెలుఁగు, అరవము, కన్నడము, మలయాళము మొదలగు భాషలుగా మాఱిపోయినది. ప్రాచీనముగ నుండిన వైదిక కాలమునాఁటి వాడుకభాషయే కాలక్రమమున మాఱి వైదిక ప్రాకృతములు, శాసనస్థ ప్రాకృతములు, గ్రంథస్థ ప్రాకృతములు, నపభ్రంశ భాషలు, నేఁటి యుత్తర హిందూస్థాన భాషలు నన్నట్లు మాఱిపోయినది. పూర్వరూపము లయిన యాభాషలు కాలస్రవంతిలోఁ గొట్టుకొని పోయినవి. సులక్షణ బద్ధమయిన సంస్కృతమే విశాలవిజ్ఞాననిధి యగుటవలన దైనిక వ్యవహార భ్రష్ట మయినను నేటికిని నిలిచి యున్నది. ఈ చరిత్రను బట్టి ప్రామాణికభాష వాంఛనీయ మనియు, దాని ననుసరించుటయే కర్తవ్య మనియు సిద్ధమగుచున్నది. అదియే నాగరకతా లక్షణము. ఎన్నియో యనాగరక భాషలు మనదేశములోనే యున్నవి. వానికి ప్రామాణికత్వము లేదు. అవి వ్యావహారికావస్థను దాటలేదు గావునను గ్రాంథికావస్థను బొందలేదు కాబట్టియు ప్రామాణికములు కావు.

నేఁడు మనము శిష్టవ్యావహారికముగ వాడుచున్న తెలుఁగుభాషయొక్క ప్రామాణిక రూపమును నిలువఁ బెట్టవలయును. శిష్టు లనవారు ? ఏది శిష్టవ్యావహారికము ? అను విషయమున మతభేద ముండ వచ్చును. మనము పరిగణింపవలసినది భేదము కాదు. ఐక్యమే యంగీ

కర్తవ్యము. తెలుఁగు భాషయొక్క లక్షణములను స్వభావమును గుర్తెఱింగి, ప్రకృత వ్యావహారిక రూపములను బరిశీలించి, మనప్రామాణిక భాషను నిరూపింపవలెను. ఆంగ్లదేశమున నెన్నియో మాండలిక భాషాభేదములున్నను ప్రామాణిక భాషనే ముఖ్య వ్యవహారమున కంగీకరించుచున్నారు. మన మట్లు చేయక, వ్యక్తి సౌలభ్యము నుద్దేశించి, పఠనక్లేశమును పరిహరించుకొనుట కొఱకు, స్వేచ్ఛాచారము ననుసరించినచో, మనభాషకుఁ జీలిక తప్పదు. అట్టి చీలిక రాకుండ మనము కాపాడుకొనవలెను.

ఈ సందర్భమునఁ జేయవలసిన పనినే భావికార్యక్రమ మని చెప్పవలయును. చాలకాలము క్రిందట సర్ జార్జి గ్రియర్సను గారి యాధిపత్యమున భారతీయ భాషాస్వరూప పరిశీలనము, పరిగణనము జరిగినవి. (Linguistic Survey of India).

అందు తెలుఁగు మొదలయిన ద్రావిడభాషలప్రధానముగా స్పృశింపఁ బడినవి. నేటి యాంధ్ర ప్రభుత్వము మన భాషా మాండలిక రూపములను బరిశీలించి గ్రథిత మొనర్పవలెను. దానిలోని విషయము ననుసరించి ప్రామాణిక వ్యాకరణము బయల్వెడలవలెను. ఇది యంతయు దుర్ఘటము, చాలకాలము పట్టునని చెప్పుట యయుక్తము. భాషాభిమానము గలిగిన భాషావేత్త లుత్సాహవంతు లయిన యువకుల సాహాయ్యమునఁ బరిమిత ద్రవ్యముతో మొదటిభాగమును నిర్వర్తింపఁ గలరు. దాని కనుబంధముగనే రెండవదియు జరిపింపవచ్చును. కావలసినది ప్రభుత్వసమ్మతి. వారి ధనసాహాయ్యము.

ఇంకొక గొప్పవిషయము, ప్రభుత్వము చేయింపవలసినదియు ముఖ్యమయినదియుఁ గలదు. మనము, అనగా భారతీయుల మయిన యాంధ్రులము, ప్రపంచవిజ్ఞాన సముద్రమునఁ బ్రవేశించుట కాంగ్ల భాషావాహినియే ముఖద్వారము. అట్టి యాంగ్లభాషా కోశములలో గొప్పదగు నొకదాని ననుసరించి తెలుఁగున కోశమును నిర్మించుట. దీనియందే శాస్త్రపదకోశము, వ్యావహారిక పదకోశము కొంతవఱ కంతర్భూతమై యుండును. ఇట్టిది కర్ణాటక భాషయందు గలదు.

మఱియొక గొప్పపని యాంధ్ర ప్రభుత్వము చేయింపవలసినది. సుమారు పది శతాబ్దుల నుండి వాఙ్మయావస్థకు వచ్చిన తెలుఁగులోఁ దెలుఁగు పదముల యొక్క చరిత్ర నెవ్వరు నన్వేషింపలేదు. ఆంగ్లభాష లోని పదము లన్నియుఁ బ్రకృతిప్రత్యయముల రూపవివరణములతో గోశములయందుఁ గననగును. సంస్కృత పదములు వ్యుత్పన్నములు. తెలుఁగు పదముల వ్యుత్పత్తి వివరింపఁ బడలేదు. అవి యవ్యుత్పన్నము లనియు, యథాశ్రుత ప్రమాణము లనియు పండితులు వానిని విడిచి వేసిరి. ఇది చాల నష్టము. ఏ భాషలోని పదములకుఁ బ్రకృతి ప్రత్యయ వివేకము తెలియఁ బడదో యా భాష యభివృద్ధి నందదు. అభ్యసించు వారి కది లొంగియుండదు. కావుననే తెలుఁగు పండితులు క్రొత్త తెలుఁగు మాటలను వాడుకొనఁ జాలక క్షుణ్ణమార్గ మయిన సంస్కృత పద నిర్మాణమునే యనుసరించుచున్నారు. తెలుఁగు పెరుగకుండుట కిది యొక పెద్ద ప్రతిబంధకము. ఈ పని కూడఁ బ్రభుత్వ సాహాయ్యముచే నొక ప్రణాలిక ననుసరించి సమర్థులు జరిపింపఁ గలరు. ఇది యవశ్య కర్తవ్యము.

భాషావిషయమునుగూర్చి భూతము, వర్తమానము, భావి, యను వానిని సంగ్రహముగ నిరూపించితిని. ఇఁక వ్యాకరణమునుగూర్చి చెప్పవలయును. భాషావ్యాకరణముల కవినాభావసంబంధము కావునఁ గొన్ని విషయము లింతకుముందే గతార్థము లయినవి. మిగిలినవానిని గూర్చియే యిందు విచారించుచున్నాను.

తెలుఁగునకు మొదటివ్యాకరణ మనఁబడెడి యాంధ్రశబ్దచింతా మణి నన్నయపేరు మోసియున్నది. నవ్యులనేకులు నన్నయకర్తృత్వము నంగీకరింపలేదు. ఆ మతమున నథర్వణకారికలును నథర్వణకృతములు కావని సిద్ధమగుచున్నది. ఇఁక నాంధ్రభాషాభూషణమే వారిమతమున ప్రథమ వైయాకరణభాషణము. మనకావివాదముతోఁ బనిలేదు. ఆమూఁడిటిచేఁ బ్రవేశపెట్టఁబడి బాలప్రౌఢములచే నాదరింపఁబడిన మార్గమొక్కటియే. అదియేయిచ్చట విమర్శనీయము. ఆపద్ధతి కేవల సంస్కృతవ్యాకరణానుసరణము. తెనుఁగువ్యాకరణము, పాఠశాల తర

గతులలో క్లేశకారి యగుటకు నిదియే ముఖ్యకారణము. తెలుఁగు మాటాడుట తెలుఁగుబాలురకు స్వతస్సిద్ధముగా లభించుచున్నది. ఇఁక వ్యాకరణము నేర్చుకొనుటవలనిఫలము సన్నగిలిపోవుచున్నది. పైఁగా దానిలోని క్లేశముకూడ దాని పఠనమునకుఁ బ్రతిబంధకమగుచున్నది. ఇట్లనుటవలన సంస్కృతభాషాజ్ఞానముగాని, తద్వ్యాకరణ సంస్కారముగాని మనకవసరము లేదని చెప్పుచున్నానని భ్రాంతిపడరాదు. అది తప్పక కావలసినదియే. తెలుఁగు స్వరూపము నావిష్కరింపఁజాలక, యధిక మయిన పఠనక్లేశమును గూర్చునంతటి యయుక్తానుసరణము, తొలగించిననేగాని తెలుఁగువ్యాకరణము పరిపూర్ణఫలప్రదము కానేరదు. ఈ యనుసరణ మెట్టిది యనువిషయము నుదాహరించుట కేవల శాస్త్రవిమర్శనముగావున నిచ్చట పరిహరింపఁబడుచున్నది. ప్రౌఢవ్యాకరణము తరువాతవచ్చిన వ్యాకరణములు క్రమక్రమముగ సంస్కృతభాషా సంప్రదాయములను విడిచి యంతకంత కాంగ్లవ్యాకరణానుసరణమునే యాశ్రయించినవి. ప్రాచీనులు చేసిన సంస్కృతవ్యాకరణానుసరణము క్లేశకారి యయినను, నెట్లయిన సమర్థించుకొనవచ్చునుగాని, యీ యాంగ్లవ్యాకరణానుసరణము దుర్భరమై తత్కర్తలలో వెలసిన యసమర్థతనుగూడఁ గొన్నియెడల నిరూపించుచున్నది. తెలుఁగుభాషయొక్క పరిపూర్ణస్వభావమును నిరూపించుచు సులభ మయిన రీతి నభివృద్ధికి వీలయినట్లు వ్యాకరణములు వ్రాయవలెను. ఇదియును శాస్త్రవిషయము గావున నిచ్చటఁ బ్రపంచించుటకు వీలు లేదు.

ఇఁక వ్యాకరణ మెట్టిది? వైయాకరణున కున్న యధికారమేమి? ఆతఁ డెంతవఱకు భాష ననుశాసింపఁ గలఁ డను విషయమును జర్చింపక యీ విషయమును ముగించుట యుక్తము కాదు.

వ్యాకరణము లనేకభాషలకు ననేకులచే వ్రాయఁబడినవి. అట్టి వార లే మార్గము నవలంబించి రను విషయమే మన సిద్ధాంతమున కాధారమయి యున్నది. వారు గ్రహించినవియు, నితరు లంగీకరించినవియు నెట్టియధికారములు వారి కున్న వను విషయముగూడ విమర్శనీయము. సమగ్రవ్యాకరణ మననేమి? తెలుఁగునకు సమగ్రవ్యాకరణము

వ్రాయ నగునా? యను ప్రశ్నమునకు సమాధానముకూడ నాలోచింప వలసియున్నది.

మనకుఁ బరమప్రమాణమై యొరవడియైన సంస్కృత వ్యాకరణ విచారమందుఁ బతంజలిమహర్షి యిట్లు చెప్పెను. అనుశాసనము సుశబ్దములకా ? అపశబ్దములకా ? అని విమర్శించుచు, సుశబ్దములకే యను శాసన మనియు, 'గౌః' అనునదియే ప్రామాణిక మనియు' గావీ, గోణీ, గోతా, గోపోతలికా'' అను నపభ్రంశములు కల వనియు, ప్రామాణిక మయిన గో శబ్దము మాత్రమే వ్యాకరింపఁ బడు ననియుఁ జెప్పియున్నాఁడు. ఇక్కడ మన మడుగవలసిన ప్రశ్నయొకటి. ఈ యపశబ్దములనఁ బడునవెవరయిన వాడుచుండిరా ? లేదా ? అట్లువాడుచుండిరనియే సమాధానము. లేకున్న వానిగ్రహణము నిష్ప్రయోజనము, నిర్మూలము. ఇంతియకాక యీ రూపములు ప్రాకృతములలోను, నేఁటి యుత్తర హిందూస్థాన భాషలలోను కొన్ని గోచరించుచున్నవి. కాబట్టి యవి యానాఁడు సంఘములో నెవ్వరిచేతనో ప్రయోగింపఁ బడుచుండినవేగాని, కృతకములు గావనుట స్పష్టము. వైయాకరణుఁడు ప్రయోగయోగ్యములయిన శబ్దములనే వ్యాకరించుననుట పై దానినుండి స్పష్టము. ఇట్లే యాంగ్ల వ్యాకరణములందును, పద్ధతి నిరూపింపఁబడినది. (King's English) ప్రామాణిక భాషకే వ్యాకరణము. అనేక విధములయిన మాండలి కాంగ్ల భాషలకు వ్యాకరణము వ్రాయఁబడలేదుగదా! Mee Goes, I Sees, అను వాడుకలు వ్యవహారములో నున్న వాని నాంగ్ల వ్యాకరణము లంగీకరించుటలేదు సరిగదా స్పృశింపనైనలేదు. ఇట్టి ప్రయోగములు యథావ్యవహృతముగ ననుసరింపఁ బడిన సంభాషణములలో, నవలలయందు, వంకయక్షరములలో, (Italics) గను పట్టును. కావున ప్రామాణిక భాషకే వ్యాకరణ మనుట స్పష్టము. 'చేస్తున్నాడు' అనుదానికిఁగల రూపాంతరముల నన్నింటిని సాధించుట వైయాకరణుని పనికాదు.

ఇఁక నేది ప్రామాణికమని వైయాకరణుఁడెట్లు నిర్ణయించవలెనను ప్రశ్నము బయలుదేరుచున్నది. ఒకటి స్పష్టము. తనవ్యాకరణ

ములోఁదనకుఁ బ్రామాణికమని తోఁచిన దానినే యతఁడు వ్రాయును గావున నం దతనిది తుదిమాట. అట్లయినచో వైయాకరణులు నిరంకుశులా? కృతకపదములను నప్రయుక్తపదములను గ్రహించుటకుగాని ప్రయుక్తములను పరిహరించుటకుగాని వాని కేమయిన నధికారము కలదా? యని ప్రశ్నింపవలెను. ఒక నియమ మున్నది యని సమాధానము. 'ప్రయోగ శరణా వైయాకరణాః' అను నుడి గలదు. వైయాకరణులు ప్రయోగమే శరణముగాఁ గలవారు. దీని యభిప్రాయ మేమో విమర్శింపవలెను. ఏ కవి యేది ప్రయోగించినను దానినంతను వైయాకరణుఁడు గ్రహింపకతప్పదా? లేక తా నంగీకరించిన కొందఱు ప్రామాణికులయిన కవులప్రయోగముల నన్నింటిని నంగీకరించి తీరవలయునా? యను ప్రశ్నబయలుదేరుచున్నది. దీనికి సమాధానము పయినుడిలో లేదు. పై వాక్యమున కర్థ మిట్లు చెప్పవలసినది. వైయాకరణుఁడు చేసిన సూత్రములకు ప్రయోగముండి తీరవలెను. అవి ప్రయోగ శరణములు. లోకములో కవుల మనుకొనువా రందఱును వాడినవిగాని, యొక కవి వాడిన వన్నింటినిగాని వైయాకరణుఁ డంగీకరించి తీరవలసిన నిర్బంధ మాతనిపై లేదని, సర్వభాషావ్యాకరణముల మార్గమునుబట్టి స్పష్ట మగుచున్నది. మహావిశాల వ్యాకరణము గలిగిన సంస్కృతముననే యపాణినీయములు నార్షములు నని చెప్పఁబడునవి యనేకములు గలవు. కాని యీ వ్యాకరణ మపరిపూర్ణ మనిగాని యప్రామాణిక మనిగాని యెవ్వరు ననరు. తెలుఁగువైయాకరణు లెల్లరును పై మార్గముననే యనుసరించి కవిప్రయుక్తములకే వారు లక్షణములను వ్రాసిరి. అట్లు వారు గ్రహించిన కవిప్రయోగములలో గొన్నింటిని పరిహరించిరి. ఏవి యగ్రాహ్యములో వారు చెప్పిరి. అట్టి యధికారము వారికి లే దని కవిప్రయోగముల నన్నింటిని నంగీకరించి తీరవలసిన దనియు జెప్పుకొందఱి నవ్యుల యభిప్రాయము వైయాకరణపద్ధతికి విరుద్ధము. ఆ పద్ధతి నెవ్వరు ననుసరింపలేదు. ఈ సందర్భమునఁ దెనుఁగు వ్యాకరణములలోని గొన్ని విషయములను దిఙ్మాత్ర ముదాహరింపకతప్పదు. క్త్వార్థకేకారసంధి, వైరిసమాసము, అనునవి యుదాహరణముగా గ్రహింపఁబడును. ఈ రెండింటి

విషయమునను కవుల ప్రయోగములలోఁ గొంత వ్యభిచారము గన్పట్టు చున్నను, వైయాకరణు లవ్వానిని సామాన్యసూత్రములుగ గ్రహించి యంగీకరింపలేదు. వారిమతమున నివి తెలుఁగు భాషాస్వభావమునకు విరుద్ధములుగావున నంగీకరింపరా దనియు నిషిద్ధము లనియు సిద్ధాంతము. అల్పాచ్కములయిన తెలుఁగు క్త్వార్థకరూపములగు 'ఇచ్చి చూచి' మొదలగు వానికి సంధిచేసినచో నర్థావగతికి భంగముతప్పదు. 'ఇచ్చి +ఎప్పుడు' ='ఇచ్చెప్పుడు' చూచి +ఏసెను = చూచేసెను'' ఇత్యాది ప్రయోగముల స్వారస్యము పండితైక వేద్యమే యగును. 'అనేకమంది' సప్తావులు, భోజన పిదప, అల్పదండు, శుద్ధతప్పు, బాలదొంగ, ఇత్యాదులు పరిహరించిరి. కారణము తెలుఁగు భాషాపద్ధతి కిది విరుద్ధ మగుటయే. ఇట్టిచోట్ల తెలుఁగు సంధియా? సంస్కృత సంధియా, అనుసరింప వలసినది? అనేకయిల్లు, అనేకేళ్లు' అను సందేహము దుర్వారము. ఒక పదమును తెలుఁగుగా నర్థము చెప్పవలయునా, సంస్కృతముగా వివరింపవలయునా, అను సందేహము తప్పదు. వైయాకరణు లందఱును దీనికి వైముఖ్యమును జూపిరి. కొన్ని ప్రాచీనకవి ప్రయుక్తములయి సుప్రసిద్ధములయిన వానిని పరిగణనముచేసి సాధించిరి. కొందఱు కవు లుపయోగించినారు గావున నిట్టివానిని నన్నియెడలను స్వాతంత్ర్యముగాఁ వాడుదుము, ఇష్టము వచ్చినట్లు వైరిపదమును సృజింతు మను వాదముల ప్రశస్తము లనుట వైనారి యభిప్రాయము.

అథర్వణుఁడు "ప్రతిక్రియ మడాంతత్వం శ్రూయతే నచగీయతే, క్వాచి దింప్వంతతాం కేచిదూచిరే నహిమే రుచిః'' అని తన యసమ్మతిని సూచించెను. అట్లే సూరియు చేతురు, కోతురిత్యాది ప్రయోగంబు లసాధువు లని యెఱుంగునది''యని తన యనిష్టమును సూచించెను. ఇట్టి వనేకములు గలవు. పైరీతిని సంస్కృతాది సర్వభాషా వైయాకరణ మార్గమునే యనుసరించిన తెనుఁగు వైయాకరణులను నిందించుచు, నితరులను శిరసావహించుటకు హేతువేమో యెఱుంగరాదు. తెలుఁగు వైయాకరణులును లోకోపకృతికై భాషాసేవయొనర్చిరి.

ఇఁక తెనుఁగునకు సమగ్రవ్యాకరణము లేదనియు, సూరిమొద

లగువారి కృతులపరిగ్రాహ్యంబులనియు చెప్పువారి మాటలు విమర్శింప వలసియున్నది. నిరంతరము ప్రయోగమున మారుచు క్రొత్తపద్ధతుల వలన విశాలమగుచున్న జీవద్భాషకెవ్వరును సమగ్ర వ్యాకరణమును వ్రాయలేరనియు, నట్లువ్రాసినచో నట్టిది రైలువేగనులపై రావలసినదే గాని వేరుగాదనియు నవ్యులాకరనిరి. ఇది సత్యమయినచో దాము వ్రాయు వ్యాకరణమునకు నపరిపూర్ణత్వము తప్పదుగదా? ప్రాచీన వ్యాకరణములపరిపూర్ణములని తిరస్కరింపనేల! ఇప్పటి మన తెలుఁగు వ్యాకరణముల పద్ధతిని నేయొక్క వ్యక్తి వ్రాసిన తెలుఁగు వ్యాకరణ మయినను, నపరిపూర్ణమే కావలసివచ్చును. ఒకశబ్దము యొక్క రూపాంతరముల నన్నింటిని వైయాకరణుఁడు సాధించి నిరూపించవలెనను నుద్దేశముతో వ్యాకరణ రచనను విమర్శింపఁ బూనినచో నీదోషముతప్పదు. కోశకారులు చేయవలసిన పనిని కొంతవఱకు వైయాకరణులు తమపైని వేసికొనిరి. వ్యాకరణ మెప్పుడును భాషను నేర్చుకొనుటకు సాధనము. భాషాధ్యగునకు; మార్గదర్శకమే గాని యాతనిని గమ్యస్థానమునకుఁ గొనిపోవు వాహనముకాదు. కాబట్టి వ్యాకర్తలు ఇట్టిపనిని గొంత తగ్గించుకొనినఁగాని యీ వ్యాకరణము లపరిపూర్ణములను దోషము పరిహరింప వీలులేదు ఆంగ్లవ్యాకరణములు పరిపూర్ణములు నపరిపూర్ణములను విమర్శకు గుఱికాకుండుటకు వారి మార్గమే రక్షకము. అట్టిది తెలుఁగువారనుసరింప వలసిన యవసరము నేఁటి భాషాపరిణతినిబట్టి స్పష్టమగుచున్నది.

ఇఁక పరిపూర్ణవ్యాకరణమన్ననో యాంధ్రమాండలికభాషాసర్వస్వపరిశీలనమను విషయము జరిగిననేగాని సాధ్యముకాదు. ఇట్టిపని యాంగ్లమువంటి మహాభాషకే జరుగలేదు. కాని కొంతవ్యయముతో, ప్రభుత్వము చేయింపవచ్చును.

తెలుఁగుభాషావ్యాకరణములీ భాషోన్నతికిని తత్ప్రయోక్తలకు జ్ఞానసంపాదన హేతువులగుటకును ననుకూలముగ నభివృద్ధిపొందవలె ననుట వాంఛనీయము.

ఇ తి శి వ మ్.

# కార్యదర్శి నివేదిక

చతుర్వేదుల సత్యనారాయణ

ఆంధ్రసాహిత్యపరిషత్తు 1911 వ సంవత్సరము మే నెల 12 వ తేదీని చెన్నపట్టణమునందుఁ బ్రతిష్ఠింపఁబడినది. నేఁటి కీ పరిషత్తునకు నలువది రెండేండ్లు గడచినవి.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారును, శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం మహారాజులుం గారును చెన్నపట్టణమున నున్న పెద్దలతో సంప్రదించి పరిషత్తును స్థాపించుటకై యొకసభ యేర్పాటు చేసిరి. అందు శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, వావిలకొలను సుబ్బారావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలగు పెద్దలు గలరు. అదియే పరిషత్సభగాఁ బరిణమించెను. ఆ సభకు శ్రీ పిఠాపురము మహారాజావా రగ్రాసనాధిపతులుగా నుండిరి. ఆ సభలోనే యాంధ్రభాషకు సమగ్రనిఘంటు వొకటి నిర్మింపఁబడవలె నని తీర్మానము గావింపఁబడినది. శ్రీ పిఠాపురము మహారాజావారు దాని కయ్యెడు వ్యయ మంతయు భరించుట కంగీకరించిరి.

నాఁటినుండి నేఁటివఱకుఁ గ్రమముగాఁ బరిషత్తాంధ్రదేశమునందలి కవి పండిత విమర్శ కామోదమును బడయుచు నభివృద్ధి నొందెను. 1935 సంవత్సరమున నీ పరిషత్తునకు రజతోత్సవము శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారి యధ్యక్షత నీ నగరమందే మహా వైభవముతో జరిగెను. 1946 సంవత్సరమున శ్రీ ప్రభల సుందరరామయ్యగారి ధర్మపత్నియు, శ్రీ జయంతి రామయ్య పంతులుగారి సోదరియు నగు శ్రీమతి చిలుకుడు అనెడి వెంకటసుబ్బమ్మగారు గొప్ప విరాళము నొసంగి తమ భర్తగారి పేర నీ దివ్యభవనమును నిర్మించి యిచ్చిరి. వారి పేరిటనే యీ భవనము "ప్రభల సుందరరామ భవనము" అని పేర్కొనఁబడుచున్నది. దీనితోఁ బరిషత్తున కొక శాశ్వతనిలయ మేర్పడినది. అంతియే గాక యీ మహాసతి తన మరణశాసనమున నీ భవనము మీఁదిభాగ

మునఁ దన పేరిట నొక యంతస్తు నిర్మించుటకు 6000 రూపాయలను నిచ్చునట్లేర్పాటు గావించిరి. కోర్టుద్వారా మరణశాసన మమలు జరుపుటకు మా సహాయ కార్యదర్శి ప్రిభృతులకు కోర్టువా రధికార మొసంగినవెంటనే యీ ధనము మనకు లభించును. శ్రీమతి చిలుకుడు అనెడి సుబ్బమ్మగారి పే రీభవనరూపమునఁ జిరస్థాయి కాఁగలదు.

శ్రీబొబ్బిలి మహారాజావారును, శ్రీ వేంకటగిరి మహారాజా వారును, చెఱి పదివేలు గవర్నమెంటు ఋణపత్రముల రూపమునఁ బరిషత్తున కొసంగిరి. ఇదియే పరిషత్తునకు మూలధనము. దీనివలన సాలునకు 750 రూప్యములు లభించుచున్నవి. గ్రంథ విక్రియమువలన వచ్చు నాదాయము పునర్గ్రంథ ముద్రణమునకు సరిపోవుచున్నది. మొదటినుండియుఁ బరిషత్పత్త్రిక నష్టముమీఁదనే సాగుచున్నది.

ఈ భవననిర్మాణము పూర్తి యగుటకుఁ గొంత ధన మప్పు చేయవలసి వచ్చినది. ఆ సందర్భమున శ్రీ మాంధాత వెంకటరావుగారి యొద్ద మూఁడువేల రూపాయీ లప్పటి కార్యదర్శు లప్పు తెచ్చిరి. శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు రు 4606-5-4 పెట్టుబడి పెట్టిరి. నిన్న మొన్నటివఱకుఁ బరిషత్తీ ఋణములలోఁజిక్కుకొనియే యున్నది. ఇది యిట్లుండఁగాఁ బరిషత్కార్యములు చక్కగా నిర్వహింప సమర్థులైన శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిలుగారు స్థానికకళాశాలలోఁ బండితులుగా నియమింపఁబడి యిచ్చటి మేనేజరు పదవినుండి విరమించు కొనిరి. వారి స్థానమునఁ బనిచేయు సమర్థు లెవ్వరును లభింపకుండుట చేతను, పరిషత్తు ఋణగ్రస్తమై యుండుటచేతను, యుద్ధకారణమునఁ గాగి తము, ముద్రణము మొదలగువాని ధరలు విపరీతముగాఁ బెరుగుటచేత ను బరిషత్కార్యములకుఁ గొంత ప్రతిబంధము కలిగెను.

పిమ్మటఁ బరిషత్కార్య నిర్వాహకవర్గమువారు ధనసంపాదనము నకును, తన్మూలమున యథాపూర్వకముగఁ బరిషత్కార్య నిర్వహణ మునకు నత్యంత శ్రద్ధతోఁ గృషి యొనర్చిరి. తత్ఫలితముగా 2-2-1952 సంవత్సరమున శ్రీ పిఠాపురము మహారాజవారి కళాశాలలో సంగీత నృత్యసభ జరిగెను. శ్రీమతి వక్కలంక సరళాదేవిగారును, కుమారి

సూర్యకళయుఁ బరిషత్తునుండి ద్రవ్య మపేక్షింపకయే యుచితముగాఁ బ్రదర్శనము గావించిరి. దీనివలనఁ బరిషత్తునకు మూఁడువేల రూపాయీలు లభించినవి. గత సంవత్సరము విజయనగరమున నొక నాటక ప్రదర్శనము గావింపఁబడెను. తెనాలియందలి ఆంధ్ర ఆర్టిస్ట్స అసోషియేషనుకు సంబంధించిన శ్రీ మాధవపెద్ది వెంకటరామయ్యగారు, శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారు, శ్రీ పీసపాటి నరసింహమూర్తిగారును నాఁడుచితముగాఁ బ్రదర్శన మొసంగిరి. దీనివలన మే మనుకొన్నంత ధనము లభింపకపోయినను రు 500- లు మాత్రము చేకూరినవి. వీరందఱికిఁ బరిషత్పక్షమున మా కృతజ్ఞతఁ దెల్పుచున్నాము.

గత సంవత్సరమునఁ బరిషత్తునందలి యత్యంతాభిమానముచే మేము కోరినదే తడవుగా శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారుఁ దాము రచించిన స్వప్నవాసవదత్త మను సంస్కృతానువాద నాటకమును మా కుచితముగా నొసంగిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువా రధికాదరముతో దాని నింటర్మీడియేటు పరీక్షకుఁ బాఠ్యపుస్తకముగా నిర్ణయించిరి. దీనివలన నీ సంవత్సరము రెండువేల రూప్యములు లభించినవి. ఈ యుపవిశ్వవిద్యాలయమున కెంతయుఁ గృతజ్ఞులము.

ఉదారచిత్తులైన యీక్రిందఁ బేర్కొనఁబడినవారీ సంవత్సరము చెఱియొక వందరూపాయీల నొసంగి యావజ్జీవ సభ్యులుగాఁ జేరిరి. వారు శ్రీ ఏచూరి సీతారామారావుగారు, ఆచంట వెంకటేశ్వరరావుగారు, కాఖూరి రామచంద్ర సత్యనారాయణరావుగారు, దంటు సూర్యారావుగారు, వేలూరి లక్ష్మీనరసింహ వెంకటరమణయ్యగారు.

యావజ్జీవ సభ్యు లొసంగిన చందాను బరిషత్కార్యములకు వినియోగింపక మూలధనములోఁ జేర్పఁదలంచితిమి. తదనుసారముగా నీ సంవత్సరము వేయి రూపాయీలకు మదరాసు ప్రభుత్వ ఋణపత్రమును గొంటిమి పై విధముల లభించిన ధనముచే శ్రీ మాంధాత వెంకటరావుగారి కీయవలసిన ఋణము తీఱిపోయినది. ఈసంవత్సరము పరిషత్తు భవనము మీఁదిభాగమున సున్నము చేయించుట, వెల్ల

వేయించుట, విద్యుద్దీపముల నమర్చుట మొదలగు పనులు నిర్వహింపఁ బడినవి. ఇఁక 1946 సంవత్సరము నుండి శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారికి వారు పెట్టుబడి పెట్టినసొమ్ము వడ్డీతోఁ గూడఁ బరిషత్కార్యవర్గతీర్మానము ననుసరించి చెల్లింపవలసియున్నది. నేఁ డాధనమంతయుఁ దమ మాతృదేవతయగు శ్రీమతి లక్ష్మమ్మగారి పేరఁ బరిషత్తునకు విరాళముగా నొసంగెదమని వారు ప్రకటించుట యత్యంత ముదావహము.

25 సంవత్సరములకుఁ బైఁగాఁ బరిషత్తునకుఁ గార్యదర్శిగా నుండి కార్యభారము నంతయు వహించిన శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగా రీ సంవత్సరము అనారోగ్య కారణముచేఁ దమ పదవినుండి విరమించిరి. లోటుపాట్లులేకుండఁ దగిన సలహాల నిచ్చుచు నిఁకముందుగూడఁ బరిషత్కార్యము నడుపుటకై వారిని బ్రార్థించుచున్నాము.

ప్రస్తుతము పరిషత్కార్యము లన్నియు, వెనుకటివలెనే చురుకుగా జరుగుచున్నవి పరిషత్పత్త్రిక రెండునెలల కొకసారి వెలువడుచున్నది. ఆంధ్రదేశమునందలి కవిపండిత విమర్శకులు తమ యమూల్య వ్యాసముల నొసంగి యాదరించినచో నచిరకాలముననే మాసపత్త్రిక కాఁగలదని విశ్వసించుచున్నాము.

ధనాభావముచేతను, యుద్ధకాలమున కాగితము లభింపకుండుట చేతను బరిషత్పత్త్రిక సక్రమముగా వెలువడుటలోఁ గొంతకాల మాలస్యము కల్గినను బరిషత్ప్రచురణములు మాత్రము వెలువడుచునే యున్నవి. వాని నిటఁ బేర్కొనుచున్నాము.

1. లక్షణసార సంగ్రహము- చిత్రకవి పెద్దన- క్రీ॥ శ॥ 16 శతాబ్ది. అప్పకవికి పూర్వుఁడు.
2. కావ్యాలంకార చూడామణి- పాఠభేదములు.
3. పరిషత్పుస్తక భాండాగారము_ మూఁడవభాగము.
4. ఈశానసంహిత- (సంస్కృతము) శ్రీనాథుఁడు రచించిన శివరాత్రి మాహాత్మ్యమునకు మూలము.
5. నీతిశాస్త్ర ముక్తావళి- బద్దెన- క్రీ॥ శ॥ 1260 ప్రాంతము.

6. ప్రగడవారి కందములు- కర్త- కాలము తెలియదు.

7. ఉదాహరణ పద్యములు- వివిధకవులవి- పరిషత్తునందలి యొక ప్రతినుండి సంగ్రహింపఁబడినవి.

8. శివలీలా విలాసము- నిశ్శంక కొమ్మన- క్రీ॥ శ॥ 15 శతాబ్దము-శ్రీనాథునకు సమకాలికుఁడు కవిత్వము చాలపటిష్ఠమైనది.

9. భాగవతైకాదశ ద్వాదశస్కంధములు- హరిభట్టు. క్రీ॥ శ॥ 17 వ శతాబ్ది.

10. రాధికాసాంత్వనము- సముఖము వెంకట కృష్ణప్ప నాయకుఁడు దక్షిణాంధ్రకవి. క్రీ॥ శ॥ 18 వ శతాబ్ది.

11. ప్రాస్తావిక పద్యావళి- మచ్చ లక్ష్మీనారాయణకవి- క్రీ॥శ॥ 19 వ శతాబ్ది- విజయనగరం.

క్రొత్తపాఠములఁ జేర్చి కాళహస్తిమాహాత్మ్య పారిజాతాపహరణ గ్రంథములు సమీక్షింపఁబడినవి.

రంగాజమ్మ రచించిన ఉషాపరిణయము, శ్రీనాథుని క్రీడాభిరామము, ఈ రెండును పరిచూడఁబడి ముద్రణమునకు సిద్ధముగా నున్నవి. ఉషాపరిణయము నందలి యుపోద్ఘాత మిదివరకే పరిషత్ పత్త్రికాముఖమునఁ బ్రకటింపఁబడెను.

పరిషదారంభమునుండియు నేఁటివఱకు డెబ్బదికిపైఁగా నపూర్వగ్రంథములు పరిషత్తు ద్వారా ప్రకటింపఁబడెను.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు పరిషత్ప్రయత్నములలోఁ బ్రప్రథమమైనదే గాక ప్రధానమైనదియు. శ్రీశ్రీశ్రీ పిఠాపురము మహారాజావారు దీని నిర్మాణమునకై యిప్పటికి రెండు లక్షల రూప్యములకు పైఁగా వెచ్చించియున్నారు. నాలుగు సంపుటములు వెలువడి పరిపత్తు ద్వారా దేశమున కంతటికి లభించినవి. మిగిలిన మూఁడు సంపుటముల గ్రంథము పూర్తియై సిద్ధముగా నున్నది. నేఁటి క్లిష్టపరిస్థితులలోఁ గూడ శ్రీ మహారాజావారు మిగిలిన సంపుటముల నొక్కసారిగా ముద్రణమున కొసంగిరనియుఁ ద్వరలోనే యవి వెలువడ

నున్న దనియుఁ దెలియవచ్చుట శ్రీ మహారాజా వారి మహౌదార్యమునకు వారి యాంధ్ర భాషాభిమానమునకుఁ దార్కాణము.

మా పరిషదాశయములలో నేఁటి కింకను బూర్తి కావలసినవి కొన్ని గలవు. అందుఁ బ్రధానమైనది "తెలుఁగు భాషకు సజాతీయేతర భాషలతోఁ గల సాదృశ్యమును సాకల్యముగా నిరూపించుచు నొక వ్యాకరణము రచించి ప్రచురించుట" ఈ వ్యాకరణము సాధ్యమైనంత వఱకు సర్వసమ్మతముగా నుండవలె నని మా యూహ. ఇందులకై యీ సభలోఁ జర్చలు గావింప నిర్ణయించితిమి. ఈ సభకు విచ్చేసిన మహా పండితు లంద ఱీచర్చలలోఁ బాల్గొని యీ వ్యాకరణ స్వరూప మెట్లుండవలెనో నిర్ణయించినచో దానిని రచించుటకుఁ దగిన ప్రయత్నములను జేయనెంచితిమి. వ్యావహారిక భాష కొక యనుగతి లేకుండుట చేతను, మన కింతవఱకు లభించెడి వ్యాకరణములు సమగ్రములు కాకపోవుటచేతను, సర్వసమ్మతము, పర్యాప్త మైన వ్యాకరణ మొకటి నేఁ డవసర మయ్యెను.

ఇంకను బరిషదాశయములలోఁ బారిభాషిక శబ్దకోశము సిద్ధము చేయుట, ఆంధ్రదేశ చరిత్రము రచించి ప్రచురించుట, తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలు గావించి పట్టముల నొసంగుట మొదలగునవి నేఁటికిని సాధ్యావస్థలోనే యున్నవి. ఆంధ్రమహాజనులు తగిన యుత్సాహ మొసంగినచో వీనిని సాధించుట యొక శ్రమగాదు.

నేఁడు కేంద్రప్రభుత్వము భారతసాహిత్యపరిషత్తును శ్రీ అబ్దుల్ కలాం అజాద్‌గారి యధ్యక్షతక్రింద నెలకొల్పుచున్నది. దానికి దేశభాషా పరిషత్తు లంగములు గావింపఁ బ్రయత్నములు జరుగుచున్నవి. అట్టియెడ మన యాంధ్రదేశములో దాని కంగముగా నుండఁదగినది ఆంధ్రసాహిత్య పరిషత్తొక్కటియే యని చెప్పుట యతిశయోక్తి గాదు. ఈ సందర్భమున కొంద ఱీ పరిషత్తు ప్రాచీనసాహిత్యమునకే సంబంధించిన దని చెప్పుట మిగుల శోచనీయము. భాష లక్షణయుక్తమైనచోఁ బరిషత్తున కే సాహిత్యమైన నొక్కటే.

ఈ విధముగాఁ బరిషత్తు నిరంతర భాషాసేవ చేయుచున్నది. ఇంత కాల మీ విధముగా భాషాసేవ చేసిన సంస్థ యాంధ్రదేశమున మఱి యొకటి లేదు. ఆంధ్రదేశమునఁ గల కవులు పండితులు తమ చేతనైన విధమునఁ జేయూఁత నొసంగినచోఁ బరిషత్తితో నధికోత్సాహముతో భాషాసేవకుఁ గడంగఁగలదు.

చిరకాలము పరిషత్తులో మేనేజరుగానుండి తాటియాకు పుస్తకముల నన్నిటిని సంరక్షించి పరిశోధించి ప్రకటించుటకై వ్రాఁతప్రతుల వ్రాసి తమ జీవిత మంతయు నాంధ్రభాషాసేవకై ధారపోసిన శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారువంటి పండితుల సాహాయ్య మెంతయు నావశ్యకము.

పరిషద్గ్రంథాలయములోఁ దాటాకు పుస్తకములు సుమా రాఱు వేలు గలవు. అం దమూల్యమైన యముద్రితగ్రంథములు దాదాపైదు వందలు గలవు. ఈనడుమ యాంధ్రవిశ్వకళాపరిషత్తులో B. A. (Hons) మొదటి తరగతిలో మొదటివారుగా నుత్తీర్ణులై భారతప్రభుత్వ పరిశోధక వేతనముఁను బడయుచున్న యస్వీ జోగారావుగారు మూఁడు నెలలనుండి "యక్షగానము" అను విషయమును గూర్చి పరిషద్గ్రంథాలయమునఁ బరిశోధనము జరిపిరి. వారి కిప్పటికిని నముద్రితములును, ఇతరత్ర దుర్లభములు నగు యక్షగానము లనేకము లభించినవి.

పాశ్చాత్యదేశములలో గ్రంథరచనము వలన జీవయాత్ర గడచుటయే గాక కవులు ధనికులుగూడ నగుచున్నారు. దీనికిఁ గారణము ప్రజలలో స్వభాషాభిమానము, గ్రంథపఠనాభ్యాసము నధికముగా నుండుటయే. మనవారికి మన భాషయందు నభిమానము లేకపోవుటయే గాక మన వాఙ్మయము సర్వాంగసుందరము కాదని కొందఱు తెగడఁ జూచుట హాస్యాస్పదము. మన వాఙ్మయము పరిపుష్టము నొందలేదనిన యాలోపము మనదే యన్న సంగతి మఱవఁగూడదు. మన మెంతకాలము మన వాఙ్మయమును నిరసించుచుందుమో యంతకాలము మన భాషకీ యధోగతి తప్పదు. మన వాఙ్మయ స్వర్ణయుగకాలమున నత్యంతప్రారంభదశలో నెన్నో మఱుంగు లడుగునఁ బడియున్న యాంగ్ల వాఙ్మయము వారి నిరంతర కృషిచే నేఁ డెట్టి యున్నతస్థితియం

దున్నదో మన వారందఱికి తెలిసిన విషయమే. కృషితో నాస్తి దుర్భిక్ష మన్నది క్రొత్తమాట గాదుగదా !

ఇంతకు మనవారికి మన వాఙ్మయమన్న నేవ. మనవారికి మన వాఙ్మయమన్నఁ దెలియదుగాని యీతర వాఙ్మయములఁ గూర్చి క్షోదక్షమముగా నుపన్యసింపఁగలరు. ఇతర వాఙ్మయపఠనమునకు ముందు స్వవాఙ్మయపరిశీలన మవసరమని మఱియొకరు చెప్పవలసిన నికృష్టస్థితిలో మనము నేఁ డున్నాము. అందువలననే యితరసారస్వతము లు దినదినము పింపొంది యున్నతస్థాయి నధిగమించుచుండఁగా మన భాష, మన వాఙ్మయము, అంతకంతకు దిగనాఱుచున్నవి. ఇతర యులు తమ వాఙ్మయమునందలి యుత్కృష్టరచనల ననుకరించుచుండఁ గా, దౌర్భాగ్యవశమున మనవారు అజ్ఞుల యపప్రయోగములననుకరిం చుచుఁ దమ విశాలహృదయత్వమునకు సంతసించుచున్నారు.

మనకు సంభవించిన యీ దురవస్థ తెలిసికొని యిప్పటికైన భాషావ్యాప్తికై మనవారు కృషిసల్పుట సమంజసము.

నిరుడు మదరాసు ప్రభుత్వము వారిని పరిషత్తునందలి యముద్రిత గ్రంథప్రకటనమునకు సాహాయ్యము కావింపుఁడని యర్థింప వారు ఉదారమనస్సుతో ద్వరలో నేర్పడనున్న ఆంధ్రరాష్ట్రము నర్థింపుఁడని దారి చూపిరి.

మనకు నేఁటికి ప్రత్యేకరాష్ట్రము సిద్ధించినది. మన మంత్రులు గూడ భాషాభివృద్ధికై గడంగినట్లు తెలియుచున్నది. నాటి హైదరాబాదు రాష్ట్రము ఆంధ్రసారస్వత పరిషత్తునకు నిరుడు 18 వేల రూప్యముల నొసంగిరి. ఈ యేడు 15 వేల రూప్యములు సంస్కృతసాహిత్య పరిషత్తునకు వాగ్దాన మొసంగినట్లు పత్రికాముఖమునఁ దెలియుచున్నది. ఉమ్మడి రాష్ట్రములో నూతనస్థాపితమైన సారస్వత పరిషత్తునకుఁ బ్రభుత్వ మింత యవలంబన మొసంగఁగా మనభాషను బోషించుకొనుటకై ప్రత్యేకరాష్ట్రమును బడసిన మన ప్రభుత్వము 42 సంవత్సరముల నుండి నిరంతరభాషాసేవ చేయుచున్న యీపరిషత్తు నెంతయేని యభిమానింపవలసియున్నది. ఔదార్యముతో మన ప్రభుత్వము పరిషత్తు గావించిన సేవను బరిగణింపఁగలదని విశ్వసించుచున్నాను.

# కవిసార్వభౌమ స్తుతి

దు వ్వూ రి సూ ర్య నా రా య ణ శా స్త్రి.



సీ. పుంజీభవించె నే పూజ్యపాదునియందు
            బాదరాయణుమహాప్రథితధిషణ
మూర్తీభవించె నే పూర్ణులో వాల్మీకి
            గంభీరతరభావగుంభనంబు
ఏకీభవించె నే లోకైకపూజ్యుతో
            నల
వర్గీభవించె నే వరకవిరూపులో
            శ్రీనాథకవిరాజచిద్విలాస

గీ. మతఁడు చెలువొందు; కింకవివితతగర్వ
పర్వతాభ్రంలిహాగ్రి విభ్రాజమాన
శృంగభంగ ప్రశస్తివాసిత దిగంత
కీలితవిశాలకీర్తి మా కృష్ణమూర్తి.

సీ. కృష్ణయజుర్వేదకీర్తికాంతను దల
            కెక్కించికొన్న వాగీశమౌళి
పాణినీయమ్ము నా భాష్యము నాచమిం
            చిన యపశ్చిమవిపశ్చిద్వరుండు
ధర్మశాస్త్ర సమస్త మర్మకర్మముల నా
            పోశనించిన పండితాధినేత
ఆదిపురాణమ్ము లనువదించి కదించి
            తెలుఁగుబిడ్డల కిడ్డ దీప్తిశాలి

గీ. ఒక్క పూర్ణజీవితముతో నొక్కమాఱు
చదువుటకు నైన లోఁగని సరసవాఙ్మ
యమ్ము తెనుఁగుల కందించి యలరినాఁడు
ఫణిపతిగఁ దోఁచు శ్రీపాదభవ్యసుకవి.

సీ. సవదరించెను మహాకవిపూజ లొకనాఁడు
కవిసార్వభౌముండు కాంచినట్లు
ఏనుఁగంబారీల నెక్కినాఁ డొకనాఁడు
పూజ్యుఁడు పెద్దన్న పొందినట్లు
పోతన్న రీతి నొప్పాంగినాఁ డొక వేళ
సరసవాణీ కటాక్షంబుకలన
శాపాక్షరంబులఁ జల్లినాఁ డొక వేళ
అల వేములాడ భీమన్న కరణి

గీ. కాళికాలోల దృక్కళికా విలోల
డోలికా లీల ఖేలన బాలకుండు
కాళిదాసుని కరణి నుయ్యాల లూఁచి
మించి భారతి నితఁడు లాలించినాఁడు.

మ. ఏ నాఁడెప్పుడు నే శతాబ్దములలోనే గాని, యేభాషలోఁ
గానీ, యే పరదేశముల్ వనములుఁ గాలించి గాలించినం
గానీ, యిట్టి బుధోత్తముఁ గవితకుం గాణాచి, దర్శింపనుఁ
వీనుల్ సోఁకనుగూడ లే దనిన రానేరా ది దత్యుక్తిగా.

గీ. ఓయి కవిసార్వభౌమ మహోజ్జ్వలాంగ
యవతరించితి వ్యాసుని యంశతోడఁ
బూర్ణపురుషాయుషమ్ముతోఁ బొదలి నీవు
దేశసౌభాగ్యముం గూర్పఁ దివురుమయ్య.

# ఆముక్తమాల్యద.

దేవరకొండ వీరయ్యగారు M. A.
ప్రధానాంధ్రోపన్యాసకులు నరసాపురముక శాశాల.

## గ్రంథనామధేయము — కథాశిల్పము.

ఆంధ్రవాఙ్మయమున నాముక్తమాల్యద కర్తృత్వమునుగూర్చి పండితవిమర్శక లోకమున వివాదములు చెలరేగినవి. ఇది శ్రీకృష్ణరాయ మహారాజకృతి యని కొందఱును, పెద్దనాదిపండితకవులలో నెవరో ధన మున కాశించి మహారాజకృతి గానే ప్రకటించి రని మఱికొందఱును వాదించిరి. దీనికర్త శ్రీకృష్ణరాయ లనియే బహుపండితవిమర్శ కాభిప్రాయ మని సాహితీతీర్థయాత్రికులకు విదితము.

ఆముక్తమాల్యద యాంధ్రవాఙ్మయమునఁ బ్రౌఢప్రబంధము లలో నొకటి. ఇది ఉత్తమకావ్య గుణసౌందర్య శోభిత మగుటయే కాక విశిష్టాద్వైతమత సంప్రదాయ ప్రతిపాదకగ్రంథము.

ఈ ప్రౌఢప్రబంధ నామధేయము "ఆముక్తమాల్యద" యని కవియే యాశ్వాసాంతపద్యములలోఁ దెల్పెను. దీనికి విష్ణుచిత్తీయ మను నామాంతరమును గలదు. ఆముక్తమాల్యద యనగా ధరించి విడిచిన పుష్పమాల నిచ్చినయువతి. విష్ణుచిత్తీయ మనఁగా విష్ణుచిత్తుఁడను మహా భక్తుని చరిత్రమును దెల్పునది. ఈరెండు నామధేయములును గథలోని ప్రధానపాత్ర లగు విష్ణుచిత్తునిబట్టియు, గోదాదేవినిఁ బట్టియు నీ గ్రంథము నకుఁగల్గిన వని తలంపవచ్చును.

గ్రంథనామకథా శరీరములఁగల సంబంధము సాహితీమర్మజ్ఞులకు సుజ్ఞాతపూర్వము. ఈప్రబంధమునందుఁ గవి యైదువృత్తాంతముల నను సంధానించెను. (1) విష్ణుచిత్తుని వృత్తాంతము (2) ఖాండిక్యకేశిధ్వజ వృత్తాంతము (3) యామునాచార్యవృత్తాంతము (4) గోదాదేవివృత్తాంతము (5) మాతంగబ్రహ్మరక్షస్సులవృత్తాంతము. ఈగ్రంథనామ

ములఁబట్టి కథాసంవిధానములలోని యౌచిత్యమును జర్చించుటకుఁ బూర్వము కావ్యావతారికలోఁ గవి ప్రసంగించిన కావ్యరచనాప్రసక్తిని గూర్చి, కావ్యార్థసూచననుగూర్చి తెలిసికొనవలెను. కావ్యావతారికలో నిట్లున్నది: "ము న్నేఁగళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటికం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళ నికేతనుం డగు నాంధ్ర మధుమథను సేవింపఁబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున నాంధ్రజలజాక్షుఁడి ట్లని యాన తిచ్చెను. ఆంధ్రభాష ... ... యందు నొక కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.

"ఎన్నినుగూర్తునన్న విను; మే మును దాల్చిన మాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలిసెప్పుము; మున్ను గొంటి నే
వ న్నన దండ నొక్క మగవాఁ డిడ, నేను దెలుంగురాయడఁ
గన్నడరాయ! యక్కొడుదువఁగప్పు ప్రియాపరిభుక్తభాక్కథఁ."

ఈ పద్యము మాల్యముల నర్పించిన రెండు స్త్రీ పురుషపాత్రల సూచించుచున్నది. పైపద్యమున కర్థ మిది. ము న్నొక మగవాఁ డిచ్చిన ననదండల నేవ గ్రహించితి ననియు, నొకయువతి ధరించి విడిచినమాల్యము నర్పింపఁగాఁ దాను బ్రీతితో గ్రహించితి ననియు, నా యువతినిఁ దాను బెండిలియాడిన వృత్తాంతమును బ్రబంధముగా రచింపు మనియు నాంధ్ర విష్ణువు శ్రీకృష్ణరాయల నాజ్ఞాపించెను. "మున్ను గొంటి నేవ న్నన దండ నొక్క మగవాఁ డిడ" నను దానికి యర్థము స్పష్ట మగుటకు వ్యాఖ్యానింపవలసియున్నది. "మున్ను మగవాఁ"డను శబ్దముల కర్థము ద్వివిధముగాఁ జెప్పవచ్చును.

మున్ను = (1) పూర్వము కృష్ణావతారకాలమున (2) కలియుగమున గోదాదేవి తాను ధరించి విడిచిన దండల శ్రీ వటపత్రశాయి కర్పింపకపూర్వము.

మగవాఁడు = (1) సుదాముఁడు (2) విష్ణుచిత్తుఁడు. ద్వాపరయుగకాలమున శ్రీకృష్ణబలరాములకు మధురానగరమున సుదాముఁ

డను మాలాకారుఁడు పుష్పమాల్యముల నతిభక్తితో సమర్పించెను. శ్రీకృష్ణుఁ డాతనిభక్తికి మెచ్చి యొకవరము ననుగ్రహించెను. కలియుగమున విష్ణుచిత్తుఁ డను మహాభక్తుఁడు శ్రీవిల్లిపుత్తూరునందు వేంచేసియున్న శ్రీ వటపత్రశాయికి మాలాకైంకర్య మనుదినము చేసెడివాఁడు. వీరిరువురును మహాభక్తులు. సుదాముని భక్తికి హరివంశభాగవతములు ప్రమాణములు. విష్ణుచిత్తుని మాలాకైంకర్యభక్తికిఁ బ్రమాణము గురుపరంపరాప్రభావము. భక్తులైన వీ రొసఁగిన మాల్యములఁ బ్రీతితోను, గోదాదేవి ధరించి విడిచిన మాల్యముల నధికప్రీతితోను గ్రహించితి నని చెప్పుట యుచితముగాని వీరొసగిన మాల్యముల నేవ గ్రహించితి నని చెప్పుట యుచితముగాఁదోఁపదు. కనుక "ఏవక" అను శబ్దమునకు "అసహ్యాయుత్తో, ఏవగింపుతో" నని యర్థము చెప్పుటకంటె 'సాపేక్షముగా నల్పప్రీతితో'నని యర్థముచెప్పుట యుచితము కాకపోదు.

పై పద్యములోని" "మగవాఁడు" అనుశబ్దమునకు సుదాముఁడని యర్థము చెప్పినచో నాముక్తమాల్యదయందు సుదాముని చరిత్రము ప్రసక్త మగును. దానియందు సుదాముని ప్రసక్తి లేకపోవుటయే కాక యాతని సూచనకూడఁ గావ్యమం దెచ్చటను లేదు. ఇందు వర్ణింపఁబడిన వృత్తాంతములలో విష్ణుచిత్తునిదే మొదటిది. ఈతని వృత్తాంతము కథాప్రారంభమునఁ జెప్పఁబడుట మాత్రముచేఁ గాక, ఇతని పాత్రప్రాధాన్యముచేతను భక్తివిశేషముచేతను బ్రముఖ మైన దగుచున్నది.

మహాభక్తుఁడైన విష్ణుచిత్తుఁ డొసఁగిన మాల్యములనేల "ఏవ" గ్రహించుట ? విష్ణుచిత్తుఁడు కేవలము భక్తుఁడు. గోదాదేవి (విష్ణుమూర్తికి) తనకుఁబ్రియురాలైన భూదేవియపరావతారము. ఆమె శ్రీమన్నారాయణుని శృంగార భావముల కాలంబనము. శ్రీవట పత్రశాయి విష్ణుచిత్తుని మాలల సేవతో గ్రహించి యుండినయెడల నాతనిఁ బాండ్యరాజు సభకుఁబోయి పరమత వాదుల నోడించి వైష్ణవమతమే పరమని స్థాపింపు మని విష్ణునాజ్ఞాపించుటయుఁ దన ప్రియురాలైన భూదేవియవతారమైన గోదాదేవికిఁ దండ్రిగా నుండు నవకాశ మతనికే

యిచ్చుటయుఁ బొసఁగని విషయములు. ఈతని మాలాకైంకర్య భక్తి యెడఁ బ్రీతి విష్ణువునకుఁ గలదు. గోదాదేవిమాలార్పణమువలనను బ్రీతి గల్గినది. కానఁ బ్రీతి విశేషములలోఁ జాల భేద మున్నది. ఆ ప్రీతి భేదభావమునే కవి "ఏవ" శబ్దముచేఁ జెప్పెనని తలంప వలసియున్నది.

కావ్యార్థసూచనచేయు పై పద్యమును విష్ణుచిత్తుని మాలాకైంకర్య వృత్తాంతమును, విష్ణుచిత్తుఁడు శ్రీవటపత్రశాయి కర్పింపఁ గట్టిన కమ్మకలువతో మాలల గోదాదేవి తన ధమ్మిల్లవలయంబున నొకొంతసే పునిచి కూపవారిఁ దనప్రతిబింబమును జూచికొని పిమ్మట గూడ నునుచు వృత్తాంతమును బ్రబంధకథలో ముఖ్యమైన వని దోఁచు చున్నది. అనుచిన మీామె చేసిన వ్యాపారమును బట్టియే యీామెకు నాముక్తమాల్యద యను నామము తరువాతి కాలమున సార్థకముగాఁ గల్గినది. ఈ "ఆముక్తమాల్యద'' శబ్దము సన్నివేశపరముగా నర్థ మిచ్చు నని కాఁబోలుఁ గావ్యార్థసూచన సేయు పద్యములో "ఏ మునుదాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పెదము'' అని వారికి జరిగిన వివాహమును గూర్చి స్పష్టముగాఁ జెప్పెను.

ప్రబంధార్థసూచన చేయు పద్యమును, ఆముక్తమాల్యద యను గ్రంథనామధేయమును ఈ క్రింది కథాసంవిధానమునే సమర్థించును. విష్ణుచిత్తుని నివాస మగు శ్రీవిల్లిపుత్తూరు వర్ణన, ఆతని మాలాకైంకర్య పరత, గోదాదేవి యాతనికిఁ దులసివనమున దొరకుట, ఆమెయౌవనా విర్భావము, శ్రీమన్నారాయణునియెడ నామె విరాళి, శైత్యోప చారములు, శ్రీవటపత్రశాయి ననుదినముఁ బూజించుట, విష్ణుచిత్తుఁ డామెను శ్రీరంగమునకుఁ గొనిపోవుట— శ్రీరంగస్వామికిని గోదాదేవికిని వివాహము.

వస్త్వైక్యమును జెఱచిన వృత్తాంతములు — పాండ్యరాజు సభలోఁ బరమతవాదుల ఖండించి విశిష్టాద్వైతమతమును స్థాపించుట— పరమేశ్వర సాక్షాత్కారోపకారి యగు యోగమును ఖాండిక్య కేశిధ్వజ

వృత్తాంతరూపమునఁ దెల్పుట యామునాచార్యచ మాతంగ బ్రహ్మరక్షస్సుల వృత్తాంతము.

ఈ ప్రబంధమునకు నామాంతరము "విష్ణు చిత్తీయము". ఈ నామ ధేయ మీ క్రింది కథను సమర్థించును. ప్రధాన పాత్ర యగు విష్ణు చిత్తుని మాలాకైంకర్యపరత — వటపత్రశాయి శాసనమునఁ బాండ్య సభకుఁబోయి పరమతవాదుల ఖండించి విశిష్టాద్వైతమతమును స్థాపించుట — పరబ్రహ్మసాక్షాత్కారోపకారి యగు యోగసిద్ధాంత ప్రతిపాదన — గోదాదేవి విష్ణుచిత్తునకుఁదులసివనమున దొరకుట — ఆమె యౌవనావిర్భావము — విష్ణుమూర్తిని వివాహమాడ వాంఛ పొడముట — ఆమె విరాళి — శైత్యోపచారములు — శ్రీరంగముకు గోదాదేవిని విష్ణుచిత్తుఁడు గొనిపోవుట — గోదాశ్రీరంగనాయకుల వివాహము. ఇఁక మిగిలిన యామునాచార్య వృత్తాంతమును మాతంగ బ్రహ్మరక్షస్సుల వృత్తాంతమును గథాశిల్పమును జెఱచుచున్నవనుట సాహసము కాదు. శ్రీకృష్ణరాయలు తాను రచించిన ప్రబంధమునకు నాముక్తమాల్యదతోపాటు విష్ణుచిత్తీయ మను నామాంతరము గలదని కావ్యమందెచ్చటఁ దెలుపలేదు. కవి గాని యితరులు గాని యీప్రబంధమునకు నామాంతరము విష్ణుచిత్తుని పాత్రప్రాధాన్యమును బట్టి పెట్టియుండవచ్చును. విష్ణుచిత్తునకుఁ బ్రబంధకథలోఁగలపాత్ర ప్రాధాన్యమును బట్టి, అతని కథాకథన విన్యాసములఁబట్టి నామాంతరము కవికంఠోక్తము గాక పోయినను నుద్దేశించె ననుట యనుమాన సాధ్యము.

"కావ్యనాటకాలంకార మర్మజ్ఞ, సాహితీ సమరాంగణ సార్వభౌమ, కవితాప్రావీణ్యఫణీశ" బిరుదాంచితుఁడైన శ్రీకృష్ణరాయలు పైఁ జెప్పిన వృత్తాంతములు ప్రధానకథ నడ్డగించినను, ఇందు నను సంధించుటచేఁ గథా శిల్పము కంటె నధిక ప్రయోజనముల నపేక్షించె నని సాహితీ పథికులకుఁ దోఁపకపోదు. కావ్యకర్తృపతితల పరముగా సాధ్యములు ప్రథమతురీయపురుషార్థములు—ధర్మమోక్షములు. శ్రీకృష్ణరాయలు విశిష్టాద్వైతుఁడు; విష్ణుభక్తుఁడు. అష్టభక్తి

పద్ధతులు (మతాంతరమున భక్తినవపద్ధతులు) కథలోని పాత్రిలయం దున్నట్లు చిత్రించెను. వైష్ణవమతస్థాపకులు, భాగవతులు నైనవారి యెడఁ దనకుఁగల భక్తిని దద్ద్వారా శ్రీమన్నారాయణునియెడఁ దనకుఁ గలభక్తిని బ్రకటించెను. ఆముక్తమాల్యద భక్తిప్రధానమైనది. ఆ భక్తిని బుష్టముగాఁజేయుతలఁపుతోనే గ్రంథనామధేయములు సమర్థింపని వృత్తాంతములను బ్రిధానకథతో నాయాసందర్భముల ననుసంధానించెను- అనఁగా భక్తిపోషణకు సంగములుగా నీ యప్రసక్తవృత్తాంతములు గ్రిహింపఁబడినవి.

## వి ష్ణు చి త్తు ని వృ త్తా ం త ము.

విష్ణుచిత్తుఁడు మహాభక్తుఁడు; విల్లిపుత్తూరు పురవాసి; అద్వైద్వుఁడు; నిరంతరము పరమేశ్వరుని సంప్రజ్ఞాతసమాధిచే సాక్షాత్కరించుకొనువాఁడు. వేదవేదాంతాధ్యయనము లేకయే పూర్వపుణ్యమునఁ దల్లభ్యమైన జీవేశ్వర భేదజ్ఞానము కలవాఁడు. శాంతిదాంతి పరతంత్రతను బరమై పొంగి భగవత్పరిచర్య సేయుటయ పరమపురుషార్థమని తలంచినవాఁడు. మాలికాకరణకైంకర్యపరుఁడు. వైష్ణవభక్తుల షోడశోపచారముల సేవించు నైష్ఠికుఁడు.

"ఆ నిష్ఠానిధిగేహసీమ నడురే యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్రిశయాను పుణ్యకథలుం దివ్యప్రిబంధానుసం
ధానధ్వానము నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య మన్ మాటలున్"

దీనివలన విష్ణుచిత్తుని జ్ఞానవైరాగ్యములు, భగవద్భక్తి, భాగవతభక్తి వ్యక్త మగుచున్నవి.

మధురానగరమునఁ బాండ్యరాజు భోగినీగృహమునకుఁబోవుచు విప్రపఠితసుభాషితార్థమును విని విరక్తుఁడై కొలువుండి పరతత్త్వ నిర్ణయము సేయఁజాటించెను. విష్ణుచిత్తుఁడు తులసీసుగంధి మాల్యమున మాలమంత్రిమున విష్ణుపక్షమున నుంచబోఁగా శ్రీవటపత్రశాయి యిట్లు పల్కెను.

"నేఁడు మహామతీ! మధుర నీవు రయంబునఁ జొచ్చి యందు పాం
డ్యుఁడు డివాణము న్నెలయ నించినఁ బ్రేలెడు దుర్మదాంధులన్
భోఁడిమి మాన్పి మన్మహిమముం బ్రకటించి హరింపు శుల్కమున్
వాఁడును రోసినాఁ డిహము; వైష్ణవుగా నొనరింపు సత్కృపన్.

"అనిన వడవడ వడఁకి సాష్టాంగ మెఱఁగి
సమ్మదాశ్రులు పులకలు ముమ్మరింప
వినయ వినమితగాత్రుఁడై విప్రవరుఁడు
వెన్నునకు భక్తి ని ట్లని విన్నవించె".

శ్రీవటపత్రశాయి తానే పరతత్త్వ మని నిరూపింప విష్ణుచిత్తుని నాజ్ఞాపించెను. అతఁడు వడవడ వడఁకిపోయెను. విష్ణుమూర్తి తనయెడఁ జూపిన యనుగ్రహమునకు సమ్మదాశ్రులు రోమాంచమును బొడమినవి. అతఁడు

"స్వామీ! నన్ను నితఃపురాపఠితశాస్త్ర గ్రంథజాత్యంధు నా
రామక్ష్మా ఖనన క్రియా ఖర ఖనిత్ర గ్రాహితోద్యత్కిణా
స్తోమాస్నిగ్ధకరున్ భవద్భవనదాసున్ వాదిగాఁ బంపుచో
భూమీభృత్సభ నోట మైన నయశంబున్ మీకు రాకుండునే!"

అని విన్నవించినాఁడు. అతని భయమునకు హేతువు ఇంతకుఁ బూర్వము పరతత్త్వనిర్ణయమునకు వలయు శాస్త్రజ్ఞానము నధ్యయనముచే నలవఱచుకొనకపోవుట. అతని కభ్యాస మైనది శ్రీ వటపత్రశాయి యుద్యానమును త్రవ్వుట, నీరుపెట్టుట మొదలైన కృత్యసముదాయము. రాజసభఁ దా నోడిన నపయశస్సులు విష్ణువునకుఁ గల్గునఁట! ఈ క్రింది కృత్యము లాతఁడు చేయఁగలఁడఁట!

"గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికాకరణమో వాల్లభ్యలభ్య ధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో, దాక్షిపికారోపమో
నృహరీ! వాదము లేల? లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్?".

తమ యనుగ్రహరూపవిలాసమునకుఁ బాత్రులైన యితరులు లేరే? యని విష్ణుచిత్తుని ప్రశ్న. వాదమునకుఁ బంపువాఁడు శ్రీ మన్నారాయ

ణుఁడు. తన మహాత్మ్యమునఁ బరాజిత మగునది వైష్ణవమతము. ఇం దిట్లు విష్ణుచిత్తునిభక్తి పరాకోటిని బొందినది. విష్ణుమూర్తియే తనవాదమునకు వలయు శాస్త్రజ్ఞానము నిచ్చు నన్న సంగతి భక్తివివశత్వమున మఱచినాఁడు కాఁబోలు!

విష్ణుచిత్తుని భక్తికి మెచ్చి మందహాసముఖుఁడై శ్రీ వటపత్రశాయి శ్రీదేవితో "వా డితనిచే గెలిపింతు నాదు మహిమ గను"మని మఱి యిట్లు భక్తునితోఁ బల్కి యియ్యకోనఁ జేసెను.

"నీ యిచ్చయె! మిన్నక పో
వోయి; మునిప్రవర! నిన్ను నొప్పింతును భూ
నాయకు సభ నిందులకై
యే యుద్దము వలవ దవల నే నున్నాఁడన్

విష్ణుచిత్తుఁడు పాండ్యరాజు సభకుఁబోయి సాంఖ్య, అద్వైత మీమాంసక, వైశేషిక, బౌద్ధ, చార్వాక మతవాదముల ఖండనచేసి శ్రీమన్నారాయణుఁడే పరతత్త్వముగాఁగలవిశిష్టాద్వైత మతమును స్థాపించెను. ఖాండిక్య కేశిధ్వజ సంవాదరూపమునఁ బరమేశ్వర సాక్షాత్కారార్థము యోగశాస్త్ర ప్రతిపాదనఁ జేయఁ బడినది.

యామునాచార్య వృత్తాంతము.

యామునాచార్య వృత్తాంతము కథైక్యమును జెఱచుచున్న భావము ప్రబంధ కర్తలకును గలదు. యామునాచార్య పాత్రపరిచయమును గవి శ్రీ వటపత్రశాయిచేఁ జేయించెను. ఒకనాఁడు మధ్యాహ్న సమయమాలికాసమారోపణానంతరము విష్ణుచిత్తునిఁ జూపి శ్రీవటపత్రశాయి శ్రీదేవితో

"యామునాచార్యుఁ డొకఁడు నీ మహాత్ముఁ
డొకఁడును గాదె దర్శనం బుద్ధరించి
రస్మదీయ కృపాతిశయమున" ననెను.

దీనినిఁ బట్టి విష్ణుచిత్త,యామునాచార్యులు వైష్ణవ దర్శనము నుద్ధరించుటచే వారివృత్తాంతము లిందు ప్రసక్త మగుచున్నదన్న యభిప్రాయము కవికి నున్నట్లు వ్యక్తమగు చున్నది. ఈ మతోద్ధరణ

వృత్తాంత మిందు ముఖ్య మైన దని భావించియే యవి కథలో నదుగక పోయినను బైపద్యముచే నాని ప్రసక్తిని సమర్థించుకొనెను.

విష్ణుచిత్త యామునాచార్యులకు శ్రీ విష్ణువు అనుగ్రహము సాధారణ మైనను నొక భేదమున్నది. విష్ణుచిత్తుఁ డితఃపురాపరిత శాస్త్ర గ్రంథ జాత్యంధుఁ డైనను మహాభక్తుఁడు. శ్రీ వటపత్రశాయి విష్ణు చిత్తునిఁ దానే పరతత్త్వ మని వాదింపఁ బాండ్యరాజు సభకుఁ బంపెను. యామునాచార్యుఁడు గురుకులమున వేదశాస్త్రాధ్యయనము చేసిన వాఁడు. యామునాచార్యునకు రాజాస్థానికిఁ బోయి పరతత్త్వ నిర్ణయ వాదము సేయఁదలఁపు కల్గించెను. దీనినే కవి శ్రీవటపత్రశాయిచే నిట్లు పల్కించెను.

"అబ్భూపతి తామసుండై మామకీనంబు లగు జనంబుల సామాన్యబుద్ధింజూచుచుఁదద్వృత్తులకగు నుపద్రవంబుల నుపేక్షించుచు రక్షావిముఖుండై యుండెను. కలియుగంబున ద్రవిడమండలంబునఁ గృత మాలాతామ్రపర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను దద్దేశంబున కాతఁడొడయం డగుటను రక్షణశిక్షణంబులు రాజముఖంబునఁగాని నే సాక్షాత్కరించి చేయమియుఁ దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాని పొడమమియు, నా యాభిముఖ్యంబు సంవాదంబునఁ గాని పుట్ట మియు నే విచారించి;తదాభిముఖ్య కరణార్థంబుగ నాస్థానం బెక్కి వాది విజయంబు సేయవలయు నన్నతలం ప విప్రకుమారునకుఁ బుట్టించితి" మహారాజునకొక మతమునం దాభిముఖ్యము గల్గుటకుఁ దదాస్థానమున, వాది విజయము సేయవలెను. దానివలనఁ దద్దేశమున నా మతము ప్రచారములోనికి వచ్చును. వాది విజయమునకుఁ బరమేశ్వరానుగ్రహము ముఖ్యము.

ఈ వృత్తాంతముఖమున మతసాధనకు నవసరము లైన రెండు ముఖ్యాంశములు తెలుపఁబడినవి. శ్రీ రామమిశ్రుని ముఖమున విజ్ఞా నాభివృద్ధికి అలర్కశాకాద్యాహారనియమము ముఖ్య మనియు, విష యానుభూతి నివృత్తి ప్రధాన మైన మోక్షమునకు నుపకారి యని విశ దమగుచున్నది. శ్రీ కృష్ణరాయలు తా నాచరించుచుండిన రాజనీతిని,

యామునప్రభువు తన కుమారున కుపదేశించి నట్లు తెలుఁగుప్రభువుల కుపదేశించెను. చారిత్రకముగా నది యమూల్య మైనది. ఇది సామాన్యపతితలకును వైజ్ఞానికోపదేశమే.

## గోదాదేవి వృత్తాంతము.

గోదాదేవి వృత్తాంతము శృంగారాత్మక భక్తికి నంతర్వేది. కృష్ణరాయల కవితాశక్తి గోదాదేవి యుపాలంభదంభపునః పునస్స్మరణవర్ణనమునఁ బరాకాష్ఠఁ బొందినది. వియోగవేదనాపనయనార్థ మామె వైష్ణవగీతములఁ బాడుట, యాకాలమున నామెకుఁ బొడమిన సాత్త్వికభావములు విష్ణుమూర్తియెడ నామెహృదయగతానురాగమును వ్యక్తముచేయుచున్నవి.

శ్రీపతిమీఁది గీతముల ప్రేమ విపంచిక నంటఁ, బాణి సం
తాపము సోఁకి మెట్ల మయినంబు కరంగిన, డించి, పాడు నా
లాపినిఁ దాల్చి పెజ్జెమటల న్మఱి తంత్రులు జజ్జుకోఁ గలా
లాపిని దాన పాడును గళంబును గద్గద మైన మ్రాన్పడున్".

అనుదినమును వియోగభరముచే విష్ణుగుణ కలిత ప్రబంధములఁ బాడెడిది.

గోదాదేవి పూర్వజన్మమున విష్ణు ప్రియ యగు భూదేవి. శృంగార రసపోషణకు నాయికా నాయకులు భావములఁ బోషించుట యాలంకారిక సంప్రదాయము. ఆముక్తమున గోదాదేవిశృంగారరస భావములు పోషింపఁబడినవి. కాని శ్రీమన్నారాయణునకు గోదాదేవి యెడఁగలవియోగభావములు వర్ణింపఁబడకుండుటవిశేషము. విష్ణుచిత్తుఁడు గోదాదేవిని శ్రీరంగనాయకునిసాన్నిధ్యమునకుఁగొనిపోవ నామెనాతఁడు తన తమకము నాఁపుకొనలేక తన యంతఃపురమునఁ జేర్చుకొనెను. ఈవర్ణనచేమాత్రము గోదాదేవియెడ శ్రీరంగనాయకునకుఁగల యనురాగమును గవి వ్యక్తము చేసెను. శ్రీరంగనాయకుని విప్రలంభ భావములు వర్ణితములైన భక్తుల కది వెగటు కల్గించును. శ్రీమన్నారాయణుఁడు లోకోత్తర పురుషుఁడు. శేషి. అందుచేఁ గవి శ్రీవిష్ణువు విప్రలంభ శృంగారభావ

ములు వర్ణింపకుండుట యుచితమే. (భక్తిప్రధానమైనది భాగవతము. అందును గోపికాదుల విరాళియే వర్ణింపఁ బడినది. కాని శ్రీ కృష్ణుని విరహభావములు వర్ణింపఁబడకుండుట సహృదయు లెఱుంగక పోరు.)

మాతంగ బ్రహ్మరాక్షసుల వృత్తాంతము.

భక్తికి విశేషాంగము విష్ణుగుణకీర్తన, భక్తిప్రధానముగాని కులము ప్రధానము కాదని యీవృత్తాంతమునుబట్టి ప్రతీతమగుచున్నది. మాలదాసరి యనుదినము తన గ్రామమునకుఁ గొలఁదిదూరమున నున్న కుఱుంగుడిలో వేంచేసియున్న విష్ణువును మంగళకైశికీ గానమున సేవించువాఁడు. ఈ నియమమును బెక్కేండ్లాచరించెను. దుష్టవర్తనుఁడైన సోమశర్మ బ్రహ్మరక్షస్సాయెను. ఒకదినమున నాతఁడు బ్రహ్మరాక్షసుని చేఁజిక్కెను. ఈబ్రహ్మరక్షశ్శరీరమును విడుచుటకు నొకనాఁటి గీతికాచరమచరణఫల మైనను ధారవోయుమని మాలదాసరిని బ్రహ్మరాక్షసుఁడు ప్రార్థించెను. ఎట్టకేలకు మాలదాసరి దాని కంగీకరించి భగవంతుఁడ నిన్ను రక్షించు నని యూరడించెను. వెంటనే సోమశర్మ వైష్ణవభక్తిచిహ్నితదేహుఁ డయ్యెను. ఈ వృత్తాంతమున విష్ణుగుణకలిత ప్రబంధగాన మాహాత్మ్యమునుగూర్చియు, భాగవత పరిచయ ప్రభావమున బ్రాహ్మణ్యంబె కాక భాగవత శ్రీయును గల్గు నని కవి వ్యక్తము చేసినాఁడు.

గానము నవభక్తిమార్గములలో నొకటి. ఇది విష్ణుసేవకు ముఖ్యమార్గముగా నంగీకరింపఁబడినది. ఈ హేతువుచేతనే త్యాగరాజు, క్షేత్రయ్య మొదలైన గాయకులు దక్షిణాంధ్రయుగమున వెలసినది. ఉత్తరదేశమున మీరాబాయి, సూరదాసు, తుకారామ్‌వంటి గాయకులు వెలసిరి. గానమే విష్ణుసేవకుఁ బ్రశస్తాంగముగాఁ గళాపూర్ణోదయమునఁ దెలుపఁబడినది.

"విద్యలందెల్ల సంగీత విద్య మిగుల
నుత్తమము గాదె యిది పురుషోత్తమునకు
నర్పితం బగునేని యే మని నుతింతు".

ఇట్లు శ్రీకృష్ణరాయలు భక్తివిశేషములను వివిధవృత్తాంతరూపములఁ దెల్పెను. ఇందు విశిష్టాద్వైతమత సిద్ధాంతములు,సంప్రదాయములునుగూడ వ్యక్త మగుచున్నవి. వైష్ణవమతమునకు నంగము లగు భాగవతసేవ, యోగాభ్యాసము ప్రబంధగానమును ప్రముఖ మైన వని వ్యక్తీకరించు వృత్తాంతములను వైష్ణవ గ్రంథములనుండి గ్రహించి యథోచితముగా మార్చి యీ ప్రబంధమున ననుసంధానించెను. శైవ కవులు — పండితారాధ్యుఁడు, నన్నెచోడుఁడు, పాల్కురికి సోమనాథుఁడు మొదలైనవారు శైవభక్తుల కథలను, వారి భక్తివిశేషములను శైవమత సంప్రదాయములను గ్రహించి యుత్తమకవితాగుణములతో మేళవించి కావ్యముల రచించిరి. శైవకవులు శైవమతమునకును వాఙ్మయమునకును సేవ యొనర్చినట్లే శ్రీకృష్ణరాయలు విష్ణుపరతత్త్వముగా నిరూపించుచు భక్త్యాత్మకకావ్యము ఆంధ్రవాఙ్మయమున లేని లోపమును దీర్పఁగాబోలు నీ ప్రబంధమాల్యము నర్పించెను. ఆముక్తమాల్యద వైష్ణవభక్తితత్త్వ ప్రతిపాదక కృతులకు.

నాంది.

గుణదోషౌ బుధో గృహ్ణన్ ఇందుక్ష్వేడా వివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి

# అవహేళనకావ్యములు.

దివాకర్ల రామమూర్తిగారు M. A.

ప్రధానాంధ్రోపన్యాసకులు ఎ. వి. యన్. కళాశాల, విశాఖపట్టణము.

"ప్రయోగమూలం వ్యాకరణ"మ్మన్నది వ్యాకృతియం దెంత సత్యమో లక్షణగ్రంథములయందును నంతియ సత్యము. కావ్య ప్రపంచమున నుపస్థిత మై యున్న గ్రంథములఁ బరిశీలించి తల్లక్షణములఁ బృథక్కరించి లాక్షణికులు సర్వసామాన్య మైన లక్షణముల ననుశాసింతురు. లక్షణము మృగ్యమై యుండ నా కావ్య మా కాలమున నవతరింపక యే యుండవలయును, లేదా యవతరించినను సహృదయ హృదయానందకారి యైనఁ గాకుండ నుండవలయును. లేదా కాలాభిరుచికి నెదిరీది పండితుల మన్నన కెక్కనట్టిది యైననై యుండవలయును. లేనిచో నా కావ్యమునకు లక్షణము విధింపఁబడియే యుండును. తెనుఁగున సుమారు 19వ శతాబ్దము వఱ కేమి యిరువదవ శతాబ్దము వఱ కన్నను బాధాకరము కాదు — స్వతంత్ర నాటకములు లే నందువలననే సంస్కృత లక్షణములఁ దెనుఁగున ననువదించిన లాక్షణికులు సహితము నాటకలక్షణముల ననువదింపక యుండిరి. గతశతాబ్దాంతమువఱకు నన్నింటను లక్షణమునకు సంస్కృతమే ప్రాతిపదికము లేదా యుపాదేయ మయిన తెనుఁగునకు సంస్కృతమున నవతరింపని కావ్యజాతులకు లక్షణమే లేక యున్నది. లక్షణము లే నంతమాత్రమున మహాకవుల ప్రతిభకుఁ గొఱఁత రాదు. సహృదయుఁడయిన పఠిత సంస్కారము, గ్రహణశక్తి రసహృదయమునుబట్టి సార్వకాలిక మయిన యుత్తమ రచనయందలి నిగూఢార్థ నవార్థములు ప్రకటితములై వివృతములగుచునే యుండును. విమర్శకుని దృక్పథము సమన్వయశక్తికి మహాకవుల కావ్యము నికషోపలతుల్య మైనది.

సంస్కృత లాక్షణికుల విమర్శనలను బట్టి, కావ్యప్రపంచమున బహువిధ కావ్యరీతులకు లక్షణవిధు లేర్పఱుపఁబడినవి కాని,ఆక్షేపకావ్యములకు లేదా పరిహాసకావ్యములకు లక్షణము నిరూపింపఁబడినట్టులు కాన్పింపదు. దీనికిఁ గారణము హాస్యము, అవహేళనము, ఆక్షేపములు మహాకావ్య రచయితలకుఁ బ్రధానములుగాఁ దోఁచియుండవు. సనాతనాచారపరు లయినవారి మనస్సులకు స్వల్పవిషయములయినవి యాకర్షకములు కాకపోవుట సమంజసమే. అట్లని వారికీ విషయములయం దనుభవము లేదనియు,వారు రస హృదయులు కారనియుఁ దోఁచిసి వేయరాదు. అలంకారశాస్త్రమున నెన్నియో యుదాహరణములను దల్లక్షణములను వారే నిబంధించియుండిరి. ఆక్షేపాలంకారము వారికిఁ గ్రొత్తది కాదు. నిందాస్తుతి, స్తుతినిందలు వారికిఁ దెలియనివి కావు. వ్యాజస్తుతులు, అప్రస్తుత ప్రశంసలు వా రెఱుంగనివి కావు. కాకువులు, శ్లేషలు, అన్యోక్తులు, వక్రోక్తులు వారి కనభ్యస్తములు కావు. కాని కావ్య మంతయు నామూలముగ సపహాసప్రాయ మైన కావ్యముగాని, ఆక్షేపముతో నిండినకావ్యముగాని, అవహేళనకావ్యముగాని వారు రచించినట్లు తెలియదు. ఎందయినను దాత్కాలిక ప్రయోజనమును సాధించిన చాటువులు కొన్ని వృద్ధాచారపరు లయి గురుకులమునఁ బ్రాచీనపద్ధతుల విద్య నభ్యసించిన పెద్దల కంఠస్థము లైయుండిన నుండ వచ్చును. ఈ చాటువు లధికముగ వ్యాప్తిని బొందకుండుటకు హేతువు లరయ, నేమి గాని వలసినచో నవహేళన కావ్యములను రచింపఁగల శక్తి మాత్రము సమగ్రముగ వారికిఁ గల దనుట కివ్వి నిదర్శన ప్రాయములుగ నున్నవి.

సంస్కృత ప్రకృతుల కనుకృతు లయిన తెనుఁగు రచనల యందును నాడాడ నాక్షేపకావ్యములు కాదు కాని యవహేళనాదికము శబ్దశ్లేషచేతనో యుక్తిభంగిమాంతరముచేతనో వికృతవర్ణనాదికము చేతనో స్ఫురింపఁజేయు విడివడిన పద్యములు చాటుపద్య మణిమంజరుల యందు గోచరించుచున్నవి. చంద్రరేఖావిలాపమువంటి తిట్టుకవితలు కలవు. వేమనపద్యములవంటి సంఘమునందలి విపరీతముల నతిసూ

క్ష్మముగ విమర్శించి నవ్వుతోపాటు వెగటు పుట్టించు పద్యములు కలవు. కాని ప్రత్యేకముగఁ బ్రతిపదమునందును లేదా ప్రతిసన్నివేశమునం దును మృదువైన యవహేళనము స్ఫురింప రచింపఁబడిన కావ్యములు కాన రావు. ద్వ్యర్థికావ్యములు కలవు. త్ర్యర్థికావ్యములు కలవు. ఇవి పాండితీప్రకర్షకు నిదర్శనములైనంత రసప్రాధాన్యమునకు లక్ష్యములు కావు. మీఁదుమిక్కిలి యివి శబ్దములతో సాముగరిడీలు, కసరత్తులు చేయునట్టివి. కావ్యఫల మయిన సద్యఃపరనిర్వృతి కొఱఁతపడినది. ఇవి మృదువైన యాక్షేపకావ్యములు కావు. అవహేళన కావ్యములు కావు. అపహాస్యకావ్యములు కావు.

అవహేళనమునకు హాస్యశీలము ప్రధానము. హాస్య మన్నది చాల మృదు వయిన కళ. విపరీతవాచాలత్వమున నవ్వువచ్చును. ఇది యానందపర్యవసాయి కాక యసహ్యాభావజనక మైనది. వికృత మయిన యలంకరణముల మూలమున, వికృత మైన యాంగికాభినయముల మూలముననఁ గలిగెడి హాస్యము నీచ మైన తరగతికిం జెందినది. ఇంచుమిం చుగా నది పామరజనప్రీతిని గలిగించునేమో కాని పండిత హృదయ రం జకము మాత్రము కాదు. అధిక్షేపింపఁబడిన వ్యక్తికూడ నా యుక్తివై చిత్రికి హృదయపూర్వకముగ నానందింపఁ గలిగిన సమగ్రత గలిగినది యుత్తమ హాస్యము. ఇది వ్యంగ్యమర్యాద నాశ్రయించును. వక్రోక్తి మర్యాద నుపాధిగాఁ గలిగియుండును. భంగ్యంతరోక్తిని నుపాదేయము గాఁ గలిగియుండును. విచిత్రపరిస్థితుల నవలంబించియుండును. ఆక్షేపము స్ఫురింపఁజేయవలయు నని ప్రయత్నపూర్వకయత్నము గలిగియుండిన కావ్యమున నెట్లు యమకాదిశబ్దాలంకారములయెడ రసస్ఫూర్తి కొఱఁత పడియుండునో యట్లే రసచమత్కృతి లోపమై యుండును. అప్రయత్న పూర్వకముగ నుక్తివైచిత్రి నాశ్రయించి యా యధిక్షేపమో హాస్యమో స్ఫురింపవలయును. సంస్కారము గలిగిన పరిణతబుద్ధులకు హృదయాహ్లాది కావలయును. సూక్ష్మవిమర్శదృష్టులకు ధర్మప్రబోధనము తాత్పర్యము గాఁ గలిగినదై వ్యర్థప్రయత్నము కాకుండ నుండవలయును. అలంకారాం శము లున్నంతమాత్రమున నుక్తివైచిత్రి లేనిచో నవి యలంకారముగ

నెట్లు భాసింపదో యధిక్షేపకావ్యమునఁ గూడ నుక్తివైచిత్రి సమగ్రముగ నుండిననే కాని యిది భాసింపదు. ఇట్టి యద్భుతాధిక్షేపకావ్యము సమగ్రముగఁ గవి బ్రహ్మచే నుత్తరగోగ్రహణమున నిర్వహింపఁబడినది.

తిక్కన సర్వసారస్వతకావ్యశాఖలకును మార్గదర్శి. ఆతని లేఖిని దారి తీయని తీయని తెనుఁగుకావ్యపు రీతులు లేవనుట యతిశయోక్తి కానేరదు. తిక్కననాటకీయప్రతిభలు, భావనిగూఢపదప్రయోగప్రౌఢిమలు, లోకజ్ఞత, రాజకీయ పరిజ్ఞానము, వైదికధర్మవిజ్ఞాతృత్వము ప్రబంధనిబంధనావిశిష్టత — మున్నగు గుణములనుగూర్చి పలువురు విమర్శించి యుత్తమ వాక్యముల రచించియున్నారు. కాని యీ కవి బ్రహ్మయందలి యీ ప్రత్యేక లక్షణము నింతవఱకు నెవ్వరును స్పృశించి యున్నట్లు తెలియదు. ఉత్తరగోగ్రహణ మొక యధిక్షేపకావ్యము. కవి బ్రహ్మ దాని నెట్లు సమర్థించెనో నుంత విచారింతము.

విరటునకుఁ బుత్త్రుఁ డొకఁడు కలఁడు. అతని పేరు తరుఁడని లోక ప్రతీతి. బహుశః వీరులలో నుత్తరుఁడని కాఁబోలుఁ దల్లిదండ్రుల యభిప్రాయము. కాని యతని కింకొక నామ మున్నది. అది భూమింజయుఁడనునది. భూమింజయుఁడనునది యలుక్సమాసము. అలుక్సమాసస్పష్టిలోనే యపహాస మిమిడియున్నది కాఁబోలు. ఉత్తరుని శౌర్యాటోపాదులు విన్నవారికి భూమింజయ నామ మాతనికి నేతిబీరకాయవంటి దనుస్ఫూర్తి కలుగకయుండదు. ఈ నామకరణముతోనే యీ కథాపాత్త్రసక్తి కవహేళన మవతరించినది.

భీష్మాచార్య రవిసుతాది యోధసంఘోద్భటమై దుర్యోధను బలము ప్రబలవోర్బలలీలాధుర్యగతి నడచి మత్స్యావనీపతి గోగణంబులఁ బొదివె. గవాధ్యక్షుండు బెగ్గడిలి రథంబుఁ ద్రోలికొని యాక్రోశించుచుఁ బురంబున కరుగుదెంచి రాజమందిరద్వారంబుఁ జొచ్చి రథావతరణంబుఁ జేసి యంతఃపురమున నున్న భూమింజయుని గాంచి ససంభ్రమముగా—కురుబలము వచ్చి సముద్ధాంతంబులై గోగణముల ముట్టడించినవి. నీవు వేగమై మరలఁ దెచ్చుటకుఁ గడంగుము. "రిపుస్వాపాల

లోకంబును శరజాలంబుల పాలు చేయుము, భుజోత్సాహంబు శోభిల్లఁగ' అనిచెప్పి.

నీ తండ్రి విరటుఁడు పలుపురిలో నిన్నుగూర్చి పదేపదే మా వాఁడు బాహువిస్ఫురితుఁడు, శౌర్యశాలి, కుల భూతివిశేష విధాయకుండు, భూభరణవిశారదుండు, జనభవ్యతేపఃఫలసంభవుండు, కాతర పరిరక్షకుం డనుచుఁ బెద్దగఁజేసి చెప్పుచుండును. ఆ పలుకుల యాథార్థ్యమును బ్రకటింప సమయ మరుదెంచినది, దానికి నీవుగఁజేయు మిత్రజిన్ అనెను.

ఈ సంభాషణము జరిగినది కాంతాజనంబులలో— అందుచే నగ్గింపఁబడి పొంగి దర్పోద్ధతిని మిన్నుముట్టెను.

విరటుఁడు దక్షిణ గోగ్రహణమున కరిగెను. కృతశస్త్రాస్త్రమతి కాకుండుటచేఁ బుత్రుని నంతిపురమున విడిచెను. గవాధ్యక్షుఁడు పిడుగు పడినట్లు వచ్చి యతని నుబ్బెత్తుగాఁ జంద్రమండలమునఱకుఁ బొగడి విడిచెను. అల్పజ్ఞుఁడు తన్నుఁ దా నెఱుఁగని యాడంబరప్రియుఁ డగ్గింపులకుఁ బొంగెను. ఇంతెంతయుఁ గాంతాజనముల సమక్షమున జరిగినది. ఆఁడు వారిముందు నొకండు వచ్చి పరాక్రమాదికము—యథార్థముగ నుం డనీ—లే కుండనీ—పొగడ మగపురువు కా దని యూరకుండునా? ఏదియో కొంత 'డాబు' గొప్పతనము కాంతాజనముల ముందుఁ బ్రదర్శింపఁ దలచినాఁ డుత్తరుఁడు. నిజముగా నాతఁ డుబ్బుగుణము కలిగిన వాఁ డని యెఱింగియే యేమో యీ గవాధ్యక్షుఁ డంతెంతగాఁజేసి యాతనిని నక్షత్రవీథి కెక్కించి విడిచినాఁడు.

ఉత్తరుఁడు లేని ధైర్యమును బ్రకటించి యొక యెత్తు పన్ని తప్పించుకొనం దలపోసినాఁడు. యుక్తియుక్తముగఁ దప్పింపఁ దలఁచి కొని ఇది యెంతపాటి పని; గోవులను వారలు మార్కొనలేని యెత్తున వారిని గొందును. ఇది యొక క్షణకాలము పట్టదు. అని నూనూఁగు మీసముల మెలివెట్టి—తల గోఁకికొనుచు — కాని నాతేరికిఁ దగిన సారథి లేకుండుట నాకు విచారముగా నున్నది. ఎవ్వ రయ్యా యీనగర

ములో 'ఇత్తఱి నేఁగదా కడప నెంతయు నేర్తును రథంబు'

తగుసారథి దొరకొనినంబగతుర సాధించు టెంత పని—అని యొక చిటికె వేసినాఁడు

కదుపుల దవ్వుగ గొనిపోదు రొకో పెదవి విఱిచినాఁడు

యిట్లగునె — కలండేని సూతుఁడు —

(ఎందు కయినను మంచిది—ఇదే పోవుదును అని డాంబికము చూపి) సూతుఁ డరయుం డెందుక—అని తన తావు మెఱపింపఁ దల పోసి గవాధ్యక్షుని పలుకులకు వ్యాఖ్యాన మేమో యనఁగా—ఇంతకును నగరమున సూతుఁ డన్న వాఁ డెవ్వడును లేఁడని యెఱింగి యుండినవాఁడు కావున—

కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్యులు, మత్సముద్యమ స్ఫురణముచూచి, పార్థుఁ డను బుద్ధి గలంగ బెట్టు గిట్టి సంగరమున నోర్చి యని స్త్రీజనములవంకను, గవాధ్యక్షునివంకను సాకూతముగ గంభీరముగఁ జూచి—ఏ పనుల గ్రమ్మఱ తేరకఁయున్న నన్ను భూవరుఁడు సుహృజ్జనంబు పరివారము చిత్తములందు మెత్తురే యని ప్రగల్భపరుఁ డయ్యెను.

దీనిఁ గవి యపహాస్యపాత్రుఁడగు పాత్ర ముఖముననే కథాక్రమమును నడిపించి కావ్యార్థసూచనము చేయుచు నీతనియెడ నొక వికటపు హాస్యముచేయుచున్నాఁడు. కౌరవవీరులు వీని సముద్యమును జూచి పార్థుఁడని కలంగుదు రఁట. తాను వారిని సమీపించి కొట్టు నఁట—నిజముగా నంత పనియును జరిగినది. అది యుత్తరుఁ డను పార్థుని జూచి కాక పోవుట-ఇందు అపహాస్యమున కయిన విషయము.

ప్రగల్భవాచారంభ సంరంభ బధిరీ భూయమాన కాంతాజనాంతఃపురాంగణమండపములో) ద్రౌపదికూడ నున్నది. ఆమె లేకుండిన నా సమావేశమున భూమింజయుఁడు జయించెడివాఁడే. ఉత్తరకుమార ప్రజ్ఞలుగా నతనిపలుకులు పరిహాసమాత్రజనకములు కాక యుండెడివి. ద్రుపదధరణిపతినందన సామర్థ్యాపహాసతరళహృదయ యైనది. ఆమె

ద్రౌపదికాదు. మాలినికాదు. సైరంధ్రికాదు. ద్రుపద ధరణీపతినందన. ఈ పదప్రయోగములోఁ దండ్రికి నున్నంత పౌరుషాభిమానములు గలిగిన శూరవనిత యని ధ్వనించినాఁడు కవి. ఆమె సామర్షాపహాసతరళహృదయ— ఎందుల కమర్షము కలిగినది. ఎందుల కపహాస మొనర్చినది. ఎందులకుఁ దరళహృదయము కలిగిన దైనది.

ఉత్తరుఁడు 'తన్ను జూచి కౌరవవీరగణము పార్థుఁడను బుద్ధి గలంగ వలయు ననియె' అసమానశౌర్యధుర్యుఁ డైన తన భర్త కా యీ గృహశూరుఁడు తన్ను బోల్చుకొనుట యని కోపము కలిగినది. వెంటనే—ఇంతకుం బూర్వము గూడ నాతని యునికియు, సంభాషణప్రగల్భ రంగము స్త్రీజనసహిత మంతఃపురమె యగుట యామె యెఱిఁగిన దగుట వెంటనే ఇవి 'ఆడంగిడప్పాలు' — డాంబికపుఁబల్కులు — ఎందుల కీ డాబులన్నట్లుగా నపహాసము కలిగినది. ఏ మయినఁ దాను సంబంధము గల్గించుకొని పలికినచో నజ్ఞాతవాసదీక్షకు భంగము కలుగు ననియో, తనమనస్సున జనించిన యమర్షాపహాసలక్షణముల నితరులు గమనించిన నేమి ప్రమాదముగలుగు ననియో యామె తరళహృదయ యయినది.

లోన జంఝామారుతము లుద్వేత్తుగా వీఁచుచుండ వానిని పరిస్ఫురింప నీయక యదిమి పట్టుకొని, యందే యుండ నామె కసాధ్య మయినదో—అయిన నీ వృత్తాంతము పార్థునితోఁ జెప్పిన నాతఁ డే మనునో, ఈ యదను నుపయోగించుకొని తన భంగపాట్లు తీర్చు ననియో యచ్చటినుండి వెంటనే తరలిపోయినది.

ఆమెమనోగత మయిన యపహాస మీ కావ్యమునకుఁ బ్రాణ మని కవి తలపోసియుండును. లేదా యట్టి విషమపరిస్థితులలో మాలినిగా నున్న సైరంధ్రి కా యపహాసము కలుగుటలో నర్థము లేదు. బహుశః అందుకొఱకే కార్యమునం దంతట నా ఘట్టమున నపహాస్యమునే చేయుచు గంభీరముగ లేఖిని నడిపించెను. ఇది యసామాన్య మైన యొక రచనా విశిష్టత.

ద్రౌపది బృహన్నల కడ కరిగినది. అజ్ఞాతవాస వత్సరం బతీత మగుట నతఁడు నిరూపించి, 'బృహన్నలకు సారథ్యంబుఁ జేయు సామర్థ్యంబు కలదు—అని నీ వన నతఁడు పకాలున న ను. అట్టియెడ—ఖాండవ దహనాదులయందుఁ బాండవమధ్యమున కతఁడే సారథియై యతని చిత్తంబు వడసి—తదీయ సాహాయ్యంబున నీవు కురుసైన్యములఁ జయించవచ్చు నని యుదాహరణ పూర్వకముగాఁ జెప్పి, వా రేమేని యాడిన నన్నుఁ రాఁ బిలుచు నట్లు ప్రసంగించు మని చెప్పి, యామె నంపెను. ఈ వాక్యముల యందును నవహేళన మున్నది. కాంతాజన సమూహముల యం దీ రీతిగాఁ బ్రగల్భములు పలుకునట్టి వానికి బృహన్నల, పేడియతఁడు సారథిగాఁ బనికిరాఁడా యని—ఒక వేళ రథికుఁ డసమర్థుఁ డయినను దన శక్తి చాలమి నెఱుంగనంతటి గర్వియై యుండుట సహజము కనుక—అతని గర్వము నుపహసించియో, లేదా ఆతఁ డింతకు ముం దాడిన "పార్థుఁ డను బుద్ధిగలంగగఁ బెట్టుగిట్టి"—యను పదమును సెగతాళి చేయుచు నీవు సంశయింప నవసరము లేదు. పార్థుఁ డంతటి వానికే, మానవమాత్రులతోఁ గాక దేవేంద్రాదులతోఁడి యుద్ధమున నతఁడు సారథియై వర్తించెను సుమీ! నీ కన్న చో నెంత! అంతియకాక యెంతటి సారథి కాకపోయినచోఁ బాండవమధ్యముని చిత్తంబు వడసి యుండు నని—యుద్దీపింపఁ జేసి ప్రతిహేళనముతో నీ వాక్యము లుపయోగింపఁబడినవి. వ్యంగ్యము చెడని యీ మృదుతరమైన యధిక్షేపము రసానుగుణక మయిన రచనతోఁ బొంది పొసంగియుండుట కావ్యశిల్పమున నారితేరిన జగజెట్టికిఁ గాని యితరుల కసాధ్య మైన విషయము.

స్వభావోక్తి యొక యలంకారమే కా దనినాఁడు కుంతకుఁడు. వక్రోక్తి కావ్యమునకుఁ బ్రాణ మనినాఁడు. భంగ్యంతరమున నుడివిన కాని వక్రోక్తి స్ఫురింపదు. ఇది వక్రోక్తియా! వక్రోక్తికి మించి రసవత్ప్రాణస్థానము కావ్యమున నాక్రమించు రసచమత్కారోక్తియా! విజ్ఞులెఱుంగవలయును. ఎట్టి దని లాక్షణికులు వాదోపవాద నిమగ్నులయి నది సహృదయ హృదయాహ్లాది యీమార్గ మనుటలో సంశయము లేదు.

సైరంధ్రి యుత్తరదెస కరిగినది. స్త్రీజన స్వభావ సిద్ధ మయిన సంభాషణము చేయ నామె సహజముగా నారంభించినది. 'చూడు, ఉత్తరా! జనపతినందనుఁడు తగు సారథికొఱకు నారయుచున్నాడు—మఱి యెఱింగిన పని చెప్పఁగావలయు గాదా ! యని యామె కండ్ల లోనికిఁ గన్ను విప్పి,చూచి యామెయాత్రమును బరికించి—క్రీడి మనంబున మెచ్చునట్టి నేర్పును, భుజశక్తియుం గలిగి, రూఢికి నెక్కిన సూత వృత్తిమై నని నడిసన్న యేడ్తెఱ—(మన) బృహన్నలకుం గల దమ్మా! ఖాండవ దహనాదులయందు నర్జునునకు బృహన్నల వెరవు లావులు గాదె జయ మొసంగినవి—మఱి యీ సంగతి సారథికొఱ కెదురు తెన్నులు చూచు నుత్తరున కెఱింగింత మనియె.

అట్లనే వా రరిగిరి. ఉత్తర సముచితముగ నా సంగతి చెప్పె, ఉత్తరునకు నవ్వు వచ్చినది—నవ్వుచుఁ బాంచాలితో—ఓసైరంధ్రీ! నన్నేల యిట్లాలిగొనఁగ...నీ వెఱుఁగవా! నేను చక్కఁగఁ గను విచ్చి పేడిఁ జూడ రోయుదు రణమున—అట్టిడ నేను సూతకృత్యభరము దాల్చుటకు బృహన్నల నెట్లంగీకరింతునమ్మ యని నవ్వెను—నిజమే, సైరంధ్రి తన్ను నపహసించుచున్న దని యతఁడెఱింగెను. నిజమున కాతని జీవిత మంతయు నట్టిదే. అతఁడు పై నవ్వెనేకాని పలుకులలో శూరత్వమును నోలుకఁబోసినాఁడు. అదిగాక కురుబలమేఁగుదెంచెనఁట—గోవుల బిట్టఱఁ బట్ట దానిపైఁ బరిగొని శౌర్య సంపదయు బాహాబలంబును జూపఁ బూని

ఏ నరిగెదనట్టె ! తేరికి బృహన్నల సారథి యైన దాని నవ్వరె!

అయ్యయ్యో! ఎంత కర్మము వచ్చినది-ఎందు కమ్మ యివి యన్నియుఁ బురిలో రథచోదకు లింత కఱవా ! యనెను.

రథచోదకుఁ డుండఁ డనియుఁ దన ప్రగల్భము లప్రతిహతముగ సాగు ననియు ధైర్యముతో నున్న యాతనికి సైరంధ్రి యొక గడ్డు సమస్య తెచ్చిపెట్టినది. దీనిని త్రోసిరా జనుట యెట్లు తన శౌర్య స్ఫూర్తి భంగము కలుగరాదు—శక్తి లే కున్నను క్స్థానమున నతనికి సిరి

యున్నది—నే నఁట—కౌరవులతోఁడి యుద్ధమున కరుగుదు నఁట—బృహన్నలా నాకు సారథి! నవ్వరఁ టమ్మా యిది యని నవ్వించినాఁడు. తాను నవ్వినాఁడు. తన గొప్పతనము చితికిపోక రక్షింపఁబడిన దని కాని దీనత్వమును బురస్కరించుకొని 'ఇంతకును ఈ నగరములో సారథు లింత కఱవైరా!' యని నిట్టూర్పుపుచ్చి యాసనమున వెనుకకు జాఱగిలఁబడి చేతితో నుదురు పట్టుకొనినాఁడు. ఆతనికి మించినది ద్రౌపది.

అర్జునుని బేడి యని, నిర్వీర్యుఁ డని; లోకులు నవ్వుదు రని, ఇంతకంటె సారథులు లేరా మన నగరిలో నని యుత్తరుఁ డన మగనిపై ఈఁగ కాదుకదా దోమ వ్రాలుటకుఁ గూడ నిచ్చగింపని యా వీరపత్ని—

బృహన్నల పేడి యని, లోకు లాతనిని సారథిగాఁ గొని యరిగిన
నవ్వుదు రని నీ వెంచకుము మఱి. కౌరవసేన గాదు (తెలిస
నదా) త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినం దేరు బృహన్నలా వశగతిం
జలియించిన గెల్వ వచ్చు — ఇది తథ్యము — రూఢివిషయము—
నీ వెట్లు చెప్పఁ గలుగుచుంటి వందువేమో.

త ద్వీరగుణంపుసొంపు పృథివీవరనందన ము న్నెఱుంగుదున్—
దాని కేమి గాని — యథార్థము చెప్పవలసివచ్చినచో—

“కారణజన్మమై తనువికారము వచ్చినఁ బెంపు దప్పునే” యని యర్థాంతరన్యాసము నుపయోగించి సమర్థనీయార్థమును జమత్కారముగను గంభీరముగను సమర్థించినది.

పాపము! ద్రౌపది నిజమే చెప్పినది. ఆతని కా సత్యము నిగూఢము. పతితలకుఁ బ్రత్యక్షము. దీనియందుఁ బరిణామ మున్నది.

ఇంకఁ దప్పనిసరి వచ్చి పడ్డది. సారథి లేఁడు. యుద్ధమునకుఁ బోవుటకు వీలు లే దన్న సాకిఁక సాఁగదు. అంతకంటె నతని కొఱలు సారథులు లేరు. ఎట్లో బృహన్నలఁ బిలుచుట కొడంబడిన పలుకు పలుకుటయుఁ —

ఏల యింత యొడంబడిక లేకపోయినను ఉన్న ట్లుండెడి పలుకు పలుకవలెనో ! ఇది యాతని ప్రగల్భతకుఁ గారణము. అదియే యాతని యందలి యపహాసజనక మగు గుణము.

పాపము తీఱఁ బరుగుపరుగున నాట్యమందిరమునకు మెఱుపు మొగిలుఁ జొచ్చుచందమునఁ బోయినది—అమాయికురాలు—బాల—ముగ్ధ—లోకావ్యవహారముల నెఱుంగనిది.

ప్రార్థన, వినయము, సంభ్రమము ముప్పిరిఁగొన బృహన్నలతో నుత్తర —

ఇచ్చట నొకకయ్యంబున
జచ్చెమదీయా గ్రజన్ముసారథి తగువాఁ
డెచ్చోటఁ లేమి నాతం
డచ్చుపఱుపఁ డయ్యె నీ క్రియకు నొండొకనిన్.

అని ప్రారంభించినది. పాప మీ వృత్తాంతము బృహన్నలకుఁ దెలియ దని యా పసిబాలభావము. పాపము రెండు ముక్కలలో నంతయుఁ జెప్పినది. తగువాఁడు కాకపోవుటచే నామెయన్న యింకొకని నీ క్రియచ్చుపఱుపలే దఁట. పాప మామె తన యన్న ప్రగల్భముల నన్నింటిని సత్యము లనియే నమ్మినది. తగువాఁ డనుటలోఁ గౌరవసేనను జెండాడు పార్థునితోఁ దుల్యుఁ డైన యుత్తరునకుఁ దగినవాఁ డని యామె భావము.

ఈ కథ యంతయు బృహన్నలా కల్పితమే. ఆతఁడే దీనికి సూత్రధారుఁడు. ఆతఁ డూఁకొట్టుచుఁ దెలియనట్టు లాత్రముతో వినుచున్నాఁడు. ఆమె మిక్కిలి శ్రద్ధతోఁ జెప్పుచున్నది. ఇది యింకొక యపహాసమునకుఁ దరుణము. ఆతఁడు తనకుఁ దెలియనట్లు నటించుట. ఆతనికిఁ దెలియని విషయ మేదియో యాత్రముతో నామె యాతని కెఱింగించుట యపహాసమును గల్గింపక మానదు.

ఇంత చెప్పి—ఆ సారథిచచ్చుట-తగువాఁడు వేఱొకండు లభింపమి-దీని కేమి గాని — ఇప్పుడు కౌరవులు గోవులఁ బట్టి రని కూయి వచ్చినది — అన్న కురుబలమును వెన్నంటి దఱుము సన్నద్ధుఁడై

యున్న వాఁడు. సారథి లేమి నాతఁడు కింకర్తవ్యతా మూఢుఁడై విషాద నిమగ్నుఁ డై యున్నాఁడు. నీ కందువ యెఱింగి సైరంధ్రి చెప్పినది. నిన్ను దోడ్తేర నన్ను నా యన్న పనిచె. నేనును, నీయెడఁ జనువు గలుగుటంజేసి యెల్లవిధంబులఁ దెత్తు నని ప్రతిజ్ఞ చేసి వచ్చితిని.

నా పలుకులఁ గుఱుచచేయకుము. నీ పెంపు ప్రకటముకా రథంబు గడప నియ్యకొని యీ యాపద గడువంబెట్టుము. నీ వంగీకరింపమి నా యందలి వాత్సల్యంబు కొఱంతవడుట యన్నది.

ఆమెయమాయికత్వమునకుఁ దనయందుఁ గల చనువునకు ద్రౌపది యందుం గల ప్రియంబునకు, అన్నయందుఁ గల గౌరవప్రతిపత్తికి బృహన్నలకు నవ్వు వచ్చినది. మొదటినుండియు వేఱొక రయినచో నా విచిత్ర సన్నివేశముల నాలకించుచుఁ గడు పుబ్బ నవ్వి గేలి చేసెడివాఁడే, కాని, ఉత్తర బాల. శిష్యురాలు. అమాయికురాలు. మాట విని యడలినది. ఆమెను నవ్వి బెదరఁ గొట్టన్యాయము కాదు. బృహన్నల నగుచు—

ఓ జగదీశ్వరపుత్రి — (అందుకొఱకే నీ కెదురాడ వెఱచెదను) నాకు సారథ్యమున నేర్పుగలదె! ఇది యేటి మాటలు—సైరంధ్రి కేమి యెఱుక — ఆమె మేల మాడినదేమో) అయినను

నీ మాటకు మిగులంగా వెఱతు—రమ్ము, పోదము. ఈ మాటలలో నామె కెక్కడ నధైర్యము కలుగునో యని మఱల సంశయించి మనమున —అమ్మా!

భవదీయప్రార్థనముచేఁ దివిరి, పరమదుష్కరములఁ దీర్చి యయిన నత్సవ మొనరించెద —

(ఇది నీకు చాలునా! నీ యెడఁ గల వాత్సల్యమును పాటించి నీ మాట నిల్పితినిగదా ! సంతోషించుదువా! మఱి

సారథ్యం బొకం డనఁగ నేల- "తివిరి సాధించెద దుష్కరముల" నని యామెతో నతఁడు మాట్లాడెను. ఆమె సంతోషమునఁ దనమాట నెగ్గిన దన్న యుత్సాహమునఁ జెంగున గెంతి నవ్వినది.

బృహన్నల మొదట వినయమును సూచింపఁ బలికి తరువాత యథార్థమునే చెప్పినాఁడు. కాని యామె కా పదములయందలి యర్థము పూర్ణముగ నవగాహనము కా లేదు. ఆమె తన మాట కెదురాడక బృహన్నల యంగీకరించె ననియే బ్రహ్మానందమును కటి ముట్టినది. ఆమె యమాయికత్వమునకు నవ్వు వచ్చును. సంగీతనిలయము వీడి మెత్తమెత్తన నడ తెంచు మత్తశుండాలముంబోలె నతఁ డరుగుదెంచె —

బృహన్నల కౌరవయుద్ధమున సారథిగా నరుగుచున్నాఁడు. ఆతని నడక చూడుఁడు. ఆతఁ డేమి సారథ్య మొనరించునో కాని మత్తశుండాలమువలె నడు గిడుచున్నాఁ డని ప్రేక్షకగణము పక్కున విఱుగఁబడి నవ్వుచున్నది.

అరుగుదెంచు బృహన్నల నంతనంతఁగని నృపాలసుతుఁడు — తండ్రికిఁ దగిన బిడ్డ—మహాశౌర్యధుర్యుఁడు— బృహన్నలయెడ గౌరవంబును జూపి — ఆతఁ డింకను దన్ను సమీపింపక పూర్వమే యెదురుగా వచ్చి — మొగమునఁ జిరునవ్వు ప్రకాశింప —

"చూఁడు బృహన్నలా! కౌరవులతోడఁ గయ్యంబు కలిగె నాకు"

మఱి—కడఁగి నేఁడు రథ మ్మొనృ గడపవలయు—ముందుగాఁ బేడిమొగము చూడన్నైన రోయుదు నని బీరములు వల్కిన భూమింజయుఁడు తానే ముందుగా వచ్చి యి ట్లనుట — ప్రేక్షకుల కాతని శీలము —హాస్యజనక మొనర్చినది.
ఆతని యాత్రము మీఱిపోవుచున్నది.

అబ్బా! రావేమి? తొందరగా రమ్ము

మైమఱువు దొడి తేరెక్కుము—"చూఁడు ... నీకుఁ దప్ప" గ్రుంకఁదీరదు
ఆతఁ డేమో యనంబోవుచుండ...
చాలు చాలు ప్రతివచనములు వద్దు మాకు, నీ దగు బీరమ్మును బెంపు లావు వెరవును సైరంధ్రి చెప్పె నని నోటి కడ్డము వచ్చెను.

వెంటనే బృహన్నలకు నవ్వువచ్చినది. ఆతనికి మొదటినుండియు నవ్వుగనే యున్నది. అయిన నాతని నధిక్షేపింపఁ దలపోసి కొంచెము వెక్కిరింపఁ దలఁచి

నృపతనయా!

"ఆటపాట గలయప్పటికిఁ నను గోరి పిల్వఁబంచినఁ దగుఁ గాక" —

ఇదేమి యన్యాయము — "సంగరముచేతకు సారథివి గమ్ము రమ్ము అనుట ఉచితమా" ... అని దీనముగా విన్నవించి— ఆతఁడు నిరుత్సాహపడి యుద్ధవిముఖుఁ డగునేమో యని సంశయించి-"మరల-నెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁ డైన యొక్కని రథ మేత్తెఱంగడుపఁగా నియమింపఁగ రాదె—రాజనందనా! అనెను. ఆతఁ డేమనునో యని నవ్వు బిగఁబట్టి పేక్షక లుండిరి. బృహన్నల యవినయము దోఁపనీకయతనివంకే యదే చూచుచుండె-

ఇఁక వైరాటి కిరీటి కిట్లనియె.

ఆతఁడు వైరాటి — అసలు సంగరకార్యభారము వహించునది రథికుఁడు గాని సారథి కాఁడు. నిమిత్తమాత్రమై యుండఁజాలును. ఇంతకు నాతఁడు తక్కువవాఁడా ! వైరాటి—విరాటి కొడుకని కవి నవ్వుచున్నాఁడు.

వైరాటి! — చూఁడు. ఖాండవ మేర్చునప్పుడు దగఁ రథచోదకవృత్తి సల్పి యాఖండలసూతికిన్ జయము గల్గనొనర్చినయట్టి బుద్ధియుఁ—పండితనంబు నీ యెడన తక్కెనె ! ...

ఇందులో నాటకీయచమత్కృతి. బృహన్నలయే యాఖండల సూతి —

మఱి "నా దెస మైత్రి పెన్పుము, ఇంకొండొక మాట దక్కుము. రణోత్సహానం బొనరింపు గ్రక్కునఁ"—

అని బృహన్నలను బ్రతిమాలెను ... బృహన్నల నీ వెంతబ్రతిమాలినను రాఁ డనునేమో యనికొనినాఁ డేమో—

బృహన్నల "అడ్డ మూడ వెఱచినట్లు" ముఖభావము చూపెను.

ఆతఁ డియ్యకొనెను—తప్పనిసరి వచ్చినది. వెంటనే నృపతనూజుఁడు దృఢతనుత్రాణ మాతనికిఁ దేరఁబనిచె.

రాజాజ్ఞకంటెఁ దొందరగా నాతనియాజ్ఞ నిర్వర్తింపఁబడినది. తనుత్రాణము వచ్చిపడినది.

ఆ తనుత్రాణమును దొడుగు మని బృహన్నల నాతఁడొప్పించెను. ఇఁక బృహన్నల తనుత్రాణముల నిదివఱ కెన్నఁడును జూడనివాని వలె నిట్టునట్టు త్రిప్పి యొఱవలుగా మైఁ గప్పికొనె—అదియంతయు నటన. కాని బృహన్నలాపాత్రకుఁ దగినదే. కాంతాజనములు విఱుగఁబడి నవ్విరి.

ఉత్తరుఁడు 'అట్లుకాదు' "ఇట్లుసుమా" దీనిని దొడుగు మని తొడిగించెను. తనుత్రాణము తొడగనివాఁ డేమి యాతనికి సహాయము చేయుట యేమి—అని యందఱుఁ దమలో నవ్వుకొనిరి.

ఒక వేళ విజయమువచ్చిన భూమింజయుని పరాక్రమమువలననే రావలయునన్నట్లు వారు తలపోసిరి.

ఉత్తరుఁడు తాను కంకట మిడి హృద్యోదారం బగు రథంబెక్కి—బృహన్నలను తీవిలో నాజ్ఞాపించెను.

హయములఁ బూన్పుము, రథమున సిడ మెత్తుము—ఇప్పుడె రా వలయును గోగణము గొని, అని ఆఁడువారివంకఁ జూచి యస్మదీయ విజయ మభినందింపఁ బురము జనము లెదురుకొనఁగ—అన నవ్వుకొనె.

స్వామీ! నీ వెట్లు పంచిన నట్ల చేయవలయు, నీ వున్న యెడ నుండవలయు, నీవు నన్న దెసఁ జనవలయు —

ఈ వాక్యములలో భీతుఁడై పరువెత్తు నుత్తరుని భీరుత్వము సూచితమైనది. ఆతని విధేయత నవ్వు పుట్టించినది. చివర —

నా శక్తి యెఱిఁగి పంచి పనిగొని కడిమిమైఁ బగఱఁ గెలుము-ఇందెంతయోయర్థము స్ఫురించుచున్నది. అంతయు నేఁ జేసెదను. ఏమి టాయాజ్ఞలన్న అధిక్షేప మున్నది. నన్ను బట్టి నీవు నియోగించు మనియె-

ఇట్లు పరిశీలింప నీ ఘట్టమున తిక్కన చాల మృదువుగా హాస్యమును అంగిరసముగానే పోషించి అధిక్షేపకావ్యమునకు మార్గదర్శకుడయ్యె నేమో యనిపించు —

---

# శ్రీ మద్రామాయణములోని హాస్యము

భమిడి సత్యనారాయణశర్మ గారు



నవరస స్వరూపుఁ డగు రామచంద్రుని నాయకునిగా గ్రహించి వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణ మను మహాకావ్యమును నిర్మించెను. ది15-2-1952 తేదీగల హిందూపత్రికయందు "Sudden Glory" అను నుప సంపాదకీయ వ్యాసములో! "There are many Occidental Ori-entalists who tell you that there is no humour in The Ramayana" అని వ్రాయఁబడిన వాక్యములఁజదివిన నాఁటినుండియు రామాయణములోని హాస్యరసప్రధాన మగు ఘట్టములను గ్రహించి యొక వ్యాసరూపమునఁ బ్రకటింపవలె ననుకొంటిని. ఎట్టకేల కందలి రసవత్తరఘట్ట మగు తారాలక్ష్మణసన్నివేశమును వస్తువుగాఁ గొని చిత్రతారక మను నొక చిన్న నాటికనుగూడ రచించితిని. దానిని కొలఁది కాలములోఁ బ్రకటింప నమకట్టియుండ నీ పరిషత్కార్యదర్శులు వార్షికోత్సవ సందర్భమున రామాయణములోని హాస్యరసమునుగూర్చి కొంచెము ముచ్చటింపవలసినదిగ నా కానతిచ్చిరి. ఇట్టి మహాపరిషన్ముఖమున నీ రీతి సదవకాశమును నా కొసఁగి నన్ను బ్రోత్సహించినందులకీ పరిషత్కార్యవర్గమువారి కనేక ధన్యవాదములు. రసగ్రహణపారీణు లగు నీ విద్యారసికులు నా ప్రయత్నమునందలిదోసఁగులు మన్నింతురుగాక. ఇతోఽధికమైన విషయములింకేమేని నేను సాధింపకున్నయెడ నట్టివానిని వివరించి లోకమున కందించుచు శ్రీమద్రామాయణమునందు హాస్యరసము లేదను బాశ్చాత్యపండితుల వాదమపాస్తము సేయుదురుగాఁత.

"వాగంగాదివికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః"

అని రసగంగాధరమున శ్రీ పండితరాయ కవిశేఖరుఁడు నిర్వచిం

చెను. అయ్యది ఉత్తమ, మధ్యమ, నీచ భేదములచేఁ ద్రివిధ మనిగూడ నాతఁ డిట్లు ప్రకటించెను:-

"స్మితం చ హసితం ప్రోక్త ముత్తమే పురుషే బుధైః
భవే ద్విహసితం చోపహసితం మధ్యమే నరే"
"నీచే ౨ పహసితం చాతిహసితం పరికీర్తితం"

రామాయణకావ్య ముత్తమ నాయకుఁడగు శ్రీరామునిగూర్చి రచింపఁబడిన మహత్తర గ్రంథరాజమగుటచే నందలి రససన్నివేశము లన్నివిధముల నుత్తమ విధముగనే వాల్మీకి వర్ణించెను. "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం" మ్మను క్షేమేంద్ర వచనమును రామాయణముఁ జూచియె యతఁడు రచించె ననుకొన్నఁ దప్పులేదు. కాని మనయాంధ్రులకు మాత్రమే రస మైన ఘాటుగ నున్నఁగాని రుచింపదు. సుమారిరువదేండ్లకుఁ బూర్వ మీపురమునకుఁ బ్రస్తుతము భారత వర్షీయ శాసన సభాధ్యక్షులగు శ్రీ రాజేంద్రప్రసాదు గా రరుదెంచి నప్పు డీ కాకినాడ పురపాలక సంఘాధ్యక్షు లొక సన్మానపత్రమును సమర్పించిరి. శ్రీరాజేంద్రులు వారికిఁ దమ సమాధాన మొసఁగుచు నద్దానియందు రెండు చమత్కారయుతము లగు భావములను వెల్లడించిరి. అం దొక్కటి మన యాంధ్రులను గూర్చి వా రొసఁగిన మహదభిప్రాయము. మన యాంధ్ర సంఘము ప్రపంచములో శెల్లఁ గారము దినుటలో నగ్రస్థానము వహించిన దని వా రొక చక్కని యోగ్యతాపత్రమును మన కిచ్చిరి! ఆంధ్రుల భావోద్రేకములు గూడ నట్టులనే నతి తీక్ష్ణముగ నుండు నని వారు వక్కాణించిరి. "అన్నమయం హి సౌమ్యమనః" అను ఛాందోగ్యోపనిష ద్వాక్యము ననుసరించి, మన మానసిక ప్రవృత్తులు గూడ మన యాహారము నాశ్రయించి యుండు ననుట నిర్వివాదాంశము. మనకు షడ్రసములలోఁ గటుతిక్తామ్లాది రూక్ష పదార్థములం దెక్కుడు ప్రీతి యగుట నేను వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. కావుననే మన కావ్యములందు సాధారణముగ వర్ణింపఁ బడిన రసములు గూడ మిగులఁ జిక్కఁదనముఁ గలిగియుండినఁగాని నా యా రసానుభూతి మనకుఁ దృప్తికరము కా దని కాఁబోలు మన

పూర్వప్రబంధకారులు మిగుల నుద్రేకపూరితముగ నొక్కొక చోట వర్ణించి యున్నారు.

శ్రీ మద్రామాయణమునందలి నాయకు డుత్తమశ్రేణికిఁ జెందినవాఁ డగుటచే, నా రాముఁ డెప్పుడును స్మితపూర్వముగను, మృదువుగను, మితముగను, సంభాషించెడివాఁడు. "ఉచ్యమానో௨పి పరుషం నోత్తరం ప్రతిపద్యతే" యని యనుటవలనఁ బరిపూర్ణ మగు మనోనిగ్రహము గల ధీరోదాత్తుఁ డగుటచేత నా మహానాయకునిచేఁ బ్రదర్శింపఁబడిన తత్తద్రసములుగూడ మిగుల నిగ్రహ విశిష్టములుగ నుండెను. మన కతిహాస్యము గాని, యపహాస్యము గాని, యతిరౌద్రము గాని యందుఁ బొడసూపవు. ఏ రస మైనను మితము దప్పక యుండును. మనము రామాయణము నంతయు వెదకిన నొక్క తావునఁ దప్ప మ రెక్కడను నాయకుని స్వోత్కర్షోక్తి కాన్పింపదు. "వీర్యవాన్నతు వీర్యేణ మహతా స్వేన విస్మితః" యనుటచేఁ బదునాలుగు వేల రాక్షసుల నర్ధాధికముహూర్తమునం బొటఁగొన్న పరాక్రమవంతుఁ డెచ్చట నాత్మవికత్థన మాచరించి యుండ లేదు! విభీషణు నెంతమాత్రముఁ బరిగ్రహించుటకు వలను కా దని సుగ్రీవుఁడు తీక్ష్ణముగ వాదించుటచే నాతని నూఱడించుటకుఁగాఁబోలు "అంగుళ్యగ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరిగణేశ్వర!" యని యత్తఱి రామచంద్రుఁడచ్చోట మాత్రమే తన ప్రతాపమును గూర్చి యుగ్గడించెను. అట్టి నిగ్రహస్వరూపుఁ డగు ధర్మవిగ్రహచారిత్రమునందు రసము లన్నియు నుత్తమ స్థాయినే ప్రసరించినవి. కావున నందు హాస్యమునందుమాత్ర మతిహాస్యము గాని యపహాస్యము గాని బుట్టునట్టి ఘట్టము లెట్లు సంప్రాప్తించును? ఉత్కృష్టములును మానవాభ్యుదయమునకు ముఖ్యకారణములు నగు వీర శాంత కరుణా రసములు మాత్ర మందు బ్రధానము లగుటచే వాల్మీకి యా రసత్రయమును రామాయణమునందుఁ బొంగి పొరలించి పాఠకులను శ్రోతలను గూడఁ దన్మయత నొందించి యున్నాఁడు. ఒక్కచోటనుమాత్రమే శృంగారమునఁ గొంత యౌచితిని గవి తప్పించె

నేమో యనిపించును. అట్లా సందర్భమున నాతఁడారీతి రచనకుఁ గడంగుటం బట్టియుఁ దన కావ్యమునం దంతట నార్షముఖి చాంద్రమానముచేతనె కాలనిర్ణయము సేయుటం బట్టియు వాల్మీకి యాంధ్రుఁడేమో యని నాకనిపించుచుండును. ఏమైన నేమి కిష్కింధకాండలోని శృంగార రసోద్రేకమునకు హేతువును మున్ముందు వివరింతును.

ఇఁక రామాయణమునం దుఁ దొలుదొల్త హాస్యరసమును గవి ప్రవేశపెట్టిన ఘట్టమయోధ్యాకాండము. ఒకవంక శ్రీరాముఁ డడవికిఁ బోవుటకు సన్నద్ధుఁ డగుచుండ నయోధ్యాపట్టణ మంతయు నట్టుడికి నట్లుడుకుచుండెను. ప్రజ లందఱు శ్రీరామ ప్రవాసముచే మిగుల దుఃఖము నొందుచుండిరి. ఇటు రాజాంతఃపురమునఁ గైకామంథరలు గాక శేషించిన స్త్రీలుఁ బరిచారకులు నటు రామాంతఃపురమున నెల్లరు నావేదన మొందుచుండిరి. అట్టి శోక సాగరమున నుండిన వారి నుద్ధరించుటకో యన నొక హాస్య రస ప్రతిబింబితమైన ఘట్టమును రామచంద్రుఁడు ప్రదర్శించియుండెను. శ్రీరాముఁడు తన సర్వస్వము నాశ్రితులకుఁ బరిజనులకుఁ బురోహితాదులకు నితర యాచకులకుఁ బంచిపెట్టుచుండెను. అంతటఁ ద్రిజటుఁ డను నొక బహుకుటుంబికుఁడగు శతాధిక వృద్ధ బ్రాహ్మణుఁడు తరుణవయస్కురా లగు తన భార్యచేఁ బ్రబోధింపఁబడి శ్రీరాముని యాచించుటకుఁ బోయెను. ఆ త్రిజటుని వర్ణనము మనకు భాగవతములోని సుప్రసిద్ధ కుచేలోపాఖ్యానము జ్ఞప్తికిఁ దెచ్చును "స భార్యావచనం శ్రుత్వా శాటీమాచ్ఛాద్య దుశ్ఛదామ్". అను వాల్మీకివచనములను దిలకించినచో భాగవతమునందలి కుచేలోపాఖ్యానము త్రిజటోపవృత్తాంతమును జూచియె వ్యాసుఁడు రచించెనేమో యనిపించును.

అనంతర మా త్రిజటుఁడు శ్రీరామచంద్రుఁ డుండిన పంచమ కక్ష్యవఱకును మూఁగియుండిన ప్రజలను నెట్టుకొని పోయి మిగుల వృద్ధుఁ డయ్యును నా జన సమూహమును సరకుఁగొనక, తన తేజమును జూచి యచ్చటివా రందఱు నచ్చెరు వొంది దారి యొసంగ నా ముదుసలి పాఱుఁడు తుదకు రాముని జేరి:—

'నిర్ధనో బహుపుత్రోఽస్మి రాజపుత్ర మహాయశః।
ఉఞ్ఛవృత్తిర్వనే నిత్యం ప్రత్యవేక్షస్వ మా మితి" యనెను.

ఆ విప్రుఁ డట్లడిగిన యంతనె:—

"త మువాచ తతో రామః పరిహాససమన్వితమ్
పరిక్షిపసి దణ్డేన యావ త్తావద వాప్స్యసి॥

అని రాముఁడు పరిహాససమన్వితముగఁ జెప్పినంతనే యా బాపఁడు తన మొల కంగవస్త్రమును బిగించి, కర మందున్న యాఁతకోలను గొని బిఱబిఱఁ ద్రిప్పి సర్వప్రాణశక్తిని గుంభించి విసరివైచెను. అంత నా దండము పోయి పోయి సరయూనది కావల నుండిన రామగోష్ఠము నం బడెను. రామచంద్రుఁ డా శతాధికవృద్ధబ్రాహ్మణుని శక్తి కెంతయు నబ్బుర మంది

("మన్యుర్న ఖలు కర్తవ్యః పరిహాసో హ్యయం మమ।"
"ఇదం తు తేజ స్తవ య ద్దురత్యయం।
తదేవ జిజ్ఞాసితు మిచ్ఛతా మయా॥"

ఇత్యాది సాంత్వన వచనములచే నా కాలమునందలి యా వృద్ధ బ్రాహ్మణుని శక్తిసామర్థ్యములు లోకమునకుఁ దెలుపుట గూడ నా మహామహుని యాశయ మని వచించెను. రామాయణమునందు ప్రధానముగ మనము గమనింపవలసిన విషయము ప్రతివర్ణనమునందును బ్రతీతిహాసమునందును, ధర్మము నీతియుఁ బ్రవర్తించుచుండును. రామాయణమునందుఁ బ్రకృతిని గూర్చి కవి యంత వెఱ్ఱిగ వర్ణించెనే దాని వలన చరితార్థ మేమి యని నన్నొకరు ప్రశ్నించిరి. బహువిధ వృక్షములు, లతలు, గుల్మములు, మృగములు, పక్షులు, మొదలగు చరాచర జాతము నెల్ల వాల్మీకి యతి విపులముగ నా యా ఋతుధర్మములతో పాటు వర్ణించెను. దాని వలన మన కొక తృణము మొదలు మహావృక్షము వఱకును, మశకము మొదలు దంతి వఱకు నే యే కాలములం దెట్లు తమ తమ ధర్మము నవి తప్పక ప్రవర్తించుచున్నవో

చూపు నొక జ్ఞాన విశిష్టుఁ డగు మానవుఁడు దప్ప నీ భూతప్రకృతి యంతయుఁ గాలమును, దేశమును, స్వభావము నుల్లంఘింపక తమ కర్తవ్యమును నెఱవేర్చుచున్న వని తెలుపుటయె యీ మహాకవి యాశయ మని నా యభిప్రాయమును వారికి నివేదించితిని. అట్టులనె నా హాస్యరస ప్రదర్శనముచే రామవియోగదుఃఖభారాక్రాంతు లగు నా పురజనుల హృదయముల కా కరుణామయుఁడు గొంత విశ్రాంతి సమకూర్చెను. ఇఁక లోకమునకు బ్రాహ్మణుఁ డభక్ష్యభక్షణాదు లగు దోషముల నొనరింపక నుఞ్ఛ శిలావృత్తుల నాచరించుచు వేదాధ్యయనము సేయుచుండిన యతఁడు శత వత్సరప్రాయుఁ డయ్యు నెట్టి దార్ఢ్యము కలిగి తన తేజముఁ గోల్పోవకుండఁ గలఁడో శ్రీరాముఁడు లోకమునకుఁ జాటెను. ఆహా ! హాస్యరసమందుఁ గూడ నట్టి మహత్తర నీతి బోధమును గావించిన యీ కవిబ్రహ్మకల్పనాచాతుర్యము చతుర్ముఖునకుఁ గూడ లే దేమొ యని నా మనవి. (నవరసములలో లోకమున కానందమును గొల్పునది హాస్యమునకన్న మిన్న యగు విషయము గాన్పింపదు. ఇతర రసము లన్ననో దేశము, కాలము, పాత్రత కలిగి వాని వలన నా యీ రసానుభూతి నిర్ణీత మగు చుండును. కాని హాస్యమునకు మాత్ర మట్టి నిర్ణయములతోఁ బని యంతగ లేదు. అయ్యది యందఱకు నన్ని కాలములందు నానందమును విశ్రాంతిని కలిగింపఁ గల దివ్యౌషధ మనుటకు సందియము లేదు. దాని నౌషధప్రాయముగ వాడిన మన కది నిరతిశయ ఫలహేతు వగును.)

అటు తరువాత లోకమునందు "హాస్యం శూర్పణఖాముఖే" యను రామ కర్ణామృత శ్లోకములో నవరస నాయకుఁడు రాముఁ డెట్లయ్యెనో నిరూపించిన యీ కవివచనములు ప్రసిద్ధి చెందినవి. ఇచ్చట శూర్పణఖాసన్నివేశమునందు హాస్య మున్నదా ? లేదా ? యను విషయమును గూర్చి కొంచెము చర్చింప వలసి యున్నది.

పదునాఱవ నేఁడు ప్రారంభమునఁ జైత్రశుద్ధపూర్ణిమ రోజున జనస్థానమున నివసించెడి ఋషిమండలమధ్యమున శ్రీరామచంద్రుఁ డాసీ

నుండెయుండెను. అచ్చటకు రావణసోదరి యగు శూర్పణఖ యరుదెంచి యా పురుషపుంగవుని జూచి మోహించెను. కురూపిణియు వృద్ధురాలు నగు నా రాక్షసస్త్రీ యువకుడును దివ్యసుందరమూర్తియు నగు రాముని పై మరులుగొనుటను వాల్మీకి యిట్లు వర్ణించెను.

"సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ!
విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా"
"ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వరా
తరుణం దారుణా (వృద్ధా) దక్షిణం వామభాషిణీ"
"న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియదర్శనా
శరీరజ సమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్"

చూడుడు! శూర్పణఖకును రామచంద్రునకును గల రూపభేద వయో భేదముల నతివిచిత్రముగ జిత్రించి, త్రిజటావృత్తాంతమున దరుణవయస్కురా లగు భార్యతో నా విప్రుడు ప్రవేశించుటయు, నీ శూర్పణఖా వృత్తాంతమున వృద్ధస్త్రీ తరుణవయస్కుని జూచి మోహించుటయు జదివిన పాఠకులకు "వయసి గతే కః కామవికారః" యను శంకరభగవత్పాదుల సూక్తి నిగూఢ వారు మించి రని బోధపడగలదు. అట్టి శూర్పణఖ రాముని ప్రేమించి యా పురుషోత్తమునితో సాభిప్రాయముగ మాటలాడుటయు దుదకు దన యభిలాషమును సువ్యక్తముగ "చిరాయ భవ మే భర్తా సీతయా కిం కరిష్యసి" యని చెప్పుటతో నూరకుండక త్రిలోకసుందరి యగు సీత కురూపిణిగ నుండె నని యాపె పలుకుట "వికృతా చ విరూపా చ న చేయం సదృశీ తవ" యనియు "అహ మేవానురూపా తే భార్యారూపేణ పశ్య మాం" "ఇమాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీం" ఇత్యాదిగ సీత నధిక్షేపించుటయు హాస్యరసోత్పాదకములు గ నుండె ననుట యొప్పుకొనక తప్పదు. కాని శూర్పణఖ నంతకు బూర్వము "న హి తావన్మనోజ్ఞాంగి రాక్షసీ ప్రతిభాసి మే." "ఇహ వా కిం నిమిత్తం త్వ మాగతా బ్రూహి తత్త్వతః" యని రాముడడిగెను "మనోజ్ఞ"

మగు స్వరూపము గల దానినిగ సంబోధించుచు నట్లు సుందరరూపము గల స్త్రీ రాక్షసి యగు టెట్లని యామెను ప్రశ్నించెను. ఇచ్చట శూర్ప ణఖ సుందర వేషమును ధరించి శ్రీరామసన్నిధానమునకుఁ బోయె నని యు, నామె తన యథార్థ మగు వికృతరూపముతోఁ బోయిన రాముఁ డెట్లామెను వలచునని యెంచి సుందరరూపము దాల్చి యేఁగుట వలన నే "నహి తావ న్మనోజ్ఞాంగీ" త్యాది రామవాక్యము లుపపన్నములగు చున్న వని వ్యాఖ్యాతలు రచించిరి. అట్టియభిప్రాయముల నా యా సంద ర్భము ననుసరించి మన మొప్పుకొన వలసి యున్నది. ఏలన, నిది వఱ లో రామచంద్రుని యనుభవమందు తాటక యను రాక్షసస్త్రీ నాతఁ డు చూచెను. ఆమె భయంకర రూపమును దాల్చి యుండెను. రాక్షస పురుషులు గూడ మారీచ, సుబాహు, విరాధాదులు ఘోర రూపము లతో నుండిరి కావున "ఇట్టి సుందర రూపము గల నీ వెట్లీ రాక్షస భూ ముల కరుదెంచితివి ? నీవు నాకు రాక్షసిగఁ బొడగట్టుట లే"దని శ్రీరా ముఁడనుట సహజమును యుక్తియుక్తమును గూడ నై యున్నది. అట్టి తఱి సీత నామె యధిక్షేపించుటలో నింక హాస్యము కాన్పింపదు. అది యుం గాక నీచ స్త్రీ యగు రాక్షసితో "న హి తావ న్మనోజ్ఞాంగి"యని రాముని యట్టి యాదాత్తనాయకుఁడు పరిహసించె ననుట యసంగతము. అన్య స్త్రీని రాముఁడు పరిహసించునా యని మన మాకాంక్షించుకొన వలసి యున్నది. కావున నచ్చటి "సుముఖం దుర్ముఖీ" త్యాది వర్ణనము కవికృతమ్ము లగు శూర్పణఖా పూర్వరూప వర్ణనమే; యను గోవిందరా జాదుల వ్యాఖ్యానము సహేతుకముగ నున్నది. కామమునకు రూపము గాని వయసుగాని యవరోధము కా దనియు నా వర్ణన పరమార్థమగు ట నిస్సంశయము. అందు హాస్యరస మేమియుఁ గానరాదు. కామవశ యైన క్రూరస్త్రీ నా ఋషిపరివృత్సన్ముఖమునుండి యెట్లయిననావలకుఁ బంపుటకు "స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మిత పూర్వమథాబ్రవీత్"అని రాముఁడామెను సంబోధించి లక్ష్మణుని కుపచార మొనరింపు మని చెప్పె

చుఁ బో వచ్చెను. ఆ సందర్భమున "శ్రీమా నకృతదార శ్చ లక్ష్మణో నామ వీర్యవాన్" అని లక్ష్మణునకుఁ బెండ్లి కా లే దని శూర్పణఖతో రాముఁ డబద్ధ మాడె నని యున్నట్లు పరిహాసోక్తులం దబద్ధమాడినఁ దప్పు కా దనియు వ్యాఖ్యాత లందఱు నేకకంఠముగ రచించిరి. సుప్రసిద్ధ పండితులును నవనాగరికశిఖామణు లగు శ్రీ. వి. ఎస్. శ్రీనివాస శాస్త్రి గారు కూడ నీ "అకృతదార" పదప్రయోగముపైఁ దమ యపూర్వరామాయణోపన్యాసములందుఁ జర్చించి చర్చించి తుదకు "Though he might have meant the other meaning he did deceive Surpanakha, he was all the same gulty" అని నిశ్చయించి రాముఁడు శూర్పణఖను మోసపుచ్చుటకై యట్లు వచించి యబద్ధ మాడుటగాని శ్లేషముగ నా శబ్దముఁ బ్రయోగించుట గాని యను నేదియో యొక తప్పు రామున కంటఁగట్టిరి! అయ్యది యసంగత మగు వాద మని నా మనవి. పదములకు సర్వసాధారణముగ యౌగిక మనియు రూఢ మనియు రెండువిధముల ప్రయోగ ముండుట లోక విదితమే. రూఢము లగు పదములు గూడ లోకవ్యవహారమునందు గౌణముగఁ బ్రయోగింపఁబడుచుండుట గూడ వేఱుగఁ జెప్పనక్కఱలేదు. లోకమునం దవి వాడుకొను నప్పుడు లాక్షణికార్థకములై యుండును. కావున నచ్చట "అకృతదారః" "న కృతః దారోపచారః" యని లాక్షణికార్థమందుమాత్రమే యా శబ్ద మూహింపఁబడిన దనుకొనవలె నని నా విన్నపము. వాడుకయందుఁ గూడ మన మొక నిగ్రహము గల పురుషుని గూర్చి మాటలాడు నపుడు "అతఁడు భార్య మొగమెన్నఁడుఁ జూచి యెఱుఁగఁడు" అని వ్యవహరించుట సుప్రసిద్ధము. ఇట్టి ప్రయోగమునే వాల్మీకి మఱియొక తావునఁ గిష్కింధకాండలో వాలి చనిపోవు నపు డంగదుని రామున కప్పగించుచు "అకృతబుద్ధి రయం కుమారః" అని యనిపించియున్నాఁడు. దాని కర్థ మంగదునికి బుద్ధియె లే దనుట సంగతమో లేక "అపరిపక్వ బుద్ధి రయం కుమారః" యనుట యుచితమో రసికు లూహింతురు గాక! కావున నీచకాముకి యగు నా దుష్టరాక్షసి నావలకుఁ బంపుటకు

"లక్ష్మణుఁడు దారోపచార మెఱుంగఁడు. కావున నీవు పోయి యాతని కుపచార మొనరింపు" మని చెప్పి రాముఁ డామె నెటులనో యాతని కడ కంపినట్లు చెప్పుట సర్వవిధములఁ దగియున్నది. అటు కానిచో "అస న హి రామస్య కదాచిదపి సమ్మతమ్। న విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్య చ" యని యంతకుఁబూర్వమే రాముని గవి ప్రశంసించి యంతలో నబద్ధ మాడించుట యసంబద్ధము కాదా? కావున నా ఘట్టమునందుఁ బరిహాసము గాని, హాస్యము గాని నే మేని యున్న నయ్యది కొంచెము లక్ష్మణుఁ డొనరించె ననుట యుక్తము. ఆ పురుషశార్దూలుఁడు పరిచర్యయందు మిగుల డస్సి వీథియరుగుపైఁ గూర్చుండెను. అట్టి తరుణమున శూర్పణఖ యాతని వరింపఁబోయెను. అప్పు డా రామానుజుఁడు తన మానసిక విశ్రాంతికై కాఁబోలుఁ గొంత హాస్యరస ముద్దీపింపఁ జేసి యుండెను. త్రిజటుని విషయమై 'పరిహాసోఽయం మమ' యనిన రాముఁడు శూర్పణఖ తనను భార్యగఁ బరిగ్రహింపు మని కోరఁగనే "ప్రహస్య" యని రాముఁడు నవ్వె నని మాత్రమె కవి చెప్పెను. నిజముగ రాముఁడు పరిహాసము నేసె నేని యది సోదరునిపైఁ గూడ బ్రయోగించె ననవలసి వచ్చును కదా! అంతకన్న హాస్యాస్పద మైన విషయ మే ముండును? అట్టి సోదరునితోఁగూడఁ బరియాచకము రాముఁడు నేసె నేని "క్రూరై రనార్యైః సౌమిత్రే పరిహాసః కథంచన। న కార్యః పశ్య వైదేహీం కథంచిత్ సౌమ్యజీవతీం" అని యేల నాతఁడు లక్ష్మణునిపై నలుగును? ఎటు జూచినను శూర్పణఖాసన్నివేశమున :—

"కథం దాసస్య మే /దాసీ భార్యా భవితు మిచ్ఛసి?
సోఽహమార్యేణ పరవాన్ భ్రాత్రా కమలవర్ణిని!"
"సమృద్ధార్థస్య సిద్ధార్థా ముదితామలవర్ణినీ
ఆర్యస్య త్వం విశాలాక్షి భార్యా భవ యవీయసీ
"ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీం
భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వా మేవైష భజిష్యతి"

"కో హి రూప మిదం శ్రేష్ఠం సంత్యజ్య వరవర్ణిని!
మానుషేషు వరారోహే కుర్యా ద్భావం విచక్షణః
"ఇతి సా లక్ష్మణేనోక్తా కరాళా నిర్ణతోదరీ
మన్యతే తద్వచ స్తథ్యం పరిహాసావిచక్షణా.

యని లక్ష్మణుఁడే పరిహాస మొనరించె నని కవి చెప్పియుండుటచే నిచ్చట శూర్పణఖ వికృతరూపముతో లక్ష్మణునివద్దకు వచ్చియుండె నని సుబోధ మగుచుండెను. ఆమె రాముని భర్తగఁ గోరి తాను రావణుని చెల్లె లనియు లక్ష్మణుని సీతను గూడ భక్షించెద ననియు నాతనితోఁ జెప్పు నప్పు డా శూర్పణఖ తన నిజరూపమును గైకొనిన ట్లూహింప వలసి యున్నది.

కావున మున్ముందుగా నున్న జనస్థాన ఘోరసంగ్రామమునకును, సీతాపహరణాది సంఘటనములకును బీజ మా లక్ష్మణ పరిహాసమునం దేర్పడి "మొదట వేళాకోళము తరువాత శిఖాగ్రహణ" మను లోకోక్తి సిద్ధ మైనది. అందుచేతనే రాముఁడు నీచులతోఁ బరిహాసము వల దని లక్ష్మణుని మందలించెను. ఇట్లు "హాస్యం శూర్పణఖాముఖే" యను నా శ్లోకోక్తి లక్ష్మణపరిహాసముతో బ్రారంభమై శూర్పణఖా కర్ణ నాసి కా చ్ఛేదముచే రగిలి రాక్షసాటవీ దహన మొనరించెను. అయ్యది హాస్యమొ భీభత్సమొ పాఠకు లూహింతురు గాక యని నా విజ్ఞప్తి.

ఇఁక నిజ మగు హాస్య రస స్ఫురణము కిష్కింధాకాండములో నా కవి యథేచ్ఛముగను పుష్కలముగను జదువరుల కొసంగియున్నాఁడు. అయ్యది శ్రీమద్రామాయణాంతర్భూత మైన యొక 'Comedy of Errors' వంటి హాస్య రస విష్కంభ మని చెప్పినఁ దప్పులేదు. అందు "వాగం గాది వికార దర్శన జన్మా వికాసాఖ్యో హాసః" యను రసగంగాధరోక్తికి పరిపూర్ణ లక్ష్యసిద్ధి కావచ్చును. ఆ విచిత్ర సంఘటనమును జిత్రించుటకుఁ బూర్వమె, కవిబ్రహ్మ యగు వాల్మీకి తన యమోఘమాయస లేఖినిచే నం తవఱకు విష్ణ్వవతారముగఁ జిత్రించిన రాముని యరణ్యకాండముననె సీతావియోగదుఃఖోపతాపమున నున్మత్తుని జేసి క్రమముగఁ గిష్కింధ

కొండయందా యుదాత్తమూర్తిని సీతావిప్రలంభముచే మఱింత సామాన్య కాముకునిగ మార్చివైచెను! ఈ ఘట్టములోని రాముని మనము గమనించినచో మనకు విప్రనారాయణ చరిత్రలోని "ఆ విప్రోత్తము వజ్ర పంజర నిభంబై నిశ్చలంబైన" యను పద్యము మనకు జ్ఞప్తికి రాక మానదు. అందు విప్రనారాయణుఁ డెట్లు మారెనో యట్లనె శ్రీరామునిహృదయమునందుఁ బ్రవేశించిన దుఃఖము, రౌద్రము, భీభత్సము మున్నగు విపరీతభావములఁ బోఁగొట్టి యాతని నొక విప్రలబ్ధుఁ డగు కాముకునిగా ముందు జరుగబోవు నాటకమున కనువైన రూపము న మరించుట కా రఘుపుంగవుని గవి మతంగాశ్రమమునకుఁ గొనిపోయెను. అ య్యాశ్రమమునం దుండిన సప్త సముద్రతీర్థమునం దవగాహన మా రాముఁ డొనరింపఁగనె యాతని యశుభము లన్నియు నుపశమించెను.

"ప్రణష్ట మశుభం తత్త త్కల్యాణం సముపస్థితం
తేన తత్త్వేన హృష్టం మే మనో లక్ష్మణ సంప్రతి".

అని రామచంద్రుఁడు సోదరునితో ననును. పంపా సరోవరమునం దా మహనీయుఁడు స్నాన మాచరించుటకుఁ బూర్వమె యాతని హృదయమునందు శుభావిర్భావ సూచకము లగు నుత్సాహాదులు పొడసూపుచుండెను! ఇందుఁ దీర్థస్నానమువలనఁ గల్గు లాభముల మన కీ రీతిని కవి సూచించెను.

"హృదయే హి నరవ్యాఘ్ర శుభ మావిర్భవిష్యతి
తదా గచ్ఛ నగవ్యాఘ్ర పంపాం తాం ప్రియదర్శనామ్".

ఇట్లు రామచంద్రున కిదివఱకు వికృతరూపముగఁ గనుపట్టిన ప్రకృతి యంతయు నిప్పుడు ప్రియమై యంతకంతకు బ్రియారూపమును దాల్చుచుండెను! ఇంక పంపాసరోవరావగాహనమునఁ గామోద్దీపనము కలిగి "కామీ స్వతాం పశ్యతి" యను కాళిదాస సూక్తి నిజ మనునట్లు సరోవరములోని మీనముల చాపల్యము, పద్మముల సుగంధము, నదుల మేఖలత యెందుఁ జూచినను సీతయె యా విప్రలబ్ధునకు రామునకుఁ దోఁచుచుండెను. అంతట నాంజనేయుని జూచినతోడనె యా రామచంద్రుని

కన్నులకు సీతాప్రాప్త్యాశాజ్యోతులు మరల వెలుఁగొందుచుండెను. సుగ్రీవ సచివుని యుపన్యాసానంతరము రాముని హృదయ ముప్పొంగి వెదుకఁబోయిన దివ్యౌషధీలత కాలికిఁ జుట్టుకొనిన ట్లయ్యెను. మారుతి సందేశమువలన 'సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితాం।ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహారిణీం' అనటచే, తహతహలాడెడి శ్రీరామ హృదయ మాంజనేయుని వశ మయ్యెను. బుద్ధిమంతులలో వరిష్ఠుఁడును, చతుర్వేద పారంగతుఁడును, వ్యాకరణశాస్త్రనిష్ణాతుఁడు నగు నా సూర్యశిష్యుఁడు సూర్యపుత్రునివద్ద కా సూర్యవంశజుల నిరువురఁ దన మూఁపున నిడుకొని నిముషమాత్రమునఁ గొంపోయెను! ఏమి యా యాంజనేయుని యద్భుతాతిథిసత్కారప్రకారము! ఆ క్రొత్తమానవు లెవ్వరో చూచి రమ్మని తన ప్రభు వంప వారిని నెత్తిన మోచుకొని వచ్చిన దూత నే ప్రభు వాదరింపఁడు? ఆ వచ్చినవారి యానందమునకు మాత్రము మేర యుండునా? అటు సుగ్రీవుఁడు నిటు రామచంద్రుఁడు గూడ నానందరసనిమగ్నులైరి. నేఁటికిఁ దనకుఁ గావలసిన "చూచి రమ్మనినఁ గాల్చివచ్చెడి" దూత లభించెఁ గదా యని రాముఁడు పూర్తిగ నానందసముద్రమున మునిఁగి యవిచారితముగ సుగ్రీవునితో నగ్నిసాక్షికముగ మైత్రిఁ జేసికొనెను. ఇదియె రాముఁడొనరించిన 'Comedy of Errors' లోని Error' లేక తొట్రుపాటు. తరువాత సుగ్రీవుఁడు సీతభూషణములఁ దెచ్చియిచ్చుటఁజేసి రామునిమానసము మఱింత ద్రవించి సుగ్రీవునితో హత్తుకొనిపోయెను. కపినాయకుఁడు భోగలాలసుఁడు, నబద్ధ మాడుటకు వెనుదీయఁ డనియు రాముఁ డప్పు డేమియు ననుకొనలేదు. అట్టి యుద్రిక్తావస్థలో సఖ్యమునకుఁ బూర్వము సోదరుల పరస్పరవైరకారణ మరయుటకు మారు సఖ్యానంతరము వాలి సుగ్రీవుల వైరకారణమునుగూర్చి రాముఁడు ప్రశ్నించెను. సుగ్రీవుఁ డంతయుఁ బూస గ్రుచ్చి నట్లు చెప్పెను. కాని వాలి బిలమం దున్నకాలమున నాతఁడు తారను బరిగ్రహించిన వృత్తాంతమును దాఁచెను 'శుభం వా యది వా పాపం యో హి వాక్య ముదీరితం। సత్యేన ప్రతిగృహ్ణాతి

స వీరః పురుషోత్తమః" యని తన వాలివధప్రతిజ్ఞను బురుషోత్తముఁడగు రాముఁ డెట్టకేలకు నిర్వర్తింపవలసివచ్చెను.

వాలి మరణానంతరము, తారా రుమలలో సుగ్రీవుఁ డంతఃపుర భోగములందుఁ బానాసక్తుఁడై మునిఁగిపోయెను. వానరరాజ్యమును మంత్రుల కప్పగించి కపిరాజు భోగలాలసుఁడై రాముని మఱచెను! తాను శరదృతువునందుఁ గార్తికము ప్రాప్తించినంతనె సీతను వెదకుటకు యత్నము సలుపుదు నని చేసిన వాగ్దానము విస్మరించెను. ఋష్యమూకమున నున్న రాముఁ డన్ననో, యొకవంక వర్షాకాలమందుఁ బ్రకృతి యంతయు భోగమునందు మునుంగుటయు, మఱియొకవైపున మేఘావృతగగనమండలము "క స్సన్నద్ధే విరహవిధురాం త్వ య్యుపేక్షేత జాయాం" యన్నట్లు నిరంతరము జానకీవిరహావేదన రగుల్కొనఁ జేయుటయు, వేఱొకవంక నాంజనేయుఁడు తనకు సీతావృత్తాంత సంపాదకుఁడు కాఁ గలఁ డను నాసయు నిఁక నొకమూల సుగ్రీవుని వర్తనముచేఁ గలిగెడి సంశయము, వీనికిఁదోడు సుగ్రీవాంతఃపుర కాముకజన కోలాహలములు తన హృదయమునందు మన్మథోద్రేకతరంగము లుప్పతిల్లఁజేయఁ బ్రకృతియందలి వస్తువు లెల్ల సీతవలె నాతనికిఁ గన్పట్టుచుండెను.

> "దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః
> నవ సంగమ సవ్రీడా జఘనా నీవ యోషితః"
> "చంచచ్చంద్రకరస్పర్శ హర్షోన్మీలితతారకా
> అహో రాగవతీ సంధ్యాజహాతి స్వయ మంబరం.

ఇత్యాది శృంగారరసభావములు పుంఖానుపుంఖములుగఁ జెలరేగుచుండెను! అట్టి వివిధరసభావసంజనితానేకవృత్తములందా సుకుమార రఘుకుమారుని హృదయము దవులుకొని క్రమక్రమముగ నా సుగ్రీవభోగలాలసత్వము కంటకముగఁగూడఁ దోచెను! "ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతె" యను వచనమునకు బ్రబలప్రమాణమును

మనకు వాల్మీకి యీ కిష్కింధాకాండమందు నిరూపించియున్నాఁడు. సుగ్రీవకామభోగస్మరణమువలనఁ దన కుద్భవించిన మనోవికృతిచే

"ఇనూ స్థితగుణా వర్షా స్సుగ్రీవ స్సుఖ మశ్నుతే
విజితారి స్సదార శ్చ రాజ్యే మహతి చ స్థితః
"అహం తు హృతదార శ్చ రాజ్యా చ్చ మహత శ్చ్యుతః
నదీకూల మివ క్లిన్న మవసీదామి లక్ష్మణ !.

అని రాముఁడంతటి మహానాయకుఁడుగూడ ననుటచే నిఁక సామాన్య మానవు లెట్లుకామోపహతు లగుదురో వేఱుగఁ జెప్పనక్కఱలేదు ! "కామాత్సంజాయతేక్రోధః" యనునట్లు సుగ్రీవాలస్యముచే నా పర మోదారుఁడు శాంతుఁడు నగు రామునకుఁగూడ కోపము జనించెను. ఇదియె రెండవ "Error" లేక తొట్రుపాటు. అంతట నా రామహృదయ సంజనితకోపము తీవ్రమయి"న చ సంకుచితః పంథాః యేన వాలీ హతో గతః। సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలి పథ మన్వగాః"యను క్రోధవాక్య ములకు దారితీసెను. అట్టి మానసికోద్రేకమును రాముఁడందుటఁ జూచు చుండిన లక్ష్మణునిమాట వేఱెచెప్ప నేల? "నే నిప్పుడ వోయి సుగ్రీవుని జంపివైచి యంగదుని వానరరాజ్యాభిషిక్తునిగ నొనరించివచ్చెద"నని లక్ష్మణుఁడు లేచుచుండ, రామచంద్రుని సహజగుణము లగు నౌదా ర్యము, ఘృణ, శాంతము మొదలగు నుదాత్తభావము లా పుణ్య మూర్తి మనమున యనతికాలమున మరల నావిర్భవించెను. జ్ఞానికిఁ గలుగు నజ్ఞానము నజ్ఞానికిఁ గల్గు జ్ఞానమును క్షణికములుకదా ! అది యుంగాక "స్వభావస్తుప్రవర్తతే" యనునట్లు శ్రీరామునకు శమద మాదిగుణములు స్వభావము లగుటచే నవి తత్కాలజనితోద్రేకమును బెరుగనియ్యవు. అందుచే :—

"త మాత్తబాణాసన ముత్పతంతం
నివేదితార్థం రణచండకోపమ్
ఉవాచ రామః పరవీరహన్తా
స్వవేక్షితం సానునయం చ వాక్యమ్".

యని, రాముఁడంతలో నభిరాముఁడై లక్ష్మణుని కోపము శాంతింపఁ జేసి "నేద మద్య త్వయా గ్రాహ్యం సాధువృత్తేన లక్ష్మణ! । తాం మనువర్తస్వ పూర్వవృత్తంచ సంగతం" అనియు, "సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్ । వక్తు మర్హసి సుగ్రీవ వ్యతీతం కాలపర్యయే" యనియు ననిపించినవి.

ఈ రీతిని డోలాయమానమానసుఁ డగు రాముని, రౌద్రమున కునికిపట్టు నహంకారమునకు బుట్టినిల్లగు లక్ష్మణుని, పిఱికిదనమునకు బంటగు సుగ్రీవుని, వాక్చాతుర్యమునకు యుక్తిప్రయుక్తులకు నిలయమగు తారను, రామకార్య ధురంధరుఁ డగు నాంజనేయుని నెట్లయిన సుగ్రీవుని దోషి యనుపింపవలె నను చిత్తమున నలుకుగల యంగదుని గోని యొక విచిత్రమగు నాటకమును వాల్మీకి యీ కిష్కింధాకాండమున రచించెను. ఈ ఘట్టమున తారా లక్ష్మణులు ముఖ్యపాత్రలు వహించిరి. నాటక మంతయు నాడించుట కాంజనేయులు సూత్రధారుఁ డనవచ్చును. రౌద్రరసాభినయముల లక్ష్మణుఁ డందివేసిన చేయి, యుక్తిగ మాటలాడుటలోఁ దారను మించిన జాణలు లేరు. ఇటు తన ప్రభుకార్యము నటు రామకార్యమును సాధించుటలోఁ దన వాకచక్యము నంతయు వినియోగింప సమర్థుఁడు వాయునందనుఁడు. శ్రీరామ చంద్రుఁ డెప్పుడు లక్ష్మణుని సాంత్వనవచనప్రయోగముచే సుగ్రీవుని నయమార్గమునకుఁ దెమ్మనెనో యప్పుడే యా సౌమిత్రి చక్కని యుక్తిని బన్నెను. భయముచేఁ గాని పానాసక్తులు లొంగరన్నిలక్ష్మణునకుఁ దెలియని విషయము కాదు. "The and justifies the means" అనునట్లు తన యన్న రూక్షములు వలదని చెప్పినను కార్యసాధనమే ప్రధాన మగుటచే లక్ష్మణుఁడీక తన రౌద్రరసాభినయమునకుఁ బూర్తిగ నిశ్చయించుకొనెను.

కిష్కింధకుఁ బయనమైన లక్ష్మణ పదాహతిచేఁ నేల్లు పెల్లగిలుచుండెను. శిలలు చూర్ణము లయ్యెను, కాని యాతని యంతఃకరణము

మాత్రము పరిశుద్ధముగ నుండెను. "తతః శుభమతిః ప్రాజ్ఞో భ్రాతుః ప్రియహితే రతః । లక్ష్మణః ప్రతిసంరబ్ధో జగామ భవనం కపేః"॥ యని కవి వచించెను. ఇచ్చట లక్ష్మణుని కోపోద్రేక మంతయు నటన మనుటకు మన కీ శ్లోకమున రెండు కీలకముల నమరించినాఁడు వాల్మీకి. "భ్రాతుః ప్రియహితే రతః" యనుటలో భ్రాతుః ప్రియస్య సుగ్రీవస్య హితే రతః లక్ష్మణః యని మన మన్వయము చేసికొనవలె నని నా మనవి. లేనిచో నిటీవల నాంజనేయునిచే నుడువఁబడిన "సర్వథా ప్రణయాత్ క్రుద్ధో రాఘవో నాఽత్ర సంశయః॥"యను వాక్యములు వ్యర్థము లగును. అట్లు సుగ్రీవుని హితవును గోరి బయలువెడలిన లక్ష్మణసంరంభ మంతయు "ప్రతిసంరంభ"ము కాని వాస్తవ మగు సంరంభము కాదు. అట లక్ష్మణుని నటనాసంరంభ మంతయు నట్లుండ నిట కిష్కింధలో స్వామిహితేషణుఁడును శ్రీరామభక్తుఁడు నగు నాంజనేయుఁడు సుగ్రీవునకుఁ బూర్తిగఁబిఱికి మందుఁ బోయుచుండెను! "అభిక్రుద్ధ స్సమర్థో హి చాప ముద్యమ్య రాఘవః । సదేవాసురగంధర్వం వశే స్థాపయితుం జగత్" అనిచెప్పుటచే "సుగ్రీవా ! నీవు రామునకుఁ బ్రత్యుపకార మొనరింపనిచో నిన్ను నిముసమాత్రము నాతఁడు శాసింపఁగలఁడు సుమా"యనియు, 'కామం ఖలు శరై శ్శక్తః సురాసుర మహోరగాన్' అనియు నయమునను, భయమునను నా సచివోత్తంసుఁడా కపిరాజునకు బోధించుచుఁ బానోద్రేకముచే నవశమైన యాతని హృదయమునందు రాఘుని భయంకర కోదండవిస్ఫూర్తిని స్ఫురింపఁజేయుచుండెను. అంత నంగదుఁడు ప్రవేశించి "సోఽయం రోషపరీతాక్షో ద్వారి తిష్ఠతి వీర్యవాన్। వానరా వానరపతే! చక్షుషా ప్రదహన్నివ । తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్ర స్సహబంధుభిః" ఇత్యాది భయోపాదక వాక్యములు నుడువుటయు, అశనిపాతమువలె నంతలో లక్ష్మణ ధనుష్టంకారనాదము వినఁబడుటయు, సహజభీరు వగు సుగ్రీవునికి భయోత్కంపచే హృదయము తల్లడిల్ల సాగెను. ఆగ్రహావిష్టుఁ డగు లక్ష్మణుని జూడ నోడి, యాంజనేయులు తనపై లక్ష్మణునితోఁ గొండెములు చెప్పె నని యాతనిపై ననుమానించి తుదకు విధి లేక తారాదేవిని బ్రతిమాలి లక్ష్మణు నూఱడించుట

గామెను బంపెను! "త్వద్దర్శనవిశుద్ధాత్మా న స కోపం కరిష్యతి। న హి స్త్రీషు మహాత్మానో క్వచి త్కుర్వంతి దారుణమ్। త్వయా సాంత్వైరుపక్రాంతం ప్రసన్నేంద్రియమానసమ్ । తతః కమలపత్రాక్షం ద్రక్ష్యా మ్యహ మరిన్దమమ్" ఇత్యాదివాక్యములచేఁ దారను బ్రతిమాలుచు నామెను సుగ్రీవుఁడంపుటయు, "తతస్తారాం హరిశ్రేష్ఠఃసుగ్రీవః ప్రియదర్శనాం। ఉవాచ హిత మవ్యగ్రః త్రాససంభ్రాంతమానసః" యనుటతో హాస్యరసమును బ్రారంభించి కవి తన హాస్యరచనావిష్కంభకమునకుఁ జక్కని ద్వారము నమరించెను. ఇంకఁ దారాదేవి చాకచక్యము, ఆమె ప్రస్ఖలద్గమనము, లక్ష్మనితో సఖేలముగ మాటలాడుట మొదలగు నాంగిక వాచిక వికారములను హేలనాదులను గవి విపులముగ వర్ణించి తుదకుఁ దారాయుక్తి వైభవమునకుఁదోడు, లక్ష్మణుని కార్యసంఘటనాపేక్ష యంతకంత కినుమడించి ప్రేరేఁప నొకవంకఁ దార "ప్రణయప్రగల్భ" వచనరచనలఁ గ్రుమ్మరింప "తదాగచ్ఛ మహాబాహో! చారిత్రం రక్షితం త్వయా। అచ్ఛలం మిత్రభావేన సతాం దారావలోకనం" అను సుషేణపుత్రి యుపలాలన వాక్యములచే నదివఱకెవ్వరి యాభ్యంతరమందిరములఁ జొచ్చి యెఱుంగని లక్ష్మణుఁడెట్టకేల కా జాణచే సుగ్రీవాంతఃపురమునకు గొంపోఁబడె నని వాల్మీకి తన రసపోషణ నైపుణ్యమును జాటెను. అచ్చట సుగ్రీవుఁ డింకను రుమాదేవితో ప్రణయరసనిమగ్నుఁడై మదిరాసేవనముచే నొడలు తెలియకుండనట్టి కపిరాజుఁ గాంచి లక్ష్మణుఁ "డంతకసన్నిభుఁడై కోపరక్తాక్షుఁ"డైన, నా రామానుజునిఁ జూచి భీతిల్లి సుగ్రీవుఁడు రుమను గాఢముగఁ గౌఁగలించుకొని నని యిట్లు వర్ణించి యా కవిరసికుఁడు హాస్యరసము నుచ్ఛస్థాయికిఁ దెచ్చెను :-

"రుమాం తు వీరః పరిరభ్య గాఢం
వరాసనస్థో వరహేమవర్ణః
దదర్శ సౌమిత్రి మదీనసత్త్వం
విశాలనేత్ర స్సువిశాలనేత్రం."

అను శ్లోకమున లక్ష్మణ సుగ్రీవుల "వాగంగాది వికారదర్శన"లాభము వలన సుగ్రీవుని సుభటత్వమును, లక్ష్మణుని రౌద్రరసాభినయమును

కవి పాఠకుల కండ్లకుఁ గట్టుటచేఁ దిక్కన విరాటపర్వమునలె నా ఘట్టము నొక దృశ్యప్రబంధరీతిని రూపొందించినట్లు మనకు గోచరించును. ఆ సందర్భముననఁగూడ తార హేళనవాక్య వైశద్య ముచ్చస్థాయి నలంకరించినది. "ప్రాప్తకాలం న జానీతే విశ్వామిత్రో యథా మునిః" యని యా ప్రౌఢ, లక్ష్మణుని గురువర్యునకే పంగనామములుంచుటంజూడ తారాపాత్రపోషణమునందు వాల్మీకి ప్రాగల్భ్య మంతయు తేటపడఁ గలదు. ఎట్టకేల కా నాటకము నట్లాడించి యాడించి యా కవిపుంగవుఁడు లక్ష్మణ సుగ్రీవసమాగమమునఁ దారాయుక్తి వాక్యసంధానముచే "యదికించి దతిక్రాంతం విశ్వాసాత్ ప్రశ్రయేణ వా। ప్రేష్యస్యక్షమితవ్యం మే న కశ్చి న్నాపరాధ్యతి?" యని సుగ్రీవుఁడును "సర్వథా హి మమ భ్రాతా సనాథో వానరేశ్వర! త్వయానాథేన సుగ్రీవ! ప్రశ్రితేన విశేషతః" యని సౌమిత్రియు నొకరి నొక రభినందించుకొని రని మనకుఁ దెల్పెను. అట్లు వా రిరువుర పరస్పర కరస్పర్శలచే నా తారాలక్ష్మణ సన్నివేశమును ముగించి వారు శ్రీరామ సన్నిధానమున కరుగుట మున్నగు విషయములను, సీతాన్వేషణకై వివిధ కపి నాయకులఁ బంపుట, మన యెదుట జరుగుచుండిన ట్లా వృత్తాంత మంతయుఁ గవి రచించెను. ఇందు హాస్యరస మంతయు నెట్లు పొంగి పొరలెనో దృశ్యప్రబంధముగ నొనరించినం గాని నటకుల కది సాధ్యపడ దని యెంచి నా శక్తికొలఁది యొకచిన్న నాటికను రచించితిని. దానిని రంగస్థలమున నటకులు ప్రదర్శింప సమకట్టుటయు, విద్యారసికు లద్దానియందలి స్వారస్యము నాస్వాదించుటయుఁ గలిగె నేని నా యత్నము ధన్య మగును.

ఇఁక సుందర కాండమున మధువన భంగమున నా యా కపి చేష్టలు, పానమత్తు లగు వానరులు, వనపాలుఁ డగు దధిముఖాదులకు "దేవమార్గ" దర్శనము సేయించుట మున్నగు కాపేయ స్వభావముల వర్ణనము మనకు హాసమును బుట్టింపక మానవు. వేయేల ? యాంజనేయుని యట్టి నిగ్రహ స్వరూపుఁ డగు కపి సత్తముఁడు గూడ దన స్వభావము నెట్లు వీడఁ జాలక రావణ తల్పము నందుఁ బరుండి యుం

డిన మందోదరిం జూచి సీత యని భ్రమించి తన సహజప్రకృతిని బ్రక టించె నని హాస్యరస ముట్టిపడునట్లు వాల్మీకి యిట్లు వర్ణించెను :-

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం
ననంద చిక్రీడ జగౌ జగామ
స్తంభా నరోహ న్నిపపాత భూమౌ;
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనాం॥

ఇందు, కవి "జగౌ" అని ప్రయోగించుటం జేసి యా హనుమంతుఁడు సంతసముతోఁ గూని దీర్ఘమును గూడ దీయుచుండుట మనము చూచి యుంటిమేని యా దృశ్యము మనకు హాసము కలిగింపక మానునా? ఈ గతి ప్రతిఘట్టము నందును, తుదకుఁ గుంభకర్ణుని నిద్రనుండి మేలు కొలుపుటలో యుద్ధకాండమునందుఁ గూడ యుక్తరీతిని హాస్యరసము నుద్దీపింపఁ జేసి వాల్మీకి తన కావ్యాదియం దొనరించిన "రసైః శృంగార కారుణ్య హాస్య వీరభయానకైః" యను ప్రతిజ్ఞను బూర్తిగ నిర్వర్తిం చుకొనియుండ, రామాయణమునందు హాస్యము లే దను పాశ్చాత్య పండితుల వాద మసంగతము ననాలోచిత మని విన్నవించుచున్నాను. రామాయణము వంటి యుత్కృష్ట కావ్యమునం దా కవిబ్రహ్మ నిర్మిం చిన రస సంప్రదాయములను హృదయము లం దుంచుకొని మన యాంధ్ర వాగ్బ్రహ్మలు గూడ నాధునికాంధ్ర వాఙ్మయమునం దుత్తే జకరములగు రస సాధనకుఁ గడంగుదురు గాక, "సాధ్యో హి రసం యథాతథం కవిభిః" యను నన్నయ సూక్తిని మఱవకుందురు గాక యని ప్రార్థించుచున్నాను.

---

ముమ్మడిదేవుల తిరుమల కవి

# గీతరఘునందనము

యస్వీ జోగారావు—ఎమ్. ఏ.



ఆంధ్రసాహిత్య పరిషత్తునఁ గల యపూర్వయక్షగాన కృతులలో నీ గీతరఘునందన మొకటి. ఇది అముద్రితము. పరిషత్సంఖ్య 6. ఇఱువది యంగుళముల నిడివి, రెండంగుళముల వెడల్పును గల నూట డెబ్బదిరెండు శ్రీతాళపత్రముల సంపుటము పుటకుఁ బది పండ్రెండేసి పంక్తులు గలవు. అక్షరములు చిన్నవైనను అందముగా విడి విడిగా విస్ఫుటముగా నున్నవి. వ్రాఁతతప్పులు లేవు. గ్రంథము సమగ్రమైనదే. ఆకులు క్రొత్తవే కాని ప్రబంధ పరిభాషలోఁ జెప్పవలె నన్న కీటకవిటాధముల దంతక్షతాదులచే గ్రంథసుందరి కాయము గాయపడినది చాల. ఇందు బాలకాండాదులు వరుసగా 10, 13, 12, 17, 30, 90 ఆకులుగా నున్నవి. అనఁగా నున్న కాండములలో యుద్ధకాండము పెద్దదగుటయే కాదు గ్రంథమున సగముపైఁగా నదే. కాని యందు సగపాలు చెద పాలైనది.

ఏతద్గ్రంథకర్త ముమ్మడిదేవుల తిరుమలకవి. పరాశర సగోత్రుఁడు. రామచంద్రయతికి శిష్యుఁడు. కవి హరిహరాద్వైతి నని చెప్పికొన్నాఁడు. దక్షిణామూర్తి పేరు ప్రత్యేకముగాఁ బలుతడవలు పేర్కొనినాఁడు. కావ్యము హరి కంకితమిచ్చినాఁడు. ఈతని తండ్రి పేరు గూడ తిరుమలుఁడే. తల్లి లక్ష్మమ్మ. పాప మామె కన్న తిరుమలుని చిన్ననాఁడే కట్టుకొన్న తిరుమలుఁడు గతింపఁగా నానా కష్టములకు లోనై యతనికి విద్యాబుద్ధులు తానే చెప్పించి పెంచి పెద్దఁ జేసిన దఁట. చిత్తూరు కవికుటుంబమునకుఁ జిరనివాసమఁట. ఈ వివరములన్నియు నతని గ్రంథాంత ద్విపదనుండి యెఱుకపడినవి. ఆ ద్విపద పరిషత్పుస్తకభాండాగారము- ప్రథమభాగమున నుదాహరింపబడినది, (చూ. పరిషత్పత్రిక-సం. 3, పుట 368).

కవికాలము: గ్రంథమున లేఖకుని శ్లోక మొకటి కలదు. 'గురువారే ఽక్షయ బాహుల బహుళాష్టమ్యాం స సచ్చిదానందః। గీతరఘునందనం నిజ పితృ తిర్మల రచిత మలిఖ దిదమ్ ॥' పరిషత్పుస్తక భాండాగారమున 'తన తండ్రి యగు తిరుమలకవి రచించిన యీ గీతరఘునందనమును సచ్చిదానందుఁడు వ్రాసె నని యుండుటచేతను, ఈ సచ్చిదానందుఁడు వ్రాసిన యిందలి ప్రతిలోఁ గొన్ని పత్త్రములు చెదలు కొట్టివేసినను బత్త్రములుమాత్రము మాసిపోయినట్లుండకపోవుటచేతను, గడచిన యక్షయ సంవత్సరమునందే (అనఁగా క్రీ.శ. 1866) యీ గ్రంథము వ్రాయఁబడియుండు నని తోఁచుచున్నది. కావున నెట్లయినను గవి యిప్పటికి (ప. పు. భాం. రచనాకాలమునాఁటికి) అఱువది డెబ్బదిసంవత్సరముల నాఁటివాఁ డని నిర్ణయింపఁ దగియున్నది' అని యున్నది. అని యథార్థము కావచ్చును.

గీతరఘునందన మనఁగానే చట్టున గీతగోవిందము స్మరణకు వచ్చును. ఆ పద్మావతీచరణచారణ చక్రవర్తి ప్రప్రథమముగాఁ గళాధిదేవతాకటకఝుళంఝుళ విన్న వేళావిశేష మేమో గాని యతని కృతిలో నాపాతమధురము, నాలోచనామృతము నగు నా మాతృప్రసాదముల రెండుపాలును సరిసమానముగాఁ బడినవి. అది మొదలా యుభయకళాసుభగములైన రసికహృదయము లా కృతికి జోహలు వెట్టినవి. అనుకృతు లనేకము వెలసినవి. అందులో నాంధ్రవాఙ్మయమునఁ జెప్పుకోఁదగినవానిలో నీ గీతరఘునందన మొకటి. కాని రెంటికిఁ బ్రధానభేద మొకటి కలదు. గీతగోవిందము భావప్రధాన మైనది. గీతరఘునందనము కథాప్రధాన మైనది. అనఁగా నన్నెచోడుని మాటలలోఁ జెప్పవలె నన్న గీతరఘునందనము 'వస్తుకవిత' క్రిందకు వచ్చును. గీతిధర్మ మెట్లును ఉభయత్రి యుద్దిష్ట మైన ప్రయోజనమే. అదనముగా నిందుఁ దిరుమలకవితీర్థులవారి కృష్ణలీలాతరంగిణియందువలెఁ బ్రయోజనాంతరమును సాధించినాఁడు. అసలు 'పాఠ్యే గేయే చ మధురమ్' అను యోగ్యతాపత్త్రము సంపాదించిన వాల్మీకి రామాయణకృతి

ననువదించునపుడు కూడ నా మాట దక్కించుట ప్రశంసనీయ మైన విష యము. తిరుమలకవి యీ ధర్మసూక్ష్మమును గ్రహించినాడు. గ్రంథ మును ధారాధోరణీభాసురము లగు దరువులతో, గతిగంభీరము లగు ద్విప దలతోఁ బదపద్యములతో నిర్వచనముగా రచించెను. అసలు వాల్మీకి రామాయణ మనుదినము సర్గపరాయణుఁడై పారాయణచేసినవాఁడు కవి. ఈ గ్రంథమందలి కథాప్రణాళికయు యథావాల్మీకముగనే నడచినది. కవి భోజచంపువును గూడఁ బలుకరింపక విడువలేదు.

ఇఁక రచనానైపుణిని గుఱించి చర్చించుటకు ముందు మన వాఙ్మ యమునఁ గల యేతాదృశగేయకావ్యముల గుఱించి కొంచెము చెప్ప వలసి యున్నది. కవితాగానకళ లెంత కవలపిల్ల లనుకొన్నను బ్రథ మమున శిర ఉదయము గానకళ దని విజ్ఞులందఱు నంగీకరించిన విషయ మే. ఆంధ్రతాముద్రను భద్రపఱచి, ఆంధ్ర వాఙ్మయవ్యక్తిత్వమును నిరూపించు మన దేశిసాహిత్యప్రక్రియ లన్నియు గానకళాత్మకములే. అందు ద్విపదది యగ్రతాంబూలము. దాని నడకల విన్నాణము లెన్నో గేయరీతులకు దారి తీసినది. అది యెత్తిన యవతారము లన్నీ యిన్నీ కావు. ద్విపదకవితాభగీరథుఁడైన పాల్కురికియే చెప్పవలె నప్పటి పదముల పట్టిక. అవి యన్నియు నిప్పు డే మైనవి? మార్గకవితాభార్గవుల ప్రభకుఁ దట్టుకొలేక మరణశాసన మైన వ్రాసికొనకుండ గతించినవి. తదుపరి జంగము కథలలోను, జక్కులపాటలలోను వాని 'వారసత్వ' మగుపించినది. కాని గీతిచ్ఛందోరీతి వైవిధ్యము జంగము కథలలోఁగంటె జక్కుల పాటలలో నధికతరము. చంపువులలో ద్విపద యుండదు, ద్విపద కావ్యములలో గద్యపద్యము లుండవు. ఆ పద్యము, లాగద్యము లా ద్విపదలు, సమకాలికము లగు నితరపదవిశేషము లనేకమునకు, రగడలు, రానురాను రచయితల సంస్కారమును బట్టి రాగతాళధారా శములుగా రూపొందిన దరువులు మొదలగు వానికెల్లఁ బుష్పకవిమాన మైనది యక్షగానము. అసలు యక్షగానరచనము ప్రత్యేకకృషి లేనిదే, నాట్యసంగీతాది బహుళకళాపరిజ్ఞానము లేనిదే కేవలము

సాహిత్యపౌరోహిత్యము చేసికొను మహాకవులకును గలము జరుగని పని. పుట్టినది మొదలు చాల కాలము గ్రామసీమలఁ భామరగాత్రమాత్రోపజీవిగా నుండిపోయిన యక్షగానము శ్రీనాథుని కాలమున వీథిఁ బడి, తంజావూరు సంస్థానమునకు మహాప్రస్థానము గావించిన తరువాతఁ బండితోపజ్ఞమై, రాచవారి నగరి మొగసాలలకు నెగఁబ్రాకినది. కోటలోని రాజుగారికిఁ బేటలోని ప్రజలకును సమానముగా నాదరపాత్ర మైనది. అట్లగుటకుఁ గారణ మది ప్రదర్శనగౌరవముఁ జూఱగొనుటయే. ఆ దక్షిణాంధ్ర యక్షగానములకు నుత్తరాంధ్ర యక్షగానములకుఁ బ్రధానభేద మక్కడనే యున్నది. మొదటి వానిలో నెక్కువపాలు దృశ్యకావ్య ప్రక్రియాప్రకృష్టములు. తంజావూరి కవు లందుచేతనే తమ యక్షగానములకు రూపకసామాన్యవాచిగా నాటక నామకరణము కూడ చేసికొనిరి. రెండవవానిలో శ్రవ్యకావ్యధర్మ మెక్కువ. సంభాషణ లెక్కువైనచో నవి ప్రదర్శన కెక్కును; వర్ణన లెక్కువైనచో నవి పారాయణ కెక్కును. అంతియే భేదము.

గీతరఘునందనమునను సుదీర్ఘసంవాదశైలీచాతురి, నాటకీయసన్నివేశపరికల్పనశిల్పమును గవి చూపియున్నను నిందు పాట పాలెక్కువ యని యీ పేరే చెప్పక చెప్పుచున్నది. అసలు కవి యుద్దేశము నదే కద. జంపె, కుఱుచజంపె, త్రిపుట మొదలగు తాళములలో దరువులు, యాలలు, అర్ధచంద్రికలు, లాలిపాట, శోభనములు, మంగళహారతులు మొదలగు గేయవిశేషములు నిందు గలవు. ద్విపద లధికము. ప్రాయికముగా యక్షగానము లన్నియు ద్విపదప్రచురములే. అసలు యక్షగానరచన కది యధిష్ఠాన మైనది. దీర్ఘద్విపద లనఁగానే ఛందోవైవిధ్య ముండదు, పాఠకునకు విసుగు పుట్టవచ్చు ననవచ్చును. కేవల ద్విపద కావ్యముల విషయమున నది నిజమే కావచ్చును, కాని యక్షగానముల విషయమున నట్లుకాదు. వివిధగేయరచనలతో పాటు ద్విపదనా కవు లౌక ప్రయోజనదృష్టితో, సందర్భసుందరమైన గమకముతో పాడుదురు: అన లన్ని ప్రయోజనములకు ననఁగా వర్ణనలకుఁ గథా

గీ త ర ఘు నం ద న ము

కథనమునకుఁ బాత్రల సంవాదములకు స్వగతములకు నన్నిటికిఁ బనికి వచ్చునట్టిది ద్విపద- ఆ కూర్పునేర్పులు రచయిత కుండవలెఁ గాని, గీత రఘునందన కర్తయు నా ద్విపద నట్లు నడుపు రొుకుపు లెఱిఁగిన ప్రోఢ.

ఏదో యొక సాహిత్యప్రక్రియలో నిబద్ధమై, ఆ కథలో నేకదేశము లగు ఘట్టములను గ్రహించిన గ్రంథముల మాట యటుండఁగా సమగ్రరామాయణములే మన యాంధ్రుల కున్నన్ని మఱెవరికి నుండ వనుకొందును. చంపువులలో భాస్కరాదుల కృతులు, ద్విపదలలో రంగనాథవరదరాజ - ఏకోజీ రామాయణములు, యక్షగానములలో లేపాక్షి, ధర్మపురి, చుక్కలూరు రామాయణాదు లనేక మిదివఱకే ముద్రితములై ప్రసిద్ధి వడసినవి. రచనాగౌరవమును బట్టి గీతరఘునందనము చంపూరామాయణములకు న్యూనము, ద్విపదరామాయణములకు సమానము, యక్షగానరామాయణముల నుత్తమము ననిపించుకోఁ గలదు. అందలి భాష సలక్షణ మైనది, రచన నిర్దుష్ట మైనది. అన్నిటిని మించినది రసప్రసన్న మగు శైలీలాలిత్యము.

గీతరఘునందనమున మొదటి యైదు కాండములలోఁ గథ సంగ్రహింపఁబడినను బ్రతిపాదనవిషయము పెరుపఁబడినది. యుద్ధకాండము నచ్చేసరి- దాని నంతె విపులముగా, నంత నిపుణముగా నిర్వహించిన కవి యోపిక కబ్బపడవలసినదే. తిరుమలకవికి వర్ణనలయం దతిమాత్రమైన ప్రియత్వము, ప్రియత్వమే కాదు వైదగ్ధ్యమును గలవు. అందుల కుదాహరణ:

1. గంగానదీ వర్ణన

ద్వి. 'దేవర్షిగణసేవ్య దీనశరణ్య
పావనపానీయ పరికీర్తనీయ
భువనత్రయారాధ్య పురవైరిధార్య
నవనళినోత్పలనయనమనోజ్ఞ'

'వేధోండ నిర్భేద విక్రమోదార
మాధవాంఘ్రిసరోజమకరంద ధార
తీరద్వయారూఢ దివ్యమహీజ
సారసుమావళీసౌరభాస్వాద్య
రాజదిందిందిరరాజీవరాజి
రాజహంసవతంసరంగత్తరంగ
సాగరపావని సర్వాఘశమని
శ్రీగిరీంద్రతనూజ శ్రితకల్పవల్లి
సిరు లొసంగెడు తల్లి సింధుమతల్లి.'

2. రావణ బాహుదండ వర్ణన :-

'కాంచనమణిమయాంగద సంగతములు
వంచిత రాజర్షి వరవైభవములు
విష్ణుచక్రక్షతోద్భిన్న వర్ణములు
జిష్ణువజ్ర ప్రపంచితలాంఛనములు
ఐరావతోగ్ర దంతాగ్రవిద్ధములు
వారణశుండానువర్తివృత్తములు
దేవదానవముఖ్య ధీరసంఘాత
జీవపీడనకాల చిత్రదండములు
సుందరీసాహస్ర సుఖపరీరంభ
చందనచర్చాది సాధనమ్ములును
సానువుపై సాగిపడియుండినట్టి
దానవేంద్రుని బాహుదండముల్ రెండు
కనదుగ్రఫణపంచకము గల్గినట్టి
ఘనసర్పముల రీతిఁ గనుపించె హరికి
శృంగద్వయంబుతోఁ జెలఁగు మందరము
భంగి బాహువులఁ జూపట్టె రావణుఁడు.'

రావణు నెంతో భీకరముగఁ జిత్రించిన కవులు గలరు. కాని యిట్లు బాహువులు మొదలింత వివరముగా వర్ణించిన కవు లరుదు. అట్లే ఎక్కడో ఎట్టన సూరనాదు లే కొద్దిసుందిమో చేసినట్టిది—

3. సముద్రవర్ణన :—

'ఆ లవణాబ్ధి ఘోరాకారదనుజ
శైల సంకీర్ణంబు చపలప్రచండ
తిమి తిమింగిల నక్ర తీవ్రభుజంగ
గమనాగమన భయంకర జలాకరము
సంగతచంద్రికా సంభృతోత్తుంగ
రంగత్తరంగాంతరంగ భాసురము
చంద్రబింబసహస్ర సౌందర్యపదము
సాంద్రమౌక్తికమణి స్వచ్ఛతీరంబు
విమలశంఖప్రభా విభ్రాజితంబు
రమణీయ వనరాజి రాజితాంతికము.'

ఉపర్యుదాహరణములను బట్టి కవి రచనావైచిత్రియు విశదమైనది.

ఇఁకఁ గొన్ని సన్నివేశములు- అందలి గుణదోషములు :

1. వాలి వధఘట్టము : ఈ రామాయణ పతాకావిష్కరణము చాల మంది కవులు చక్కఁగా నిర్వహించినారు. అందు మన తెనుఁగు యక్షగానకవులలోఁ బేర్కొనఁ దగినవాఁడు సుగ్రీవ విజయకర్త కందుకూరు రుద్రకవి. ఈ సందర్భమునఁ దిరుమలకవి యతనికిఁ దీసి కట్టయినను రామునితోఁ దారమాటలుగా, నవి మాటలు కావు, మనస్సునకుఁ బోటులే, యిట్లనిపించినాఁడు:

'వనజలోచన నీవు సతి నెడఁబాసి యిట్లు శోకించుకై వడి
వనచరేంద్రుఁడు నన్ను గానక కనలు దివినీ॥
మగువ యని మది శంక నొందక మార్గణముతో నను వధింపుము
మగనిలో సతి సగము గావున మలయు శుభమూ॥
దానములలో దారదాన ముదార ఫల మని ధీరు లందురు
కానఁ బ్రియునకు నన్నొసంగుము దీనబంధూ॥''

2. వాలి తరువాత రాజ్యమునకే గాదు తారకును వారసుఁడై సుగ్రీవుఁడు సుఖము మఱిగిపోయి రాముని పనిమాట నేమఱియున్నప్పుడు లక్ష్మణుఁడతని పని పట్టించుటకు బయలుదేఱును. అప్పుడు సుగ్రీవుఁడు మొగమోడుట చూచి తార ముందునకు వచ్చి లక్ష్మణుని సమాధానపఱచి చివర 'మిత్రి తనయునిఁ బ్రోవవె మిత్రి కులజా' అనును. అవి సాభిప్రాయములైన ముక్కలు.

3. రావణుని రాణివాసమును వర్ణించుచు వారతనియెడ నెంతటి యనురక్తిలో చెప్పుచు, నా మధ్య సీతకూడ నున్నదఁట, ఆమెను ప్రత్యేకింపవలసిన బాధ్యత కవి కనఁబఱుచుచు 'మును పురుషాంతరమ్మును బొందినట్టి। వనిత లే దందొక్కవై దేహి దక్క' అని యన్నాఁడు. ఇటుఁ బురుషాంతర సమాసముద్వారా కవి యొక ప్రయోజనము సాధింప నెంచినాఁడు. అది సార్థకముగాదు సరికదా అపార్థ స్ఫూర్తికి దారితీయును.

4. ఒక తెనిద్ర వర్ణించుచు 'పుస్తకమున్నట్లు పొరలక యొకతె' యుండెననుట సందర్భమునకు సరియైన జాతీయత గల యౌపమ్యము.

5. హనుమంతుఁడు రావణుని నిండుసభలో 'దానవేశ్వర నీకుఁ దమ్ముఁడైనట్టి। కీశనాయకుఁడు సుగ్రీవుఁ డంతటను। గౌశలం బని నీకుఁ గడుఁ దెల్పు మనెను' అనుటలో నెంతైన నర్థమున్నది.

6. చూడామణిని జూచిన రాముఁడు

'దాపుదూడను గన్నతఱి గోవుపొదువు
చేపిన లీల నీ సిరు లొందు మణిని
కనిన నా హృదయంబు కరఁగె నే మందు'

అన్నాఁడఁట, సరసోపమ!

7. రావణమాయాపరికల్పితమైన రామశిరస్సును జూచిన సీతమ్మ శోకము.

'హా కలనరమ్నుం డవనిపైఁ గూలె
కైకేయి నీ కోర్కె కడవెళ్ళె నమ్మ

ఖామ నెమ్మది నింక బ్రిదుకవె నీవు

♦ ♦ ♦

ఏ దంపతులను ము న్నెడఁబాపినానొ
నా దేవుఁ డిప్పుడు కన్నడఁ జేసె నన్ను
నన్ను రక్షింప సంద్రము దాఁటి విభుఁడు
సన్నుతయశుఁడు గోష్పదముఁలో మునిఁగె ॥

లక్ష్మణమూర్ఛ సందర్భమున రాముని శోకము నిక్లే హృదయ విదారకముగా వర్ణింపఁబడినది. కవి స్వతః శృంగారరసప్రియుఁ డయ్యు నవకాశ మున్నపుఁ డెల్లఁ గరుణరసప్రశక్తి మగు హూని వాల్మీకి సారస్వతమూర్తి నొక కంటఁ గనిపెట్టుచునే యుండును.

8. యుద్ధాంతమున రాముఁడు సీతతో :
'రమణి నినుంగోరి రణము సేయఁగ లేదు
నా పౌరుషము జూపినాఁడను సుమ్ము'

అని పైఁగా నామె ననుమానించును. సీతవంటి శీలవతి కది భరింప రాని యవమానము. అందుల కామె సమాధానము :

'కుల మెల్లఁ జెడ దొంగకూళ్ళ కాసించి
చిన్నపనుల్ సేసి చీవాట్లుపడిన
మొన్న నిన్నటి అంకుముండల వలెనె
నన్ను జూచెద వేల నా ప్రాణనాథ'

ఇట పదములు పటువులు పడవలసినచోఁ గటువులు పడినవి.

9. ఆజన్మాంతబ్రహ్మచారి హనుమంతునిచే నొకచోఁ సీతాదేవి పర్యంకసి శృంగారవర్ణన చేయించుట కేవల మనుచితము. కావలసినఁ గవియే యందుల కొడి గట్టవలసినది, గ్రుడ్డిలో మెల్ల యనిపించుకొనును.

ఇట్టి యనౌచిత్యము లక్కడక్కడ నీ గ్రంథమునందుఁ గన్పట్టును. కవి పాత్రపోషణమునం దంత ప్రత్యేకదృష్టి పెట్టిన ట్లగుపింపదు. అదే యిట్టి యనర్థముల కెల్ల మూల మనుకొందును. కైకేయిపాత్ర విషయమున మాత్రము, ఆమె 'ప్రాకట మంథరావాక్య పారుష్య ! మునఁ గుపితాత్మ' యైనది కాని స్వతః 'కైకేయి నిర్మల కరుణార్ద్ర

హృదయ' అన్నాఁడు. ఆమె పాత్రను సమర్థించుటకుఁ జాలమంది కవులు, భాస రాజశేఖరాది సంస్కృత నాటకకర్తలును బ్రయత్నించిరి. కాని నెగ్గినవారు కొద్దిమంది. తిరుమలకవిని నెగ్గిన నేర్పరులలోఁ జేర్ప వలనుపడదు గాని యథాశక్తి నా ప్రయత్నము నెఱపిన సత్కవుల నొకఁ డనవచ్చును.

10. సీత యగ్నిప్రవేశఘట్టము— చూడవచ్చిన స్త్రీల చిత్తక్షోభ-

ద్వి. 'జానకి యిల్లాలు సాకేత విభుని
మాటలు విసలేక మానంబుఁ గోరి
ధాటిగా నగ్నిలోఁ దరళాక్షి దుమికె
ని మ్మహిం మగవారి హృదయమ్ము లిఁకను
నమ్మరాదమ్మ జానకి నమ్మి చెడెనె—
అప్పరో సీతమ్మ హా ముద్దుగుమ్మ
నిప్పుల పాలాయె నీ చక్కఁదనము
ఏమె సీతమ్మ నీ యిడుము లన్నియును
రాముఁడు తీర్చెనా రమణిరో నేఁడు
నిక్కంబె పరసతుల్ నీ చక్కఁదనము
చెక్కలపాలుగాఁ జెడఁ దిట్టి రేమొ''

  

ఇట్టి ఘట్టము లెత్తుకొన్న యక్షగానకవులే యెత్తుకొనవలెను. ఇట్టివి ప్రబంధకవుల కందవు. వారికి రాజమందిరమర్మము లేగాని ప్రజాహృదయరహస్యములు పట్టవు, కిట్టవు. నిజమైన ప్రజాకవులు, పదకవులు నీ యక్షగానకర్తలే. ఇటువంటి విషయములనే కా దింక ననేకధా సాటి యక్షగానకవులను జాలమందిని, కొంతమంది ప్రబంధ కవులను నతిశయింపఁగల ప్రతిభావంతుఁడు తిరుమలకవి. అతని గీత రఘునందనము పరిషత్పరిస్థితియే బాగుపడినచో నెప్పటికైన నెల్గుఁ జూడక పోవునా :

అన్నట్లు గీతరఘునందన మనుపేర సంస్కృతమునను నొక్క కృతియున్న దని సన్నగా వింటిని. కాని దానికిని దీనికిని సంబంధ ముండదనుకొందును. కవి చెప్పనే చెప్పినాడు తాను వాల్మీకము పఠనపాఠనములందుఁ గృతశ్రముఁడ నని. శిర సుండఁగా నిఁక మోఁకాలికి మ్రొక్కియుండఁ డని నా నమ్మకము. క్రీ. శ. 1896లో పి. ఆనందాచార్యులను నాయన వ్రాసిన గీతరఘునందన మను తెలుఁగునాటక మొకటి ప్రకటిత మైనదఁట. ఆయనెవరో అధునికునివలె నగపడుచున్నారు. తిరుమల కర్ణాచీనుఁడే కావచ్చు. ఆ గ్రంథము నాకంటఁబడలేదు.

ఓమ్.

# ప్ర శం స.

వోలేటి వేంకటసుబ్బరాయశాస్త్రి.

చ. కవులును బండితో త్తములు
గాయకు లాదిగఁ గల్గు నీ సభా
భవనములోన లక్ష్మియును
భారతియున్ వసియించి సభ్యులన్
బ్రవిమలభ క్తియుక్తుల న
పారముదంబునఁ గాంచి భాషకై
యవిరళసేవ చేయఁ దగు
నట్టి సమర్థులఁ జేయుఁగావుతన్

గీ. శిష్టభాషకు హానిగా దుష్టభాష
తలను బై కెత్తుచును వెఱ్ఱితలలు వైవ
నాంధ్రసాహిత్యపరిషత్తె యవతరించి
రక్షణ మొనర్చె గ్రాంథికప్రభను నిల్పె.

సీ. ఎండకన్నెఱుఁగక యే మూలనో పడి
చీపురుకట్టలై చెదరునాఁడు
వాతాతపములకు వశమౌచు రూపఱి
తలగడ లట్టులు చెలఁగునాఁడు
వానకుఁ దడియుచుఁ బ్రాణాల బిగఁబట్టి
ముదుసలి గోవట్లు మూల్గునాఁడు
క్రిమికీటకములచే ధృతి మాలి ధూళియై
యెండుటాకులమాడ్కి నెగురునాఁడు

గీ. దీన మగు గ్రంథజాలమ్ము దీక్షఁ బూని
తపము సలుపంగ మది మెచ్చి ధాత యొసఁగె
నాంధ్రసాహిత్యపరిషత్తు, నది యపూర్వ
గ్రంథరాశికి దిక్కయి కావఁ దొడఁగె.

సీ. అపురూప మైనట్టి యాంధ్రుల సంస్కృతి
భాషాదివిషయాలఁ బాటుపడుచు
సందిగ్ధవిషయాళిఁ జిక్కుదిద్దెడు తామ్ర
శాసనాదుల కెన్నొ శ్రమలఁ గనుచు
చెదపుర్వులకుఁ జిక్కి శిథిలంబులై యుండు
ప్రాఁతపురాణముల్ బయలుపఱచి
నియమబద్ధం బర్థనిర్ణయం బొనరించు
క్రొత్తనిఘంటువుఁ గూర్చుకొనుచు

గీ. వ్యాసరాజిని బ్రకటించి భాషకెంతొ
సేవ యొనరించు ప్రతిభావిశిష్టమైన
పత్రికను గూడ నడుపు నీ పరిషదంబ
యెల్ల కాలం బితోఽధికవృద్ధిఁ గనుత.

గీ. ఆంధ్రభాషాభివృద్ధికై యహరహంబు
సర్వశక్తులఁ గృషిచేయు సభ్యవరుల
నాంధ్రసాహిత్యపరిషత్తు నాంధ్రప్రజలు
పాలకులు గూడఁ గనిపెట్ట బాధ్యులుగద!

# వ్యాసులవారి దేవయాని-పాత్రచిత్రణము.

కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి.

సభాప్రైమనమః — ప్రతిభా వ్యుత్పత్తు లాధారముగ—రసోద్రేక కల్పనావైశిష్ట్యము గలిగి, సహృదయంగమముగా వ్యక్తీకరింపఁబడిన వచస్సమూహసమాహారస్వరూపమే వాఙ్మయము. కొన్ని గుణవిశేషములను బురస్కరించుకొని సాహితీవేత్తలు వాఙ్మయమును గొన్ని శాఖలుగా విభజించిరి. ఐతిహాసిక, పౌరాణిక, ప్రాబంధిక, నాటకీయ శాఖ లందు ముఖ్యములు. కాలక్రమమున నవల - నాటిక - కథానిక—ఖండకావ్యములు బయలుదేరినవి. మిగిలిన శాఖ లన్నింటికిని బీజము లితిహాసములయందుఁ గలవు. భారతీయవాఙ్మయమున మహేతిహాసము భారతము. కర్త శ్రీకృష్ణద్వైపాయనులవారు. వారికే వ్యాసులవా రని నామాంతరము— పురాణములందుఁ గథాకథనము ముఖ్యము. ప్రబంధములందు వర్ణనలకుఁ బ్రాధాన్యము హెచ్చు. నాటకములందుఁ బాత్రచిత్రణేత్యాదిశిల్పము గమనింపఁదగిన విషయము. వీని నన్నింటిని దనయందిమిడ్చికొనినవాఁడే ఐతిహాసిక వాఙ్మయనిర్మాత కాఁగలఁడు. లేనిచో నితిహాసము రక్తి గట్టదు. భారతేతిహాసమును నిర్మించిన శ్రీకృష్ణద్వైపాయనులు బ్రాహ్మీమయమూర్తి. ప్రస్తుతము వారి పాత్రచిత్రణకౌశలమును దర్శించుటయే మన పని.

మన స్తత్త్వము వ్యక్తినిష్ఠము. అది చాల విచిత్ర మైనది. వ్యక్తి నుండి వ్యక్తికది మాఱును. స్థూలదృష్టికిఁ గొన్నిచోటులఁ గనుపించక పోయినను సూక్ష్మపరిశీలనమువలన వైవిధ్యము స్ఫురించును. దీనిని బట్టియే వ్యక్తియొక్క ప్రవర్తనాదికము లుండును. ఇవి క్షణక్షణ భిన్నములును, పరస్పరవిరుద్ధములును గావు. వీనియందు సూత్రప్రాయముగా నెడతెగనితన మొకఁడు ప్రస్ఫుటముగా నుండును. నశ్వరభావావేశమునఁ గొంత వైలక్షణ్యము గోచరించినను, వ్యక్తిని నిముఁద్రాటఁ బోనిచ్చి

గమనించినచో సమత కనుపించును. ఇట్లు భిన్నములైన మనస్తత్త్వము లతో నున్న వ్యక్తులను శాస్త్రజ్ఞులు స్థూలముగా, మూఁడువిధము లని విభజించిరి. (1) Instinctine character (2) Emotional character (3) Sentimental character రెండవ దానిని 'ఉద్రిక్తపాత్ర' అని నేను వ్యవహరింతును. దీనియందు మిగిలిన రెండింటికంటెను విశిష్టత-భిన్నత గోచరించును. ఈ పాత్రములు శక్తములు. మిశ్రితభావసంయుత ములు. ఈ పాత్రల కృత్యములు క్రమవిరహితములు—స్థైర్యాభావములు నిరాటంకములు — అయి ఆశ్చర్యజనకములుగా నుండును.

దేవయాని యుద్రిక్తపాత్ర. పాత్రల శీలస్వభావాదులను మాఱుచు శక్తి మనస్తత్త్వమునకుఁ గలదు. అది పరిసరవాతావరణానుగుణముగా శక్తిమంత మగును. అసలు వాఙ్మయమునఁ బాత్రచిత్రణము రెండు విధములు. జీవితమందలి విశేషఘట్టములను వర్ణించుట మొదటిది. వాఙ్మయశిల్పమున కనుగుణమైన జీవితమందలి ప్రతి యంశమును వర్ణించుట రెండవది. వాఙ్మయశాఖావైశిష్ట్యమునుబట్టి యీ పద్ధతు లవలంబింపఁబడును. ఇతిహాసములందు మొదటిమార్గమే యనుసరణీయము. ఏల నన, అందు కథ విశాలము. ప్రధానకథాసూత్రముతో నే మాత్రము సంబంధ మున్న ప్రతిపాత్రయుఁ బ్రవేశించి తనవ్యక్తిత్వమును నిలుపుకొనవలయును. ప్రధానకథాగతి కాటంకములుగా నీ పాత్రలు నిలువరాదు. అట్లని ప్రవేశమును దొలఁగించరాదు. కనుక జీవితమందలి విశేషఘట్టములను బ్రదర్శించుట చాలును. దేవయాని యట్టిపాత్రలలోఁ జేరును. భారతమునకు కౌరవ-పౌరవులకథ ప్రధానము. పౌరవులకు మూలపురుషుఁడు పురువు. వాని సవతితల్లి యనవచ్చును దేవయానిని. నిజమునకుఁ బ్రధానకథతో సంబంధ మంతగా నామెకు లేదు. ఆమెయుండుటవలననే పురువునకు స్థిత్వ మేర్పడినది. కనుక దేవయానికి భారతకథతోఁ బ్రత్యక్షసంబంధము లేకపోయినను బరోక్షమునఁ బ్రాధాన్యము గలదు.

శ్రీకృష్ణద్వైపాయనులామె జీవితమందలి మూఁడు ఘట్టములనే చిత్రించినారు (1) కచునితోఁ బ్రణయము (2) శర్మిష్ఠతోఁ బంతము. (3) యయాతిపట్లఁ తిరస్కారము. మొదటిదానివలన రెండవది — రెండవదానివలన మూఁడవది సంభవించినవి.

మొదటి మారుగా దేవయానిప్రశంస దేవలోకమున వచ్చినది. మృతసంజీవని దెచ్చుటకు శుక్రాచార్యులయొద్దకుఁ బంపుచు దేవతలు "త మారాధయితుం శక్తో భవాన్ పూర్వావయాః కవిమ్. దేవయానీం చ దయితాం సుతాం తస్య మహాత్మనః। త్వ మారాధయితుం శక్తో నాన్యః కశ్చన విద్యతే। శీలదాక్షిణ్యమాధుర్యై రాచారేణ దమేన చ। దేవయాన్యాం హి తుష్టాయాం విద్యాం తాం ప్రాప్యసి ధ్రువమ్," అని కచునితోఁ జెప్పిరి. దేవయానిని దుష్టి నందించవలసినదిగాఁజెప్పుటలో విశేషము గలదు. ఉశనునియొద్ద నున్న మృతసంజీవని బడయుటకు వాని కుమార్తె నేల సంతుష్టిపఱుపవలయు ననఁగా దేవయాని సంతుష్టి శుక్రునకుఁ బ్రిధానము. అనఁగా నామెను సంతోషపఱచుటయే వాని జీవితపరమావధి. కనుకఁ గచుఁడు ముందుగా దేవయానిని సంతోషపెట్టి యామె మనసున కెక్కినచో నెప్పుడో యొకనాఁడు కచుని రాకలోఁగల యుద్దేశ్య మామెకుఁ దెలియక తప్పదు. ఆ యుద్దేశ్యము తన తండ్రివద్ద నున్న మృతసంజీవని విద్య బడయుటయే కనుక ఆమె కచున కా విషయమున సహాయము చేయఁగలదు. అనఁగాఁ దండ్రితోఁ జెప్పి యిప్పింపఁ గలదు. అసలు శుక్రుఁడు మృతసంజీవని కచున కొసఁగుట విచారింపఁదగిన విషయము. ఏ మన దేవదానవయుద్ధములందు మరణించి దానవులను శుక్రుఁడా విద్యవలన బ్రతికించుచున్నాఁడు. దేవతలును దానిని కోరియే పంపిరి. దేవతల కా విద్య యున్నచో దానవులను సులభముగా జయింప వచ్చును. కాని శుక్రుఁడు దానవపక్షపాతము గలవాఁడు. అతఁడు సురాచార్యుఁడు. ఆ విద్య కచున కొసఁగినచోఁ దానుగా దానవులను సంహరించినట్లు స్వామిద్రోహము. అటువంటి బలవత్తరమైన విద్యను సహితము దేవయాని సంతోషముకొఱకుఁ బరుల కిచ్చుటకు శుక్రుఁడు సం

సిద్ధుఁ డని దేవతలకుఁ దెలిసిన దనుటవలన శుక్రునకు దేవయాని పట్లఁ గల వాత్సల్యము మమకారము పాఠకు లూహించుకొనవలసిదే గాని వ్రాయ నలవి గాదు. తండ్రియొక్క స్థితినిగూడ గమనింపక యామె మంకుపట్టు పట్టి యైనను దండ్రిచేతఁ దాను దలఁచినకార్యము చేయించుట లక్ష్యము. ఇందువలన శుక్రున కామెయందుఁ గల మమకార మామె నదుపాజ్ఞల లో నుంచక, ఎంత విశృంఖల మొనరించినదియు స్పష్టమే. అట్టి విశృం ఖలత యొకనాఁడు జనించదు. చిన్నతనమునుండియు నామె కది యల వాటై యుండవలయును. తల్లి యైనను గొంత కట్టుబాటులో నుంచ లేదా యనిన, తల్లియే యున్నచో నింతదూరము తండ్రినిగూర్చియే ప్రసం గింప నేల ? మాతృవియోగమువలన దేవయాని బాల్యమునుండియు, సహజ మైన వాతావరణమునుండి దూర మైనది. పిల్లలను బెంచుకొను విషయమునఁ దల్లిదండ్రు లిరువురును గొంత కొంత భారము వహింప వలయును. అందును దల్లి యధికముగా జాగరూకత వహింపవలయును. తల్లి పెంపుడువిధానమే బిడ్డ భావిజీవితమును దీర్చి దిద్దును. దేవయా నికిఁ దల్లియే లేదు. ఇఁక నామె విషయమును జెప్పవలసిన దేమి? తండ్రి పెంపకమువలన రా వలసిన పెంకెతనము- ఆభిజాత్యము- ఉద్రేకము మొదలైన గుణవిశేషము లన్నియు నామెకు సంక్రమించినవి.

కచుఁడు శుక్రునియొద్దకు వచ్చినాఁడు. శిష్యుడై నాఁడు. నృత్య గీ తాదులచేతను, ఫలపుష్పములచేతను దేవయానిని సంతోషపెట్టుట మొద లిడినాఁడు. అసూయాపరు లైన రాక్షసు లొకనాఁడు కాననమున నొం టరిగా నున్న కచుని జంపి వృకములచేతఁ దినిపించిరి. సూర్యుఁడ స్తమించి నాఁడు. గోవు లింటికి వచ్చినవి. కచుఁడు రా లేదు. దేవయానికిఁ దోఁచ లేదు. తండ్రికడ కేఁగి విషయము విన్నవించుకొని "త్వం వినా న చ జీవే యమ్" అనినది. కచుఁడు లేనిచోఁ దాను బ్రతుకలేకపోవుట యేమిటి? కచుఁడు పురుషుఁడు. ఆమె స్త్రీ. ఒక పురుషుఁడు లేనిచో నొక స్త్రీ బ్రతుకలేకపోవుట, ఆ స్త్రీకి, ఆపురుషు డాలంబన మైనచో సంభవించును. ప్రస్తుతము దేవయాని మాటలను బట్టి తనకుఁ గచుఁ డాలంబన మనియు- అతఁడు లేనిచోఁ దాను బ్రతుకఁజాల దనియు స్పష్టము. అనఁగా నామె

వానిని ప్రేమించిన దనుట యింతవఱకు నా విషయమును వ్యాసులవారు పేర్కొన లేదు. కాని యీ ప్రేమ హఠాత్తుగాఁ బుట్టియుండదు. కొంతకాల మునుండి యామె హృదయమున నుద్భవించి ననలు తొడుగుచుండవలె నా ప్రేమలత. లేనిచోఁ బ్రస్తుత మా మాట యామె పలుకలేదు. అవస రమును లేదు. తుదకు శుక్రుఁడు కచుని బ్రతికించినాఁడు.

మరల నొకమారు రాక్షసులు కచుని జంపి బూది చేసి సురలోఁ గలిపి శుక్రాచార్యునిచేఁ ద్రాగించుటయు-దేవయాని కోర్కె ననుసరించి మృతసంజీవని విద్య కచున కుపదేశించి శుక్రుఁడు తనను, కచుని బ్రతి కించుకొనుటయు జరిగినది. కచుఁడు వచ్చిన పని పూర్తి యైనది. కనుక దేవలోకమునకుఁ బయనమైనాఁడు. ఈ విషయమును దేవయాని కెఱుక పఱచినాఁడు. ఆమె తన మనోగత మైన యభిప్రాయమును వ్యక్తము చేసినది. కచుని కట్టి యూహ లేదు గనుక నాతఁడులిక్కిపడి వెంటనే గురుపుత్రి సహోదరి యనినాఁడు. ఆ మాట కామె మనసు చివుక్కు మని నది. వానినుండి యట్టి సమాధానము నామె కలలోనైనను శంకించి యుండలేదు. కచుఁ డనిన మాట శల్యమువలె హృదయమున గ్రుచ్చు కొనినది. తనను గా దనుచున్నాఁడు కచుఁడు. ఇతః పూర్వ మామెను గా దనినవారులేరు. అమె చెప్పినది కాదనఁబడఁగల దనిగూడ నామె కంతకు బూర్వము తెలియదు. తండ్రి యామె నా విధముగా పెంచినాఁడు. తనను కచుఁడు మాత్రము నిరాకరించినాఁడు. వానియందుఁ దనకుఁ గల యను రాగమును- సౌహార్దమును వ్యర్థము లైనవి. ఆమె కాగ్రహ మువికి వచ్చినది. విద్యవలన రా వలసినది సంస్కారము. దేవయాని తలఁచిన సంస్కారము కచునిలో లేదు. కనుక నామె కచునితో 'నీ చదువువలన నీకు ఫలితము కలుగ దనెను. అదే వానికి శాప మైనది. వానికిని నాగ్ర హము వచ్చినది. ఇంత శ్రమపడి యా విద్యనుగైకొని దివి కేఁగుచున్న తనలో నీ యపశకునపుఁ బలుకు దేవయాని పలికినది. శుక్రుని కూతు రు. జ్ఞాని. సహోదరు తుల్యుని ప్రేమించుట జుగుప్సాకరము. ఆమెకే గాదు. ఆమె కులమునకే తలవంపులు. కనుక నామెతో కచుఁడు 'కుల

మర్యాద నైనను పాటించని నిన్ను కులమువారు పెండ్లియాడ'రనినాఁడు. ఆమెకు శాపము. కచుఁడు దేవలోకమున కరిగినాఁడు.

మొదటి ఘట్టము ముగిసినది. ఈ విషయమున ఉద్రిక్తపాత్ర వీఁగినది. ఒక విషయమున నపజయమును స్వీకరించినను, ఆపాత్ర యంతటితో నిలువదు. మరొక దానికిఁ బ్రాఁకులాడును. విజయమును సాధించవలయు నను బట్టుదల యుద్రిక్తపాత్రములం దధికముగా నుండును. దేవయాని విషయమును నంతియ. అపజయమునఁ గృంగిపోవలసియుండగాఁ దేరుకొని పురోగమించుట యాశ్చర్యమును గలిగించక తప్పదు. మన మనుకొను నట్లు లుద్రిక్తపాత్రజీవితము గడువదు. నిమ్నోన్నతము లా జీవితమునఁదఱచు సంభవించును. ఇఁకఁ గచుని విషయమా మెకుఁ బట్టదు. జరిగిన దేదో జరిగినది. లేనిదానికిఁ బోయినదానికి వగచుట సునిశితమైన దూరాలోచనలేకపోవుట. తనను దిరస్కరించిన కచుఁడు వెళ్ళిపోయినాఁడు. ఇఁక దన నెవ్వరును దిరస్కరింపరాదు. అందఱును దనను గౌరవించవలయును. ఆ విధముగాఁ దాను చేసికొనవలయును. తనకుఁ దన తండ్రియండుఁ గలదు. ఆభిజాత్యము మూర్తీభవించినది. ఇప్పటి మనోవికార మొకవిధము. ఈ మనోవికారములే జీవితమున గొప్ప మార్పులు కలిగించును. స్థూలదృష్టితోఁ జూచిన మనోవికారములు రెండు రకములు. (1) అనురాగమయము. (2) అసూయామయము. మొదటిదానికి స్థైర్యము-సౌఖ్యము-మంచి మనుగడ ఫలితములు. రెండవదానివలన విచ్ఛిత్తి- భిన్నత - వ్యసనము- దుఃఖము- నైచ్యము సంభవించును. ఈ మనోవికారములు ఆత్మసంయమనమువలన నవధులు దాఁటకయుండును. ఈ సంయమన ముద్రిక్తపాత్రల కుండదు. కనుక మనోవికారములు విజృంభించును. వాని విజృంభణము ననుసరించియే పాత్రయుండును. దేవయానికి ననురాగమయమైన మనోవికారము కచునితో నశించినది. ఇఁకఁ బ్రకోపించినది యసూయామయము. జీవితాంతమువఱకు నున్నది. శర్మిష్ఠవిషయమున నీ మనోవికారము బాగుగాఁ బలిచేసినది. శర్మిష్ఠ దేవయానిని బావిలో నెట్టినది

(వస్త్రములవిషయమునస్నైన కలహము కారణము—) నెట్టుటయేగాక తనను దండ్రిని నాశ్రయించుకొని బ్రతుకువారిగా నిరూపించి పలికినది. నిజమునకు శుక్రుఁడు శర్మిష్ఠ తండ్రియు, రాక్షసరాజును—ఐన వృషపర్వుణునియొద్ద నాచార్యుఁడేయయినను శర్మిష్ఠమాటలు దేవయానికిసహింపరానివైనవి. ఆమెను నోదార్చి పురమునకుఁ గొనిపోవుటకువచ్చిన శుక్రునితో నామె పలికిన "వాగ్దురుక్తం మహాఘోరం దుహితు ర్వృషపర్వణః మమ మథ్నాతి హృదయమ్ అగ్నికామ ఇవారణిమ్. న హ్యతో దుష్కరతరం మన్యే లోకే ష్వపి త్రిషు, య స్సపత్నశ్శ్రియందీప్తాం హీనశ్రీః పర్యుపాపతే। మరణం శోభనం తస్య..." అనువాక్యములు గమనింపఁదగినవి.

ఆమె రాక్షసరాజు రాజ్యములో నడు గిడుట కంగీకరింపలేదు. శర్మిష్ఠను సాధించవలయును. చెలికత్తెలతోఁగూడి గర్వమునఁ దనను నూతఁ ద్రోసి చనిన శర్మిష్ఠ తనకు దాసి గావలయును. ఈ విషయమును దానుగా నేల బయటపెట్టవలయును? తండ్రిని రాజ్యము వదలి రమ్మని నచో రాక్షసరాజు గుండె నీ రగును. అతడే కాళ్లబేరమునకు వచ్చును. అపుడు చూచుకొనవచ్చును. అనుకొనినట్లు వృషపర్వుణుఁడు వచ్చి నాఁడు. దేవయానిని బ్రాథేయపడినాఁడు. ఆమె "దాసీం కన్యాసహస్రేణ శర్మిష్ఠా మభినేమయే" అనినది. అతఁ డంగీకరించినాఁడు. శర్మిష్ఠదాసి యైనది దేవయానికి. ఈ సందర్భమున నుద్రిక్తపాత్ర జయించినది. అనురాగమున నోడినది. అసూయతో నెగ్గినది. ఇట్టి విజయముతో నసూయ నశించలేదు. కారణమే మన శర్మిష్ఠ తన కందుబాటులో నున్నది. అసూయ యభివృద్ధియగుచునేయున్నది. అనురాగము నశించుటకుఁగారణము కచుఁడు తననుండి దూరమైనాఁడు.

తరువాత యయాతితో దేవయానికి వివాహమైనది. శర్మిష్ఠ కన్యాసహస్రయుతముగా నామె ననుసరించినది. శయనవిషయమున శర్మిష్ఠను బరిత్యజించ మని శుక్రుఁడు యయాతికిఁ జెప్పినాఁడు. దేవ

యాని యయాతితోఁ గొంతకాలము సంసారసుఖ మనుభవించినది. యయాతిపట్ల నామెకుఁ దిరస్కారభావము కలిగినది. కారణము యయాతివలన శర్మిష్ఠకు సంతానము కలుగుటయే. యయాతి తనను వంచించినాఁడు. శర్మిష్ఠతో సంగమము—వినరానిది. తాను బట్టుదలమీఁద దాసిగాఁ జేసికొనినదానితోఁ దనభర్త సంగమించుటయా? తనకుఁ దలవఁపులు. దాసీసంగమము నీచము. తనకుఁ గూర్చు భర్తయే దాసీజనముతో — సరసములకును, సంగమమునకును దిగినచోఁ దనకు గౌరవము నశించినట్లే. ఇఁక వారు తనను లెక్కచేయరు. ఇంతబ్రతుకు బ్రతికి యింటివెనుకఁ జచ్చునట్లు దాసీజనముచేతఁ బరిహసింపఁబడుటయా తాను? వలనుపడదు. దీనికిఁ దగిన ప్రతీకారము చేయవలయును. ముందు యయాతికి బుద్ధి వచ్చునట్లు చేయవలయును. భర్తయైనమాత్రమునఁ దన యిష్టమును బరికింపక సంచరించుట యయాతికిఁ దగదు. భార్యను గించపఱుపవలయు నని ఎచటఁ గలదు? ఇరువురును వ్యక్తులే. ఎవరి వ్యక్తిత్వము వారి కున్నది. దండింపవలసివచ్చినచోట భర్తనైనను దండింపవలసినదే. తనపైఁగల పగను దీర్చుకొనుటకు శర్మిష్ఠ యయాతిని వలలో వేసికొనుటకు యత్నించినది. ఆ యత్నము కొనసాగనీయరాదు, అందు కనియే దేవయాని తండ్రికడ కేఁగి సత్యమును విన్నవించుకొన్నది. ఆమె ననుసరించియే వెళ్లినాఁడు యయాతి. శుక్రుఁడును గూతురి దైన్యమును గాంచి క్రుంగిపోయినాఁడు. యయాతిపై నాగ్రహము వచ్చినది. యౌవనమదమునఁ జేసిన దుష్టచేష్ట సహింపరానిది. కనుక కారణభూతమైన యౌవనమే పోవలయును. అనఁగా ముసలితనము రావలయు ననుట. ఈ మాట శుక్రుఁడు పలికినాఁడు. నిజమునకు, యయాతిని శపించినట్లున్నను, ఫలితము దేవయానికే చెందును. ఆ సమయమున శుక్రుఁడీవిషయమును గమనించలేదు. దేవయానియు నివ్వెఱపోయినది. యయాతి కోర్కెపై విమోచనమును సూచించినను శుక్రుఁడింతటితో దేవయాని ప్రస్తావన ముగిసినది. ఈ విషయమున దేవయానికి గెలుపో — ఓటమియో శ్రీకృష్ణద్వైపాయనులు నిరూపింపలేదు. ఇటు

తరువాత శర్మిష్ఠపట్ల యామె ప్రవర్తనమును మనకుఁ దెలియదు. కాని యామెతత్త్వమునుబట్టి యూహించినచో శర్మిష్ఠపైఁ దనకుఁగల యాగ్రహమును—అనేకవిధముల వ్యక్తము చేసి—ఆమెను రాచి అంపానఁ బెట్టియుండును.

జయాపజయములలో నేది యీ పాత్రవిషయమున జరిగినది యను ప్రశ్నయు—సమాధానమును—అనవసరములు. ఏలన నసూయామయ మైన మనోవికారముతో దుఃఖమునకుఁ బాల్పడి—సుఖమునకు దూరమై—కేవలము మంకుఁదనముతో — క్షణక్షణము ప్రవృద్ధ మగుచున్నయుద్రేకముతో జీవితమును గడిపిన పాత్రకు జయాపజయములు పాఠకులే యూహించుకొనవచ్చును. దేవయాని యొక విధమైన వ్యక్తి. ఆమె కామెయే సాటి.ఆమె దొక విలక్షణమైన స్థానము.

ఇట్టి పాత్రను సృష్టించుటవలన భారతమునసాధింపఁబడిన ప్రయోజనము కొంతె తెలియవలయును. శుక్రునకు నీమె ప్రాణముకంటె ప్రియమైన వస్తు వగుటవలననే, దేవతలకు,దుస్సాధ్యమైన మృతసంజీవని లభించినది. అనఁగా దేవతల కార్యసాఫల్యమున కీమె యుపకరించినది. కాని దేవతల యుద్యమ మీామెను గష్టముల పాలొనరించినది. అస లామె యుదిక్తపాత్ర యగుటచేతనే దేవత లామెను నుపయోగించుకొనుట యుచిత మని తలఁచిరి. అనఁగా శుక్రునియొద్ద నామె యునికి దేవతలకు మేలు గూర్చిన దనుట.కచుఁ డామె కొసఁగిన శాపమువలన బ్రాహ్మణుఁడు వివాహ మాడడు. కనుక దేవయాని యయాతిని బరిణయ మాడినది. యయాతి క్షత్రియుఁడు కనుక వర్ణసంకర మేర్పడి నట్లే, కాని శుక్రుఁ డధర్మ నివృత్తికి వర మొసఁగినాఁడు.కాని వీరి సంతానమునకు వర్ణసంకరదోషము తప్పుట యెట్లు? వారు యయాతి యనంతరము రాజ్యమునకు వచ్చినచో రాజవంశమే ముందు వర్ణసంకరమునకు దారి తీసినట్లు. ఆర్షసంప్రదాయమున కది విరుద్ధము. ఇట్టి విరుద్ధము జరుగకుండ మునుముందు, దేవయాని యసూయామయమైన మనోవికారము శర్మిష్ఠను లొంగఁదీసికొనినది. ఆమె రాచబిడ్డ శర్మిష్ఠను

దాసిగాఁ జేసికొను సందర్భమునఁ గేవలము దేవయాని యాభిజాత్యమే పనిచేసినది, దేవయానితోపాటు యయాతినగరమును బ్రవేశించిన శర్మిష్ఠకుఁ గొంతకాలమునకు యయాతివలన సంతానము కలిగినది. ఈ విషయము దెలియఁగనే దేవయాని యుడికిపోయినది. ప్రశాంతముగా నామె విషయమును బరిశీలించలేదు. తండ్రికడ కేఁగినది. అతఁడు యయాతిని శపించినాఁడు. మరల శాపవిమోచనము చెప్పెను యయాతి ముసలితనమును స్వీకరించి, యౌవన మొసఁగినవాఁడే రాజ్యమున కర్హుఁడగును. దేవయాని పుత్రు లందుల కంగీకరింపలేరు. శర్మిష్ఠ పుత్రుఁడైన పురు వంగీకరించినాఁడు. రాజ్యము వాని కైనది. కనుక వర్ణసంకరము తప్పినది. దేవయాని పుత్రకుఁడొకఁ డంగీకరించినచో మార్పు వచ్చెడిది. కాని తల్లి గుణగణములు సంతానమునందుఁ బ్రతిఫలించుట వింతగాదు. దేవయానివలెనె యామె సంతానమును బూర్వాపరసంబంధ మైన యాలోచనకు దూరము.

శ్రీకృష్ణద్వైపాయనులు చిత్రించిన దేవయాని పాత్రయందలి విశేషమును నా శక్తిననుసరించి విశదీకరించితిని. ఈ విషయము పండితు లెఱుంగన దని గాదు. నాకును దెలియునని విన్నవించుకొనుటయే యుద్దేశము. ఇందలిదోషములను విజ్ఞులు మన్నించెదరుగాక! ఈ యుపన్యాసమున కీ సదవకాశము నాకు కల్పించిన ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకును—తదితర యధికారవర్గమునకును గృతజ్ఞుడను. వారికి మత్కృతనమోవాకములు !! —

---

# ఆముక్తమాల్యద—రాయలవారి యాంతర భావములు

దివాకర్ల వేంకటావధాని బి. ఏ. ఆనర్సు

కావ్యరచనోత్సుక్యపూరితుఁడైన కవి తన హృదయము నెక్కువగా నాకర్షించు కథను వస్తువుగా స్వీకరించును. ఆ వస్తువును బహుముఖముల విన్యసించునప్పు డాతఁ డందలి పాత్రల చిత్తవృత్తులను మనోగత భావములను సందర్భానుగుణముగాఁ జిత్రించును. ఆ భావములు వివిధవ్యక్తులు వివిధ సన్నివేశములలో నెట్లు వర్తింతురో తెలుపునట్టివే. కాన యన్నియును గవికి నైజములు కాఁజాలవు. అనఁగా నవి యా పాత్రల స్వభావములను వలెఁ గవి స్వభావమును వెల్లడింపఁజాలవు. కాని యొక్కొక్కప్పుడు కవి కావ్యస్థము లైన కొన్ని పాత్రల ముఖమున నుండి వారిమాటల ద్వారా తనహృదయభావములను వ్యక్తము చేయుచుండును. ఇట్టి పద్ధతి దృశ్యకావ్యములలో వలెనే శ్రవ్యకావ్యములందును నెడనెడ గోచరించుచునే యుండును. ఏవంవిధములైన సన్నివేశములను బట్టియుఁ గావ్యమున నచ్చటచ్చటఁ గానవచ్చు నర్థాంతరన్యాసాదులను బట్టియుఁ గావ్యకర్త యాశయములను నాంతర విశ్వాసములను గుర్తించుట కవకాశ మేర్పడుచుండును. ఇట్టి యవకాశమును బురస్కరించుకొని యాముక్తమాల్యదలో రాయలవారు ప్రకటించిన నైజభావముల నీ వ్యాసమున సూచింప యత్నించెదను. జ్ఞానము లోకమున రెండు విధములై కానవచ్చును. అం దొక్కటి విజ్ఞవిరచితములై విజ్ఞానవారాన్నిధు లనఁబరఁగు నుత్తమము లైన గ్రంథములఁ బఠించుటచే లభించునట్టిది. రెండవది కేవల మనుభవసిద్ధ మైనట్టిది. గ్రంథమూలమున జ్ఞానలాభము నొంది దాని నాచరణ సామర్థ్యముచేఁ బరిపక్వత నొందించువారు పరమపుణ్యాత్ములు. వారి నెవ్వరు నే విధముగను నాక్షేపింపఁజాలరు. కొందఱు బహుగ్రంథనిక్షిప్తజ్ఞానభాండారముఁ జూఱఁగొని

దానికి వివరణ వ్యాఖ్యానములు కావించుటలోఁ గడుం గడు నేర్పరులయ్యు నిజజీవితముల దాని ననుసంధించుట కించుకయు శ్రద్ధ వహింపరు. వీరిది వట్టి పుస్తకజ్ఞానము. వీరు నేర్చిన విద్యకును గడపు జీవితమునకును సంబంధమే యుండదు. మఱికొంద ఱట్లుగాక విద్వజ్జన శుశ్రూషచేతను, జన్మాంతర వాసనాపరిపాకముచేతను విమలమైన జ్ఞానము నార్జించి నిరక్షరాస్యులయ్యు నిత్యశుద్ధమైన జీవితమును బుచ్చుచుందురు. వీరిది విద్యలేని విమలజ్ఞానము. రాయలవారి కిట్టి జ్ఞానముపై నాదర మెక్కువ. విద్వత్త్వాజన్యమై యాచరణశూన్యమైన జ్ఞానముకంటె విద్వత్త్వారహితమయ్యు ననుభవసిద్ధమైన జ్ఞాన మెన్నోమడుంగుల గరీయ మని యాయన విశ్వాసము. విష్ణుచిత్తుఁడు ఛందోబృందములందలియుఁ దదంతములందలియు వాక్కులఁ బఠించినవాఁడు కాఁడు. అపఠితశాస్త్రగ్రంథ జాత్యంధుఁడు. అయ్యు నాతఁడు పరమేశ్వరు ప్రసాదబహుజననకృత సుకృతఫలరూప యగు నాచార్యకృప ప్రకృతికంటెఁ బరుండగు తన్నును దనకంటెఁ బరుండగు పరమేశ్వరుని గుప్తదానంబు నిధానంబుఁ దెలిపినగతిం దెలుపఁగా నాత్మీయ తదీయ శేషశేషిత్వసంబంధం బనాద్యంబుగాఁ దెలిసి యఖండనిర్వృతిం గాంచి సుఖించుచుండెను. అతనికి వేద వేదాంతజన్యమును నిష్పందమునైన ద్వైతజ్ఞానము కరతలామలకమై యుండెను. ఈ జ్ఞానగరిమచేతనే యాతఁడు పాండ్యరాజ సభలో వైదుషీ సింధువులైన విద్వాంసుల నెందఱినో యోడించి, యన్యమతముల ఖండించి, వైష్ణవమతపారమ్యమును నిరూపింపఁ జాలెను. ఇట్లే హీనకులుండును ననభ్యస్తశాస్త్రుఁడునైన మాలదాసరి సర్వజ్ఞుఁడైన బ్రహ్మరాక్షసునకుఁ దన జ్ఞానగరిమచే విస్మయము కలిగించి వికృతరూపవిముక్తి ప్రసాదించెను. పై రెండు కథలును రాయలవారికిఁ బాండిత్యాభిభవము లేకయుఁ బరమజ్ఞానమునకు నిధానములైన భక్తవరేణ్యులపైఁ గల యాదరమునకు నిదర్శనములు. అట్టి పరమయోగులకు బహుక్లేశదంబు లగు చదువులవలనఁ బని లేదనియుఁ, దపస్సత్యశమదమాది లబ్ధము కాని జ్ఞానము నిష్ప్రయోజన మనియు, శాస్త్రంబులెడ

నధీతిబోధంబులు తక్క నాచరణప్రచారంబులు లేని విజ్ఞానము ధర్మదూరమనియు నాయనకు మాఱని యభిప్రాయము. ఈ విషయమునే యాయన బ్రహ్మరాక్షసుని నోట "చంపకు చదువుల మేము పఠింపని శాస్త్రములె, మా పఠింపని శ్రుతులే, యింపవని" యనియుఁ "నిదురయుఁ గూడుఁ బోఁ జదివి నే నిటఁ గన్నది యేమి, యెవ్వఁ డీ చదువుల యర్థవాదపు మృషల్విని బేల్పడు" ననియు షష్ఠాశ్వాసమున వాచ్యముగాఁ జెప్పించెను. సౌవీరభూరమణుఁ డగు రహూగణునకు గౌరవం బంగీకరించి పరమార్థము బోధించి ముక్తి కనిచిన భరతభూమీసురవతంసమును రాయలు విష్ణుచిత్తునకు సాటిగాఁ జెప్పుటయుఁ బై యభిప్రాయమునందలి ప్రత్యేక ప్రత్యయముచేతనే.

రాయలవారికి వైష్ణవమతమునఁ గల యభినివేశ మింతిం తన రానిది. అసలా యభినివేశమే యాయన యాముక్తమాల్యదను రచించుటకుఁ బ్రధాన హేతువు. ఆత్మయు నవనియు ననల పవన గగన కాల మృత్యు ప్రభృత్యఖిల చిదచిత్ప్రపంచమును విష్ణువు శరీరములే యనియు, నందుచే నశేషదివిషచ్ఛరీరంబులు నన్నారాయణు శరీరములే యనియు, ముముక్షువునకుఁ బుండరీకాక్షుఁ దక్క మఱే వ్యక్తి నుపాసింపరా దనియు, విష్ణువునకుఁ దత్తత్కాలవిగ్రహము లగుట బ్రహ్మరుద్రార్జున వ్యాస భాను భార్గవాదుల భజనము త్రైవర్గికునకే కాని యపవర్గకాంక్షుల కయుక్త మనియు, "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణ" యని సుబాలోపనిషత్తునఁ జెప్పఁబడినట్లు సమస్తమునకు నారాయణుఁడే పరాయణ మని తలంపవలె ననియు రాయలవారికి గాఢమైన విశ్వాసము. ఈ విశ్వాసము నాయన యాముక్తమాల్యదలోఁ బలుచోట్ల వెల్లడించియున్నారు. విష్ణువు రమాదేవికి యామునాచార్య వృత్తాంతము నెఱింగించుచు "వనజజ రుద్రాదులు మత్తనువులె, తత్పూజనంబు తథ్యము మత్పూజనమె, తదీప్సితఫలదాతను నేనె, యట్లైనఁ గలవు తరతమవృత్తుల్" అని తనకును బ్రహ్మరుద్రా

దులకును గల సంబంధము దెలిపి, వారు తనకంటె భిన్ను లని తలంచి తన వాసుదేవతాస్థితి గుర్తింపక జను లొనరించు పూజ సాంతఫలమై త్రిప్పు నని వక్కాణించి యుండెను. విష్ణువుతో మఱొక్క-వేల్పు సముఁడని తలంచినచోఁ గలుగు పాతకమునకు హద్దు లే దని రాయలవారి నిశ్చయము. మాలదాసరి కావించిన తుది శపథ మీా విషయమునే వెల్లడించుచున్నది. ఆ పాతకముయొక్క- పటిష్ఠత యనిర్వాచ్య మగుటచే నది వినినంతనే బ్రహ్మరాక్షసుఁడు ప్రత్యయము కుదిరి యాతని బంధ మూడ్చివైచెను. ఇట్టి సందర్భములఁ బాండ్యరాజునకు వెల్లిశైవమువలెనే రాయలవారికి వెఱ్ఱివైష్ణవము ముదిరినట్లు కనిపించును. మాలదాసరి కాయన "ముకుందాన్యదేవతా శాస్త్రబధిరత్వము" నారోపించుటయు, ముదిరిన యీా మతాభినివేశమునకే మూదల.

శ్రీ మన్నారాయణు మహిమవిశేషమువలెనే భాగవతుల మహిమానుభావములును నప్రతిమానములై విలసిల్లును. వారిపరిచయప్రభావ మనిర్వర్ణనీయమాహాత్మ్యము కలదై విరాజిల్లును. మాలదాసరి పరిచయ సంపర్కముచే బ్రహ్మరాక్షసునకు బ్రాహ్మణ్యమే కాక భాగవతశ్రీయు సిద్ధించుట యిందుకుఁ దార్కాణము. అగణ్యపుణ్య పరిపాకం బుండినఁ గాని మానవునకు భాగవతజన్మ సంభవింపదు. ఆతఁడు పూర్వభవసంచితకర్మపరంపరకు ఫలితముగా న్యూనాధికములైన యనేకతనువులు తాల్చుచుండునుగాని 'కంసరిపుభక్తుఁడొక్కఁడే' కాఁజాలఁడు. ఒక్కొక్కప్పుడు భాగవతుఁడు భగవంతునికంటెను నధికప్రభావము ప్రదర్శింపఁజాలును. రాయ లీ భావమును ఘంటాకర్ణుని కర్మమును మాన్పి యాఁడె భగవంతుం డట్టి శ్రీకంటెఁ భాగవతుండు మించనోపఁగఁగాలేఁడె యను బ్రహ్మరాక్షసుని పల్కులలో వెల్లడి చేసెను. భగవంతుఁ డెంత శక్తిసంపన్నుఁ డయ్యుఁ బ్రపన్నుల కపరిమితమైన చన వొసంగుచుండును. ఈ చనవుచేఁ దప్ప నన్యోపాయములచేఁ బరమేశ్వరుఁడు సాధించుట దుష్కరమైనపని. విష్ణుచిత్తుఁడు తన కూఁతు శ్రీరంగేశున కిచ్చు విషయమున మాధ్యస్థ్యము నడుపవచ్చిన 'హర

విధి చమూపుల' నెట్టిన నా దేవుఁ దమ పురమునకు విజయము చేయించి వివాహము జరుపవలె నని ప్రార్థించుచు "పరిభుతేఁ బరమేశ్వరుండై నఁ బత్సిపన్నజనమున కొసంగు మీకు నీ చన" వనిచెప్పు సందర్భమున రాయ లీ యాశయమును బ్రదర్శించెను.

శ్రీ విష్ణువును భక్తులు పూజించువిధానము లనేకము లున్నవి. అవి యన్నియు నుత్తమఫలప్రదములే యయ్యు వానిలో శ్రీ విష్ణుగుణ ప్రభావసంకీర్తనరూప మైన గానము విశేషఫలప్రద మని గోదాదేవి చరిత్రము వేయివిధముల విశదము చేయుచున్నది. మాలదాసరి వృత్తాంత మాహాత్మ్యఫల ప్రదాన క్షమ మైన గానమహిమను విశదముచేయుటకే చెప్పఁబడినది. మాలదాసరి బ్రహ్మరాక్షసునకుఁ దన తనువైన నిచ్చుట కంగీకరించెను గాని ప్రభాతసమయంబునఁ బాడిన చరమగీతఫలంబు కూడ నిచ్చుటకు సమ్మతింపకపోవుటయే యమేయ మైన యీ గానఫలమునకుఁ దార్కాణము. పరమేశ్వరుఁడు సర్వప్రాణులం దంతర్గతుఁడై యుండును గావునఁ బ్రాణులకు మేలుగావించుట పరమేశ్వరపూజాప్రకారములలో నొక్కటై విరాజిల్లును. గాన ఫలం బిచ్చి తన్ను ముక్తు నొనరింపు మని బ్రహ్మరాక్షసుఁడు మాలదాసరికిఁ జూపిన హేతువులలోఁ "బూజనము గాదా ప్రాణి మేల్భక్తికిన్" అనునది ప్రబల మైనది.

రాయలవారికిఁ గడచిన జన్మలం దాచరింపఁ బడిన సుకృత దుష్కృతము లిచ్చు ఫలముపై నమితమైన విశ్వాసము. గోదాదేవి భూదేవి యవతారము. పూర్వజన్మమున నామెకుఁ జెలు లైన నాగకన్యలు పొరుగుల భాగవతుల గృహముల జనించి యామెకు వయస్యలై బొమ్మల పెండిండ్ల సందర్భమునఁ బద్మాలయాపరిణయామేయగేయములఁ బాడుచు ననంతు ననంతకళ్యాణ గుణములు కీర్తించుతఱి వినుచుండిన గోదాదేవికిఁ బ్రాగ్జన్మ సంస్కారమున నతనిఁ గవయు బుద్ధి జనింప నామె "తదవతారానుమేయ కథానుధానుకలితలీలానుకృతుల వర్తిలు చుండెను." బ్రహ్మరాక్షసుఁడు బీభత్సకుత్సార్హం బగు రక్షోజన్మంబు వాపి కరిణింపు మని మాలదాసరిని వేఁడుచుఁ బ్రాగ్జనిద్వి

జుండఁ గావున దయనీయుండన. ఒక్క దుష్కర్మంబున నిష్కృతి" యని పలికి తరువాతఁ దన పూర్వ వృత్తాంతమును వివరించెను. ఈ విధముగా రాయలు సందర్భము చిక్కినప్పు డెల్లఁ బూర్వజన్మ కర్మ ఫలంబునే జీవుల యాకార వర్తనములకుఁ గారణముగాఁ దెల్పుచుండును.

భాగవతమునందలి జడభరతోపాఖ్యానమున జడభరతుండు నిరంతరము హరిణశాబకమునే తలంచుచుఁ జివర కట్టి తలంపుతోనే మృతి నొందుటచే హరిణజన్మముఁ గాంచె నను కథ చెప్పఁబడి యున్నది. "యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరం, తం తమే వైతి కౌంతేయ సదా తద్భావ భావితః" అని కృష్ణ భగవానుఁడు కూడ భగవద్గీతలో నీ యర్థమునే యర్జునునకుఁ దెల్పియుండెను. రాయలు సోమశర్మ బ్రహ్మరాక్షసుఁడై వికృతభీకరాకారమును గాంచె నని వర్ణించునప్పు డందలి విశ్వాసమును బ్రకటించెను. సోమశర్మ ధనసంచయముతో నింటికిఁ బోవుచుండ దారిలోఁ గాకశ్మశ్రు వను చోరచండాలుఁ డాతనిఁ దాఁకి, గాయపఱిచి, యాతఁడు రెడ్డిరాజులకుఁ దెలిపి శిక్షింపించు నేమో యను భీతిచే నాతని మృతప్రాయునిగా మోది వెడలి పోయెను. తరువాత సోమశర్మబావ యాతనిఁ గాంచి కావడిలోఁ బెట్టి కొంతదవ్వు గొనిపోయెను. "కయ్యంబునఁ బాఱఁబాఱ గాయంబు సేసి వెరవేఁకి గొలిపిన కాకశ్మశ్రు నామధేయ చండాలు కరాళ వేషంబు కన్నులం గట్టినట్లుండ" సోమశర్మ దారిలో మరణించెను. అందుచేతనే యాతనికిఁ దరువాతఁ దత్సదృశమైన కరాళవేషము ప్రాప్తించెను.

కల్యాణప్రాప్తికిఁ గలుషరహితమైన మనస్సువోలెఁ గలుషరహితమైన కాయముకూడ నవసర మని రాయలవారి యభిప్రాయము. బ్రహ్మరక్షస్సు త్రైకాలిక జ్ఞానసంపన్నుఁడై దివ్యబోధ మహిమవలన భూతభవిష్యదర్థంబులుకూడ నెఱుంగఁ జాలియుండెను. అయ్యు నాతని జ్ఞాన మాచరణప్రచారములు లేని దగుటచే భవోత్తారణసమర్థము కాకపోయెను. "కలుషరహితకాయంబునం గాని కల్యాణంబు లబ్ధంబు కాదు" కావునఁ దన విరూపవిగ్రహం బుడిపి యనుగ్రహంబునఁ గృతా

ర్థుఁ గావలసవలెనని యాతఁడార్తుఁడై మాలదాసరిని బ్రార్థించెను. మాల దాసరి మహిమచే నాతనికి నైరూప్యము తొలంగుటయే కాక బ్రాహ్మ ణ్యమును భాగవతశ్రీయు లభించెను.

ఆత్మశక్తి (క్షేత్రజ్ఞ శక్తి) చరాచర వస్తువు లన్నింటియందు సమానముగా నుండక, కర్మశక్తి వేష్టితమై. జన్మజరామరణాద్యనేక సంసార తాపము లనుభవించుచు, విజ్ఞాన తారతమ్యము నొందు చుండును. ఆ శక్తియు ప్రాణులందు మిగులఁ దక్కువగా నుండును. వానికంటె స్థావర శ్రేణియందును, వానికంటె సరీసృపాదులయందును, వానికంటె ఖగములందును, వానికంటె మృగములందును, వానికంటె మర్త్యులందును, వారికంటె గంధర్వ నాగాదులందును, వారికంటె నిలింపులందును, వారికంటె హిరణ్యగర్భునందును నధికమై యుండును. ఈ రూపము లన్నియు విష్ణుని శరీరములే. ఆతఁడచింత్యశక్తిచే నిఖిలభూతములందాకసమువోలె నిండి యొసంగుచుండును. విజ్ఞానమువలెనే "స్థావరంబులకంటెఁ గీటాదులకును, వానికంటె మఱి మృగాదులకును, వానికంటె మఱి పశుపతంగాదులకును", వానికంటె మర్త్యులకును, వారికంటె దేవయోనులకును గరణకళేబరాదిపాటవ మెక్కుడుగా నుండును. మర్త్యులకువలెనే దేవయోనులకును హింసాభయంబు తప్పదు. ముందు వెనుకలతో నించుక తారతమ్య మున్నను అంతవత్త్వంబు వారికందఱికిని సమానమే. భూతములందలి తైజసంబగు తారతమ్యమునకుఁ దమస్సత్వంబులు హేతువులు. చరాచరవస్తువులందుఁ గన్పట్టు సామ్యవైషమ్యములను గూర్చి రాయలవారికిఁ గల యభిప్రాయ మిట్టిది.

ఆముక్తమాల్యదలో యామునాచార్యుఁడు కుమారునకు రాజనీతి బోధించిన ఘట్టమున రాయలవారి కా విషయమునఁ గల యభిప్రాయము లెన్నో వ్యక్తము లగుచున్నవి. అందుఁ గౌటిల్యాది పూర్వనీతివేత్తల యభిప్రాయములతోపాటు రాయలవారు స్వానుభవముచే గ్రహించిన విశేషములును గొన్ని గలవు. అందుఁ బెక్కు కేవల సిద్ధాంతములేకాక యాచరణసాధ్యములుగాఁ గానవచ్చుటయే యిందుకు

నిదర్శనము. ఈ రాజనీతిని సూక్ష్మముగాఁ బరిశీలించినచో రాజ్యపరిపాలనమునందలి ప్రత్యంశమునందును రాయలవా రెంత జాగరూకత వహించిరో తెలియనగును. రాయల రాజనీతి విశేషములు వేఱే వ్యాసమున వివరింపవలసిన వగుటచే నిచ్చట వానిని దడవక విడిచివైచితిని.

రాయలు ద్వితీయాశ్వాసమునఁ గావించిన పాండ్యరాజవర్ణనమునుబట్టి యాదర్శభూపాలున కుండవలసిన గుణగణముల విషయమున నాయనకుఁ గల యభిప్రాయముల నించుక యెఱుంగవచ్చును. రాజు నీతిమాలినవాఁడు గాక ప్రజల మనములు నొచ్చునట్లుగాఁ బన్ను గ్రహింపక, కొండెగాండ్రు చెప్పు మాటలు విని యనాలోచితముగా నెవ్వరిని జెఱుపక, యాత్మశ్లాఘా పరనిందా పరాయణుఁడు గాక ధీరోదాత్తుఁడై యుండవలయును. భగవంతుఁడు సర్వజగన్నియంత యయ్యు మానవుల కక్షిగోచరుఁడు కామిచే వారికిఁ బ్రత్యక్ష పరిపాలకుఁడు రాజే. ఆతఁడు భగవంతునికిఁ బ్రతినిధి. అందుచే భగవంతుఁడు ప్రజారక్షణ శిక్షణంబులు తాన సాక్షాత్కరించి చేయక రాజముఖంబుననే యొనరించుచుండును. పరమశైవుఁడైన పాండ్యరాజునకు విష్ణుభక్తరక్షణేచ్ఛ నిజాభిముఖ్యమునం గాని కలుగమియు, నా యాభిముఖ్యంబు సంవాదంబునం గాని పుట్టమియు నెఱింగి విష్ణుఁడు యామునాచార్యునకుఁ బాండ్య రాజాస్థానమున కేఁగి వాదిజయంబు చేయవలయు నను తలంపు కలిగించెను. రాజు పాలించు దేశ మంతయుఁ దదధీనమందే యుండుటచే నందుఁ గలుగు నిధినిక్షేపము లన్నియు నాతనికే చెందును. ఈ న్యాయము ననుసరించియే శ్రీరామమిశ్రుఁడు యామునాచార్యునితో "నా కేటికి నిక్షేపము, నాకు నిధియు నాకరంబు నరనాథులసొమ్మే కాన విన్నవించెద" నని పలికి యాతని శ్రీరంగమునకుఁ గొనిపోయి యుండెను.

రాయలవారు పై కథాభాగములందువలెనే కొన్ని పద్యములఁ గూడ నాముక్తమాల్యదయందుఁ గొందఱు వ్యక్తులనుగూర్చియుఁ గొన్ని వస్తువులనుగూర్చియుఁ దత్ప్రవృత్తులనుగూర్చియుఁ దమకుఁగల యభిప్రాయములను వెల్లడించియున్నారు. వేసవియందలి దంపతుల

పొందు హృదయములు కలియని తఱచైన వెడ కౌఁగిలింతలతోడను, గార్యములందుఁ గల్గక మాటలందుమాత్రమే కలుగు పెన్నదురులతోడను, ఘనములైన వట్టిశైత్యములతోడను గూడి యనార్యుల పొందు వలె నుండె నఁట! (ఆము ౨-౬౨) మనసు కలియని మాయకౌఁగిలింతలకును, గార్యరూపము తాల్పని శుష్కప్రియోక్తులకును, గపటానురాగములకును నెలవై యనార్యులకూటమి యానందము గొల్ప దని యాయనభావము. పాఱువారు సాహసికులై శాస్త్రవాద మొనర్తు మని చెప్పుచు నోడినను దయచే నేమైన నీయకుందు రాయను మోసపుఁ దలంపుతో లజ్జాహీనులై రాజసభలందుఁ బ్రవేశము సంపాదింతురఁట! రాయలకాలమునఁ బ్రతివారి కరికేసరు లగు విప్రులట్లే లజ్జాహీనులైన యిట్టివారును గొంద ఱుండిరి కాఁబోలును. పాఱువారే యన నేల? యీ సాహసము ప్రదర్శించు వా రన్నివర్ణములయందు నుందురు. కాని యట్టివారు బ్రాహ్మణులలో నెక్కువగా నుండిన కతముననో మ జేలకో రాయలవారు "పాఱువారల బుద్ధి చెప్పంగ నేల" యని సాధారణీకరించినారు.

మానవులు భుజించు నాహారమే జీర్ణమై రక్తముగామాఱి వారి గుణదోషములకుఁ గారణ మగును. అందుచేతనే భగవద్గీతాది గ్రంథములలో సాత్త్వికమైన యాహార ముపదిష్టమై యుండును. తిను నాహారముయొక్క మేలుగీళ్ళను బట్టియే విజ్ఞానముయొక్క వికాస వినాశములును బ్రాప్తించుచుండును. ఈ విషయమున రాయలవారికిఁ గల నమ్మిక యతిమాత్రమై యున్నది. శ్రీరామ మిశ్రుఁడు యామునాచార్యుని విషయలోలుపతను గుర్తించి, యుపాయముచే నెట్లైన నాతని మనఃప్రవృత్తిని ద్రిప్పవలయు నను నుద్దేశమున నాహార దోషమే విజ్ఞాన నాశమునకు మూల మని తర్కించుచు నలర్కశాకము బ్రతిదిన మారాజు భోనపు బాడబుల కిచ్చి పుచ్చుచుండెను. ఏతదలర్కశాకాస్వాదముచేతనే కలిగెనో పూర్వపుణ్య పరిపాకముచేతనే కలిగెనో కాని తరువాతఁ గొంత కాలమునకు యామునాచార్యు మానసమున నించుక పరివర్తనము

కలిగెను. అమృతమైనను జాత్యన్నముతో సమానము కాఁజాలదని యిట్టి యాహార విషయమున రాయలవారికిఁ గల యింకొక విశ్వాసము. హరికి సఖుఁడును రథమునైన గరుడుఁడు చేఁ జిక్కిన యమృతము సురలకిచ్చి యవియు కూడుగ నడుగుకొనలేదా యని యాయన యిందుకుఁ జూపిన దృష్టాంతము. మాలదాసరి బ్రహ్మరాక్షసునికి దేవతలు భ్రాతలని చెప్పి వా రమృతాశులై యపూతాహారము నంటకుండ నీ వేలమనుజ మాంసాహార మపేక్షించెద వని పలుక బ్రహ్మరాక్షసుఁ డమృతమైనను జనులజాత్యన్నసమమె యను మాటతో నాతని వాదమును ఖండించెను.

'గజకుంభేషు వంశేషు జలదేషుచ శుక్తికాయా మిక్షు దండే మౌక్తిక సంభవః'' అని కవిసమయము. శుక్తులందుఁ దప్ప నన్యములందు ముత్యము లుద్భవించుట కావ్యలోకముననే కాని భూలోకమునఁ గానరాదు. రాయలు మధురావర్ణన సందర్భమున ముత్తెముల కభ్ర ఘాకర మను భ్రాంతి కలుగుటకు వేఱు కారణమును జెప్పి "ఆకర మభ్రం బని యండ్రుగా కుదధి తక్కన్ముత్యమున ఫుట్టునే''యని సిద్ధాంతీకరించెను. (ఆము. ౨-౧౧)

పూలమాల లలిత మనోహరమైన వస్తువు. అట్టి వస్తువులను బరుషములైన పురుష హస్తములనుండికంటెఁ గోమలములైన కాంతా హస్తములనుండి గ్రహించుట సమంజసమును సంతోషావహము నని రాయలవారి తలంపు. ఈ తమ తలంపునే రాయలవా రాముక్తమాల్యదలో నాంధ్ర శ్రీవిష్ణువున కారోపించిరి. మగవాఁ డీయఁగా నేవనైనా నాయన మున్నెప్పుడో యొక ననదండ గొనియెనఁట! ఆ కొదువ యాయన నవతారాంతరమునఁ గూడ నంటిపెట్టుకొని వెంబడించెను. ఆ కొదువ కప్పుకొనుటకే యాయన తాను మును దాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నది రంగమందైన పెండిలిచెప్పు మని రాయలవారిని బ్రతిమాలుకొనుట మగవాఁ డిచ్చిన నవప్రసవమాలిక కంటెను నాఁడుది యిచ్చిన యాముక్తమాల్యమే శ్రేష్ఠము కాఁబోలును. ఔను|లంబ కు

చాలింగనాత్ లికుచకుచాపాదతాడనం శ్రేష్ఠమ్") ఇట్లే రాయలవారింకొక విషయమునను స్త్రీజనమునకుఁ బురుషులకంటె నాధిక్య మొసంగుదురు. స్త్రీపురుషుల హృదయములఁ బుట్టిన వలపుకొలందిలో న్యూనాధిక్యము లెట్లున్నను బురుషులే స్త్రీలచెంత కరుగవలెఁ గాని స్త్రీలు తమంతఁ దామై పురుషులఁ జేరఁ బోరాదు. అట్లెవ్వరైనఁ బోయిన నా పోయిన యామెకేకాక స్త్రీజాతికంతకును దలవంపు. అట్లు పోయి నప్పు డామెను బురుషుఁ డాదరింపక యుపేక్షించినచో నింక వేఱె చెప్పనక్కఱయే లేదు. ఆముక్తమాల్యద విష్ణువు నుపాలంభించుచు "స్త్రీలు తలవంపఁదానె వచ్చెనది చాలకాఁడుదాని బజీతుసేయఁగ వలయునె" యని పలుకుట పురుషపుంగవు లయ్యు రాయలవారు పూర్ణహృదయముతో నంగీకరించిన విషయము.

ప్రాణేశ్వరులు దవ్వుల నున్నప్పుడు విరహవేదనాతిశయముచే స్త్రీలు వారి నెరసులెన్ని యుపాలంభ మాచరింతురు. మఱి వారు చెంత కరుదెంచి వశ్యులైనచో నితరుల నెవ్వరి నొల్లక వారితో నొక్కఁడై యింద్రుఁడు చంద్రుఁడని పొగడ నారంభింతురు. అప్పుడు వారిరువురిని గూర్చినబోంట్లు కేవలము తేరకత్తెలై పోదురు. (ఆము ౫-౫౬) విరహవేదన మానుషస్త్రీలకువలెనే తిర్యగ్జాతిస్త్రీలకును దాపము కలిగించు ననియు, నొక్కొక్కప్పుడు తిర్యక్కులకే యది యెక్కువగా నుండు ననియు రాయలవారిభావము. ఏల నన మానవాంగనకైనచో దాని నాటపాటలచేతను గథావినోదములచేతను గొంత యడంగించుకొనుట కవకాశమున్నది. తిర్యగ్జంతువుల కట్టి యవకాశములేదు. మఱియుఁ దమబాధ నితరులకుఁ జెప్పి హృదయము తేలికపఱచుకొనుటకైన వానికి నోరులేదు. అందుచే (నోరులేని జంతువులకు నొప్పి ఘను) మని రాయలవారి తీర్మానము.

బ్రాహ్మణుఁడు నాలుగువర్ణముల కన్నెలను వివాహ మాడవచ్చునని కొన్ని స్మృతు లంగీకరించుచున్నవి. స్మృతు లిచ్చిన యాయంగీకార మున్నను బురాణములలోఁ దప్ప నిజముగా నట్లొనరించినవారు

చరిత్రలో నెందఱో కానరాగు. రాయలవారు వివాహవిషయమునఁ బైస్మృతుల యభిప్రాయయతో నేకీభవించునట్లు తోఁచుచున్నది. ఏలననఁ బాండ్యరాజు యామునాచార్యుని వాద విజయమును మెచ్చి తాను వైష్ణవుఁడగుటయేకాక యాతనికిఁ దన కడగొట్టు చెల్లెలి నిచ్చి వివాహమొనరించి యతని యౌవరాజ్య పట్టాభిషిక్తు నొనరించున ట్లుగా రాయలవారు వర్ణించినారు. ఈ వివాహప్రసంగ క్రమమూలక మాటచే రాయలవారి కీ విషయమునుగల యభిప్రాయమును మఱింత విస్పష్టము కావించుచున్నది.

విషయాతురున కావిషయముల విడువు మని చెప్పు హితోప దేశ మత్యంతకోపకారణముగాఁ బరిణమించును. అందుచే నాతని నా విషయలాలసనుండి మరల్చుట కెంతేతో మెలఁకువ కావలయును. నేర్పుమైఁ గథాదులచే నొకత్రోవకు వచ్చునట్లు చేసి యాతఁడు పశ్చా త్తప్తుఁడైనపిమ్మట నతని నావిషయమునఁ బరాఙ్ముఖు నొనరింపవల యును. మఱియు నా తృష్ణతీఱిన పిమ్మటఁగాని విషయ పరవశునిఁ దత్పారవశ్యమునుండి మేల్కొల్పుట కష్టసాధ్యమైన పని. దీనికి రాయ లవా రిచ్చిన యుపమాన నూయన మృగయానైపుణ్యమును లోకజ్ఞ తావిశేషమును బహువిధముల వ్యక్తమొనరించుచున్నది. "నల్లఁ గ్రోలనిచ్చి మెల్లనె చివ్వంగినోటి జింకను దినియు వేటకాఁడువలె" హితైషి విషయాతురునిఁ దత్తృష్ణ తీఱ నిచ్చి విషయాళినుండి త్రిప్ప యత్నింపవలయును. వ్యసనము లన్నిటిలో రాజ్యవ్యసన మన గాఢ మైన దని రాయలవారి భావము. అసలు ప్రేమాధికారము లెంతయొ క్కువగానున్న వారికైన వ్యసనలోలుపు నావ్యసనమునుండి మరల్చుట కష్టము. మఱి రాజ్యవ్యసనము వారించు టెవ్వరికిని శక్యము కానే కాదు.

రాయలవా రల్పులహృదయ ప్రవృత్తినెంతయుఁ జక్కఁగా గ్రహించుటకు రాజనీతి వర్ణించు సందర్భమున వారుచేసిన సూచన యొకటి తార్కాణముగానున్నది. పార్వతీయులను బెదరువాపి నేర్పు

మైఁ జేకూర్చుకొనవలె నని వారియూహ. ఏల నన విశ్వాసావిశ్వాసములును, ననురాగ ద్వేషములును, నానుకూల్య ప్రాతికూల్యములును నల్పు లగుటచే వారి కల్పకారణముచేతనే కలుగుచుండును. ఈ విషయమును దృష్టాంతీకరించుటకై వారు చూపిన యుదాహరణము మిక్కిలి సహజమును సముద్రమునై యున్నది.

కూఁతులకు సామాన్యముగాఁ దండ్రిపోలిక కాక తల్లిపోలికయే కలుగుచుండు నని రాయలవారి నమ్మకము. ఈ నమ్మకము నాయన వసంతర్తువులో నొక్కచో నర్థాంతరన్యాసముచే వెలిబుచ్చినారు. సంపెంగచెట్లున వసంతాగమముచేఁ గలిగిన పూవు లుండఁగా నవి చేఁ దని తుమ్మెదలు వానివంక కేఁగ వయ్యెను. ఇట్లుండ నొకానొక కాంత సంపెంగవంక మోము మెత్తగా 'ముఖరాగేణ చంపక' యను దోహదశాస్త్రము ననుసరించి యా చంపక వృక్షమున మఱికొన్ని పువ్వు లుద్భవిల్లినవి. ఇవి చైత్రసంజనితములు కాక వనితాముఖోందు రాగ సంజనితము లగుటచే నందలి తేనె లమృతసదృశములై మధురములుగా నుండు నని తలంచి తేంట్లు వానిపై వ్రాలినవి. కాని యవియుఁ జైత్రంపుఁ బూవులవలెనే చేఁదై ముఖ మడఁచి వానిని ద్రోలి వైచినవి. ఏల యన నా పూవులకుఁ దండ్రియైన చంద్రుని గుణము రాక తల్లియైన గంధఫలిగుణమే యబ్బినది. అందుచేఁ దల్లిబడికోల్చెట్టటయే మహిం దఱచని రాయలవారి సిద్ధాంతము.

ఇట్లే యర్థాంతరన్యాసాలంకారములద్వారా రాయలవారు వెల్లడించిన భావములు మఱి కొన్ని గలవు. మల్లీ పాటలలు వేసవిలోఁ బూచు పూవులు. అందు మల్లెలుఁ దమకు నిదానమైన నిదాఘమువలె నుగ్రములై కామినీకచదాసీలకచాగ్రపంక్తిని నెఱియ ల్గాఁ బాపఁ బాటలలు దేనెసోనలు చిమ్మి వానిని సురల యథాపూర్వముగా నతికినవి. ఇట్లే నాభీనిర్విషములు రెండును సాగరోత్పన్నములే యయ్యు గుణముల విషయమున వైరుద్ధ్యముకలిగి యున్నవి. దీనినిబట్టి తోఁబుట్టువులకున్నైతము గుణముల యెడాటమునఁ బార్థక్య ముండు నని రాయ

లవారు తేల్చిన సారాంశము. ప్రియము చౌకమైన చోట నిలువఁ జన దని రాయలవారి భావము. ఈ భావము నాయన గోదాదేవిని బాల్యము వదలి యౌవనము పైకొన్న సందర్భమున వెల్లడించినారు. దైవికమునెదుట యుక్తులు ఫలింప వనియు, దైవ మనుకూలించుతఱి నకృత్యముచే నగు పీడయు గోచరము కా దనియు రాయలవారి విశ్వాసము. గోదాదేవి తుమ్మెదపాట వినలేక దానిని మాన్పుటకై వీణ వాయింపఁ దొడంగ నా గానముచేఁ దుమ్మెదలపాట మఱింత రక్తి పొంది యామెను బూర్వముకంటెను నధికముగా నేఁపసాగినవి. దైవికమునెదుట మానవుల యుక్తు లెందుకుఁ బనికివచ్చును. వసంతుఁడు పూచిన పూవు లరిష్టకరము లని వానిని మన్మథున కమ్ములవేయఁగా నాతఁడు వానిని గొనియే పథికావళీజయశ్రీ చణుఁ డయ్యెను. దైవమనుకూలమై పరుమేలు దీఱిన తఱి నకృత్యముచే నగునట్టి పీడ యైనను గోచరము కాదుగదా!

రాయలకు రెడ్లన్న నేలకో యీసడింపు. జడివేళ వారు మేకెరువుం గుంపటి మంచ మెక్కి- రని వెక్కిరించుటయే కాక యాయన యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేసరని పీసంబుగల రెడ్డివర్ణసోమశర్మ తనకున్న కొంచెపాటి చదువె పరబ్రహ్మమై పెద్దలఁ జెనకి సరిపోతిననియు సరియై జయించితి ననియు నసత్యము లాడుచుండె నని వారి నీసడించెను.

పరుసవేది, మందాకుపసరు మున్నగు స్వర్ణవిద్యాసాధనములందును, మరులుఁదీఁగ మున్నగు విచిత్రవస్తువులందును రాయలవారికి నమ్మక మున్నట్లు తోఁచును. తరుణశైవాల జలజపత్రములు పొదుగుటచే మరకతచ్ఛాయనుండిన పరిఖజలము కోట బంగారుచేయుటకై మున్ను వేధ పిండిన మందాకుపసరువోలె నుండె నని యాయన యుత్ప్రేక్ష. స్వధితి నైనను, ద్విజుఁ జంపిన శస్త్రము నైనను బరుసవేది సమానముగా సువర్ణ మొనరించు నని బ్రహ్మరాక్షసునిచే నాయన మాలదాసరి కొక యసాధారణ న్యాయమును జెప్పించెను. కథ జరిగిననాఁటి రాత్రి మాలదాసరి దారి తప్పుటకు మరులుఁదీగను మెట్టుటయే కార

ణము. మఱలు మాతంగిటీఁగను ద్రొక్కినవారు త్రోవ తప్పుదు రని యిప్పటికిని గొందఱు పెద్దలు చెప్పుచుందురు.

తెలుఁగు ఖండశర్కరవంటి దనియు దేశభాష లన్నింటఁ దెలుఁగు లెస్స యనియు రాయలవారికిఁ దెలుగుభాషపై నభిమానము. గీర్వాణ భాషానిష్ణాతులై యందుఁ గవిత చెప్ప నేర్చినవారికిఁ దెలుఁగుభాష యసాధ్యము కా దనియు నాయన తలంపు. గీర్వాణభాషలో ననేక కావ్యములు వ్రాసి పండితుల మెప్పించిన తనకుఁ దెలుఁగుభాష యసాధ్యము కా దని దేవుఁ డన్న వాక్యము. దేవవాక్యము నన్యథాకరింపఁజూచుట పాపమును గొని తెచ్చుట యగును.

ఆముక్తమాల్యదలోని యాశ్వాసము లన్నింట మాలదాసరి కథతోఁగూడిన యాశ్వాస మెంతయు రసవత్తరమై చదువరుల చిత్తము లరించును. ఇది చదువరుల భావమే కాదు; రాయలవారిది కూడను. "ఆముక్తమాల్యద నాశ్వాసవర్ణ్య మాఱవది" హృద్యము లైన పద్యతతులతో నెసలారు నని యాయనయే దాని వర్ణ్యత్వము చెప్పుకొనియుండెను.

పరాశ్రియవస్తుకము లైన కావ్యములలో గ్రంథకర్త తానై యేమి చెప్పుటకు నంత యవకాశము లేకపోయినను, అతఁ డచ్చటచ్చటఁ బ్రత్యక్ష మగుచునే యుండు నని మొదటనే మనవి చేసియుంటిని. రాయలవారట్లాముక్తమాల్యదలోఁ బ్రత్యక్షమైన పట్లు సాధనములుగాఁ జేసికొని యీ వ్యాసము వ్రాసితిని. మఱి యాయన యల్పజ్ఞుఁడ నైన నా కెంతవఱకుఁ బ్రత్యక్ష మయ్యె ననుటకు సహృదయులైన విద్వద్వరులే ప్రమాణము.

---

# పద్యరత్నములు.

విద్వాన్ పాలెపు వెంకటరత్నముగారు.

సీ. 'నన్నయ' భారతామ్నాయ కల్పనలోని
నైగమ పరిపూత నాదము విని
'తిక్కన' సుకవితాధివిశేషములోని
శృంగారనైపుణిఁ జెంగలించి,
'శ్రీనాథ' కవిరాజవాణీ విపంచికా
కలనాదగాంభీర్యగరిమ నెంచి
'అల్లసాని' కులాబ్ధి నవతరించిన పితా
మహు 'మనుకథ' సుధామహిమఁ దలఁచి,

గీ. 'సూరనార్యుని' కల్పనాశుద్ధి, 'రామ
రాజభూషణ' 'వసుకావ్య' యోజ నేసి
మోడ్పు కేల్దోయితో నేత్రముకుళనమున
సన్నుతించెద నినుఁ బరిషల్లలామ

శా. శ్రీకళ్యాణగుణాంక సంకలితసూంధ్రీపాదమంజీరమా
ధ్వీకానందసుశబ్దముల్ సెలఁగె నీ వేళన్ విపశ్చిత్కవి
ప్రాకామ్యప్రదవార్షికోత్సవమునన్; వాణీకరాంభోజ వీ
ణాకాండంబునఁ దంత్రులెల్ల రసవన్నవ్యశ్రుతుల్ సల్పఁగన్.

మ. భళిరా నేఁడిటు కాకినాడపురి శో ♦ భాప్రాభవం బొప్పఁ గా
వ్యలతారామల సత్పరీమళములన్ ♦ వ్యాపింపఁగాఁ జేసె, ప్రా
జ్ఞుల నెల్లన్ బిలిపించి; సత్కవితలన్ ♦ గోష్ఠీవినోదంబులన్
గళలన్ స్వాదుమనోహరంబులుగ, రా♦గం బూరఁగా నిత్తఱిన్

చ. సలలితరీతిఁ దొల్తనె ప్రసన్నకథాకలితోక్తి నేర్చి, కో
మల మృదుశబ్ద సన్మధురిమాగరిమంబున ముద్దు పుట్ట నాం
ధ్రులు 'మదిమోదముం బొరయ' దోరపుఁబల్కులఁబల్కి యంతటన్
గిలకల నవ్వి నాఁడె కనకంబునఁ దానము లాడితం బరో!

# రెండు శృంగములు

కొత్తపల్లి వీరభద్రరావు.

"కావ్యమును గీతియును చిత్రకళయు నరున
కబ్బిన యుదాత్త దివ్యాంశ లవని మీఁదఁ
బశుదళావరణంబు నావలకు దాఁటఁ
దన్మయానంద మంద సాధనలు కావె!''

అని వ్రాసినారు శ్రీ రాయప్రోలు వారు. ప్రాచీనులును రసానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి అని ప్రవచించినారు. ఈ యానందమును సహృదయ లోకమునకుఁ బంచి యిచ్చు నుదాత్త దివ్యకళ లివి. కావ్యమును గీతియు వేఱువేఱు కళలు. కాని పరస్పరపోషకములు కూడ కాఁగలవు. ఒక విధముగఁ జూచినచో లలితకళలలో నీ రెంటికి నింతదగ్గర చుట్టరికము లేదని తోఁచును. ఇంత సన్నిహితత్వము కలవైనను ఇవి రెండును వ్యక్తిత్వము, ప్రత్యేకత లేనివి కావు.

సాహిత్యమునకు సంగీతమెంతవఱకుఁ బోషకము? సంగీతములో సాహిత్యమునకుఁ గల స్థాన మేమి? అను ప్రశ్నలు మనలను గ్రమక్రమముగ శుష్కవాదములలోనికి దింపి, ఈ రెండిటిని విడిగఁ గాని, ఉమ్మడిగఁ గాని మన మానందింపలేకుండఁ జేయు ననుట సత్యదూరము కాదనవచ్చును. ఒకటి తియ్యని యావుపాలు. ఇంకొకటి కండచక్కెర. దేని కదియే శ్రేష్ఠము. ఆస్వాదయోగ్యము. ఈ రెండింటిని పాళ్లు చెడకుండఁ గలిపి- వ్యష్టిగా నీ రెండింటిలోను దేనికినిలేని- క్రొత్త చవిని పొందవచ్చును. పొందుచున్నాము కూడ.

ఆపాతమధుర మైన సంగీతము నాదప్రధానము. మోక్షమునకు రాజమార్గము. "నాదలోలుడవై బ్రహ్మానందమందవే మనసా'' అన్నాఁడు శ్రీ త్యాగరాజు. ఈ యానందమును బొందుటకు శిశువు మొదలు పశువు వఱకు నందఱును నధికారులే. ఇంత విస్తీర్ణతకుఁ గారణము, దానిలోని యాపాత మధురత్వమే.

సాహిత్యము ఆలోచనామృతము. భాషలు వేఱైనను భావము లకు విశ్వజనీనత యుండుట కవకాశము గలదు. వర్తమానమును దన లోఁ బ్రతిబింబించుకొనుచు, భూతకాలికవిజ్ఞానమును వలసినంతగ విని యోగించుకొనుచు, సాహిత్యము భవిష్యమును బాలించును. అనాది అనంతము అయిన పరమసత్యమును ఉద్ఘాటించును. ఈ ఉద్ఘాటనము నకు వాచ్యము పనికి రాకపోయిన, వ్యంగ్యమును ఆశ్రయించును. ప్రకృ తికి అద్దము పట్టి, ప్రకృతిలోని లోలోఁతులను "పెంజీకటి కవ్వలి వెలుఁగు" ను జూపి యుపాసకులను దరింపఁజేయును. దీనికధికారి కాఁదగినవానికి- ఇది ఆలోచనామృతము గనుక-కొంత యధిక మైన సంస్కారము కావ లెను. సంస్కార తారతమ్యమును బట్టి 'చవి' మాఱుచుండును. ఇది భాషతోఁ గూడినది గనుక, ఎంత తేటమాటలతో నున్నను, కొంత భాషాసంబంధ మైన పరిశ్రమ యున్నఁగాని 'చప్పన'- సంగీతమువలె- నానందమీయకపోవచ్చును. కనుక, అనుభూతి విషయములో, అధి కార తారతమ్యమును గ్రహింపవలసివచ్చును. కావ్యమునకు ఆత్మ ధ్వని. ఈ 'ఆత్మానుభూతి' లభింపవలెనన్న చో నెంతయో 'అధికారము' కావ లెను. సంగీతవిషయమునను ఎంతయో సంస్కారము కావలెను. కాని, అది వినఁగనే యేదియో కొంత యందఱకు నానందము కలుగకపోదు. సాహిత్యవిషయములో నంత సులువుకా దని, అభిప్రాయము.

సంగీత విషయములోఁ గాని, సాహిత్యవిషయములోఁ గాని 'అధి కారి' యొక్క సంస్కారమును బట్టి యానందము యొక్క స్థాయి మాఱు చుండును. ఆ వ్యక్తులపై నీకళలు చూపు ప్రభావముయొక్క 'లోఁతు' మాఱుచుండును. లలితకళ లందఱకు నానంద మిచ్చును. "కాంతా సమ్మితతయా" ఉపదేశము చేయును. ఈ రెండు శక్తులును లేని లలిత కళ,ఉత్తమ మైనది కా దనియే చెప్పవచ్చును. కాని, ఈ రెండు సంస్కా రములును- ఆనందము కలుగుట, ఉపదేశము గ్రహింపఁగలుగుట-అంద ఱకు నొకేప్రమాణములో జరుగ వను విషయము లోకములో మనము చూచుచున్న దియే. కాని సంస్కార విషయమునఁ గల యీ తారతమ్య ము, అధికారియొక్క మనస్సుయొక్క పరిపక్వతను బట్టి యుండును

గాని, లౌకికము లైన విభేదములను బట్టి కాదని గ్రహింపవలెను. ఈ 'సంస్కారము'యొక్క తరతమభావము కొంచెము 'ఇంపు గొలుపుట' దగ్గఱనుండి 'తాదాత్మ్యావస్థ' వఱకును గలదు. మనము ముఖ్యముగ గుర్తింపవలసినది యిదియే.

సంగీతము సంగీతముగ భాసించుటకుఁ బదము లక్కఱలేదు. మనోధర్మసంగీతములో-రాగాలాపన, తానము, స్వరకల్పన యిత్యాదులలో-వాక్యములకుఁ దావు లేదు గదా! కావ్యనిర్వచనముగ- రమణీయార్థ ప్రతిపాదక శబ్దమును గ్రహించిన మనము- సంగీతముయొక్క ప్రసక్తి లేకుండ, సాహిత్య ముండగలదనియు, నున్న దనియు నంగీకరించినటులనే గదా! కనుక, సంగీత సాహిత్యములకుఁ బ్రత్యేకస్థితి, సంయోగస్థితి సంప్రదాయసిద్ధమే యని తేలినది.

స్థూలముగఁ జూచినచో సంగీతము- ప్రాచ్య, పాశ్చాత్యపద్ధతులను- రెండు భిన్నవిధములుగ నేఁటి ప్రపంచములోఁ గన్పట్టుచున్నది. పాశ్చాత్యు లది స్వరైక్య (Harmnoy) సంప్రదాయపద్ధతి. వెంబడించు స్వరములచేఁ గలుగుమాధుర్య (Melody) పద్ధతి మనది. ఏకకాలమున, సమవాదిస్వరముల సమ్మేళనమే, పాశ్చాత్యపద్ధతియొక్క ముఖ్య లక్షణ మనవచ్చును. మనవా రీ పద్ధతిని నెఱుఁగనివారు కారు. కాని, మన పూర్వు లీ పద్ధతిని నభివృద్ధిచేయక, రాగసంప్రదాయ మధుర పద్ధతిని నవలంబించినారు. రేఖకు, భావమునకు విశేషప్రాముఖ్యము నిచ్చిన ప్రాచ్యచిత్రలేఖనమునకు, మూఁడు కొలఁతలకు, స్థూలరూపమునకు విశేష ప్రాముఖ్యము నిచ్చిన పాశ్చాత్య చిత్రలేఖనమునకు నున్న భేదము బోలినదే, ప్రాచ్యపాశ్చాత్య సంగీతముల కున్న ముఖ్యభేదమనుట సత్యదూరము కాదేమో!

"గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే" అని ప్రాచీనకాలమునుండి వచ్చిన యభిప్రాయ మైనను, ప్రస్తుత సంగీతస్థితిని జక్కగాఁ జెప్పగలిగిన నిర్వచనము, "రాగః స్వర శ్చ తాళ శ్చ త్రిభి స్సంగీత ముచ్యతే" యనునది.

సంగీతసాహిత్యవాహిను లొకదాని నొకటి పెన వేసికొని కలిసిపోయి, కలియక భిన్నభిన్నముగ వేదకాలమునుండియు నవిచ్ఛిన్నముగఁ బ్రవహించుచున్నవి. మానవహృదయమును బునీతము చేయుచున్నవి. కళకు సంబంధించిన మానవుని తీఱని తృష్ణను శాంతింపఁజేయుచు వచ్చుచున్నవి. మానవుని దొక తీఱని దప్పిక. వీఁ దొక యెడతెగని ప్రవాహము. వేదములో రెండుమూఁడు స్వరములతో మాత్రము పలుకు బుక్కు లెన్నియో గలవు. ఉదాత్తానుదాత్త స్వరితము లను పేరులు కేవలము వ్యాకరణశాస్త్రములోఁ గన్పట్టు పదములు మాత్రమే కావు. సామవేదకాలము నాఁటికి సప్తస్వరములు-ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, మంద్ర, అతిస్వార్య, క్రుష్ట అను నామములతో నేర్పడినవి. నేఁడు వ్యవహారములో నున్న షడ్జాదినామములు మనకుఁ దెలిసినవే. కాని, ఇక్కడి విశేషము వేదసంగీతములోని 'ప్రథమ', లౌకిక సంగీతములోని 'మధ్యమ' అగుటయే! అనఁగా, వేదగానము మధ్యమగ్రామ సంబంధి యని తెలియును. ఇఁక, షడ్జగ్రామము మనకుఁ బరిచిత మైనదియే గదా!

ఈ రెండు 'గ్రామముల'నుండి జాతు లుద్భవించినవి. జాతులు ప్రస్తుతరాగములవంటి వనవచ్చును. ఇవి రాగములకు నొక విధముగ మాతృక లనినను విప్రతిపత్తి యుండరాదు. వేదములోని బుక్కుల నటుంచి పరిశీలించిన; గానమున కనుకూలముగ బయలుదేరిన మొట్టమొదటి మహాకావ్యము, శ్రీమద్రామాయణము. "క్రౌంచ మిథునాను రాగదారణమునలని శోకమే శ్లోక మయి", ఆదికవి వాల్మీకి నోట రామాయణముగఁ బ్రభవించినది. కుశలవులు శ్రీమద్రామాయణమును గానము చేసిరి. దీనిని బట్టి, ఆదినుండి సంగీతసాహిత్యములకుఁ గల 'ప్రణయము' అర్థ మగును. కనుకనే, శ్రీమద్రామాయణము 'పాఠ్యే గేయే చ మధురం' వాల్మీకి రామాయణముయొక్క 'మాతు'(సాహిత్యము) సంస్కృత భాష. లౌకిక మైనది. 'ధాతు'(స్వరరూపమైన సంగీతము) సప్తజాతులు. శ్రీమద్రామాయణము, 'జాతిభి స్సప్తభి ర్బద్ధమ్, తన్త్రీలయసమన్వితమ్.' ఇదే దీనిలోని విశిష్టత. ఇందువలన శ్రీమద్రా

మాయణము- సంగీతపరముగ సాహిత్యపరముగఁ గూడ-లౌకికప్రపంచమున నాదిలక్ష్యకావ్యము. వాల్మీకి లౌకికప్రపంచములో మొదటి వాగ్గేయకారుఁడు.

సంగీత సాహిత్యములకుఁ గల పొత్తును పెద్ద లందఱు గ్రహించి యంగీకరించిరి. కనుకనే,'గీతము'యొక్క భేదములను జెప్పుచుఁ బూర్వులందఱు సాహిత్యముతోఁ గూడిన 'గీత' భేదము నొకదానిని, ప్రత్యేకముగ నంగీకరించినారు. ఈ సందర్భమున నుదాహరింపఁదగినది-వాత్స్యాయన సూత్రములపై—యశోధరుని 'జయమంగళ' వ్యాఖ్యలోని యీ శ్లోకము.

"స్వరగం పదగం చైవ తథా లయగ మేవ చ।
చేతో౽వధానగం చైవ గేయం జ్ఞేయం చతుర్విధమ్॥"

ఇది, సాధారణాధికరణములో, విద్యా సముద్దేశాధ్యాయములో 16 వ సూత్రములోని 'గీతము' అనుదానిపై వ్రాసిన వ్యాఖ్యాన శ్లోకము.

గానము చేయఁబడునది గనుక గీతము. దీనినే సంగీత మందురు. ఇది నాల్గువిధములుగ నున్నది. స్వరగతము, పదగతము, లయగతము, చిత్తప్రణిధానగతము- అనునవి యీ నాల్గు విధములును. స్వరమేళనముతోఁ జేయు గానము -స్వరగతము. పదముల మేళనముతోఁ జేయు గానము—పదగతము. కేవలము లయయొక్క గమనమును మాత్రమే యాధారముగ గ్రహించి చేయు గానము లయగతము. గానమునందే చిత్తము నాయత్తముచేసి, ఏకాగ్రతతో లోలోపల చేయుగానము- చిత్తప్రణిధానగతము. ఈ నాల్గింటిలో, మొదటి మూఁడును స్ఫుటముగ వ్యక్తములు. ఈ మూఁడింటిలో రెండింటి కీ పదము లక్కఱ లే దన వచ్చును.

మనోధర్మ సంగీతము, ఈ రెండింటిని నాశ్రయించి యుండును. పల్లవిలోఁ బదము లున్నను గాయకునకుఁ గాని యర్థముతో విశేష ప్రసక్తి లేదు. ఆ పదములు కేవలము విఱుపులకుఁ బనికివచ్చునవి. పల్లవి, గాయకుని సంగీతశాస్త్రవిజ్ఞానమును శ్రోతలకుఁ బ్రదర్శించుటకు సాయ

పడును. ఇందు విభుపుల కున్నంత ప్రాముఖ్యము, సాహిత్యమునకు లే దని భావము.

సంగీత రచనలలో- గీతములు, వర్ణములు, కీర్తనలు- సాహిత్యమును గలిగియున్నవి. వీనిలో నుత్తరోత్తరము సాహిత్యమునకుఁ బ్రాముఖ్యము హెచ్చు. గీతములలో సాహిత్యమునకుఁ బ్రాముఖ్య మంతగ లేదు. శబ్దమాధుర్యము, లాలిత్యము-సౌందర్యము నిముడింపఁజేయుటకుఁ బనికివచ్చునంతే గీతములలో సాహిత్యమున కున్న ప్రాముఖ్యము కంటె వర్ణములలో సాహిత్యమునకుఁ బ్రాముఖ్యము కొంత హెచ్చు. ఇఁక, కీర్తనలలో సాహిత్యమునకు విశేష ప్రాముఖ్యము కలదు. కీర్తన సర్వకళాపూర్ణ మైన చంద్రబింబము. సర్వరాగతాళ స్వరూపము చక్కఁగాఁ దెలిసికొని, సాహిత్యములోని మెలకువలు గ్రహించినవారు గాని, ఉత్తమకీర్తనలు వ్రాయలేరు. కనుకనే, ఉత్తమకీర్తన, సంగీత సాహిత్యముల కూడలి, అట్టి తీర్థప్రదేశములను "ఎందరో మహానుభావులు" కల్పించినారు వారిలో 'శ్రీ త్యాగరాజు' అగ్రగణ్యుఁడు. సంస్కృతమునందు సంగీతరచనలు చేసినవారికి నే విధముగను దీసిపోని ప్రతిభ కల మహానుభావుఁ డితఁడు.

సంగీత సాహిత్యముల పొత్తును పరిశీలింపఁదలంచుకొన్న వారికి శ్రీ త్యాగరాజును మించిన వాగ్గేయకారుఁడు కానరాఁడు. అతఁడు గంగా యమునా సరస్వతుల సంగమస్థానము. పుణ్యతీర్థము. అతని సాహిత్యము గంగానది. సంగీతము యమున. అతని యద్వైతానుభూతి, అంతర్వాహిని యైన సరస్వతి. అతని బ్రతుకు ఈ ముయ్యేఱుల కూడలి. పవిత్ర త్రివేణీతీర్థము. శ్రీ త్యాగరాజునకుఁ బూర్వ మెన్నియో యుత్తమకీర్తనలు-అధ్యాత్మరామాయణ కీర్తనలు, రామదాసు కీర్తనలు, తాళ్లపాకవారి కీర్తనలు మొదలగునవి కలవు. సంస్కృతములో నెన్నియో కలవు. కీర్తనలలో సంగీతసాహిత్యములకు మంచి సమన్వయము కుదుర్చుటలో శ్రీ త్యాగరాజుకు విశిష్టత కలదు. సంగీత సాహిత్యముల మాధుర్య సౌకుమార్యములను రంగరించి, శ్రీ త్యాగరాజు కీర్తనగా చేసి యాంధ్రరసికులకు నందించినాఁడు.

శ్రీ త్యాగరాజుయొక్క గొప్పతనము కీర్తనలో భావమునకు విశేష ప్రాముఖ్య మిచ్చుటలోఁ గలదు. సంగీతములో భావస్ఫూర్తి కొంతవఱకు రాగముమీఁద నాధారపడియుండును. ప్రతి రాగమునకును భావమును సృష్టించు శక్తి కలదు. ఎత్తుగడ, సంచారములను బట్టి యాభావములో వైవిధ్య మేర్పడుచునుండును. రాగమునకు సహజముగ నున్న భావమును సృష్టించు శక్తి, కీర్తనలోని సాహిత్యమునకుఁ గల శక్తితోఁ గలిసి కోటిగుణిత మగును. రాగము సృజించిన భావము, సాహిత్యములోని భావములో లీన మయి, పరకోటి ముట్టిన రసానందము కలుగును. ఈ కళారహస్యము శ్రీ త్యాగరాజునకు స్వానుభవసిద్ధము. అందుచేతనే యాయన, భావములను సోపానములుగ సహజ మైన క్రమపద్ధతిని బెంచుటకు, సంగతుల పద్ధతి నేర్పరుచుటయేగాక, సాహిత్యమును దదనుగుణముగ మరఁచెను. ఈ వాక్యార్థమును వ్యక్తము చేయు, "ఆరగింపవే, పాలారగింపవే" వంటి అనేకకృతులు సుప్రసిద్ధములే గదా! ఉపనిషద్వాక్యములను, భగవద్గీతా రామాయణాదులలోని యుత్తమభావములను- సంగీతసాహిత్యముల కూడలి యైన కీర్తనల రూపమున వ్యక్తము చేసి, ముముక్షువులకు మోక్షమార్గము సుగమము చేసెను. ఇవన్నియు భక్తిపారవశ్యమున గానముచేయుచున్న శ్రీ త్యాగరాజు "ముఖవియత్పథమున గంగ"వలె, కీర్తనలుగ నావిర్భవించినవి. స్వయం వ్యక్తము లైనవి. కనుకనే, 'కర్తను నేను' అను నహంకారము వారికి లేదు. "పలికించెడివాఁడు రామభద్రుండఁట"అని పలికిన పోతన్నగారు, త్యాగయ్యగారి గౌరవాభిమానములను జూఱగొనుటకు నిదియే కారణము కావచ్చును. వీరిరువురి కృతులును నాంధ్రలోకమున నపౌరుషేయములవలె నాదరింపఁబడుటకు, ఈ భక్తిపారవశ్యమే ముఖ్యకారణము.

ఉత్తమ కళాసృష్టి విశేషప్రయత్న సిద్ధముగాదు. ఉన్న యాపత్ప్రయత్నమును, కళాసృష్టి జరిగిన తరువాత చేయు సవరింపుమాత్రమే యగును. శ్రీ త్యాగరాజు కీర్తనల విషయమున నిది పరమసత్యము. కనుక, కీర్తనల నన్నింటిని ముందు స్వరరూపముతో వ్రాసికొని శ్రీత్యాగ

రాజు తరువాత వానికి సాహిత్యము చేర్చినారనియు, అందువలన వారి కీర్తనలలో సంగీతమునకే గాని సాహిత్యమున కంత ప్రాముఖ్యము లేద నియుఁ దలంచువా రెవరైన నున్నచో (ఉండరు!) వారు శ్రీ త్యాగ రాజు కీర్తనలలోని సాహిత్యసౌష్ఠవమును మెచ్చుకొనలేకపోయినారన వలసివచ్చునేమో! శ్రీ త్యాగరాజు కీర్తనలను భక్తివశుఁడై పాడినాఁడు గాని కష్టపడి కట్టలేదు.

శ్రీ త్యాగరాజు కీర్తనలలో సంగీతము, సాహిత్యము భావ వ్యక్తీకరణములో సమ ప్రాముఖ్యమును బొందియున్నవి. ఒక కీర్తనలో సంగీతము నింకొక కీర్తనలో సాహిత్యముఁ గొంచె మధికప్రాముఖ్య మును బొందియుండవచ్చును. అంతమాత్రము చేత రెండును నుత్తమ ముగ లేవనిగాని; ఒకటి ప్రధానము నింకొకటి యప్రధానము నని గాని నిర్ణయింపరాదు. ఆతని ఘనరాగపంచరత్నములలో భావము, భాష, సంగీతరచన,అహమహమికతో నడచినవి. అవి యుత్తమసాహిత్యమునకు, ఉత్తమసంగీతరచనకు- ఉత్తమకీర్తనలకు- పూర్ణలక్ష్యములు. 'వరాళి' రాగములోని కీర్తనలలోని యీక్రింది పంక్తులు ఎంత మోహనముగా, మధురముగా నున్నవో పరిశీలింపుఁడు

"కనకన రుచిరా కనకవసన నిన్ను
దినదినమును మనసున చనువున నిన్ను (క)

1. పాలు గారుమోమున శ్రీయపార మహిమ దనరు నిన్ను ॥క॥
2. తళతళ మను ముఖకళ కలిగిన సీత

కులుకుచు ఓరకన్నులను జూచు నిన్ను ॥క॥

అచ్చులో చూచి, మనంతట మనము చదువుకొనునప్పుడు- దీనిలోని సంగీతరచనాసౌందర్యము, లుప్త మగును గనుక- కలుగు నానందము, సగ మగును. జంత్రముపై దీనిని విన్నపుడు- సాహిత్యసౌష్ఠవము విన బడదు గనుక-కలుగు నానందము, సగ మగును. కాని,యుత్తమభావుకు నకు రెంటను, వరుసగా సంగీతసాహిత్యస్ఫూర్తి కలిగి యానందము కలు గక పోదు. ఉత్తమ గాయకుఁడు పాడగా విన్నచో, ఈ చరణములు సంగీత సాహిత్యముల కూడలి యని యెవ రంగీకరింపరు ? శ్రీ రామ

చంద్రుని రూపము "కన కన రుచి" అంట! మన పెద్దలు కూడ, "క్షణే క్షణే యన్నవతా ముపై
గదా పలికిరి! తేటతెనుఁగు మాటలతో, ఎంత సూటిగా, శ్రీ త్యాగరాజు ఈ గంభీర భావమును వ్యక్తము చేసెనో పరిశీలింపుఁడు. ఇక్కడ సాహిత్యమునకుఁ బ్రాముఖ్యము లేదని యెవరనఁగలరు. ఇంక, "తళతళమను ముఖకళ గలిగిన సీత" అనుచోట, సీతయొక్క సౌందర్యము, శ్రీరామచంద్రుని జూచినప్పుడే విధముగ ద్విగుణీకృత మైనదో "తళతళ" అనునది చూపుచున్నది. సీతయొక్క సౌందర్య సౌశీల్యములు, శ్రీరామచంద్రుని నేకపత్నీ వ్రతునిగఁ జేసినవి! అట్టి సీతమ్మకే, శ్రీరామచంద్రుని జూచినవెంటనే, ముఖము తళతళ మెఱసి, క్రొత్త వెలుఁగులు తోఁచినవి. అనఁగా, శ్రీరాముఁ డెంత సౌందర్యమూర్తియో! కనుకనే, ఆతని మూర్తి "కనకన రుచి" అని, శ్రీ త్యాగరాజు సమన్వయము. ఇట శ్రీ త్యాగరాజు ప్రయోగించిన "కులుకుచు", "ఓరకన్నుల" అను పదము లతిలోకసుందరములు. అనన్యసామాన్య వాల్లభ్యశోభితులు సీతారాములు. జగత్తునకుఁ బితరులు. వారికి మనుష్యత్వమును గల్పించి వర్ణించుచు, నాయిక యగు సీత "కులుకుచు ఓరకనుల" నాయకుఁడగు రాముని జూచిన దని వర్ణించి శ్రీ త్యాగరాజు రసికహృదయముల నానందాబ్ధిలో నోలలాడించెను. ఈ సన్నివేశమునఁ బ్రయోగింపఁదగిన పదములలో నింతకంటె లలిత మైనవి, రమ్య మైనవి లే వనుట సత్య దూరము కాదు.

మహాకవి యగు పోతన్నగారికిని, వాగ్గేయకారుఁడైన త్యాగయ్యగారికిని నెన్నియో పోలికలు కలవు. ఇద్దరును నిర్లిప్తులే. "కావ్యకన్యకన్ గూళల కిచ్చి, యప్పడుపుకూడు భుజించుటకంటె", ఉన్నదానితోఁ దృప్తిపడి, శ్రీరాముని సేవించుచు జీవించుట శ్రేష్ఠ మని పోతన్నగా రభిప్రాయ పడిరి. "నిధి చాల సుఖమా, రాముని సన్నిధి సేవా", అని ప్రశ్నించుకొనిరి త్యాగయ్యగారు. పదప్రయోగమునందును, భావ వ్యక్తీకరణమునందును; భక్తియందును, జీవితదృక్పథమునందును; వీరికిఁ జాల పోలికలు గలవు. ఇరువురును సహజ పాండిత్యవైభవోపేతులు

తన కీర్తనలలో సాహిత్యమునకుఁ దగినంత ప్రాముఖ్యము లేదని శ్రీత్యాగ రాజు తలంచినచో, సాహిత్యరచన యంత హృద్యముగ నుండియుండె డిది కాదు. శ్రీ త్యాగరాజు కీర్తనలలో సంగీతమునకే ప్రాముఖ్యము, అని కొందఱనుకొనుటకుఁ గారణ మిది కావచ్చును. ఇంతవఱకుఁ దెలుఁగు సరిగా రానివారు- సంగీతరచనకు మాత్రమే ప్రాముఖ్య మిచ్చి కీర్తన లను సాధనచేసినవారు- ఈ సంప్రదాయమును దమయందుంచుకొనిరి. వారికి భాష సరిగ రాకపోవుటవలన, తెనుఁగులోని తీపిని గుర్తింపలేక పోయిరి. ఆదిలోఁ గొందఱు గుర్తించినను, క్రమక్రమముగ వారు సంగీత రచనకే ప్రాముఖ్యమంతయు నీయఁజొచ్చిరి. ఈ కారణ మెటు లున్నను, అవకాశ మున్న సహృదయులు రెండింటి మాధుర్యమును గ్రహించుట మనకుఁ దెలియనిది కాదు.

శ్రీ త్యాగరాజు కీర్తనలలో నన్నిచోటులయందు కనఁబడు శబ్దా లంకారములకు, అర్థాలంకారములకు, వ్యంగ్యవైభవమునకుఁ గల స్థాన మును గుర్తింపవలెను. స్థూలముగ నైనను శ్రీ త్యాగరాజు సాహిత్యము ను బరిశీలించిన, దాని వైశిష్ట్యము తెలియును. కొన్ని మచ్చుతును కలు-

"మనసా మన సామర్థ్య మేమి"
"సిటో మెల్లని మాటో కన్నుల తేటో మరి వలెవాటో"
"వందనము రఘునందన సేతుబంధన భక్తచందన రామ"
"శ్రీదమా నాతో వాదమా నే భేదమా ఇది మోదమా రామ."

శ్రీ త్యాగరాజు సాహిత్యములోని యక్షరరమ్యతను, శయ్యాసౌభాగ్య మును "ఎంతని నే వర్ణింతును."

"సుందరముఖ మరవిందనయన మఘబృందపర్వతపురందర మనఘ స
నందననుత మానందజలధి మహిబృందసుభూషణ వందిత చరణమ్."
మొదలగు చరణములలో నున్న పదగుంఫనము, సాహిత్యప్రాముఖ్య మును దలంపని వాగ్గేయకారుఁడు చేయునా?

"అలక లల్లలాడ, ముద్దుమోము ఏలాగు చెలంగెనో" అని వ్రాసిన- కాదు, పాడిన-శ్రీ త్యాగరాజునకు సాహిత్యముమీఁద దృష్టి లేదని యనుట యెట్లు?

"బంగారు మేటిపాన్పుపై భామామణి జానకి శృంగారించుకొని
చెలువొంద నిన్ను కని పొంగుచు మల్లెవిరుల పూజించు వేళ.

శ్రీహరి సంగీతము పాడు మను సామి త్యాగరాజునితో" అని వేఁడిన శ్రీ త్యాగరాజుయొక్క భావలాలిత్యమును, శబ్దమార్దవమును, అమలిన శృంగారరసపోషణమును గుర్తింపకుండు టెట్లు?

శ్రీ త్యాగరాజు తన రచనల ద్వారమున, తనయొక్క సంఘ వైశేష్యమును బ్రదర్శించెను. మూఢాచారములను, డాంభికుల కృత్యములను విమర్శించెను. ఈ విషయములో నీయన వేమనవంటివాఁడు, శ్రీ త్యాగరాజు, సాధ్యమైనంతవఱకు, వేమనవలెనే తేట తెనుఁగు మాటలలో రచన సాగించెను. ఈ క్రింది చరణములు పరిశీలింపుఁడు-

"తెలియలేరు రామభక్తి మార్గమును
వేగిలేచి నీట మునిఁగి భూతిబూసి
వేళ్ళనెంచి వెలికి శ్లాఘనీయులై
బాగపైక మార్జన లోలులై రేగాని."

అని దాంభికులను దీవ్రముగ విమర్శించెను. సాహిత్యము నర్థముచేసికొని, ప్రజలు తమ తప్పులను దిద్దుకొందు రని శ్రీ త్యాగరా జిటుల వ్రాసినాఁడుగాని, కేవలము స్వరకల్పనలతోడనే తృప్తిపడి, తన కీర్తనలలోని సాహిత్యమును విస్మరింతు రని యనుకొనినచో నిట్లు వ్రాసెడివాఁడే కాఁడు. సంఘములోని దురాచారములను వెల్లడించి ప్రజలలో బ్రబలిన యవినీతిని దొలఁగించుటకుఁ గీర్తనలను గొన్నికొన్ని చోటులందు- శ్రీ త్యాగరా జాధారముగ చేసికొనినటుల తోఁచును. ఇట్టి పట్టులందు శ్రీ త్యాగరాజు సంగీతము నుపయోగించినటుల, వేమన హాస్యము నుపయోగించెను. తాపత్రయాగ్నిసంతప్తులకీ మార్గములలో బోధ పంచదార పొదిగిన చేఁదుమాత్ర. ఒకరిదృష్టి యానందింపఁజేసి జనులను సన్మార్గములోఁ బెట్టవలె నని. ఇంకొకరి దృష్టి, నవ్వించి

ప్రజల ప్రవృత్తిని మార్చవలె నని, మార్గములు వేరైనను, గమ్యస్థాన మొకటే.

తెనుఁగు నుడికారపు సొంపు చెడకుండఁ దన యునికిని బట్టి వచ్చిన తమిళ నుడికార మక్కడక్కడ నున్నను, ఉత్తమ సాహిత్యమును, ఉత్తమసంగీతమునకు జతకూర్చిన నేర్పరి శ్రీ త్యాగరాజు. చక్కని జాతీయములు, లోకోక్తులు యథాసందర్భముగ పాడినాఁడు. కొన్నింటిని బరిశీలింపుఁడు-

"గణనాథు సేయఁకోరఁగ కడు వానరుఁడై తీరెగా"
"సూకలు పదివేలున్న చేరెడు నూకలు గతిగాని ఓ మనసా"
"కోకలు వెయ్యున్న కట్టుకొనుట ఒకటే గాని"
"పరునిండి పారిన పాత్రకు తగునీరు వచ్చుగాని"
"వృషరాజుల కటుకుల రుచి తెలియు చందముగాని"
"చెవిటికి ఉపదేశించినటు"

ఇట్టి ప్రయోగములకు సార్థక్యము, సంగీతముతోపాటు సాహిత్యమునకును బ్రాముఖ్య మున్ననే గదా !

కొన్నికొన్ని చోటులందు, రాగముల పేరులను నెగతాళిచేయుచున్నాఁడా యనునటుల,కీర్తనలను బ్రారంభించి శ్రీత్యాగరాజు,మహానుభావులకు మాత్రమే ఉండు- అన్ని వేళలందు మందహాసము చేయగలిగియుండుట అను-లక్షణమును బ్రదర్శించెను.మచ్చున కొక్క యుదాహరణము- రాగముపేరు 'సరసాంగి'. కీర్తన "మేను జూచి మోస పోకు" అని ప్రారంభించును !

ఈతని సాహిత్యములో వ్యాకరణ మంగీకరింపని ప్రయోగములు చాల గలవు కనుక, ఈతనికి సాహిత్యముమీఁద నంత దృష్టిలేదు, అని కొంద ఱనవచ్చును. వ్యాకరణ మంగీకరింపని ప్రయోగములుచేసిన మహాకవు లెందఱో తెలుఁగుసాహిత్యములోఁ గల రని, వారికి సమాధానము.

శ్రీ త్యాగరాజు 'సాహిత్యము' అని ప్రత్యేకముగ నెంతైనను వ్రాయవచ్చును. ఇప్పుడు నా యుద్దేశము, సంగీతసాహిత్యముల నన్ని

హితత్వము సోదాహరణముగ చూపుటేగాని, శ్రీ త్యాగరాజునుగూర్చి వ్రాయుట కాదుగాన, ఇంక విపులముగఁ జర్చింపను. సంగీతసాహిత్యముల సన్నిహితత్వమును జక్కఁగ గుర్తించి, ఆచరణలో పెట్టినమహానుభావుని నా వాదమునకు నుదాహరణముగఁ దెచ్చుకొనుటకై యింతగ శ్రీ త్యాగరాజు కీర్తనలలోని సాహిత్యమును గురించి వ్రాయవలసి వచ్చెను. "నిగమశిరోర్థము కల్గిన నిజవాక్కులతో స్వరశుద్ధముతో యతివిశ్రమసద్భక్తి, విరతిద్రాక్షారస నవరసయుతకృతిచే" భగవంతుని మెప్పింపనెంచిన శ్రీత్యాగరాజే, ఈ విషయమునఁ దనకు గల యభిప్రాయమును దానే వ్యక్తము చేసెను గదా!

నవీనులలో సుప్రసిద్ధసంగీత లక్షణవేత్తయగు సంగీత కళానిధి శ్రీ టి. వి. సుబ్బారావుగారు, "There is not a single kirtana of Tyagaraja that is not is remarkable for fhe exquisite beauty of ideas as for the unspeakable charm of its melody and rythm" అని వ్రాసి, సంగీత సాహిత్యములకు శ్రీ త్యాగరాజు కీర్తనలలోఁ గల పొందికను జక్కఁగ వివరించిరి. వారే, శ్రీ త్యాగరాజు కీర్తనలలో సంగీతసాహిత్యములకుఁ గల ప్రణయమును గురించి వ్రాయు సందర్భమున నిట్లనిరి—

"Tyagaraja is a poet of the noblest rank. He did not choose the from of verse. He did better. He married his words to to immortal music." ఈ వివాహ బంధములో నొకప్పు డొకరిది పై చేయి. ఇంకొకప్పు డింకొకరిది పై చేయి. ఇరువురిలో నెవరును నప్రధానులు కారుగదా!

సంస్కృతములో రచనలు సాగించిన వాగ్గేయకారులుకూడ, ఈ సన్నిహితత్వమును గుర్తించి వ్రాసినవారే. "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" అయిన శ్రీ జయదేవుని 'గీతగోవిందము'లోని సంగీత సాహిత్యముల ప్రణయము; శ్రీ నారాయణతీర్థులవారి 'శ్రీ కృష్ణ లీలా తరంగిణి'లోని సంగీత సాహిత్యముల వాల్లభ్యము; జగత్తునకుఁ దల్లిదండ్రులైన 'రాధామాధవుల' ప్రణయమువలెనే, వాల్లభ్యమువలెనే, అవిచ్ఛిన్నము, అనుపమానము. ఉత్తర దేశములో "మీరాకే

ప్రభు గిరిధరనాగర'' అని పాడగా విన్నప్పుడు, భక్తమీరా సంగీత సాహిత్యముల నెంత సున్నితముగఁ గలిపినదా! అని ఆనందము కలుగును. కబీర్, సూర్‌దాస్, చండీదాస్, విద్యాపతి మొదలగువారి విషయమును నింతే! మార్గసంగీత మైనను, దేశిసంగీత మైనను సాహిత్య సాహచర్యము విడిచిపెట్టక పూర్ణకళాబింబ మైనది.

జానపదగేయములలో నాదినుండియు, సంగీత సాహిత్యములకుఁ జక్కని పొందిక కలదు. లలిత మైన భాషలో వ్యక్తము చేయఁబడిన భావములకుఁ జక్కని సంగీతము జతకూడి మాధుర్యము నినుమడింపఁ జేయును. నేఁటికాలములో బయలుదేరుచున్న గేయములు, సంగీత సాహిత్యముల స్నేహముచేతనే జనాదరమును జూఱగొనుచున్నవి. శాస్త్రీయ సంగీతము గల కీర్తనలనుండి, జానపద సంగీతము గల గేయములవఱకు నన్నియు నీ సన్నిహితత్వమును జూపుచున్నవి. ఆధునికకాలములో వంగదేశములలో విశేషప్రచారము బొందిన 'రవీంద్రసంగీతము'. సంగీతసాహిత్యములకు సమానగౌరవము గల సృష్టి యిది సంప్రదాయసిద్ధ మైనది కాకపోయినను, రసికుల నానందింపఁజేయుచున్నది. ఈ విధముగ ననేక స్థాయులలో, అనేకరీతులలో, సంగీత సాహిత్యములు కలిసి సహృదయుల కానందము నిచ్చుచున్నవి.

ఈసందర్భమున మనము స్మరింపవలసినది దక్షిణాంధ్రయుగము. నాఁటి విద్వద్వరేణ్యు లైన ప్రభువులను స్మరింపకుండుట యపచారము. ఆ యుగములో సంగీతములో జరిగినంత కృషి యంతకుఁబూర్వ మే యొక్క యుగములోను జరుగలే దనుట సత్యదూరము కాదు. ఆ యుగము నెలకొల్పిన సంప్రదాయములకును, విద్యాపరంపరకును జెందిన వారే శ్రీ త్యాగరాజువంటి వాగ్గేయకారులు. సంగీత సాహిత్యములు రెండును పొంగి పొరలిన కాల మది. ఆకాలమున సంగీతజ్ఞులు సాహిత్యవేత్తలు. సాహిత్యవేత్తలు సంగీతజ్ఞులు. మహాప్రభువు లుభయకళావేదులు. గాత్రసంగీతమును, జంత్ర సంగీతమును సమముగ నభివృద్ధి పొందినవి. ఆ యుగము చివరి దినములలో 'వాయులీనము' కూడ రంగస్థలమున ప్రవేశించి మన్ననలను బొందుట మొదలుపెట్టెను. వీణ

కాలానుగుణముగ మార్పులను బొందుచు వచ్చినను, దేశీయ మైన జంత్రమే గనుక దానికిని గౌరవమునకు లోపము లేదు మహానుభావులు రచించిన కృతులు గాయకులచేతను, జంత్రనిపుణులచేతను సమానముగ నాదరింపఁబడి సాధింపఁబడుచుండెను.

ఇఁక, జంత్రముయొక్క స్థానమునుగూర్చి కొంత చర్చింపవలసి యున్నది. సాహిత్యమునకు సంబంధించినంతవఱకు జంత్రమునకుఁ బ్రసక్తి లేకున్నను, జంత్రసంగీతమునకు గాత్రసంగీతముతో సహసమగు ప్రాధాన్య ముండుటవలనఁ గొంత విమర్శింపవలసియున్నది. జంత్రసంగీతములో గాత్రములో వలె సాహిత్యము- కీర్తన లోనిది-వినఁబడ దను విషయము నెల్లరు నెఱింగినదే. ఉదాహరణకు శ్రీరాగములోని "ఎందరో మహానుభావులు" అను కీర్తనను గ్రహింతము. కీర్తనయొక్క సాహిత్యము ముందుగాఁ దెలియనివానికి నా కీర్తనయొకజంత్రముమీఁద వాయించు నప్పుడు, ఆ రాగ మీయఁగలిగిన భావము కలుగును గాని, గాయకుఁడు పాడునపుడు కలుగువిధముగ- సాహిత్యభావముకూడ కలిపి- పూర్ణముగ భావస్ఫూర్తి, రసస్ఫూర్తి కలుగదుగదా! కాని, జంత్రముకూడ మహాప్రతిభావంతుల చేతులలో, సాహిత్యముయొక్క విన్యాసమును గూడ చూపి, చాలవఱకు రాగభావముతోపాటు సాహిత్యభావమును మనకు వినిపింపవచ్చును. మహాప్రవీణులు జంత్రమును చేఁబూని, "ఓరంగశాయీ, పిలిచితే ఓ యనుచు రారాదా", అని పలికించిన 'ఓ' అని సమాధానము రావచ్చును! కాని; శబ్దార్థములు శరీరముగ, ధ్వనిజీవముగ, అలంక్రియావితానము సొమ్ములుగ, గల సాహిత్యేందిర సమ్యగ్రూపము సహృదయులకుఁ గూడ జంత్రమువలన-గాత్రమునందువలె- గోచరింపదుగదా!

సాహిత్యముతో నిమిత్తము లేని శుద్ధసంగీతమును- రాగభావ ప్రాముఖ్యమును జూపుదానిని- జంత్రముమీఁద వాయించినప్పుడు విన్నచో జంత్రముయొక్క ప్రత్యేకత మనకు వ్యక్త మగును. అట్టి స్థలములందు, జంత్ర మొక్కొక్కప్పుడు గాత్రము చేయలేని పనులనుగూడ చేసి, శుద్ధసంగీతముయొక్క లోఁతులందు, ఎత్తులందు విహరించి- సం

పూర్ణ మూర్తిని మనకుఁ జూపును. అనుమంద్ర, అతితారస్థాయులు మన గాత్రములలో సాధారణముగఁ బలుకవు. అందువలన గాత్రగాన ప్రబంధములలో, ఆరెండు స్థాయులలో సంచారము కానరాదు. ఇవి రెండును జంత్రమున వినవచ్చును. అనఁగా, జంత్రము వలసినప్పుడు గాత్రము నతిక్రమింపఁగలదన్నమాట! మన దేశములో బహుళ ప్రచారములో నున్న వీణా వాయులీనములను నుదాహరణములుగ గ్రహించి పరిశీలింతము. మన గాత్రములు సాధారణముగ-మంద్రస్థాయి మధ్యమము మొదలు, తారస్థాయి పంచమమువఱకుఁ బలుకును. ఇంక వీణపైన - అనుమంద్రస్థాయి పంచమము మొదలు, అతితారస్థాయి షడ్జమమువఱకు- మెట్లు (స్వరస్థానములు) అమర్చబడియుండును. వాయులీనము- మంద్రస్థాయి షడ్జమము మొదలు, అతి తారస్థాయి షడ్జమమువఱకు-అనఁగా నాలుగు స్థాయులు( Octaves) పలుకును. ఇంకను నెక్కువదూరము పోఁగలిగినవా రుందురఁట! వాయులీనము పాశ్చాత్యులు బాగుగ నభివృద్ధి చేసిన జంత్రముగనుక, దానికి వారి సంగీతము యొక్క యావశ్యకతనుబట్టి వారు శక్తిఁ గల్పించుకొనిరి. ఈ విధముగ జంత్రము, కొన్ని ప్రత్యేకశక్తులను గలిగియుండి మనల నానందింపఁ జేయును.

శ్రీ త్యాగరాజు కాలమునాఁడు గాయకులు "సొగసుగ మృదంగ తాళముల"ను జతచేసి, తంబురా శ్రుతితోఁ బాడెడివారు. గాయకునకు సహకారముగ, నేఁ డున్నటుల, వెనుకకు జంత్రమున్నట్లు తోఁచదని పెద్ద లనుచున్నారు. జంత్రగాని మనోధర్మమునకును, గాయకుని మనోధర్మమునకును బొత్తు కుదురదను భయమే, దీనికి కారణము కావచ్చును. ఇఁక వీణావాద్యము ప్రత్యేకముగ నుండెను. దీనికిని మృదంగతాళముల జత, తంబురా శ్రుతి ఉండెడివి. కాని, జంత్రవాదకులు, భావోద్రేకములోఁ దమ గాత్రమును జంత్రముతో మేళవించి సమ్మోహనముగఁ బాడుట కలదు. నేఁటికిని, వీణ వాయించువారు, జంత్రమునకు సహకారముగఁ బాడుటకూడ మన మెఱింగినదే. వేఱుగ జంత్రవాదకుఁడు సహకారిగా నుండుట, ఈ నడుమ కాలములో ముఖ్యముగా వాయులీనము

ప్రబలిన తరువాత- సంప్రదాయ మైనటుల తోఁచుచున్నది. మన దేశములో వాయులీనము ప్రచారమునకు వచ్చిన తొలినాళ్ళలో, వాయులీన వాదకులును- అక్కడక్కడ- తమ గాత్రములను జంత్రము తో మేళగించుట కూడ నుండెడి దని పెద్దలు చెప్పుచున్నారు. ఇప్పుడు గాత్రమునకు వాయులీనముగాని, వీణగాని, వీణకు వాయులీనము, వాయులీనమునకు వీణ; వేణువునకు వీణగాని, వాయులీనముగాని సహకారముగా నుండుట పరిపాటి యయినది. వీణలోఁగాని, వాయులీనము లోఁ గాని మహాప్రతిభావంతు లని పేరు పొందిన వారు, ఆ వాద్యములతో గాత్రమును మేళవించుట యను సంప్రదాయము నేఁడు లే దనియే చెప్ప వచ్చును. రేడియోవారుకూడ నీ పద్ధతిని ప్రోత్సహించుటలేదు. కాని, ఈ సంప్రదాయమువలన సాహిత్యమును వినుట కవకాశ ముండెడిది. స్వరకల్పన, రాగాలాపన మొదలగువానిని జంత్రముమీఁదఁ జూపినను, సాహిత్యమును నోటితో నను‌టవలన, సాహిత్యము కలిగించు భావ స్ఫూర్తి యీ సంప్రదాయములోఁ గలదు. నేఁ డీ సంప్రదాయము పోవుట వలన, సంగీత సాహిత్యములను రెంటిని వినవలె నన్న గాత్రమును, కేవలము సంగీతరచననే ప్రముఖముగ వినవలె నన్న జంత్రమును మన కుపాదేయము లైనవి. ఈ విధముగా జంత్రము క్రమక్రమముగఁ గీర్తనలోని సాహిత్యమునకు మనలను దూరముచేయుచున్నది. ముందుతరములోని జంత్రివాదకులు సాహిత్యమునే స్మరింపక, కేవల సంగీతరచనను- స్వర ప్రస్తారమును మాత్రమే- అభ్యసించుట కూడ పొసఁగవచ్చును. వివిధ భాషలు కల మన దేశములో, భాషాకలహములు ప్రబలినచో దేశమున కంతకుఁ బనికివచ్చు కీర్తనలే లేకపోవచ్చును. ఈ సంకుచితదృష్టి కొంత వఱకుఁ గొందఱిలోఁ బ్రబలుటవలననే, మహానుభావుఁడైన శ్రీత్యాగరాజు కీర్తనలు దక్షిణ దేశములో నందఱకుఁ బనికిరాకపోవుచున్నవి. ఇది సహృదయుల కందఱకు విచారకారణము. సాహిత్య మర్థముకాకపోవుట వలన నందఱకును నక్కఱలేకపోయినను, సంగీతరచన దాక్షిణాత్యుల కందఱకు సమానమే గనుక, మహానుభావు లైన వాగ్గేయకారుల రచనలు- ముఖ్యముగ జంత్రములపైఁ బ్రచారములో నుండుట కవకాశము కలదు. భాషావిభేదములు కూడ, జంత్రములకే, నవీనయంత్రయుగ

మునఁ బ్రాముఖ్యమును దెచ్చునట్లున్నవి. అప్పుడు మన దేశమునఁగూడఁ బాశ్చాత్యదేశములలో వలెనే, జంత్రములు ప్రముఖస్థానమును సంగీతరంగమున నాక్రమించును.

ఇట, పశ్చిమదేశములలోని మహాప్రతిభావంతులైన సంగీత విద్వాంసులనుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. అక్కడ మహానుభావులైన బాక్ (Bach) బిథోవెన్ (Beethoven) మొదలగువారు శ్రీ త్యాగరాజాదులవలె వాగ్గేయకారులు కారు. కనుక వారి సంగీత రచనలకు సాహిత్యప్రసక్తియే లేదు. కనుకనే, వారి సంగీతరచనను-సంగీతలిపిలో నున్నదానిని గంటెముందుంచుకొనిగాని యచ్చటి విద్వాంసులు సభలు చేయరు. సాహిత్యముతో మిళితమై యున్న మన సంగీత రచనకా బాధ లేదు. గాయకునకును మన పద్ధతిలో స్వేచ్ఛ- సృష్టివిషయమునఁ గలదు. వారికది తక్కువ. మన దేశమందలి ప్రసిద్ధవాగ్గేయకారులందఱును సంగీతమును, సాహిత్యమును మేళవించియే రచనలు కావించిరి. ఇది గొప్ప విశేషము. మన ప్రసిద్ధవాగ్గేయకారులందఱును గవులును, గాయకులును గూడ పశ్చిమదేశములలో నట్టివారరుదు. పశ్చిమదేశములలో వ్యాప్తముగ నున్న 'సంగీతలిపి' ఒకటియే గనుక, దేశకాలములతో నిమిత్తము లేకుండ, ఆ సంగీతరచనలు వ్యాప్తములైనవి. వానికి భాషతో ప్రసక్తి లేదుగనుక, వివిధభాషలుగల దేశములలో వానికి ప్రచారము సులభమై యున్నది. మరియుఁ బాశ్చాత్యసంగీతము 'స్వరైక్యసంప్రదాయ పద్ధతి' ననుసరించును గావున నొకే సమయమున రెండుమూఁడు స్వరములు 'హార్మొనీ' కలవి పలుకును గనుక- వారికి రెండుమూడు జంత్రముల సమ్మేళన మావశ్యకమయినది. అందుచేతనే వారి సంగీతమున జంత్రపుష్టి యెక్కువ. ఆర్కెస్ట్రా (Orchestra) అవతరించుట కదియే మూలము.

ఇఁక భారతీయ సంగీతముయొక్క వైశిష్ట్యమును గూర్చి కొంత ముచ్చటింపవలసి యున్నది. హిందూస్థానీ, కర్ణాటక సంగీతములుగఁ బ్రస్తుత భారతీయ సంగీతము ద్విధా విభాగింపఁబడినను, ఈ రెండిటికిని మూల సూత్రములలో భేదము లేదు. రెండింటికిని మాతృక ప్రాచీన

మైన భారతీయ సంగీతమే. రెండింటి యాదర్శములును నాశయములును నొకే గమ్యస్థానమునకు మనలను దీసికొని పోవును. ముస్లిముల సంపర్కము వలన నుత్తరదేశములో సాంస్కృతికముగఁ జాల మార్పులు వచ్చినవి. అవి సంగీతరంగముననుం వచ్చినవి. ఆ మార్పులను బొంది పొంది, ఉత్తరదేశములోని పూర్వసంగీతము హిందూస్థానీ సంగీతముగఁ బరిఢవిల్లినది. కర్ణాటకసంగీతమున కట్టి మార్పు లంతగా రాలేదు. కనుక నిది ప్రాచీన సంప్రదాయమునకు మిక్కిలి సన్నిహితముగ నుండి యభివృద్ధికి వచ్చినది. కాని, యీ రెండువిధములైన భారతీయ సంగీతములును బరస్పరము పొందిక లేనివి కావు. రాగములలో రెండింటికి నెన్నియో పోలికలు కలవు. ఒక పద్ధతిలోని రాగములు రెండవ పద్ధతిలోనికి గ్రహింపఁబడి, అక్కడ ప్రముఖస్థానమును వహించి యున్నవి. ఔత్తరాహ గాయకులు దక్షిణదేశమునను, దాక్షిణాత్యు లుత్తరదేశమునను నభిమానింపఁబడి గౌరవమును బొందుట మనకుఁ దెలిసినదే. అతీంద్రియమైన దివ్యానుభూతిని నీ రెండు పద్ధతులకుఁ జెందిన సంగీతములు నీయఁగల వని విజ్ఞు లందఱు గుర్తించినదియే గదా!

'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని పెద్దలు చెప్పినను, బ్రహ్మానుసంధానమునకు సంగీతము "చక్కని రాజమార్గ" మని సాధించి చూపిన వాగ్గేయకారులు మనకుఁ గలరు. ఇట్టివా రుండుటయే మన సంగీతముయొక్క ప్రత్యేకత. భారతీయుని జీవితములోని ప్రతి భాగమునకును మతముతో సన్నిహితత్వము గలదు. ఆతని యుదాత్త దివ్యకళలకుఁ జాలవఱకు మతము వలననే ప్రేరణ కలిగినది. సంగీతముకూడ నట్టి ప్రేరణమునే పొంది, వికసించి 'మోక్షమునకు ఘంటాపథమును' నిర్మించినది.

ఈ ఘంటాపథమును నిర్మించుటకు భారతీయసంగీతము భావ, రాగ, తాళముల నాశ్రయించినది. భావావేశము నధికము చేయుటకు సంగీతరచనకు భాష తోడైనది. ఈ రెండును గలిసి యతీంద్రియానుభూతిని బురుషునకుఁ గలిగించి యాతనిని బురుషోత్తమునిగఁ జేసినవి. రాగము, తాళములు భావమునకుఁ బరిపోషకములై, సంగీతమునకుఁ

బూర్ణత్వమును దెచ్చినవి. ఈ పూర్ణత్వమునకై సాధనచేసిన మనవారు సంప్రదాయసిద్ధమైన మాధుర్యపద్ధతినే యవలంబించిరి గాని, ఇంకొక పద్ధతి నభివృద్ధి చేయలేదు. భక్తిని బరమేశ్వరుని బొందుటకుఁ బరమసాధనముగఁ జేసికొనిన వాగ్గేయకారులు 'మధురపద్ధతి' నవలంబించుటలో నాశ్చర్యము లేదు. కాని, మన దేశమున నిప్పుడు-ముఖ్యముగా సినిమాలవలన-ఆర్కెస్ట్రా యవతరించినది. మనసంప్రదాయములకు వ్యతిరేకములగు సంప్రదాయములు, అనేకములైన జీవితరంగములలోఁ బాశ్చాత్యసంపర్కమువలన వచ్చినట్లే, సంగీతమునను నిది వచ్చినది. క్రొత్తదనమందు మోజెక్కువగ నుండు యువకుల నిది యాకర్షించుచున్నది. కొందఱు యువకులైన సంగీతవిద్వాంసు లుత్తరదేశములో ముఖ్యముగ భారతీయజంత్రములతోడనే 'ఆర్కెస్ట్రా'ను నిర్మించుచున్నారు. మరి కొందఱు పాశ్చాత్యజంత్రములను గూడఁ గలుపుచున్నారు. సంప్రదాయవాదులైన మహావిద్వాంసులీ 'సంకరము' కూడ దనుచున్నారు. ఏది యెట్లైన నీ యంత్రయుగమున, జంత్రమునకే ప్రాముఖ్యమధిక మగుచున్నటుల కన్పట్టుచున్నది.

ఇఁక, జంత్రమును వదలి పరీక్షించినచో సంగీత సాహిత్యముల 'నీరక్షీరన్యాయము' సువిదితమైనదే గదా! నేఁటివఱకు సంగీత సాహిత్యములు మన సంస్కృతిని వ్యక్తముచేయుటయే గాక, పరిరక్షించినవి. వివిధప్రాంతములను గలిపినవి. భాషలు వేఱైనను, దక్షిణదేశ రసికులను-గొంతవఱకు నౌత్తరాహులను గూడ- దగ్గఱకుఁ జేర్చినది కర్ణాటక సంగీతము కాదా? పురందరదాసు, క్షేత్రయ్య, త్యాగయ్య, శ్యామాశాస్త్రి, దీక్షితులు, స్వాతితిరునాళ్ మన కందఱకు నారాధ్యులే గదా! మాతృభాష కాని, తెనుఁగును జేర్చుకొని యెందఱు దాక్షిణాత్యులు మధురరచనలు చేయలేదు. ఈ విధముగా నొకేప్రాంతములో నీ వ్యక్తుల నడుమఁ గల వైషమ్యములను, వివిధ ప్రాంతములందలి వారి భేదములను, నంతరింపఁజేయుటకే యీ రెండు కళలును కీర్తన రూపమున నభివ్యక్తములైనవి. ఈ రెండును-నుమ్మడిగా, విడిగా-మన కెప్పుడు నారాధింపఁదగిన వే.

అందులకే మన సంస్కృతికిఁ జిహ్నము, ఆదర్శము-పుస్తకవీణాపాణి.

# ఆంధ్రవ్యాకరణము

వేదాంతపారీణ, విద్యారత్న, విద్వాన్
కోపల్లె శివకామేశ్వరరావు

బ్రహ్మణాం జీవయన్తీ యా శక్తిర్వాచాం విరాజతే
తాం బ్రహ్మణీం త్విషీ వాచో వన్దే శ్రీమాతృరూపిణీమ్.
చంద్రాన్నైవ తథా సుధా సరతి, నైవార్కాజ్జగచ్చక్షుషో
భాసో భాన్తి తథా, తథా దమునసో దీప్తిర్న చోజ్జృంభతే
హృత్పద్మస్థితబోధశక్తి దరహాసోన్మిశ్రవీక్షా యథా
భ్రాన్త్యంతర్బహిరంధకారహరణే దక్షాః స్తుమస్తాం న కిమ్.
యైః సుమహాన్ కృతో యత్న ఆంధ్రవాగనుశాసనే
జయన్తు తే యశోనిత్యా లోకశాస్త్రాదిపారగాః.

సదస్సునకు నమస్య. 'ఆంధ్రమునకు సర్వసమ్మతము పర్యాప్తము నగు వ్యాకరణ స్వరూప'మను విషయమును 'జర్చించుటకు' మన మిచ్చట సమావేశితుల మైతిమి. మిత్రనియోగమున నీ చర్చారంభమును జేయువాఁడ నే నగుట యొక భాగ్యవిశేషము.

చర్చకై సమావేశితుల మైన మనము (చిచర్చిషులమా/చిచర్చయిషులమా) యనునది ముందుగాఁ దెలియవలయుట లెస్స. పరిభాషణ హింసాతర్జనార్థములందును, బరిభాషణ భర్త్సనార్థములయందును, నధ్యయనార్థమునను 'చర్చ'ధాతువు కానవచ్చుచున్నది. మనము వ్యాకరణ పరిభాషణ హింసాతర్జనములఁ జేయుటకు నన్యోన్యపరిభాషణాదుల సదితరవర్తనుల మగుట కిటకు రాలేదనుట వాస్తవము. అది కారణముగా మనము చిచర్చిషులము గాము. కాఁగా మన మట్లు కాఁగూడ దనియు మనల నాహ్వానించినవారి యభిప్రాయ మనియే 'చర్చా'శబ్దము తెల్పుచున్నది. అప్రస్తుతములైన స్థానకాద్యర్థముల విడనాడినచో నిది సంఖ్యావిచారణాశబ్దముల పర్యాయపదము. అధ్యయన మను నర్థమునందు వర్తించు చురాదిగణములోని యీ చర్చధాతువున కజ్ప్రత్యయము

'చింతిపూజికథికుంబిచర్చశ్చ' యను పద్ధతిని విధింపఁబడఁగాఁ జర్చా శబ్ద మేర్పడుచున్నది. ఇఁక సఖ్యయమునకు మర్యాద, సంఖ్యాయు విచారణయు. 'చక్షి జః ఖ్యాఞ్' కావున సంఖ్య సంఖ్యానము. సంశయార్థ మగు చురాదిగణాంతర్గత చర్చధాతువునకు 'ణ్యాసశ్రన్థో యుచ్'అను చొప్పున విచారణ. అది యట్లగుటచే మనకుఁ గరణీయ మగు చర్చ సంఖ్యానము విచారణ. మన మీ హేతువునఁ జిచర్చయిషులము. దీని నింతగా వివరింపనేల యనవచ్చుఁ గాని యాంధ్రభాషా స్వరూపమును గూర్చి స్వైరవృత్తిమై సాగినవాదముల నమ్మకమున నియమరహితముగా వ్రాయువారును బ్రసంగించు వారును మన మిట నొనర్చు నిర్ణయమును వివేకించు తఱి యిది యగుటచే నింతదూర మీ విషయమును దరిచి చెప్పవలసి వచ్చినది.

మఱి మనము చర్చింపవలసినది వ్యాకరణ సర్వసమ్మతత్వమును గూర్చి. ఎల్లవారి సమ్మతము సర్వసమ్మతము. ఎల్ల సద్వాచ్యుల మతము సర్వసమ్మతము. సద్వాచ్యులు పండితులు. ఇచ్చట సమ్మతశబ్ద ముపయోగింపఁబడినది. అందుచే నెల్లవారి సమ్మతము నగు వ్యాకరణ మని మనము గ్రహింపవలయును. ఐన నెల్లరెవరు? ఆంధ్రులు; ఆంధ్రమును మాటాడువారు. ఆబాల్యము సంస్కృతము నభ్యసించి పండితులై యాంధ్రమును మాటాడు నాంధ్రులును, దద్విధమున నాంగ్లము నభ్యసించి యాంధ్రమును మాటాడు నాంధ్రులును, సంస్కృతభాషాప్రవేశమైన లేక యాంధ్రమును మాటాడు నాంధ్రులును, విద్యాస్వరూపమెఱుఁగకయే యాంధ్రమును మాటాడు నాంధ్రులును, నాంధ్ర దేశము నివాసమై యాంధ్రజాతితోఁ గలసిమెలసి 'యురుదు' మొదలగునవి మాతృభాషలై యాంధ్రమును మాటాడు నాంధ్రులును, మఱింకఁ బలు తెఱఁగులైన యాంధ్రులును నాంధ్ర దేశమునఁ గలరు. వారు మాటాడునదియు నాంధ్రమే. ఐనచో వీరి కెల్లరికి సమ్మత మగు నాంధ్రవ్యాకరణ ముండుటకు వీలు కలదా యనునది విచారణీయాంశము.

ఈ పేర్కొనఁబడినవారును సంస్కృత ప్రాకృతాంధ్రములఁ గూలంకషప్రజ్ఞ గల్గి యాంధ్రమున వ్యవహరించు నాంధ్రులు నాంధ్రశబ్ద

వాచ్యులే. వీరును వారును నాంధ్రలోకులు. ఆంధ్రమునకు మొదట వ్యాకరణమును వ్రాయుచు నన్నయ 'సిద్ధిర్లోకాద్దృశ్యా'యనినాఁడు. కావున ముందు తెలిపిన యాంధ్రులును దరువాతఁ దెల్పిన యాంధ్రులు నగు నెల్లరు నాంధ్రలోకము కాఁగా వీ రందఱు వాడెడు భాష 'సిద్ధ' మైన దనియు, వీరి కెల్లరికి సమ్మత మగు వ్యాకరణ ముండఁదగు ననియు ననుట ప్రమాదవిలసితము. 'సిద్ధే శబ్దార్థసంబంధే' 'లోకతః' 'లోకతోఽర్థప్రయుక్తే శబ్దప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః' అను వార్త్తిక త్రయమును మనసున నిడికొని 'సిద్ధిర్లోకాద్దృశ్యా' యని నన్నయ సూత్రించె నని యభియుక్తులకుఁ దోఁచు విషయమే. పై రెండు వాక్యముల 'లోకతః' యను మాట యావృత్తిచేయఁ బడుట కాన్పించుచున్నది. ఈ యావృత్తివలని ప్రయోజనమును గ్రహించియే నన్నయ 'దృశ్యా' యను మాటను దన సూత్రమున వాడెను. ఈ వార్త్తిక యమును బట్టియే :—

'శబ్దార్థసంబంధనిమిత్తతత్త్వం వాచ్యాఽవిశేషేఽపి చ సాధ్వసాధూన్ సాధుప్రయోగానుచితాంశ్చ శిష్టా న్న వేద యో వ్యాకరణం న వేద' యను నభియుక్తోక్తియు, 'తత్త్వావబోధః శబ్దానాం నాస్తి వ్యాకరణాదృతే' యని, వ్యాకరణము, 'వాఙ్మలానాం చికిత్సిత'మ్మనుచు భర్తృహారియుఁ జెప్పెను.

అవును. అది యంతయు నిజమే. ఐనను 'లోకతః' యనువార్త్తికము 'లోకా' త్తను నన్నయ సూత్రస్థపదము, బోధించునర్థముచే నాంధ్రదేశమున నాంధ్రమును మాటాడువా రెల్లరు గ్రాహ్యులుకారా యన వచ్చును. కారు. ఎందుల కనిన వెంటనే నన్నయ చెప్పిన సమాధాన వాక్య మిది:-'లోకోఽనన్యాద్దృశశ్చ నిత్యశ్చ'. ఇట నన్నయ వాడిన ము 'సిద్ధే శబ్దార్థసంబంధే' యను వార్త్తికమునకు మహర్షి పతంజలి 'నిత్యపర్యాయవాచీ సిద్ధశబ్దః' అని చేసిన వివరణములోనిది. 'ధ్రువం కూటస్థమవిచాల్యనపాయోపజనవికార్యనుత్పత్త్యవృద్ధ్యవ్యయం యత్తన్నిత్యమితి' యను వాక్యమునందలి సంసర్గపరిణామప్రధ్వంసాని

త్యత్వములు లేనిది నిత్య మను విషయమును దెలుపువాఁడై నన్నయ 'లోక మనన్యాదృశ' మనివివరించెను. కావున నన్నయ సూత్రములందలి లోకశబ్దము సంస్కృత ప్రాకృతాంధ్రభాషాత్రియ నిష్ఠార్థమున వాడఁబడినది. అది యెట్లనఁగా నాంధ్రభాషా స్వరూప మా మూఁడు భాషల యెఱుక గలవానికే యెఱుఁగ నగును గావున.

ఇట్లు సంసర్గానిత్యమును, బరిణామానిత్యమును, షడ్భావవికార రూపప్రధ్వంసానిత్యమును గాని యనన్యాదృశనిత్యలోకముచే సంస్కృత ము లైన శబ్దములు సాధుశబ్దము లని వ్యవహరింపఁబడుట యనాదిసిద్ధము గాఁ గాన్పించుచున్నది. ఇది ప్రపంచమునందుఁగల భాషల కన్నిటికి సామాన్యధర్మము. అందులకనియే పుణ్యరాజు 'న సాధుర్యస్య వ్యాకర ణావగతః సంస్కారోఽవికలః । తద్విషయా స్త్వపభ్రంశా ఇతి' యనెను. నన్నయ వాడిన లోకశబ్దమేని 'శిష్ట' శబ్దము

'శిష్టేభ్య ఆగమాత్సిద్ధాః సాధవో ధర్మసాధనమ్
అర్థప్రత్యాయనాఽభేదే విపరీతా స్త్వసాధవః'

యను వాక్యపదీయమువలనఁ దెలియుచున్నది. నన్నయయు 'సంస్కా రార్థోఽనియమః। అనియమా గ్రామ్యం హి। యత్త్వపభ్రంశ' యని యసాధు శబ్దముల నపభ్రంశము లనెను.

ఏ నాఁడో కేతన యాంధ్రభాషాభూషణమున శిష్టాననుగృహీత ము లనియు నపభ్రంశము లనియు గ్రామ్యములనియు వస్తాఁడు,వచ్చేని, వచ్చేటి, పోదాము, తోఁపించాకుమయ్యా, వస్తోంది, వాటిని, మొదలగు మాటలను బేర్కొని యాంధ్రమున నవి ప్రయోగానర్హము లని నిందించెను. ఆ నాఁడు వాడుకలో నవి లేనియెడల నాతఁడు వాని నట్లు వ్రాసి యుండఁడు. నేఁడు నవి పామరులవాడుకలోనివే. అవి యీ నాఁడు నియమదూరులై పలువురు వాడుచుండుట సర్వవిదితమే. దీనికి హేతువు లేకపోలేదు. పరభాషయం దాదరణము;స్వభాషయం దనాదరణము; పరపాలనమున జీవికాసంపాదనమునకై యారంభ మయి, స్వభాషా విదులగు పండితకవు లాదరణము లేమిచే సన్నగిల్లిన జీవికఁగలవా రగుట

తో మేలనము నొంది, రాజాదరణము నొందుచు న్నట్లున్న పరభాషా విదు లగు శ్వవృత్తులకు సభ్యతయుఁ దదితరాక్షరజ్ఞులకు నసభ్యతయుఁ గ్రమముగా నభివృద్ధి నొందుట మొదటిహేతువు. ఉదరపోషణమునకై యభ్యసనీయమైన యాంగ్లము పరభాషయగుటచే నెంతకాల మభ్యసించి న దాని నుడికారమందనిమార్నిపం డగుటవలనఁ దమ భావప్రకటనము స్వేచ్ఛగా నందుఁ జేయనేరమి గల్గి యనాదృతమాతృభాషయందు నియమవిరుద్ధముగా భావప్రకటనము సేయఁగడఁగుట రెండవ హేతువు. రాజభాష యాంగ్లము కావుటఁ బట్టి తత్పఠనమునఁ దమకుఁ గల్గిన యసంపూర్ణజ్ఞానమున, స్వభాష రామిచే నిందలి విశేషముల యజ్ఞానమున, స్వభాషను గూర్చి యథేచ్ఛముగా సిగ్గఱి తెగనాడుట యొకటి కారణము. ఆంగ్లమునఁ గల సమస్తము సులభముగాఁ దెలియనగు నట్లున్న దనియు, నాంధ్రము పండితైకవేద్య మనియు నజ్ఞానముచేఁ దలంచుట మఱియొక హేతువు. ఇట్లు గల పరశ్శతహేతువుల వలన లోకులు పెద్దలనఁబడు రాజవిద్యాభ్యాసకుల ననుసరించుటచే స్వభాష వారికి ననాదరణపాత్రమువలెఁ గాన్పించుటచే నెల్లరును నాంధ్రమునకు శిష్టులే యైరి.

కాఁగా మఱియొక యంశమును మనము గ్రహింపవలయును. ఆంగ్లమున ఛాసరు వాని పూర్వులు రచించిన భాషకును దరువాత నున్న భాషకును గల్పితసంబంధము మాత్రము గలదు. ప్రత్యేకముగాఁ జదివినఁగాని నేఁటి యాంగ్లేయుఁ డగు నాంగ్లభాషావిదగ్ధునకు నది గ్రాహ్యము కాదు. అది హేతువుగా వారి భాషాచరిత్రమునఁ బూర్వాంగ్లమునకుఁ బరాంగ్లమునకుఁ గల భేద మత్యంత మని తెలియును. అది పఠించిన మన యాంగ్లభాషావిదులకు నన్నయ యాంధ్రమునకుఁ బెద్దన యాంధ్రమునకు వెంపరాలవారి యాంధ్రమునకు భేద మత్యంతమను నపోహమునఁ బడుట సహజ మైనది. ఈ యపోహమును వృద్ధిచేయుటకు వలసిన సామగ్రి నంతను మన కనేక సహస్రసంఖ్యాకము లగు సంవత్సరములనాఁటినుండియు వివిధభూఖండములకుఁ బ్రవహించు జనతావాహి

నుల భాషాచరిత్రముల జ్ఞానము సమకూర్చుచున్నది. ౧౦, ౧౧ శతాబ్దులనుండి పరిపూర్ణసంస్కారము నొందిన మన యాంధ్రమునకు వేయియేం డ్లయినను గడచనలేదు. బహుసహస్రవర్షాంతరములు గలిగి బహుదేశములం బ్రసరించి బహువిధసంస్కారముల నందిన భాషా కుటుంబముల చరిత్రముల సూత్రముల, మహాకాలమున బాల్యదశను గూడ నతిక్రమింపని యాంధ్రమునం బ్రయోగించి నిబద్ధము చేయం బూను వీరి యహోహమునకు మర్యాద యెక్కడను గాన్పింపదు. మఱి విద్యాశాలలయం దాంధ్రభాషాచరిత్రమును విని విని యుత్తీర్ణులై యున్నతపదవులయం దున్న వారికిఁ 'బ్రవాహ నిత్యత్వము ను' గూర్చి 'యదా యదా శబ్ద ఉచ్చారిత స్తదా తదాఽర్థాకారా బుద్ధి రుపజాయతే ఇతి ప్రవాహనిత్యత్వా దర్థస్య నిత్యత్వ' మ్మను కయ్యటవాక్యమును దెల్పి యీ పద్ధతిని బ్రవాహ నిత్యత్వమున కర్థమును జెప్పు దు మన నంగీకార మగునా? ఇట్లధికృతాధికారు లైన వారికి, వారి యనుయాయు లగు పశ్చిమదృష్టిగలవారికి సమ్మత మగు వ్యాకరణమును వ్రాయుటగాని వ్రాయించుటగాని దుస్సాధ మేమో యనిపింపక పోదు.

ఐనను నేఁడు పశ్చిమదృష్టి మరలుట కనువగు స్వాతంత్ర్యము మనకు వచ్చినది. దానితోఁబాటు ప్రత్యేక రాష్ట్రముగూడఁ జాల వఱకు భాషాప్రయుక్తమై యుదయించినది. వెనుకముందుల నాలోచించుకొని పారతంత్ర్య కంచుకాంతర్హిత మైన స్వీయస్వరూపము నేఁడపహృతకంచుకమై కానవచ్చుచున్నది గావున 'ఆర్డెన్, కాంబెల్, కాల్డ్ వెల్,' మొదలగు నివృత్తప్రభుత్వ సంబంధుల జయధ్వజులముకా మెలంగుట యెంతవఱకుచితమో మనము నిర్ణయించుకొను తఱియిది. శ్రావణశుక్రవారము గడచిన సంవత్సరమున 'సండే'నాఁడు వచ్చినది గావున విశ్రాంతి దినము కా లేదని మండలాధికారితోఁ జెప్పి శుక్రవారమును విశ్రాంతిదినముఁగా వాని నొప్పించి యనుభవించు దినములు మన కతిక్రమించినవి. మొన్న మొన్న వినీతి మెఱయు మన శాసనసభ్యు లాంధ్రముననే సర్వవ్యవహారముల నొనర్పఁదగు నిర్ణయమునకు

వచ్చిరి. నియమబద్ధ మైన పరిజ్ఞాప్రభుత్వమున వారు వీరు. నియమదూర మని వారే యనుచున్న సామ్యవాదులు వీరు గారు. వీరు వాడు భాషయు నియమదూరము కానేరదు. ఐన వీరికి స్వభాషానియమములు పూర్తిగాఁ దెలియు ననలేము. ఇప్పుడు వీరికిని ద న్నియమములు దెలియ వలయును. వీరు వానిని దెలిసికొనుటకును దప్పక కృషి చేయుదురు. వీరిలోఁ బలువురు పరభాషకు దత్తులైనను దరతరములనుండి యాంధ్రమును మాటాడు కుటుంబములఁ బుట్టి పెరిఁగినవారు కావుటచే 'ఆర్డెను' చెప్పినదియు, స్వర్గీయులు గిడుగు రామమూర్తిపంతులుగారు వ్యాప్తిలోనికిఁ దేరఁదలంచినదియు నగు వ్యావహారిక మనఁదగు నొక విధమగు నాంధ్రమును నేర్చినవారే. (ఇట్లనుటచే 'ఆర్డెన్' వ్యావహారిక భాషయే యాంధ్ర మని చెప్పినాఁడని మాత్రము భావింపకుఁడు.) New English Grammarఅను ప్రామాణికుఁడగుH. Sweet వ్రాసిన గ్రంథమునఁ... in the nature of things we must have (a practical mastery of our own language) that mastery before we begin to study grammar at all. గల యట్లు మన శాసనసభ్యులకుఁ, దదితరాధికృతాధికారులకు, వ్యవహరించుటకుఁ గొంత భాష వచ్చును. దానికి మెఱుఁగిడి శుద్ధము, నపభ్రంశమును గాని, భాషాస్వరూపమును వారికిఁ దెలుపఁదగిన సమయ మిది; వారును దెలిసికొనఁదగిన కాల మిది; వారికిఁ దెలుపఁదగిన వారము మనము. వారిని మనల ననుసరించునది జనత. అట్లగుట నిత్తఱి సర్వసమ్మత మగు వ్యాకరణమును వ్రాయ నగును. దాని కింతకుఁ బూర్వమే మేము వ్రాయ సంకల్పించితిమి. అది కొలఁది కాలములో లోకదృష్టి నాకర్షింపఁగల దని మా యాశయమును. భగవతీకృప యెట్లున్నదో!

పర్యాప్త మైన వ్యాకరణమును గూర్చిగదా మనము చర్చింప వలయును. యథేష్ట మను నర్థమున నీ శబ్దము వర్తించుచున్నను సర్వసమ్మతత్వమున యథేష్టత గతార్థ మైనను, సర్వసమ్మతత్వమునఁ గల హేతుశూన్యస్వైరితా వ్యంజకతను నివారించుట కీ శబ్ద మిట ప్రయుక్త మయ్యె ననవచ్చును. మే మెందుల కిట్లనుచున్నామనఁగాఁ బర్యాప్తశబ్ద

మునకు మఱి నివారణార్థము కలదు కావునను 'నివారణాయ తస్యైవ ప్రవృత్తి రభూత్ విదుషా'మ్మను కారికోక్తి కలదు గావునఁ దృప్తి యను నర్థమును బోధించునది పర్యాప్తశబ్ద మనఁదగును. తృప్తినిగూర్చు వ్యాకరణమును గూర్చియే మనము చేయఁదగిన చర్చ.

ఇట్టి వ్యాకరణ మాంధ్రమునకు లేదా; ఉన్నచోఁ జేయుకృషి పిష్టపేషణము. లేనిచో నున్న వ్యాకరణమును గ్రహించి పర్యాప్త మగుదనుక దానిని బెనుపవలయునా లేక 'హరి ఓ'మ్మని యున్నదాని మాట స్మరింపకయే పునఃప్రారంభము చేయవలయునా యనునదొక యంశము. పూర్వులు రచించిన వ్యాకరణము వ్యావహారికుల పక్షమున 'వాళ్లొస్తున్నారంటె నువ్వేంది ఇషూ అషూ తిరుగుతూ యేంటేంటో యెఱ్ఱెఱ్ఱిగా సూస్తుండావేమ్' అను వాక్యమునఁగల మాటలలో నొక్కమాటనేని సాధు వనఁజాలదు. మఱి వీరిలో నింకొక తెగవారు గలరు. 'వాళ్లున్నూ భోంచేశాక కూర్చొని ఉండుండి మాట్లాడుకుంటూ పెళ్లికూఁతురికేసి పందిట్లో తలంబ్రాలు పోస్తుండడం చూసి నవ్విందిరా ఆ పిల్ల ఎంచేతచప్మా అంటూ పకపక పొట్టబద్దలయ్యేటట్లు నవ్వారు గాని పెద్దమనిషి తరహా లేకుండా మేమైతేనా అట్లా చేస్తామా. చూడండి. మీరు ఇప్పుడు ఇక్కడే కొంచెం సేపాగితే వాళ్లకూ మాకూ ఉండే భేదం తెలుస్తుంది' యను భాష శిష్టవ్యవహార సిద్ధ మనువారీ రెండవ తెగవారు. మఱొక తెగవారీ వ్యావహారిక భాషావాదులు గలరు. వీరు కావ్యములందు మహాకవులు, ప్రమాదవశముననో ఛందోనియమసంబంధముననో చేతురు, కూఁతురిని, బచ్చుకు, లేకను, ఎఱింగెఱింగి, అన్నిష్టసఖి, గోకులమిల్లిలు, భవచ్చిత్తేప్సితం బెద్దిచెప్పనినక్, మా కోసము, యెవఁడు, వల్ల, ముల్లోకము, ఊహించ నొక నాల్గు గడియల సంచారము, తీర్చుము, వెనఁబొమ్ము నమ్ము మనుచుంగదలెా' మొదలగు క్వాచిత్క ప్రయోగములఁ బ్రమాణములుగాఁ జూపుచుఁ బ్రయోగశరణము వ్యాకరణము గావున నిట్టి ప్రయోగముల మీరెందుల కంగీకరింప రని వాదింతురు. ఇంక మఱియొక తెగవారు 'విశ్వ

శ్రేయః కావ్యమ్. తదదోషా చ పరిశుద్ధా వాగర్థే. సా వా గ్యా రస వృత్తిః. స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియో లోకే బహుమన్యన్తే వైకృతికావ్యాని. గృహీతత్వాచ్చ సాధుభిః. కవితోపాశ్రితం దోషం నైవ కించి త్సహామహే' మొదలగు చింతామణీకారికా వాక్యములఁ బట్టి కావ్యము వ్రాయువానికి వ్యాకరణమును బాటించుట తగినది; వచనమునఁ గావ్యమును వ్రాయువానికి వ్యాకరణ మెందుల కందురు. ఇట్లు వాదము సేయువారు మఱికొందఱు దేగలు గలరు. ఇట్టి వారినివారించి యపభ్రంశములయందు శక్తి లేదనియు సాధుత్వమును లేదనియు:—

శబ్దః సంస్కారహీనో యో గౌ రితి ప్రయుయుక్షితే
త మపభ్రంశ మిచ్ఛన్తి విశిష్టార్థ నివేశినమ్.
తే సాధుష్వనుమానేన ప్రత్యయోత్పత్తిహేతవః
తాదాత్మ్య ముపగమ్యేవ శబ్దార్థస్య ప్రకాశకాః.
న శిష్టై రనుగమ్యన్తే పర్యాయా ఇవ సాధవః
న యతః స్మృతిశాస్త్రేణ తస్మాత్సాక్షా దవాచకాః.
అంబాంబేతి యథా బాలః శిక్ష్యమాణః ప్రభాషతే
అవ్యక్తం తద్విదాం తేన వ్యక్తే భవతి నిర్ణయః
ఏవం సాధౌ ప్రయోక్తవ్యే యోఽపభ్రంశః ప్రయుజ్యతే
తేన సాధువ్యవహితః కశ్చి దర్థోఽభిధీయతే.

వాక్యపదీయము తెల్పుచున్నదిగదా. భర్తృహరి చెప్పిన యీ వాక్యము లన్నియు 'శబ్దైనైవార్థోఽభిధేయో నాఽపశబ్దేన' యను పతంజలి వాక్యవివరణమునకై యేర్పడిన వని గ్రహింతురుగాక. అందుచేఁ బర్యాప్తమైన వ్యాకరణము శక్తిఁగల వ్యాకరణ మనియు నభిప్రాయము.

ఇఁక నొక్కటి విచారము చేయవలసిన దీ సందర్భమునకే సరిపడునది కలదు. భాష యభివృద్ధికి వ్యాకరణ మడ్డుకాదా యనువారికి సమాధానము చెప్పవలయును. ఒక శబ్దమున కపశబ్దములు లక్ష పెరుఁగుట భాషాభివృద్ధి కా దని మా విన్నపము. ఇట్టి పెరుగువ కాదు మనకుఁ గావ

లసినది. నిన్నటిదినమున నార్థికమంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథముఁ నుడివినట్లు రాజనీతిని ప్రకృతిశాస్త్రములను మఱి యితరములను మన భాషలో మనము నేర్చుకొనుట కవకాశము కల్గునట్లుగా నర్థవంతములగు శబ్దముల సంఖ్య వృద్ధికావలయును. అట్లైని 'న(తద్యాత్)శబ్దాః ప్రయుయుక్షమాణో వైయాకరణకులం గత్వాఽహ 'కురుశబ్దాన్ ప్రయోక్ష్యే' ఇతి యను భాష్యవచనమునకు సమాధాన మేమి యందురేమో. 'ఇట మహర్షి యభిప్రాయమిది:-అన్యథా కార్యేషు వస్తుషు లోకవ్యవహారోఽన్యథా నిత్యేషు, శాబ్దశ్చ వ్యవహారోఽనాదివృద్ధవ్యవహార పరంపరా వ్యుత్పత్తి పూర్వక ఇతి శబ్దాదీనాం నిత్యత్వమ్.' అందుచేత మనకు వలయు శబ్దముల సంగ్రహించుట సృజించుట యనునది భాషాభివృద్ధి హేతు వగును. మఱి శబ్దమున కనంతాపశబ్దముల వాడుట, తద్వృద్ధి హేతుకమునుగాదు; అభ్యుదయహేతువును గాదు. అది కారణముగా మన మెల్లరము సన్మార్గమున మన యాంధ్రభాషాభివృద్ధికిఁ దగు కృషి తప్పకచేయఁదగు నదనిది.

మన కాంధ్రమున నేఁ డుపలభ్యమానములగుచున్న వ్యాకరణములు సంపూర్ణముగా నితరాపేక్ష లేకుండఁగా నాంధ్రభాషా స్వరూపమును దెల్పఁగల్గుచున్నవా యని మనము చేయఁదగిన విచారణ. సంపూర్ణములగు నెడలఁ బునః ప్రయత్నము పిష్టపేషణము. సంపూర్ణములు గావు. కావున నీ సమావేశము. కారికాకర్త యథర్వణుఁడు 'తదనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణిని' యని యే నాఁడో చెప్పిన వాక్యము ననుసరించియే నేఁటివనుక నాంధ్రవ్యాకరణములు వ్రాయఁబడినవి. పాణినీయతంత్రమునఁ గల కేవల సుప్ప్రకరణము తిఙ్ప్రకరణము ననునవిగాక తక్కిన భాగము లన్నియు నాంధ్రమున కత్యవసరములు. కాఁగా నాంధ్రమునఁ దత్సమశబ్దముచే గ్రాహ్యములగు రెంటిలో నొకటియగు ప్రాకృత వ్యాకరణము నాంధ్రమున కత్యంతావసరము. కాఁగా 'Grammar in the widest sense of the word is both the science and the art of language.' అను పాశ్చాత్యాభిజ్ఞుల వాక్యతాత్పర్యమున కనుకూలమగునట్లు మన వ్యాకరణ ముండవలయు. ఆంగ్లభాషాశాస్త్రజ్ఞులను

నట్లు మన వ్యాకరణము Descriptive భాగము Explanatory భాగముల రెంటితో సమృద్ధమై పైనఁజెప్పిన రెండవ భాగమునం దంశము లగు Historical, Comparitive, General అను వానితో సమగ్రమై యుండవలయును. మఱి మన భాషావ్యాకరణమున యాస్కాచార్యుని పద్ధతిని నిరుక్తము నిఘంటువు (Lexical side of language) నను భాగద్వయ స్వరూపనిరూపణము సేయుటయు నవసరము. ఇట్టి వ్యాకరణము మన భాషలో మనకుఁ దప్పక కావలసిన కాల మిది.

'అథ శబ్దానుశాసన' మ్మని మహాభాష్యము నారంభించిన మహర్షి పతంజలి 'శబ్దానుశాసనం నామ శాస్త్ర మధికృతం వేదితవ్య'మ్మని తెల్పెను. అసాధుశబ్దములనుండి సాధుశబ్దముల వేర్పఱచి బోధించుట యను శాసనపదార్థము. శబ్దానుశాసన మనునది వ్యాకరణమున కన్వర్థ మగు నామ మని మనకుఁదెలియునటుల ముఖ్యము లగు శబ్దానుశాసన ప్రయోజనములు 'రక్షోహాగమ లఘ్వసందేహా' యని తెల్పి రక్షాదిప్రతిప్రయోజనమును వివరించువాఁడై మహర్షి 'రక్షార్థం వేదానా మధ్యేయం వ్యాకరణ'మ్మని శబ్దానుశాసనపదపర్యాయపదముగా వ్యాకరణపదమును బ్రయోగించెను. ఇవి రెండు నొక్కే యర్థము బోధించు ననుదానిని జాగ్రత్తగాఁ దెలుపవలయుచో నపశబ్దత్వావచ్ఛిన్నప్రతియోగితాక భేదప్రకారక సాధుశబ్దవిశేష్యక ప్రమాకరణ రూపవ్యాకరణశాస్త్రమునకు ననాదిసిద్ధ మగు నామాంతరము శబ్దానుశాసన మందుము. ఇట్లే పతంజలి 'న చాంతరేణ వ్యాకరణం లఘునోపాయేన శబ్దా శ్శక్యా జ్ఞాతు'మ్మనునది మొదలుగా శబ్దానుశాసన పర్యాయపదమునుగా వ్యాకరణశబ్దమును వాడెను.

వ్యాకరణ మన నేమి యను ప్రశ్నమునకు సమాధానము మహాభాష్య మిట్లు చెప్పుచున్నది:- 'వ్యాక్రియన్తే శబ్దా అనేనేతి వ్యాకరణమ్', లక్ష్యలక్షణే వ్యాకరణమ్' ఇం కాంధ్ర వ్యాకరణ మగు చింతామణి శబ్ద శబ్దమునకు మాఱుగా 'వాగర్థ' యని చెప్పుచున్నది. కాని గ్రంథమున 'కాంధ్రశబ్దచింతామణి' యని పేరు. ఇందు శబ్దశబ్దమే వాడఁబడి

నది. 'బహు మన్యన్తే వైకృతకావ్యాని' యను వక్ష్యమాణవాక్యమును బట్టి కొంద ఱనుకొనినట్లు మొదట వైకృత మగు నాంధ్రము నపభ్రంశతాదోషపరిహారకనియమ మొనర్చి కావ్యభాష నొనరించు యత్నమున బుట్టినదే చింతామణి కావచ్చును. అట్టి భాషామానోజ్ఞమును విడనాడ నేరవి శిష్టు లగు నాంధ్రు లెల్లరు నా భాష నే వ్యవహారయోగ్యము నొనరించి రనినను న్యూనతలేదు. 'అదోషౌ శబ్దార్థౌ' యని కావ్యస్వరూపమును దెల్పు లాక్షణికుల పద్ధతిని జింతామణి 'వాగర్థౌ' యని యుపయోగించె నన్నను గొఱంత లేదు. అట్లగుచో శబ్దశబ్దమును జింతామణి గ్రహించి 'శబ్దార్థౌ' యనక 'వాగర్థౌ' యన నేల యను సందేహమునకు సమాధాన మిది. స్త్రీపుంసయోగోద్భవము ప్రపంచము; వాగర్థయోగోద్భవ మైనది భాష. మఱి 'వాగర్థావివ సంపృక్తౌ' యను కాళిదాసోక్తిని వినినపిదప సహృదయుఁ డెవ్వఁడును వాగర్థము లనక శబ్దార్థము లని యననేరఁడు గావునఁ జింతామణికర్త సహృదయవ్యాపార మగు కావ్యస్మరణము గలవాఁడై 'వాగర్థౌ' యనె ననవచ్చును. మఱి నామాఖ్యాతములకుఁ గూర్చు ప్రత్యయాదుల కర్థనిర్ణయము ప్రత్యేకముగాఁ జేయవలయుటఁ బట్టి 'వాగర్థౌ' యనుదాన నర్థశబ్దము వాక్కను శబ్దమునకు ద్వంద్వసమాసమునఁ గూర్పఁబడిన దను నభిప్రాయము 'లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ; షష్ఠీ తు పంచమీ గుణే హేతౌ; తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం చైకవచన మేవ స్యా ద్భూతే తద్ధర్మే చ; ఏకత్వే బహుత్వే ముడుజా సంప్రార్థనార్థకేషు స్తః' మొదలగు స్థలములందు వ్యక్తము కాఁగలదు. అది హేతువుగాఁ గూడ 'వాగర్థౌ' యని శబ్దచింతామణి యర్థశబ్దమును గ్రహించె ననవచ్చును. ఇంక "అనియమా ద్గ్రామ్యం హి" యను శబ్దచింతామణి వాక్యమును వివరించు కారిక నియమాభావమువలనఁ గలుగు నపభ్రంశతానివారణముకొఱకు విద్వాంసులు ప్రయత్నించి రనియు, దానికొఱకే మేమును మిక్కిలిగాఁ బ్రయత్నించుచున్నా మనియుఁ, దెల్పి 'గ్రామ్యతాపరిహారేణ హితా స్యాత్ శబ్దకల్పనా' యనుటను బట్టి చింతామణియందు శబ్దకల్పన

ప్రధాన మని మనకు 'వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి'యను పరిభాషా ప్రమాణమున విదిత మగుచున్నది. కాఁగా నిందలి రహస్య మింకొకటి కలదు. 'కస్తర్హి శబ్దః' యని ప్రశ్నించుకొని 'యేనోచ్చారితేన సాస్నా లాంగూలకకుద ఖుర విషాణినాం (గవాం) సంప్రత్యయో భవతి స శబ్దః' యను భాష్యవచనముతో సరిపోఁటుకై తద్వాక్యవివరణరూపమున 'వాగర్థా' యని చింతామణి దెల్పుచున్నది.

భాషా చరిత్రమును గూడఁ దెలుపు వ్యాకరణము మనకు నేఁడవసర మని పలువురి యభిప్రాయము; అది సమంజసమును. ఈ యభిప్రాయమును వెల్లడించువారు పల్వురు Caldwell రచించిన 'A Comparitvie Grammar of the Dravidian Languages'యను దానినే యాధారముగాఁ గొని యా పద్ధతి నాంధ్రమునకు వ్యాకరణ ముండవలయు నందురు; అంతటితో నాగక యితరమునుగా సంప్రదాయమును విడనాడ యత్నింతురు; సంప్రదాయజ్ఞుల మాట సరకుగొనరు. ఒక్క విషయమును మచ్చునకు వారికి నిదర్శనముగాఁ జూపి 'Caldwell' మొదలగువారి మార్గములను సంప్రదాయసిద్ధము లగు మన మార్గములను మెలఁకువమైఁబరికించి, కేవలాహంకారమున నగు పండితమ్మన్యభావమున నధికారప్రాపకము గలదుగదా యని విజ్జృంభింగక, యెల్ల రాంధ్రులకుఁ దమ భాషాజ్ఞానము సరియైన తెఱఁగునఁ గలుగునట్లు వర్తింప మనవి సేయుచున్నాము.

నామాఖ్యాతము లనియు,నుపసర్గనిపాతము లనియు నాల్గు తెఱఁగులు శబ్ద మని తెల్పి యందు నామము లన్నియు నాఖ్యాతజములను శాకటాయనమతమును నుడివి, యా యాచార్యుని మతమే నైరుక్తుల యందు గార్గ్యాచార్యుఁడు దక్కఁ దక్కునెల్లర సిద్ధాంత మని యాస్కాచార్యుఁడు నిరుక్తమున 'నామా న్యాఖ్యాతజానీతి శాకటాయనో నైరుక్తసమయ శ్చ; న సర్వాణీతి గార్గ్య'యని చెప్పెను. ఈ గార్గ్యాచార్యు మతము ననుసరించువారు కొందఱు వైయాకరణులు కల రని 'వైయాకరణానాం చైకే' యనియు నీప్రకరణముననే యాస్కాచార్యుఁ నెడ

ను. ఈ యభిప్రాయమునే యించుమించుగా Caldwell యిట్లు నుడివెను.
'In the Dravidian lauguages the number of nouns which are incapable of being traced up or resolved into verbs is more considerable. Still, such nouns bear but a small proportion to the entire number; and not a few which are generally considered to be underived roots are in reality verbal nouns or verbal derivatives. (See- Classification of Roots.)

ఈ సందర్భముననే యర్థానుస్వారము నాంధ్రమునుండి తొలంగింపవలయు నను నాంగ్లభాషావిదులగు నాంధ్రులకుఁ, దదనుయాయులగు వారికి నొక మనవి. దేశభాషలందుఁ దెలుఁగు లెస్సయని యాంధ్రభాషాభిమానమును వెల్లడించు వీరు చెవి కింపునింపు నానునాసికోచ్చారణము గల యీ యర్థానుస్వారము నేల విసర్జింపవలయునందురో తెలియుట దుర్లభము. వీరికిఁ బరమప్రమాణ మగు Caldwell గ్రంథమున Euphonic Nunnation or Nasalisation యను నాంధ్రభాషాధర్మము ను గూర్చి గల దానినే మరల నొక పర్యాయము పఠింపఁగలందులకు మా హెచ్చరిక.

పూర్వులు లఘ్వలఘూచ్చారణభేదమున ద్వివిధముగాఁ బరిగణించిన రేఫమున నలఘూచ్చారణముచేఁ బ్రసిద్ధమై కాలక్రమమునఁ బ్రత్యేకాక్షరరూపమునఁ బరిణామ మొందిన యక్షరమును గూర్చియు నేఁటివారిలోఁ బల్వురు తేనిపోని వివాదముల పా లగుచున్నారు. దంత్య తాలవ్యభేదము గల చ, జ, లయందు దంత్యోచ్చారణము గల చ, జ లను వానిని నవీనులు పలువురు చ, జ లనుగా వ్రాయుచు నట్టులనే యుచ్చరించుచున్నారు. ఇట్లు శకటరేఫార్థానుస్వారముల నిరసించియు, దంత్యము లగు చ, జ ల వాడకయు నా లగక్షరముల నున్నవానిలో లోపింపఁజేయు వార లొక వైపున నుండఁగా 'Cat, mat' అనువానిలోని 'య' కా రోచ్చారణ సమర్థమైనట్టియు, 'Coffee' మొదలగు శబ్దము లందుఁ గల ఫకారోచ్చారణ సమర్థమైనట్టియు నూతనాక్షరముల మనము గల్పింపవలయు నను వార లొక వైపున నున్న యక్షరములు చాల వని వాదు లాడుచున్నారు. అన్ని భాషల యక్షరముల సంఖ్య

కంటె నాంధ్రమునఁ గల యక్షరసంఖ్య యెక్కువ. ఈ యక్షరములు వివిధోచ్చారణానుకూల్యమునకు సంఘటితములు. ఉన్నవానిని గాదని క్రొత్తవాని నవసరము లేకపోయినను గల్పింపఁ జూచుట వెఱ్ఱితన మను మాట యటుండఁగా నాంగ్లమునఁ గల వర్ణము లల్ప సంఖ్యాకములై నను నాంగ్లేయులందు భాషాకోవిదులు వాని సంఖ్యను దగ్గించుటకై చేయు యత్నముల సామరస్యము గ్రహింపనేరని మౌఢ్యముగూడ మన భాషాశాస్త్రవిదుల నెట్లావరించినదో తెలియుట దుర్లభ మన వచ్చుచున్నది.

ఇదిట్లుండఁగా వ్యాకరణ మను మాటను వివరించువాఁడై 'అథ వ్యాకరణ మిత్యస్య శబ్దస్య కః పదార్థ' యని ప్రశ్నించుకొని 'సూత్ర' మ్మనిన మహాభాష్యమతమున కనుకూలముగా నాంధ్రశబ్ద చింతామణీ కర్త సంస్కృతవర్ణ సమామ్నాయమును దెల్ప నారంభించి 'యాద్యాఖ్యాః పంచాశ ద్వర్ణా' యని సూత్రించెను. ఈ యేఁబది యక్షరము లేవియో యాతఁడు వివరింపఁ డయ్యె. ఈ సూత్రముచేఁ దెల్పఁబడిన వర్ణసంఖ్య వ్యాఖ్యానబలమునఁ దెలియవలసియున్నది. నాఁటినుండి నేఁటివఱకుఁ దద్వ్యాఖ్యాతలు వివిధముల నా యక్షరసంఖ్యను సమర్థించుచున్నారు. కొందఱు సంస్కృతమున లేని ౡ కారమును, గొందఱు ళ కారమును, గొందఱు క్ష కారమును గ్రహించిరి. వీ రిట్లు గ్రహింపవలసి రాఁగా వీరికి మాహేశ్వర సూత్రము లగు 'అ ఇ ఉ ణ్' మొదలుగాఁ గల పదునాల్గు, వర్ణసమామ్నాయమును దెల్పుట కేర్పడినవి కా వనవలసివచ్చెను. ఇది వక్రసరణి యని మా యభిప్రాయము. పాణినీయ తంత్రమును బఠింప నారంభించువాఁడు సైతము మొదటఁ జేయు స్తుతియందే 'యేనాక్షర సమామ్నాయ మధిగమ్య మహేశ్వరా' త్తని వినఁబడుదానిని వీరు విస్మరించి యిట్లనుటకు హేతువు కానరాదు. కాఁగా మఱి 'అ ఇ ఉ' మొదలగు వర్ణముల యుపదేశ ప్రయోజనములను గూర్చి తెలుపు మహాభాష్యమున 'ఇష్టబుద్ధ్యర్థశ్చ' యనునది గల దను మాటనే వీరు విస్మరించి యుందురు. ఈ విషయమున వీరికి (విసర్జనీయ) జిహ్వామూలీయోపధ్మానీయానుస్వారనాసిక్యయమములం దేది

యు నా పదునాల్గు సూత్రము లందు లేమిచే నాసూత్రములందుఁబఠితము లైనవి యే సమామ్నా తాక్షరము లన రా దను నభిప్రాయ ముండఁదగదు. విసర్జనీయాదుల యోగవాహములు. 'యదయుక్తావహన్తి' యని యయోగవాహ శబ్దార్థము. వీని విచారణము మహాభాష్యానుకూలముగఁ జేసినయెడల వారికే పారిపొరపాటు విశద మగును. శివసూత్రములఁ గల యక్షరములు వర్ణసమామ్నాయ మనుటకు వ్యతిరేక ముఖమునఁ గూడ నొక నిదర్శనమును జూపెదము. సావధానత దానిని జిత్తగింపుఁడు. 'ఋఌక్' అను శివసూత్రమున ఌకారోపదేశ ప్రయోజనమును శంకించి 'నార్థఌకారోపదేశన' మ్మని నిర్ధారణము సేయు పర్యంతము వాదమును బెనిచి 'ఌకారోపదేశో యదృచ్ఛాశక్తిజానుకరణ ప్లుత్యాద్యర్థ'యను నదాదిగాఁ గల యుత్తరమును దెల్పు భాగమును జూచినవాఁ డెవఁడును వర్ణసమామ్నాయము కాదు పదునాల్గు శివసూత్రములఁ బఠితములైన యక్షర సమూహ మన నేరఁడు.

ఇప్పటికి దిఙ్మాత్రముగాఁ గలవర్ణములఁ దీసివేయు కృషియు, లేననుకొను వర్ణములఁ గల్పింపవలయు నను యత్నము, సంస్కృతవర్ణ సమామ్నాయమును నిర్ణయించుటకై పలువురుపోవు పోకడలు దోషస్పర్శగల వని సూచించితిమి. ఇట్టి దోషములు లేని సంప్రదాయమును విడని, భాషాచరిత్రము నేమఱని, యాంధ్రవ్యాకరణము మనకుఁ గావలయు నన్నమాట సత్యము. ఇందనుక మే మొనర్చిన విచారణ వలన సమాగతమైన దానిని భర్తృహరి వాక్యమున విన్నవింతుము:—

'సాధుత్వజ్ఞాన విషయా సైషా వ్యాకరణ స్మృతిః
నానర్థికా మిమాం కశ్చి ద్వ్యవస్థాం కర్తు మర్హతి' యను సూక్తి నేమఱక పరమేశ్వరీ ప్రసాదమున, గురుపూర్వక్రమాగత సరణి నిట్టి వ్యాకరణమును జెప్పమే మొనర్చు యత్నము సఫలము కాఁగలందులకు విద్వాంసు లాశీర్వదింతు రను సంప్రీత్యయమున నీసూచ్యార్థము గల వ్యాకరణ విషయవ్యాసమును ముగింప ననుజ్ఞాన మొసఁగ సభాస్తారుల నభ్యర్థించుచున్నాము.



# కావ్యభాష.

విద్వాన్, శిరోమణి, మల్లికార్జునరావు.



సకల శాస్త్రములకును బ్రహ్మపదార్థమందే తాత్పర్య మన్నట్లుగ, ప్రపంచకములోని సకలభాషలకును భావప్రకటనమందే తాత్పర్యమై యున్నవి. ఆదిమానవుఁ డొక్కఁడుగనే యున్నపుడు భాష యేర్పడవలసిన యావశ్యకత యుండును. క్రమక్రమముగ మానవ సంఘము పెరిఁగినకొలఁది సంఘాంతఃపాతి యగు మానవుఁడు తన మనోగతభావములను దెలియఁబఱచుటకుఁ గాని, యితరుల మనోగత భావములను దాను దెలిసికొనుటకుఁ గాని యవసర మేర్పడుచుండును. ఈ భావావిష్కరణకుఁ జేష్టాదులు నభినయాదులుఁ గొంతవఱకు సాధనములే యై యున్నను, భాషారూపసాధనమువలె సమగ్రములును సుకరములును సులభములును గావని చెప్పవచ్చును. అట్టి భాష లిపిరూపమునుగూడఁ బొందినపుడది హేమ్నః 'పరమామోద' మే యై యుండును. ఆ నాఁ డది ఖండఖండాంతరములకును గ్రంథరూపముగ వ్యాపించి స్థిరత్వ మేర్పఱచుకొనును. కాఁగా, అవసరమును బట్టి మానవసంఘము భావావిష్కరణకై భాషను సృష్టించుకొన్న దని తేలుచున్నది.

జగత్సృష్టికి సృష్టికర్త ప్రధానకారణమై యున్నను, అంకురోత్పత్తికి బీజములు కారణ మన్నట్లుగ, భాషోత్పత్తికి మానవసంఘము కారణ మని యన్నను విప్రతిపత్తి యుండఁబోదు. కారణసామగ్రి ప్రమాణసిద్ధమై యగపడుచున్నపుడు దాని నుపేక్షించి భగవంతునకే కారణత్వ మంటఁగట్టుట యీనాఁటి నాగరకప్రపంచమున సంప్రదాయ విరుద్ధముగ నుండును. పోనిండు. భాష మానవకల్పిత మనియు నయ్యది వ్యవహారార్థమే యేర్పడిన దనియు నంగీకరింతము. ప్రపంచములోని మానవసంఘ మంతయు నేకరూపమే కదా! ఆ మానవ సంఘము సృష్టించిన భాషకూడ నేకరూపముగనే యుండవలదా?

అన్న ప్రశ్న జనియించును. నిజమే. ఆదిమకాలమున నిన్ని భాషలు లేవేమో! ఏదోయొక భాషమాత్రమే యుండెడిదేమో? కాలక్రమముగ జనసంఘము ప్రవృద్ధమైన కొలఁది జనులు గుంపులు గుంపులుగఁ బలుతావులందు స్థిరనివాస మేర్పఱచుకొని రాకపోకలను దగ్గించుకొన్న కారణముగ నిరంతరశ్రవణము లేమిఁ జేసి యొకప్రాంతమందలి భాషకును వేఱొకప్రాంతమందలి భాషకును నసంఖ్యాకముగ నుచ్చారణకృత భేదము లేర్పడి క్రమమున నయ్యవి ప్రవృద్ధములై యా భాషల కిప్పటి నానాత్వమును గల్పించి యుండవచ్చును. కనుకనే భాషాబాహుళ్య మేర్పడియుండును. ఈ నాఁటి మానవసంఘమున కంతకుఁ గారణుఁ డనఁ దగిన మూలపురుషుఁ డాదిమకాలమున నొక్కఁడుగ నున్నట్లే వర్తమాన భాషాబాహుళ్యమున కంతకు మొదటి దనఁ దగిన మూలభాష యేదో యొక్కటిగనే యుండియుండు నని మన మూహింపవచ్చును. ఈ సిద్ధాంతమును బట్టి మానవసౌభ్రాతృత్వమును స్థాపించినట్లే భాషాసౌభ్రాతృత్వమును గూడ సాధింపవచ్చును. మఱియు నీ నాఁటి యనైకమత్యమును బాఱఁద్రోలుటకుఁ గూడ నీ వాద మెంతయు నుపకరింపఁ గలదు.

వ్యవహారార్థ మేర్పడిన భాషను వ్యావహారిక భాషనుగఁ బేర్కొనుచున్నారు. అగుచో నికఁ గావ్యభాష యన నేమి? దాని విశిష్టత యెట్టిది? అన్నప్రశ్నలకు సంగ్రహముగఁ బ్రత్యుత్తర మిచ్చుటే యీ వ్యాసములోని ముఖ్యవిషయము.

వ్యావహారిక భాషకు భావావిష్కరణము ప్రయోజనమై యున్నను, కావ్యభాషకు మాత్ర మదొక్కటే ప్రయోజన మని చెప్పుటకు వలనుపడదు. భావావిష్కరణ మన్నది కావ్యములో నాంతరీయకముగనే సిద్ధించుచుండును. దానికై మానవుఁడు కవి కానక్కఱలేదు. యతిప్రాసలు, ఛందోనియతి, రీతి, వృత్తి, శయ్య, పాకము, రసము, అలంకారములు, గుణదోష వివేకము మున్నగు వాని నాశ్రయింప నక్కఱలేదు. చెప్పఁదలఁచుకొన్న విషయమును సూటిగ వచనములో

నైనను జెప్పవచ్చును గదా! అట్టికావ్యమును నిర్మించుటకుఁ గవియే రా నక్కఱలేదు. ఎవరికైనను నయ్యది సులభసాధ్యమే యగును. కనుక కావ్యమును భావావిష్కరణైక ప్రయోజనముగఁ దలంపరాదు.

కావ్య మానందజనకము. అది శ్రేయస్సాధనము. దాని ప్రయోజనములే వేఱు. దాని విశిష్టతయు వేఱే. భాషాసామాన్యము నొక మహారణ్యముతోఁ బోల్చినపుడు కావ్యభాష నొక నందనవన ముతోఁ బోల్పవచ్చును. ఇఁక నందనవనములో మాత్రమే ముండును? తరులతాగుల్మాదులే కదా! అని యీసడించువారి కది యట్లే యగ పడును.

కావ్యములోని భాష సలక్షణమై యుండి సహృదయ హృద యాహ్లాదకముగ నుండవలెను. వ్యావహారికభాష భావావిష్కరణైక ప్రయోజన మగుటచే లక్షణోపేతము కాఁజాలదు. కా నక్కఱలేదు కూడ. ఒకప్పుడు వ్యావహారిక భాషయందును బ్రాదేశికముగ సలక్ష ణత్వ మగపడవచ్చును. అయినను నది యాదృచ్ఛిక మనఁ జెల్లును. భావావిష్కరణకు సాధుశబ్దములే ప్రయోగింప నక్కఱలేదు. అసాధు శబ్దములు ప్రయోగించినను భావ మవగత మగుచునే యుండును. కావుననే చిన్నపిల్లలు మాటాడు వచ్చీరాని ముద్దుపలుకులు మన కర్థ మగుచున్నవి. ఇంక నీ వ్యావహారికమును శిష్టవ్యావహారిక మని, అశిష్టవ్యావహారిక మని పేర్కొనుచున్నారు. అశిష్టవ్యావహారికమునే గ్రామ్య మని యందురు. ఇది నింద్య మనియే సిద్ధాంతము. (తత్తద్వర్ణ నోచితముగఁ బ్రయోగింపవచ్చు ననుట విషయాంతరము.) గ్రామ్య భాషకంటె శిష్టవ్యావహారికము కొంత మెఱుఁగైనఁ గానచ్చునే కాని యానందైక ప్రయోజన మగు కావ్యములోని భాషతో నది సామ్య మును బొందఁజాలదు.

సంస్కృతభాషలో సాధు శబ్దములు మాత్రమే ప్రయోగార్హ ము లని శాసించుట గలదు. అట్టిదానికి ఫలశ్రుతిగ "ఏక శ్శబ్ద స్సమ్యగ్

"జ్ఞాతః సుప్రయుక్తః స్వర్గే లోకే కామధుక్ భవతి" అనియును, ప్రత్యవాయపరముగ "అపశబ్దం ప్రయుంజానో రౌరవం నరకం వ్రజేత్" అనియును గొన్ని సూక్తులు గలవు. సాధుశబ్దప్రయోగముచే బుణ్యములు గలుగు ననియు నపశబ్ద ప్రయోగములచే నరకములు సిద్ధించు ననియు, పైవాని తాత్పర్యము. శబ్దప్రయోగమాత్రముననే పుణ్యములు సిద్ధించునా ? యని శంకింప నక్కఱలేదు. దానికి మనశాస్త్రములే ప్రమాణము. అట్టి సంస్కృత భాషతో నిత్యసంబద్ధమై యున్న తెనుఁగు భాషకును నా సంప్రదాయానుసరణము కొంతవఱకైనను ముఖ్య కర్తవ్యము గదా! ఇఁకఁ గావ్యభాష సలక్షణమై యుండవలెను గదా యని గ్రంథము నంతటిని వ్యాకరణమయ మొనర్పఁ గూడదు. అట్లొనర్చినచో నయ్యది సముద్రోదకమును ద్రాగిన ట్లుండును. శబ్దములు వ్యాకరణ పరిష్కృతము లైనంతమాత్రమున సాధుశబ్దము లగునే కాని ప్రయోగార్హములు మాత్రము కాఁజాలవు. రససిద్ధికిఁ దోడ్పడఁ జాలవు. ఈ విషయమున సంస్కృతముకంటెఁ దెనుఁగుసంప్రదాయము విలక్షణము, విజాతీయము, నై యున్నది. తెనుఁగుసారస్వతమునకుఁ బ్రథమమున శ్రీకారము నిక్షేపించిన నన్నయభట్టారకుఁడే యీ సందర్భమున "విరళాన్ పేచోషాదిక శబ్దాన్ ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః । ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్" అని చెప్పియున్నాఁడు. పేచ-ఊష-తేర-చక్ర మున్నగునవి వ్యాకరణ పరిష్కృతము లైనంతమాత్రమున సంస్కృతకావ్యములలోఁ బ్రయోగించుకొననిండు. తెనుఁగున మాత్ర మట్టి శబ్దప్రయోగము కూడదు. సంకేతిత సుప్రసిద్ధములనుమాత్రమే ప్రయోగింపవలెను. అని పైదాని తాత్పర్యము. తేలిన సారాంశ మేమి? పాండిత్య ప్రభావమును మాత్రమే వెల్లడించెడి శబ్దములు కావ్యములలోఁ బ్రయోగార్హములు కావు-అని యీసందర్భముగనే యథర్వణాచార్యులు కూడ "విచక్షణ మనోమోదకారిణీ శబ్దకల్పనా" అని చెప్పియున్నాఁడు. మఱియు "నిదానం తత్ర సద్వాచః", "ప్రయోగ స్తత్ర కారణమ్", ప్రయోగస్య తథాగతేః", "ప్రయోగాశ్రయణం మతమ్" అని యిట్లుగఁ బెక్కుచోట్ల నుద్ఘోషించి

యున్నాఁడు. కాఁగాఁ గావ్యములందు భాషాసౌష్ఠవ ముండి తీరవలె నని తేలుచున్నది. భాషాసౌష్ఠవము లేని నాఁడు భావసౌష్ఠవము కూడ నుండఁబోదు. కారణగుణములు కార్యములందు సంక్రమించును గదా! కావ్యము రసజనకమై యుండవలె ననుట సులభముగనే కన్పడును. కాని యట్టి ప్రయత్నమునఁ గృతార్థుఁడైన కవి నూటికిఁ గోటికి నొక్కఁడు గనే యుండును. రససిద్ధి యే యే ప్రయత్నములవలన సిద్ధించునో యెవ్వరును జెప్పియుండలేదు. నన్నయభట్టు కూడ "సాధ్యో హి రసో యథాయథం కవిభిః" అని యింతమాత్రమే చెప్పియున్నాఁడు. అయి నను దానికిఁ దోడ్పడు మార్గములను మాత్రము కొన్నిటిని సూచించి యున్నారు. శయ్య, రీతి, వృత్తి, ధ్వని, అలంకారము మున్నగు న వన్నియు రససిద్ధికి సూచనలే యగుచున్నవి.

భారతముతో నారంభమైన తెలుఁగు సారస్వతమందలి ప్రాచీన కావ్యము లన్నియు నిట్టి లక్షణములతో నొప్పియుండుటచేతనే యవి స్థిర త్వము నేర్పఱచుకొన్నవి. రసాత్మకమైన వాక్య మొక్కఁటియుఁ గావ్య మగు ననెడి లక్షణకారుల యాశయము కూడ నిట్టిదే యని చెప్ప వచ్చును. ఏ కవి యైనను నెన్ని కావ్యములు వ్రాసెను ? అన్నది ప్రశ్న విషయము కా రాదు. ఆ కావ్య మెంతవఱకు సహృదయ హృదయ రంజకముగ నున్నది అన్నవిషయమునకే ప్రాముఖ్య ముండవలెను. అట్టి కావ్యములే యుత్తమకావ్యము లనియు నదియే యుత్తమ సాహిత్య మనియుఁ జెప్పనొప్పును.

---

# గ్రంథసమీక్ష

బండారు తమ్మయ్య

శ్రీరమణలహరి—క్రౌను సైజు. పుటలు 31- వెల తెలియదు. ఆంధ్రీకర్త "శ్రీరామచంద్ర కౌండిన్య" యను సాంకేతిక నామముగల శ్రీ ఓరుగంటి రామచంద్రయ్య గారు, యమ్. ఎ. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు చరిత్రోపన్యాసకులు:—

నేపాలదేశవాసి శ్రీ ఉపాధ్యాయ నరేంద్రకేసరిశర్మగారు బ్రహ్మీభూతులయిన శ్రీభగవాన్ రమణమహర్షులను వారి జీవితకాలములో శ్రీ రమణాశ్రమమున సందర్శించినప్పుడు హృదయముప్పొంగ సంస్కృతభాషలో రచించిన సంస్తవమున కిది యనువాదము. మూలకృతి యేఁబదిరెండు శిఖరిణీవృత్తములలోఁ గూర్పఁబడి మహిమ్నస్తవ, శివానందలహరుల ఛాయలతోఁ జాలవఱకు వలరారుచున్నది. ఈశ్వరసాక్షాత్కార మొందిన శ్రీ రమణమహర్షిని మూర్తీభవించిన పరశివునిగను, సమస్తమతములకు లక్ష్యము వేద్యము నగు సోఽహం (పర)తత్త్వముగను బరిగణించి కృతికర్త యనన్యంబగు భక్త్యావేశముతో బహుభంగులఁ బ్రణుతి యొనర్చినారు. ఆంధ్రీకర్త శ్రీరామచంద్రయ్యగారింతకుమున్నే "రమణస్మరణ" యను స్వతంత్రకృతిమూలకముగాఁ దమకు మహర్షియెడఁ గల నిరవధికభక్తిని వెల్లడించియున్నారు. 1949 సంవత్సరములో మఱల నీ యాంధ్రానువాదరూపకస్తుతిని దేటగీతులలో రచించి ప్రకటించి చరితార్థు లయినారు. మూలశ్లోకములు వానికెదురుగాఁ దెలుఁగు పద్యములుగూడ నిందు ముద్రితము లయినవి. శిఖరిణీవృత్తములను దేటగీతులలో ననువదించుటచేఁ గొన్నియెడల నడక యించుక కుంటువడి మూలశ్లోకభావములు సంకుచితము లయి కేవలాంధ్రపద్యపాఠకులకు సువ్యక్త మగుటకుఁ గొంత యవరోధ మేర్పడినను మొత్తముమీఁద ననువాదము చాలవఱకు ధారాళ మగు శైలితో మూలభావములను లెస్సగాఁ బ్రస్ఫుట మొనర్చుచున్నవి- మచ్చునకు-

"జగత్స్రష్టా బ్రహ్మా భవసి భగవన్ సృష్టిసమయే ।
"జగత్త్రాతా విష్ణు స్త్వమసి కిల విశ్వంభరవపుః ।
మహాదేవోఽసి, త్వం నిఖిలభవసంహారవిభవ ।
స్త్రయోఽప్యేతే దేవా స్తవ రమణ! లీలావిలసితాః॥

(శ్లో 13)

"భవసృజనవేళ స్రష్టవు బ్రహ్మ వగుచు ।
విశ్వము వహించి రక్షించి విష్ణుఁ డౌచు ।
భవహరణవేళ రుద్రవైభవుఁడ వౌచు ।
నేచి మూర్తుల విలసిల్లె దీవ రమణ !"

భక్తలోక మీ స్తుతిరత్నమును సభక్తికముగఁ బఠించి భగవత్ప్రసాదమును బడయుఁ గాత !



# వ్యాకరణసమీక్ష

బులుసు వేంకటరమణయ్య.




ఆంధ్రభాషావాఙ్మయతత్త్వము నవగాహన చేసికొనుటకును, భాషావాఙ్మయతత్త్వపరిశీలనమునకును, భాషావాఙ్మయాభివృద్ధికిని లక్షణగ్రంథములు జీవాతువు లనుట విద్వద్విదితము. ఛందో, వ్యాకరణాలంకారరూపము లగు త్రివిధలక్షణములలో నలంకారము కావ్యాత్మ యగు రసమును, తత్పరిపోషకము లగు కావ్యాంగములను వివరించును. రసభావప్రకటన కుచితము లగు శబ్దము లేవో, అనుచితము లగు శబ్దము లేవో వెల్లడించును. గణ, యతి ప్రాసములఁ గ్రమపద్ధతిని నిర్వచించు ఛందస్సు కావ్యమునకు మెఱుఁగు పెట్టుటయే కాక ప్రాచీనకాలమునఁ బ్రయోగ విశేషము లెట్లున్నదియును, శబ్దస్వరూప మెట్లున్నదియును వెల్లడిచేయును. వ్యాకరణము శబ్దముల సాధుత్వాసాధుత్వములను నిర్ణయించి శబ్దతత్త్వము నెఱుకపఱచును. ఇవ్విధమున ముప్విధము లగు లక్షణములును భాషావాఙ్మయ పరిపుష్టికిని, తత్త్వావగతికిని దోహదము లగుచున్న వనుట నిర్వివాదాంశము.

లక్షణములు భాషా వాఙ్మయముల నరికట్టి స్వేచ్ఛావిహారము నలుపనీయక నిర్బంధించుచున్న వనియును, అందువలనఁ బరిపుష్టి కలుగక క్షీణతయే కలుగుచున్న దనియు, భాషావాఙ్మయములకు జన సామాన్యమున విస్తృతవ్యాప్తి కావలయునన్నచో లక్షణశృంఖలలను ద్రెంచి పాఱవేయుట ప్రధానకర్తవ్య మనియు నవ్యసాహిత్య ప్రియులు కొందఱు పలుకుచున్నారు.

కావ్యమునఁ బదునెనిమిది వర్ణన లుండవలె నని యాలంకారికులు నియమించి రనియు, అట్లు పదునెనిమిది వర్ణనలు లేకున్నను గావ్యము హృదయంగమ మగుచున్నందునఁ బయి నియమ ముపేక్షణీయ మని యనుచున్నారు. అట్లే యతిప్రాసలు, గణనియమము లేని పద్యకావ్య

ములు ప్రజామోదమును బొందుచున్నందున నీ నియమము లక్కఱ లేదనుచున్నారు. శైవవాఙ్మయమునందును, మిగిలిన ద్విపదలయందును వ్యాకరణ విరుద్ధ ప్రయోగము లున్నను, ఆ గ్రంథములు ప్రామాణికము లగుచుండుటవలన నసాధుశబ్దములను బ్రయోగించినను హాని లేదనుచున్నారు. కాని యీ యాశయ మంగీకార్యము కాదు. భాషా వాఙ్మయములే కావు. ఏ విషయమును గ్రహించినను సరే! నియమము నతిక్రమించి ప్రవర్తించినచో గర్హించుచుందురు. ఎవ్వరికిఁ గావలసిన నియమములను వా రవలంబించుచునే యుందురు. జనసామాన్యమున కందుబాటులో నుండునట్లు వాఙ్మయము వ్యావహారికభాషయందే పెంపొందింపఁదలఁచుచున్న వ్యావహారిక భాషావాదులు కూడ శిష్టజనవ్యవహారము నందలి భాషయే గ్రాహ్య మనియు, అట్టి భాషకును నియమములు తప్పక యుండవలె ననియు నభిప్రాయపడుచున్నారు. ఇట్టియెడ లక్షణములు భాషావాఙ్మయముల క్షీణతకుఁ గారకము లనుట యెంతయు హాస్యాస్పదము.

మన ప్రాచీన భాషావాఙ్మయములు జనసామాన్యమున కందుబాటులో లేవనియు, అందుల కయ్యవి లక్షణలక్షితము లగుటయే కారణ మనియుఁ జాలమంది యువకులు తలంచుచున్నారు. కాని మన మే పల్లెటూరికిఁ బోయి పరికించినను భారత, భాగవత, రామాయణములును, వసు, మనుచరిత్రాది ప్రబంధములును వాఙ్మయాభిమానుల యాదరమును పొందియుండుట కానవగును. నవ్య కవిత్వముపయి వారి కాదర మున్నట్లు కానరాదు. ఇఁక వాఙ్మయముసంగతి యక్కఱలేని వారి కెట్టి కవిత్వముతోను సంబంధము లేదు. కాఁగా భాషావాఙ్మయముల వ్యాప్తికి లక్షణము లాటంకములు కా వని స్పష్టపడుచున్నది.

మార్పు ప్రకృతిసహజము. దేశకాలముల ననుసరించి ప్రతి విషయమునందును గొంచెగనో, గొప్పగనో మార్పు కలుగుచునే యుండును. భాషావాఙ్మయములయెడలను గూడ నా పరిణామము నడ్డుట సాధ్యము కాదు. ఆ పద్ధతి ననుసరించి లక్షణములు మారుట యావశ్య

కము కావచ్చును. కాని లక్షణములే యనావశ్యకము లనుకొనుట పొరపాటు. కావ్యములలో నష్టాదశ వర్ణనము లుండవలెనను నియమమును మార్చి, కొన్ని వర్ణములనే గ్రహించిన గ్రహింపవచ్చును. ప్రాచీన కాలమునందును- ఈ పదునెనిమిది వర్ణనములును దప్పక యుండవలెనను నియమము లేదు. లక్షణకర్తలే 'ఏషా మష్టాదశానాం ద్వైః కైశ్చి దూనమపీష్యతే' అని చెప్పియున్నారు. ఆ విధమున నేయతిశయవర్ణనలను విడిచి స్వాభావిక వర్ణనలను- రసభావపరిపోషకము లగువానిని గ్రహింపవచ్చును. రసానుగుణములును, శాస్త్రసమ్మతములు నగు క్రొత్త ఛందస్సుల నాశ్రయింపవచ్చును. ప్రాచీన విద్వత్కవి సమ్మతము లయి, వ్యాకరణముచే సాధింపఁబడని ప్రయోగములకుఁ బ్రయోగార్హతను సంపాదింపవచ్చును.

నేఁటికాలమున శిష్టులుకూడ కొన్నికొన్ని పదములను గ్రాంథిక రచనలయందును ధారాళముగ వాడుచున్నారు. ప్రాచీనగ్రంథములలో ఛందోయతిప్రాసముల కుదిరికకయి కవులు ప్రయోగించిన "కాళ్లాస్తి, కొల్చిలో, ఎడ్మ' మున్నగు పదములను, క్త్వార్థకేకార సంధులను, శివకవుల స్వతంత్ర ప్రయోగములను గ్రహించి, అట్టివానిని వాడుట యుచితమని కొందఱు చెప్పుచున్నారు. 'వానిని,వీనిని, వేనిని'-అనుటకు బదులు 'వాటిని, వీటిని, వేటిని' అని వాడినను తప్పుగా గ్రహింపరాదని కొందఱు విద్యావేత్తల మతము. అట్టివారు విద్యాశాఖయందుఁ బలుకుబడి కలవారగుటచే సమాధానపత్రములలో నిట్టివానిని నొప్పులుగాఁ బరిగణించుట పరిపాటియై పోయినది. 'కట్టడము (భవనము), చేయడము (చేయుట), స్నేహితుడు, స్నేహితము, ఆధిక్యత (ఆధిక్యము), శతాబ్దము (శతాబ్ది), పైన (పైని), తేదీన (తేదీని)' మున్నగుపదములు గ్రాంథికములుగానే వ్యవహరింపఁ బడుచున్నవి. వీనిని వాడుచున్నవారు తాము సాధుశబ్దములను వాడుచున్నట్లే భ్రాంతి పొందుచుందురు. వీనితత్త్వ మొకకొంచెము ముచ్చటింతము.

'కాళ్లాస్త్రీ, కొల్నిలో, ఎడ్మ' మున్నగునవి వ్యాకరణమునకు సాధ్యములు కాకున్నను, రామకృష్ణునివంటి రససిద్ధు లగు కవితానస్రవంతిలో యాదృచ్ఛికముగాఁ బడినందున, ఆవ్యోడ నెఱసులుగాఁ గానరావు. కాని, గ్రంథస్థము లై నంతమాత్రమున నట్టివాని నితరులు, వాడినచో లోపము వ్యక్త మైపోవును.

క్త్వార్థకేకార సంధులు ప్రాచీనకవిప్రయుక్తములు కావు. 'చాపము నా కం దిమ్ము' మున్నగుచోట్ల 'అందిచ్చు' శబ్దపల్లవ పనియు, 'వెఱ చిట్లంబుదినాథ-' మున్నగుచోట్ల 'వెఱనిట్లంబుధినాథ' మున్నగు పాఠము లున్నందునఁ దిక్కనసోమయాజి యీసంధి నొనరింపలేదనియుఁ బండితుల సిద్ధాంతము.

'ఆ,ఈ,ఏ' శబ్దము లనాపవిభక్తికము లగుటవలన 'టి' వర్ణకము నకుఁ బ్రసక్తియే లేదు. కావున 'వాటిని, వీటిని, వేటిని' అని ప్రయోగించుట యుచితముకాదు.

ఆంగ్లమున Build అను ధాతువునకు 'కట్టుట' అర్థము. Building అనఁగాఁ గట్టఁబడినదానికి-భవనమునకుఁ బేరు. తెలుఁగులో Build 'కట్టుటయగుటచే' ఆంగ్లసంప్రదాయము ననుసరించి ఎవ్వరో మహానుభావులు Building నకు 'భవనము' అను నర్థములో 'కట్టడము' అని పేరు పెట్టిరి. ఇయ్యది పెద్దలవాడుకలో బాగుగ నలఁగుటచే సాధుశబ్ద భ్రాంతిని గొల్పుచున్నది. గ్రాంథికవాదులును దీనిని స్వేచ్ఛగ నుపయోగించుచున్నారు. దీని సాజాత్యమునుబట్టి 'చూడడము, చేయడము' మున్నగునవి వాడుక కెక్కినవి.

'స్నిహ్' వలన సంస్కృతమున 'స్నేహము' ఏర్పడినది. అది కలవాఁడు 'స్నిగ్ధుఁడు'. తెలుఁగులో స్నిగ్ధుఁ'డనుటకు బదులు 'స్నేహితుఁడు' అనుపదము పెద్దల వాడుకలయందును బ్రసిద్ధ మైనది. ఇయ్యది యసాధువు. ఈ'స్నేహిత' పదమునుబట్టి "స్నేహితము" అనుపదమును 'మైత్రి' యను నర్థమునఁ బ్రచారమునకు వచ్చినది. ఇది యెంతయు

అధికము ధర్మివాచకము. దాని భావ మను నర్థమున 'ఆధిక్యము' సాధురూపము ప్రసిద్ధము. కాని విద్వాంసులును 'ఆధిక్యత' అని భావార్థముమీఁద భావార్థకమును జేర్చి వాడుచుండుట కలదు. అయ్యది సరి కాదు. దీనింబట్టియే 'ఐక్యత, విస్తీర్ణత' మున్నగుపదములు తయారై నవి !

చాలమంది విద్వత్కవులు "శతాబ్ది" అనుటకు బదులుగా 'శతాబ్దము' అను బదమును వాడుచున్నారు. ఇయ్యది సమాహార ద్విగువు. ఇం దుత్తర పద మకారాంత మగుచో స్త్రీత్వేకారాంతత్వములు కలుగును. 'శతాబ్దము' అనుట సరికాదు.

చాలమంది 'పైని'కి బదులు 'పైన' అనియు 'తేదీని' అనుటకు మాఱుగా 'తేదీన' అనియు-వాడుటయే కాక, అయ్యవి సాధురూపము లనియే భ్రాంతిపడుచున్నారు. ఇకారాంతములమీఁది కు-ను-వు క్రియా విభక్తుల యుత్వమున కిత్వము వచ్చుటంజేసి 'తేదీని' అగును. ఐకారం బితుల్యం బగుటంజేసి పైని' అగును. ఒకవేళ నిట్ల్యోడ అనఁగా- 'పైన, తేదీల' మున్నగుచోట్లఁగల 'న' సప్తమ్యేకవచన మని యను కొంద మన్నను సాధ్యము కాదు. 'న' ప్రత్యయము జడంబులగు నుదంతములకే విహితము. ఇట్టిపదములకు సాధుత్వమును గల్పించుట యెట్లో?

ఇప్పటి వారి వాడుకలో నున్న పదములసంగతి యటుంచి, ప్రాచీన వాఙ్మయముదెస దృష్టి మఱల్చినను-అచ్చటను కొన్ని వింత ప్రయోగములు కానఁబడుచుండును. అట్టివానిని రెండు, మూఁడింటిని గమనింతము.

భాషాతత్త్వవేత్తల సిద్ధాంతము ననుసరించి యాంధ్రము ద్రావిడ భాషాకుటుంబమునకుఁ జెందియున్నను లక్షణ నిర్వచనమునను, వాఙ్మయ పరిపోషణమునను జాలవఱకు సంస్కృతమునే యనుసరించిన దనుట నిర్వివాదాంశము. ఆంధ్రవ్యాకరణగ్రంథములు తొట్టతొలి దినములలో సంస్కృతమునందే రచింపఁబడినవి. ఆదికవి నన్నయ తన మహాభారతమును సంస్కృతశ్లోకముతోనే ప్రారంభించినాఁడు. అక్క-

అలు, ద్విపద, గీతులు, సీసములు, తరువోజ మున్నగునవి కొన్ని తక్క తక్కిన తెలుగువృత్తములు సంస్కృత చ్ఛందోనిబంధన ననుసరించియే కూర్పఁబడుచున్నవి. ఇఁక అలంకార వాఙ్మయమునకో-సంస్కృతము పెట్టినదే భిక్ష !

సంస్కృతమున 'జయింప శక్య మగు నను నర్థమున 'జయ్యము', 'జయింపయోగ్య'మగు నను నర్థమున 'జేయము' అనునవి వ్యాకరణ సమ్మతములు. ఈవిషయమున 'క్షయ్య జయ్యౌ శక్యార్థే' అను పాణిని సూత్రము ప్రమాణము. విషయ మిట్లున్నను తెలుఁగుభాషలోఁ దొలుతనుండియు 'అశక్యమైనవాఁడు' అను నర్థమున 'అజేయుఁడు' అనియే ప్రయోగింపఁ బడుచున్నది. నన్నయ భారత భాగమునందును

'క. మా యీదాస్యము వాయు న
పాయము సేయుండు; నన్నుఁ బనుపుం; డిష్టం
బేయది దానిని దెత్తు న
జేయుఁడ నై యమరవరులఁ జేకొనినైనన్.'

[ఆదిపర్వము-ఆ-౩-ప-౫౩]

అని ప్రయోగింపఁబడినది. నన్నయభట్టారకుఁడు సంస్కృత వ్యాకరణానభిజ్ఞుఁ డనిగాని, ఇట్టి ప్రయోగ మసాధు వనిగాని మన మనుకొనరాదు. సంస్కృత వ్యాకరణమునుబట్టి 'అజేయ' శబ్దము సాధువే. ఆంధ్రభాషా సంప్రదాయము ననుసరించి దానియర్థము మాత్రము మాఱినది.

భాషాభేదమును బట్టియు, దేశభేదమును బట్టియు, పదము ల భిన్నము లయ్యును వాని యర్థము మాఱిపోవుచుండుట సహజము. అట్లే యొక్క యర్థమున విభిన్న ప్రదేశములందు వేర్వేఱు శబ్దములు వాడఁ బడుచుండును. సంస్కృతమున 'నిజ' శబ్దమునకు 'స్వీయ' మను నర్థము; తెలుఁగున 'సత్య'మర్థము. 'దరి' శబ్దమునకు సంస్కృతమున 'గుహ' యర్థము. తెలుఁగున 'సమీప' మని యర్థము. ఉత్తర దేశమునఁ బత్రికలు మున్నగువానిని చదువు చోటు 'వాచనాలయము.'

మన ప్రాంతములందు 'పఠన మందిరము.' అచ్చటి 'యానము' మనకు 'శకటము.' ఈ పద్ధతుల ననుసరించియే 'అజేయ' శబ్దమును నన్నయ భట్టారకుఁడు 'జయింప శక్యముకానివాఁ'డను నర్థమునఁ బ్రయోగించెను.

కొన్ని పదములు గతానుగతికముగ గ్రంథముల కెక్కుట కలదు. శ్రీనాథమహాకవి 'పణినాపత్య శాస్త్రంబు-' అని ప్రయోగింపఁగా, దాని ననుసరించి ఆంధ్రకవితాపితామహుఁడును 'పణిన సూను కణాద బాదరాయణ సూత్రఫక్కి విద్వాంసు లుపన్యసింప' అని పాణిని మహామునిని 'పణిన' సూనునిగాఁ బేర్కొనినాఁడు. పాణిని పణియొక్క కుమారుఁడని('పణినః అపత్యంపుమాన్ పాణినిః' అని వైయాకరణులు) చెప్పుచున్నారు. ('అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః' అను నానందవర్ధన సూక్తి ననుసరించి ప్రతిభాశాలు రగు మహాకవుల కవితలోనిట్టివి నెఱసులుగా లెక్కకురావు.

'విశ్వామిత్ర' పదము సుప్రసిద్ధము. దానిని 'విశ్వ+అమిత్ర' అని విడఁదీసి, సవర్ణదీర్ఘసంధి చేసి, 'విశ్వామిత్ర' శబ్దమును సాధించుట వ్యాకరణ సమ్మతముకాదు. పాణిని 'విశ్వ+మిత్ర' అనిమాత్రము విడఁదీసి ఋషినిదెల్పు పదము పరమగుచో 'విశ్వ' కు దీర్ఘమగునని 'మిత్రే చార్షౌ' అను ప్రత్యేక సూత్రమున నిపతించి యున్నాఁడు. కావున దీనిని 'విశ్వ+అమిత్ర' అని విఱుచుట సాధ్యముకాదు. కావున నిచ్చట 'శ్వా' అను నెడ హల్లునకే గాని, అచ్చునకు యతి చెల్లదు. ఈ యంశమును బాగుగ గ్రహించినందుననే నన్నయభట్టారకుఁడు.

సీ. 'సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతి ఘోర
తపము సేయుచు నున్నఁ ద త్తపమున'
[ఆది. ఆశ్వా. 4. ప. 36]

సీ. 'శమహీనుఁ డైన విశ్వామిత్రు చేసిన
యుపకారమునఁ జేసి యాత్మ సుతులు'
. ఆశ్వా. 7. ప. 96]

అని యతికి హల్మైత్రినే కూర్చినాఁడు, కాని తరువాతివారు కొందరు 'విశ్వామిత్ర' పదము 'విశ్వ+అమిత్ర' పదముల సంధివలన నేర్పడిన రూపమని భ్రాంతిపడి యతికి అచ్చుతోడి మైత్రిని కూర్పసాగిరి. రంగనాథ రామాయణమున—

'ఎక్కడా గురుఁ డని యెఱుఁగని నీకు
నక్కటా! గురుఁడు విశ్వామిత్రుఁ డయ్యె'

అని ప్రయోగింపఁ బడినది. నిత్య సమాస విశ్రాంతికి దీని నప్పకవి యుదాహరించి యున్నాఁడు.

ఇట్టివాని నింకను జూపవచ్చును. కాని, తత్త్వము నెఱుఁగఁ గోరువారికీ యుదాహృతులు చాలును.

పయివానిలో గ్రాహ్యములు కొన్నియు, అగ్రాహ్యములు కొన్నియుఁ గలవు. భాషా వాఙ్మయము లం దాఱితేఱిన విద్వద్వర్యులు బాగుగఁ బరిశీలించి, ఎట్టివి గ్రాహ్యములో, ఎట్టి వ గ్రాహ్యములో నిర్ణయింపవలెను. అట్టిపని 'ఆంధ్రసాహిత్య పరిషత్తు' వంటి సారస్వత సంస్థల యాజమాన్యమున జరుగవలెను. ఇట్లొనర్చినచో నాంధ్ర భాషకు సమగ్రమును, సంగ్రహము నగు వ్యాకరణము, చక్కని భాషావాఙ్మయ చరిత్రములును వెలువడుటకు మంచి యవకాశ ముండును.



శుభమస్తు

# ఆంధ్ర వికృతిపదస్వరూప నిరూపణము.

శ్రీరాంభట్ల లక్ష్మీనారాయణ

A

ఆంధ్రము-వికృతి-అను నీ పదద్వయ మేకార్థకమా? లేక భిన్నార్థకమా? అను విషయము వ్యాకరణాదులనుండి నిర్ణయించుట యిందలి విషయము.

సామాన్యదృష్టిని బరికించిన నీ పదద్వయ మేకార్థక మయి యుపయోగింపఁ బడుచున్నది. ఆంధ్రభాష, వికృతిభాష యనినఁ దెలుఁగను నర్థము స్ఫురింపకపోదు. కాని యట్లు భేదరహితముగ నీ పదను లుపయుక్తము లయినవా యని సందేహము, తన్నివారణమునకు వ్యాకరణములును, భాషయు, నత్యంతోపకారకములుగదా! వాని నరసి నిశ్చయావస్థకుఁ గడంగుట యవసరము.

తొలుత నాంధ్రపదమును గ్రహింతము. మొట్టమొదట నాంధ్ర పదము జాతిపరముగను, తరువాత దేశపరముగను నుపయోగింపఁబడి తుదకు భాషాపరముగ రూఢమయినది ఆంధ్రభాష యనఁ దెలుఁగనియు నాంధ్రులచే వ్యవహారమునకై యుపయోగింపఁబడుభాషయనియు సర్వు లు నంగీకరించిన విషయమే. తత్సమతద్భవదేశ్యగ్రామ్య రూపభేద చతుష్టయవిశిష్ట మగు తెలుఁగునకే యాంధ్రభాష యను నర్థము సర్వజనాదృతము. ఆంధ్రమహాభారతము, ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రభాషాను శాసనము, ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వము మున్నగు గ్రంథ నామములందలి యాంధ్రపదము చతుష్టయభేదవిశిష్టాంధ్రమునే నిరూపించుచున్నది.

"ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియాఱు" అని సూత్రించిన ప్రౌఢ వ్యాకరణకర్తయు, "అంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు" అని సూత్రించిన యాంధ్రశబ్దానుశాసనకర్తయుఁ బై యభిప్రాయమునే గలిగియుండిరని యవగత మగును. తత్సూత్రసరణియే దానికిఁ బ్రామాణ్యము.

"బాలవ్యాకరణం బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబు నకుఁ" అని పలికి బాలవ్యాకరణకర్త యగు చిన్నయసూరియుఁ బ్రథమమున నా యభిప్రాయమునే వెలువరించెను. "క్రొత్తగ నాంధ్రభాషకును గొండొక లక్షణ మిట్లు చెప్పినే, యుత్తమబుద్ధి వీఁడ యని యోరలువోవక విన్న మేలు" అని కేతన యాంధ్రపదమును దెలుఁగు పద పర్యాయముగఁ బ్రయోగించెను. "నన్నయ భట్టాదులు గృతు లన్నిలిపిన లక్ష్యములును లక్షణములు యుక్తి న్నెమకి గృతియొనర్చుచు మున్నుగ నాంధ్రంబు చందమున్ వివరింతున్" అని సర్వలక్షణసారసంగ్రహకర్త పై యర్థమునే వివరించెను. అప్పకవియు నిట్లే యాంధ్రపదమును గ్రహించెను. పై వ్యాకర్త లందఱు నాంధ్రమునకు వ్యాకరణమును వ్రాయఁగడంగిరి. చతుర్విధపదస్వరూపమును వారిపొత్తముల వివరించిరి. కాన వారి మతమున నాంధ్రపదము భేదచతుష్టయవిశిష్ట మని గ్రహింప నగును.

వ్యాకరణములలో ముఖ్యము లనఁదగు నాంధ్రశబ్దచింతామణి యథర్వణకారికావళులను, తద్వివరణలను బరికింపవలసి యున్నది. నన్నయకృత మని పిలువఁబడు చింతామణియందు నాంధ్రపదము గ్రంథనామముననే యుంచఁబడినది. "ఆంధ్రపద్యావళౌ ప్రాసం ద్వైతీయాక్షరం తథాఽదిమం, వళిం" అని శ్లోకమును రచించి కారికావళికర్తయుఁ బై అభిప్రాయమునే గలిగియున్నట్లు దోఁచకతప్పదు. "శబ్దశాసన నన్నార్య మాంధ్రకావ్య కృతాం గురుం, వందే కవిత్రయగురుం ఆంధ్ర వ్యాకృతి కృద్గురుం" అని యాంధ్రవ్యాకరణ సర్వస్వకారులు పై యర్థముననే యాంధ్రపదము నుపయోగించిరి.

ఇట్లుండ చింతామణికర్తయు, కారికావళికర్తయు నాంధ్రపదమును మఱికొన్నిచోట్లఁ బై యర్థమునకు భిన్నముగ నుపయోగించి స్వవచోవ్యాఘాతము గావించుకొనిరి. సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి" అని చింతామణి సూత్రము. ఇందలి యాంధ్రపదమున కర్థ మేమి? తత్సమాది భేదచతుష్టయవిశిష్ట మగు నాంధ్రపదము, అని యర్థము జెప్పఁగలమా? అట్లు వలనుపడదు. అప్పుడు 'సంస్కృతపదేన' అను పదమున కర్థము మృగ్యము. కేవల సంస్కృత

పద మనఁజాలముగదా. తత్సమపద మని యర్థము చెప్పక తప్పదు. అట్ల యిన "తత్సమపదముతోఁబరిమితవర్ణములు గల తత్సమపదము సమసించి కర్మధారయ మగును" అను నర్థము వచ్చును. అయ్యది నిరర్థకము. కాన నాంధ్ర మనఁగాఁ దత్సమపదరహిత మని యర్థమును జెప్పవలెను.అట్లయిన గ్రామ్యము ప్రయోగానర్హము గానఁ దద్భేదమును విడువవలెను. కాఁగా 'తద్భవదేశ్యభేదయుత మగు తెలుఁగు' అను నర్థమును జెప్పవలెను. ఈ సూత్రమునకు వివరణమును రచించిన యహోబలపతి యుదహరించిన యుదాహరణపద్ధతినిబట్టి చూచినఁదద్భవపదములందుఁ గానరావు. దేశ్య పదము లే గాననగును. కాన నాంధ్రపదమునకు 'దేశ్య మగు తెలుఁగు' అను నర్థమును జెప్పకతప్పదు. కావుననే యహోబలపతి 'ఆంధ్రపదం= వికృతిపదం"అని యర్థమున్వ్రాసి వేఁడి పయోధారలు, వాడి మయూ ఖములు' అని యుదహరించెను. కావున నీ స్థలమునఁ జింతామణికర్త యాంధ్రపదము నాచ్ఛికార్థముగ వాడె ననక తప్పదు.

అథర్వణుఁడును "బహవోఽత్రాంధ్రభాషాయాం వర్ణా ఔపవిభక్తికాః,ప్రవృత్తి శ్చాప్రవృత్తిశ్చ వికల్ప శ్చ క్వచిద్భవేత్ "అను శ్లోకమున 'ఆంధ్రభాషాపదమును' దేశ్యశబ్దపరముగ నుపయోగించెను. కారణ మే మన నౌపవిభక్తిక ప్రత్యయములు దేశ్యపదసాధారణము లయి కాన నగుచున్నవి. కాని తత్సమాదిసాధారణముగఁ గాన్పింపవు.

మఱియు, "ఆంధ్రిం పద్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే" అనుచోట నాంధ్రిపద మాచ్ఛిక పదసాధారణ మయి చూపట్టుచున్నది.

ఇట్లే, "సంస్కృతాంధ్రిపదాన్యత్రి సమస్యంతే యథాతథం, శ్రుతిరంజనమాదాయ విభక్త్యుపవిభక్తిభిః"అనుచోట నాచ్ఛికపరముగఁ బ్రయోగించెను.

ఒకచో నాంధ్రిపదమునకుఁ దత్సమాది భేదవిశిష్ట సంపూర్ణ స్వ రూప మనియు నొకచో నాచ్ఛిక మనియు నిర్ణయించుట స్వవచో వ్యాఘాత మని స్పష్ట మగునుగదా. ఇట్లు వ్యాకరణములు పరస్పర విరుద్ధముగ నాంధ్రిశబ్దార్థమును నిర్ణయించిన వనుటలో విప్రతిపత్తి కానరాదు.

ఇఁక వికృతిపదమును బరికింతము. ఈ పదము 'తద్భవ'మను నర్థమున రూఢ మయియున్నది. ప్రకృతి వికృతులనుచోట వికృతిపదమునకు దద్భవ మని యర్థమును, ప్రకృతిపదమునకుఁ దత్సమ మని యర్థమును గ్రహించుట యాచారము. వికృతిభాష యనఁగాఁ దెలుఁగని ప్రతీతి.

ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకారచూడామణి, సర్వలక్షణసారసంగ్రహము, అను వ్యాకరణములందు వికృతిపదప్రయోగము కానరాలేదు. ఈ వికృతిపదము చింతామణి కారికావళులందును, తద్వివరణలందును బ్రయుక్త మయి చూపట్టెడిని. సర్వలక్షణసారసంగ్రహమున "వికృతిపదాదా ప్రథమానునాసిక ద్వితీయాంతస్థా నస్తః" అను వ్యాకరణమునుబట్టి వికృతిపదమునకు నచ్చ తెలుఁగని యర్థము గోచరమగుచున్నది. ఇట్లే 'న వికృతిశబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః' అనుచోటఁగూడ వికృతిపదమునకు నాచ్ఛిక మని యర్థము రూఢ మయియున్నది.

చింతామణికి సంపూర్ణవివరణ మనఁదగు నప్పకవీయమున వైకృత పదము దేశభాషాపరముగ వివరింపఁబడెను. ఉదాహరణములందు మాత్రము ఆచ్ఛికములనే గ్రహించెను. 'గాదిలిజవరాలు కమలవాసిని మున్నగునవి.

బాలవ్యాకరణమున 'వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనంబు పరంబగునపు డుత్వం బగు' అను సూత్రమున వికృతిపదప్రయోగము గలదు. దాని వివరణమున "ఇచ్చట వికృతి శబ్దముచేఁ దత్సమేతరంబు గ్రహింపవలయు నని" కలదు. "కేవల సంస్కృతశబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు" అను స్థలమునందును వికృతిపదమున నాచ్ఛిక మని యర్థము స్ఫురింపక తప్పదు.

ప్రౌఢవ్యాకరణకర్తయు 'రాజు వైకృతం బని కొందఱందురు' అని సూత్రించి 'అపుడు తత్సమమునందలి చజలు దంత్యములు కా వని యూహించునది' అని వివరణమును వ్రాసి యాచ్ఛిక పరముగ నభిప్రాయమును వెలువరించెను. "మఱియు, 'కోటపేటలు వైకృత

ములు' అనియుఁ బ్రయోగించెను. పై సూత్రద్వయముం బట్టి వికృతి శబ్ద మాచ్ఛిక శబ్దపర మనక తప్పదు.

ఆంధ్రభాషానుశాసనకర్త యగు శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు "వర్ణలోపాదులను బొంది తెలుఁగున వాడుకలోనికి వచ్చిన సంస్కృతప్రాకృత శబ్దములు వికృతరూపములు తద్భవము లనఁబడును" అని తద్భవపరముగ వికృతి పదమును గ్రహించెను.

పై వ్యాకరణము లిట్లు వికృతిపదార్థనిర్ణయవిషయమున వారివైఖరిని దెలిపియున్నవి. ఇఁకఁ జింతామణ్యాదులను బరిశీలింతము.

చింతామణియందు "లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ" అను శ్లోకమున 'వైకృతకావ్యాని' యను పదము ప్రయుక్తము. దానికిఁ దద్వ్యాఖ్యానమునఁ "స్వదేశ భాషాకావ్యములు" అని వివరణము గలదు. తద్భాష్య మనఁదగు నహోబలపండితీయమున 'ఆంధ్ర భాషామయాని' అని వివరింపఁబడెను. ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వమును రచించిన శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారును నాంధ్రభాషామయ కావ్యము లనియే వ్రాసిరి. ఈ సూత్రార్థమును బట్టి వికృతిపదమున కాంధ్ర మని యర్థము స్పష్ట మగుచున్నది.

మఱియు, "ఏషా తయో ర్భవే ద్వికృతిః" అనుచోట తద్వ్యాఖ్యాత "వికృతిః=వికారముగా, భవేత్=అగును. అనఁగా నీ యాంధ్ర భాషలోఁ జేరిన తత్సమ తద్భవములు సంస్కృత ప్రాకృతమువలనఁ బుట్టిన వని యర్థము" అని వివరించెను. అహోబలపతి 'వికృతిత్వ వ్యపదేశాత్ ప్రకృతివ ద్వికృతి రితి న్యాయేన అనుక్తస్య కార్యస్యాత్ర తాభ్యాం ప్రాప్తి రిత్యాచార్యా శయః" అని నూతన మార్గమును బ్రదర్శించెను. సర్వస్వకారులును, పై యహోబలపతివాక్యముల నుదహరించుచు, "పై సూత్రముచే నన్నయ సంస్కృత ప్రాకృతములతోఁ దెనుఁగునకు జన్యజనకభావము నంగీకరించె ననియు, ద్రావిడభాషా కుటుంబము వేఱు కుటుంబ మగుటచే నట్లు వచించుట పొరపా టనియు వచించు కొందఱు పాశ్చాత్యభాషాపండితుల మాటలు కేవలము

సత్యావిదూరము లని యెన్నునది. "ప్రకృతిద్వయజా తజ్జా తుల్యా తు సమా ప్రవాహినీ దేశ్యా" అని యిట్లు తత్సమ తద్భవములకు మాత్రము సంస్కృత ప్రాకృత మూలకత్వమును వచించి, 'దేశ్యా ప్రవాహినీ' యని దేశ్యమునకు స్వతంత్రతను వక్కాణించిన నన్నయ భట్టారకుఁ డాంధ్ర దేశ్యమునకు సంస్కృత ప్రాకృత జన్యత నంగీకరించె ననుట యుక్తము" అని వివరణము రచించెను. దీనిని బట్టి వికృతిభాష ప్రత్యేక భాష యనియు, నది దేశ్య మగు ననియుఁ దోఁచుచున్నది. ప్రకృతి యాగములనుండి వికృతియాగములకుఁ గ్రియా కలాపము లను వర్తింపఁ బడినట్లు సంస్కృత ప్రాకృత భాషాసంబంధి కార్యాజాతము వికృతి యం దనుక్త మయిన ననువర్తింపఁ బడునని స్పష్టపఱచిరి. యే యం భాషా=వికృతి యనఁబడుచున్న యీయాంధ్రభాష, కేవలతయా=పార్థక్యముతో నుండియు, ఉభే చ అనుసర్పతి అని వ్రాసిరి. ఈ వి వివరణమున వికృతి యాంధ్రభాషకుఁ బర్యాయ పదము వలె గోచరించు చున్నది.

'షట్త్రింశ దత్ర తే' అనుచోట 'అత్ర' అను పదమున "కాంధ్ర భాషయం"దను నర్థము తద్వ్యాఖ్యానమునఁ గలదు. అహోబలపతి 'శుద్ధవికృతి' యని వ్రాసెను. సర్వస్వకర్త 'అచ్చ తెలుఁగు నం' దని వివరించెను. ఇందును నొకరి మతమున నాంధ్ర మనియు మఱియొకరి మతమున నచ్చ తెనుఁ గనియు నవగత మగుచున్నది. ఇంతకు 'ఏషా తయో ర్భవే ద్వికృతిః' అనుచోట నేతచ్ఛబ్దమునకు 'షట్త్రింశ దత్ర తే' అను చోట 'అత్ర' అను నిదంశబ్దార్థకావ్యయమునకుఁ బూర్వ పరామృష్ట మగు శబ్దమేదియుఁగానరాదు. సర్వనామము లగు నీ పదద్వయమునకు నీ యర్థమును గల్పించుట కాధార మేదియు లేదు. 'అత్ర'అను నవ్యయమునకు 'ఏషా' అను శబ్ద మాధారము కావచ్చును. ఏతచ్ఛబ్దమున 'కాంధ్ర శబ్ద చింతామణి' యను నామమందలి యాంధ్రపద మాధారమయి యుండనోపు. అట్లయిన వికృతి యనియు, నచ్చ తెలుఁ గనియు నర్థ మెట్లు పొసఁగును? కాన 'ఏషా' అనిన నాంధ్రభాష యను నర్థము

రాక తప్పదు. అట్లయిన నాంధ్రభాషకు నక్షరములు ముప్పదియా ఱె ట్లగును ? కాన నట్లు కల్పింప వలను పడదుగదా! ఇట్లన్యోన్యాశ్రయ దోషమున నీయర్థము సందిగ్ధమయి యుండ నా వ్యాఖ్యాత లెట్లా యీ యర్థముల రూఢము లొనర్చిరో తెలియఁబడదు.

"న వికృతి శబ్దాత్పరతః సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అనుచోట వ్యాఖ్యాత 'తెలుఁగు శబ్దముకంటె' అని యర్థమును వ్రాసెను, 'అతఁడు,' 'తండ్రి' అను పదముల నుదాహరించెను. అహోబలపతి 'సంస్కృతసమవ్యతిరిక్త శబ్దాత్ పరతః' అని వివరణమును వ్రాసెను. సర్వస్వకారులు మాత్ర మిచ్చట చిత్రతర మగు మార్గమునఁ బయనించిరి. "సాంస్కృతి కానాం=సంస్కృత సమశబ్దములలో, నవికృతి శబ్దాత్ పరతః=వికృతీతర శబ్దములకన్నఁ బరమయినను(నఞర్థక న శబ్దముతోడి సమాసము) వికృతి చిహ్నము లయిన డ్వాది ప్రత్యయములు లోపించిన శబ్దములకన్నఁ బరమయినను, కచటతపలకు గసడదవ లగును" అని వివరించిరి. ఈ వివరణమునుబట్టి తత్సమశబ్దములుకూడ వికృతి పదముచే గ్రహింపనగు నని విశద మగుచున్నది. సూత్రసమన్వయపద్ధతి మాత్రము చిత్రతర మనక తప్పదు. నన్నయచే సంస్కృత పదములకుఁ గావించిన గసడదవాదేశము నన్నయాభిప్రేతమే యను సిద్ధాంతమును రూఢము గావించుటకు వీ రీ వింత పుంత త్రొక్కినట్లు తోఁచును. కాని 'సాంస్కృతికానాం' అనుచోట నిర్ధారణషష్ఠి గావించుటలో వీరికిఁగల నిర్ధారణ మేదియో దెలియదు. "వర్ణసమామ్నాయమందలి శకారము వర్ణాంతరము గాని యలఘు శకారము కాదని యెఱుఁగునది యనుచోటఁ గల్లూరివా రవలంబించిన సమన్వయపద్ధతి తెలుఁగు వాక్య సమన్వయ పద్ధతికి విరుద్ధ మని వాదించిన శ్రీశాస్త్రి గారు సంస్కృత భాషాప్రణాళికకు విరుద్ధముగ నిట్లు వ్యాఖ్యానించుట సరసమా ?

"వికృతౌ క్వచిచ్చ లోపో మో ర్దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్" అనుచోట వికృతి పదమునకు వ్యాఖ్యానమున నాంధ్ర మని యర్థము కలదు. జొంపాలు, ప్రాణానక్, అని యుదాహరణము లీయఁబడినవి.

అహోబలపతి 'వికృతా విత్యనేన సంస్కృతసమపర్యుదాసః క్రియత్తే, తత్రాఽపి లులయోః పరయో రేవాయం విధిః ప్రవర్తతే. ప్రాణానన్' ఇతిప్రయోగ స్తు అథర్వణ ప్రాయోగ్రహణమహిమ్నా సాధుః" అని వివరించెను. సర్వస్వకర్త వికృతివైకృతపదముల కాచ్ఛిక మని యర్థము వ్రాసెను. దీనిని బట్టి వికృతి యన నాచ్ఛిక మని స్పష్టముగ నవగత మగుచున్నది.

'వికృతౌచ స్త్రీలింగాః స్త్రీలింగక సర్వనామధేయాస్స్యుః' అను స్థలమున నాంధ్రమం దని యర్థము వ్యాఖ్యానమునఁ గలదు. అహోబలుఁడు వ్రాసిన విమర్శనను బరిశీలించిన యాచ్ఛిక మని యర్థము స్ఫురించుచున్నది. 'పంటచెలిపట్టి లోకైకభద్రచరిత' అను నుదాహరణములు దాని కుపోద్బలకములు. సర్వస్వకర్తయు నిచ్చట "వికృతౌ= అచ్చతెలుఁగులోని సైతము:" అని వివరించెను. ఇదియు భిన్నాభిప్రాయమునకుఁ గారణము.

ఇట్లు 'వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమా స్త్రీసమాశ్చ నాన్యే స్యుః' 'ఏకత్వం భేదకగత బహువచనానాం చ దృశ్యతే వికృతౌ' "కేవల వికృతిపదైర్య స్సమాసకం తం బ్రువంతి వాక్యజ్ఞాః," "సంస్కృత వైకృతశబ్దై ర్మిశ్రసమాస స్స ఏవ విజ్ఞేయః" కవిభిల్లసైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు-ప్రథమైకవచన మాత్రే వికృతౌ నాంతాదయోపి కథ్యంతే" అనుస్థలములం దెల్ల యెడల తద్వ్యాఖ్యానమున వికృతిపదమున కాంధ్ర మను నర్థము ప్రాయశః చూపట్టుచున్నది. అహోబలపతిమాత్రము ఆచ్ఛికపరముగ వివరించెను. సర్వస్వకారులు నద్దాని నంగీకరించిరి.

ఇట్లు వికృతి పదము విభిన్నార్థ మగుటం జేసి వికృతరూపమును ధరించినది. ఆంధ్ర మని కొందఱును నాచ్ఛిక మని మఱికొందఱును వివరించుచుండిరి. వ్యాకరణ సంప్రదాయ విరుద్ధముగ నిట్లు భిన్నార్థకముగ నీ పదమును బ్రయోగించుట యాశ్చర్యమును గలిగింపకపోదు.

ఇఁక నథర్వణకారికావళిని బరికింతము-"వికృతా వత్ర లోపః

స్యాత్ సంబుద్ధ్యోయిపదే తు యేః" అనుచోట వికృతిశబ్దము నాంధ్ర పదపరముగ నుపయోగించెను. ఉదాహరణముగ 'ఓరాముఁడ' అని వ్రాసెను.

"శబ్దా యే చ సముత్పన్నా ఆద్యాయా మత్ర తేఽఖిలాః
కథితా వైకృతై శ్శబ్దై ర్భవంతి సదనుగ్రహాత్."

అను స్థలమునను నాంధ్రపదము లనియే యర్థము స్పష్ట మగుచున్నది. "నిత్య మన్యస్య వికృతౌ క్త్వార్థేతో న భవే త్సదా" అను చోట నీ యర్థమే కలదు.

"తృతీయే ప్రథమే వర్ణే పర ఏవ హి దృశ్యతే
బిందు ర్వైకృతమధ్యేతు నాన్యవర్ణే పరే తు సః"
"వికృత్యాదిగతో యో త్ర స్యా చ్ఛబ్దాంతరయోగతః
ప్రాణమాత్రావశేష స్స్యా దత్ర శ్రీకవి సమ్మతే"
"వికృతాదా భవే న్న ణః"
"వికృతాః పరుషా శ్చ స్యుః స్యు స్త ఆద్యపదాదిగాః"
"కేచిత్తు వైకృతా శ్శబ్దా విభక్త్యర్థాభిధాయకాః"
"ప్రాయశో వైకృతపదే లోపో దీర్ఘ శ్చ యో ర్మతః"
"కేచిత్తు వైకృతా శ్శబ్దాః పుంసి చాన్యత్రి సంగతాః"
వైకృతానాం లు హి భవేత్"
కేచిత్తు వైకృతా శ్శబ్దా డాదిత్వే నైవ సాధవః"
అజన్యజన్యభేదేన శబ్దా స్స్యు ర్వికృతౌ మతాః"

అను స్థలములం దెల్లెడల వికృతి వైకృత పదముల కాచ్ఛిక పరముగ నర్థము రూఢ మయి యొప్పుచున్నది.

ఇంతయేల? ఆంధ్రిశబ్ద చింతామణి యను నామమున 'నాంధ్రి' పదమును, కారికావళి యను నామాంతరముగల వికృతివివేక మను గ్రింథమునందు 'వికృతి' పదమును భిన్నార్థకము లయి యున్నవి. అందు ముఖ్యముగ వికృతివివేక మనుచోట వికృతిపదమున కాంధ్ర మను నర్థము చెప్పకతప్పదు-కానిచో నామమే వ్యర్థ మగును.

ఈ తీరున నాంధ్ర వికృతిపదములు భిన్నార్థస్ఫోరకము లయి మూలవ్యాకరణము లందుఁ బ్రయోగింపఁ బడినవి. కాని యర్వాచీన వైయాకరణులధోరణిని బట్టి యాంధ్ర మనఁగా సకలభేదవిశిష్ట మగు తెలుఁగనియు, వికృతి యనఁగా నాచ్ఛికం బగు తెలుఁగనియు (అనఁగా తద్భవదేశ్యములు) నిర్ణయించుకొనినట్లు తోఁచుచున్నది. ప్రాచీను లీ భేదమును బాటింపక యా పదములను సమయానుసారముగ నర్థద్వయ ముల నుపయోగించిరి.

ఆధునిక వ్యాకర్తలు పై విషయమును గమనించినట్లు గాన రాదు. ఆంధ్రపండితులదృష్టిమాత్ర మాంధ్ర మనఁగాఁ దత్సమాది భేదయుత మగు తెలుఁగనియు,వికృతి యనగా తద్భవ మనియు నిశ్చ యింపఁ బడుచున్నది.

ఇట్లు భిన్నభావమున నా పదద్వయ ముండుటకంటె నాంధ్ర మనఁగాఁ దత్సమాదిభేదవిశిష్ట మనియు, వికృతి యనగా నాచ్ఛిక మని యు రూఢము గావించుకొని గ్రంథములఁ బ్రయోగించుకొనుట యుచి తము.

ఈ యర్థానుసారము ప్రాచీనవ్యాకరణమందలి పదములన సరిదిద్దిన రూపసాధనము చెడుచున్నది. గాన వాని నంగీకరించి ము దుగ నట్టి లోపము రాకుండఁ జూచుకొనుట మంచిది.

---

శ్రీ రామచంద్రాయ నమః

# అహోబలపండితీయమునఁ గొన్ని విశేషములు.

విద్వాన్ ఆకెళ్ళ అరుణాచలశాస్త్రి

తెనుఁగు వాఙ్మయమునందలి మహాకవిప్రయోగయోగ్య మగు భాషకు నన్నయభట్టారకుఁడును, నథర్వణాచార్యులు మహాకవి ప్రయుక్తమగు భాషకును లక్షణములను గల్పించి యాంధ్రభాష కౌన్నత్యమును బోషించిరి. అట్టి భాషాలక్షణమును విస్తరింపఁజేయ నగు తెనుఁగుపండితులు సంస్కృతభాషానిష్ణాతు లగుటచేతను దత్కాలమున దేశమునందు సంస్కృతభాషకుఁ బ్రాచుర్య మధికముగ నుండుటచేతను గావలయును దల్లక్షణము సంస్కృతమునఁ గారికలరూపమున వ్రాయఁబడినది. పదునొకండవశతాబ్దమున వ్రాయఁబడిన చింతామణి కారికలకుఁ బదుమూఁడవ శతాబ్దమునం దున్న యథర్వణాచార్యులు వివరణమును వ్రాసిరి. ఆ గ్రంథములు వ్యాఖ్యాననిరపేక్షముగనే పదునేనవ శతాబ్దమువఱకును భాషావాఙ్మయాభ్యాసకుల యుపయోగమునం దున్నట్లుగ, నంతవఱకును వానికి వ్యాఖ్యానగ్రంథములు పుట్టకుండుటచే నూహింపవలసియున్నది. ఆంధ్రశబ్దచింతామణి కెలకూచి బాలసరస్వతీ మహోదయులు వ్రాసిన తెనుఁగు వ్యాఖ్యానమునుబట్టి యాలోచింపఁగాఁ జింతామణ్యాథర్వణకారికలకుఁ గల సంబంధముగాని యానుపూర్విగల యథర్వణకారికలగుఱించిగాని వారికిఁ దెలిసినట్లు లగపడదు. ఆథర్వణము లగు కొన్ని కారికలు బాలసరస్వతీయమున నుదాహరింపఁబడుటచే నేవో కొన్ని కారికలు పండితపరంపరాయాతముగా నాయన వినియుండు నని మాత్రము తెలియుచున్నది. గ్రంథ మంతయు నాతనికి దొరకలే దనియే విశద మగుచున్నది. తత్కారణమునఁ జింతామణ్యాథర్వణకారికలపరస్పరసంబంధము నాతనికి గోచరింపక పోవచ్చు నని యూహింపవచ్చును.

అప్పకవి యను నాతఁడు తన కొక చింతామణి కారికల ప్రతి చిక్కిన దనియు దానికిఁ దాను వ్యాఖ్యానమును వ్రాయుచుంటి ననియుఁ

జెప్పి పద్యరూపమున (తెనుఁగుపద్యములతో) వివరణమును వ్రాసెను. ఈ చింతామణి పాఠములు పెక్కుచోట్ల బాలసరస్వతికి దొరకినదాని పాఠములకన్న మిక్కిలి విలక్షణముగా నున్నవి. మూలము లగు నథర్వణకారికలను జూపకున్నను వాని యర్థమును గొన్నిపద్యములలోఁ బొందుపఱచియుండుటచే నీతఁడథర్వణకారికలను గొన్నింటిని జూచియున్నను జింతామణ్యథర్వణకారికలసంబంధమునుమాత్రము గుఱుతింపలే దని యాతని వివరణమునుబట్టి తెలియుచున్నది. కవిజనమండన మను నామముతో నథర్వణకారికల కొక వ్యాఖ్యానము బయలు దేఱినది. కాని దాని కాధారము మహోబలపండితీయమే. కవిజనాంజన మనునది మఱియొకటి చింతామణికి మఱియొక వ్యాఖ్యాన మగపడుచున్నది. కాని యిందలి కారికలు పెక్కు తెలుఁగు లగు పాఠభేదములచే నొప్పుచు సరిగఁ దెలియఁబడని తెఱంగున నున్నవి. తత్కర్తకును జింతామణ్యథర్వణకారికలపరస్పరసంబంధము తెలియదు. కేతన మున్నగు కొందఱు చింతామణ్యథర్వణకారికల యునికి తెలియనివా రగుటచే వారు స్వతంత్రముగా వ్యాకరణగ్రంథములను వ్రాసిరి. ఆ కాలమున ముద్రాయంత్రములు లేకుండుటచే మిక్కిలి శ్రమతో గ్రంథములను వ్రాసికొనుచుండిరి. అట్టి శ్రమతో సంపాదించిన గ్రంథముల నితరుల కిచ్చినచో నది శిథిల మగు నని కావలయుఁ దమకడ నట్టి గ్రంథ మున్న దను నంశమును దెలియనీయ కుండుటయుఁ, దత్కారణమున నా గ్రంథము వారికడనె శిథిల మగుటయుఁ దటస్థించియుండును. కావునఁ జింతామణి గ్రంథమును గేతనాదులు చూచియుండుట సంభవింపకపోయియుండును.

(ప్రభంజనము అహోబలపతి) యను నామమునకు సరియగు (గాలి నరసయ్య యను) వ్యావహారికనామము గల పండితవరేణ్యుఁడు చింతామణికి వ్యాఖ్యానము వ్రాసెను. ఈతఁ డథర్వణకారికలను బూర్తిగ సంపాదించి పరిశోధించి చింతామణికారికలతోఁ గలిపి వ్యాఖ్యానము చేసెను.

అహోబిల మను క్షేత్రము మనకుఁ బ్రసిద్ధముగ నున్నది. అచట నృసింహస్వామి దైవతము. ఆ దైవతము తత్క్షేత్రనామముతోఁ గలిపి వ్యవహరింపఁబడినపు డహోబిలపతి యని వ్యవహరింపఁబడును. గాలి నరసయ్యగారి నామము గ్రంథమునం దహోబిలపతి యనియే వ్యవహరింపఁబడవలసియున్నది. కాని వ్యవహారమునందుఁ బ్రచురముగా నహోబలపతి యనియు నహోబలపండితుఁడనియు నుండుటచే వ్యవహారప్రసిద్ధనామ మిందు గ్రహింపఁబడినది. ఈ యహోబిలశబ్దవికృతులు పెక్కులున్నను గాలి నరసయ్య యనువ్యావహారికనామమును గ్రంథోపయోగిగా నితఁడు మార్చుకొనియుండుటచేత నట్టి వికృతుల నాతని విషయమున వాడుట యుచితముకాదు.

అహోబిలపతిపండితుఁడు చింతామణికారికలకు వివరణములగు నథర్వణకారికలను జాలవఱకు సరిగనే జోడించి కవిశిరోభూషణ మను వ్యాఖ్యను వ్రాసెను. కాని యీ రెండు గ్రంథములకును గల సంబంధమును గుర్తించిన ట్లెచటను సూచనగానైనను జెప్పియుండలేదు. కాని కవిశిరోభూషణకృత్యాదియందు "మత్స్యేంద్రనామ సిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాం గతః, జగ్రాహ వ్యాకృతిం తస్మాత్ కవి ర్బాల సరస్వతీ, ఎలకూచికులాంభోధిశరద్రాకానిశాకరః సమస్తకవితాదక్షో వత్సరే కీలకాహ్వయే, తత్ర పంచపరిచ్ఛేదా శ్శబ్దశాస్త్రనియంత్రితాః, ఆర్యాఖ్య పద్యైస్తత్సంఖ్యాసమ్మితా స్స్యుర్గజైర్గజైః,మతంగశైలవిప్రేంద్రా దస్య ద్వ్యాకృతిపుస్తకం, కాకునూర్యప్పకవినా గృహీతం తత్ర షడ్గతాః, పాఠభేదా స్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే,మయా ప్రాయః సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే, అప్పార్య పుస్తకారూఢపాఠభేదాద్య దుత్థితం,మయా సంగృహ్యతే రూపం త దప్యాథర్వణోక్తితః...... య స్సారోఽథర్వణగ్రంథేసోఽప్యత్రైవ విధీయతే, తేన తత్సూక్తి-కాలోకలోలతా త్యజ్యతాంబుధైః" అని చెప్పెను. రాజరాజతనూజాతుఁ డగు సారంగధరుఁడు మత్స్యేంద్రనామకసిద్ధవర్యుని దయచేఁ దెగిపోయిన కాలుసేతులు కలిగి సిద్ధుఁడై తనకడ నున్న చింతామణిగ్రంథము నెల

కూచిబాల సరస్వతి యను నాతని కొసఁగె ననియు,నం దేనుబదియెనిమిది శ్లోకములతో శబ్దశాస్త్రము నిబద్ధమైన దనియు మతంగశైల విప్రేంద్రుని వలన నప్పకవికి మఱియొక చింతామణిప్రతి లభించిన దనియు నా రెంటి యందును బాఠభేదములు పెక్కు లగపడుచున్న వనియు నహోబలపండి తుఁడు బాలసరస్వతీయములోని పాఠమునే తాను సంగ్రహించితి ననియు నప్పకవి పుస్తకములోని పాఠభేదములవలనఁగలిగిన రూప విశేషముల నథర్వణకారికలవలన సంగ్రహింతు ననియు నథర్వణగ్రంథములోని పార మంతయుఁ దన వ్యాఖ్యానమునందుఁ బొందుపఱచుటచేఁ దద్గ్రంథ మును జూడవలయు నను నిచ్చను బండితవరేణ్యులు వీడవచ్చు ననియు నా కారికలకుఁ దాత్పర్యము. ఈ గ్రంథమునుబట్టియుఁ జింతామణ్యాథ ర్వణకారికలసంబంధమును గుఱించి యహోలపతిపండితుని యభి ప్రాయము నిర్దిష్టము కాలేదు. ఇట్టి యభిప్రాయమే గ్రంథమునం దెల్ల యెడలను నగపడునట్లు వ్రాసెను.

"అనాదిషువిభక్తిష్వాత్రో వా" అను సూత్రవ్యాఖ్యానమునం దహోబిలపతిపండితుఁడు "సంధివిధానసామర్థ్యా దేవ సంధివేళాయాం ద్రుతస్యాఽదృశ్యతా జ్ఞాపితా. అథర్వణ స్తు—అచాంసంఘాద్రుతోఽ దృశ్యః స్థితోఽపి చ భవేత్సదా, క్వచి త్ప్రత్యయయోగేన తథాత్వ మభి ధీయతే, ఇత్యువాచ. ప్రత్యయయోగే మిక్కిలియు నిత్యుదాహరణమ్" అనుదానికి సంధివిధానసామర్థ్యముచే సంధి కలుగుసమయమున ద్రుత మున కదృశ్యత జ్ఞాపితమై చింతామణిచేత రూపసిద్ధి కలుగుచున్న దనియు నథర్వణగ్రంథముచే ద్రుత మదృశ్యమగుచున్న దనియుఁ దాత్పర్యము. సంధించుపదములనడిమి ద్రుతము సంధిప్రతిబంధ మగుటచే దాని ప్రతిబంధమును దొలఁగించుట యవసరమై యున్నది. ఆ విషయము చింతామణి నుడువనందున నథర్వణాచార్యులు వచించిరి. ఆ విషయ మహోబిలపతి యట్లు వ్యాఖ్యానింపక రెండుగ్రంథములు నా కార్య మును సాధించుచున్న వని చెప్పెను.

ద్రుతమునకుసందర్భవేళయందు "అమలిన తారకానముద యంబుల నెన్నను"ఇత్యాది పద్యే ప్యాచార్యేణ (ద్రుతస్య) వర్ణాంతర

త్వ ముపపాదితమ్. ఏతచ్చ సమాసేన సంభవతి. ప్రయోగాభావాత్. స్వత్వం ప్రశ్లేషతా బిన్దు స్సమాసేన ప్రయోగతః, ఇత్యథర్వణవచనాచ్చ'' అని నన్నపార్యుఁడు 'ఎన్నను-ఈదను'' అని సందర్భము కలిగినపుడు ద్రుతమునకు వర్ణాంతరత్వము నుపపాదించె ననియు నది సమాసమునందుఁ బ్రయోగాభావమువలనఁ జింతామణిమతమున సంభవింప దనియు నథర్వణాచార్యులును నా యంశమునే "స్వత్వం ప్రశ్లేషతా'' అను కారికచేతఁ జెప్పె ననియుఁ బై గ్రంథమునకుఁ దాత్పర్యము. దీనిచేతను జింతామణ్యాథర్వణ గ్రంథము లొకటి కా దనియు వేర్వేఱు గ్రంథము లనియు నను నభిప్రాయమే విశదపడుచున్నది గదా.

చింతామణియందు "బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రి పరశుసమాః, ఆద్యా ఇభకరతుల్యా స్త ద్దీర్ఘా శ్శూలసన్నిభా వన్యా। దరశార్ఙ్గ పిప్పలదళాంకుశ పన్నగసన్నిభాః క్రిమాత్పరుపాః । స్తంభవిలేఖాధిక్యే తవవ వర్గద్వితీయవర్ణాద్యాః। కీరనాహం స్తిమ స్తకశుక్తితులాసన వితర్ది సీర సమాః। అంతస్థా శ్శ్చపాణ్మో ద స్త్యచజౌ గురురలౌ చ బిందుయుతౌ'' అను లిప్యుద్ధారక శ్లోకములు కలవు. అథర్వణాచార్యులు వీనిని వివరించుచు "పఞ్చ వర్గాదయో వర్ణా శ్శంఖశార్ఙ్గాదిసన్నిభాః। తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వం దండరేఖాన్వితా అధఃతవవచ ద్వితీయా స్స్యు రూర్ధ్వరేఖా ద్వికాన్వితాః। ప్రథమా స్తు తృతీయా స్స్యు స్తృతీయా స్తే చతుర్థకాః, రేఖాద్వయా ధోదండేన యుక్తా స్స్యు రనునాసికాః।మిళద్దండద్వయో పేతాఃప్రథమా లిపయస్మృతాః'' అని వ్రాసెను. చింతామణ్యథర్వణకారికలసంబంధ మింత సుస్పష్టముగా వీనియందు గోచరించుచున్నను నహోబలపతిపండితుఁ డా విషయము నేమియు సూచింపకయే చింతామణికారికలకు వ్యాఖ్య వ్రాసి "అత్ర ద్వితీయా చార్యేణో క్తమ్'' అని కారికలను వ్రాసి వ్యాఖ్యానించెను. ఈ తీరుననే గ్రంథమం దంతటను వాని సంబంధ మిదమిత్థ మని తెలియపఱుపకయే వ్యాఖ్యానము వ్రాయఁబడెను.

అథర్వణాచార్యులు కొన్నిపట్టులయందుఁ దన గ్రంథము చింతామణికి వివరణ గ్రంథ మని సూచించియుండెను. ఆ చోటులను సైతము వివరింపక యట్లే యహోబిలపతిపండితుఁడు వ్రాయుచు వచ్చెను. అవి యొండు రెండు పట్టు లీ క్రిందఁ జూపఁబడుచున్నవి.

“జౌపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ, రుల్యాదే ర్నామ్నాం స్యు స్తే వా విభక్తౌ సమాసే చ” అను సూత్రమును వివరించుచు నథర్వణాచార్యులు “బహవో ऽత్రాంధ్రభాషాయాం వర్ణా జౌపవిభక్తికాః, ప్రవృత్తి శ్చాప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్ ‘తద్వివేకః ప్రయోగైకశరణస్యా ద్ధి శబ్దతః” అని చింతామణి సూత్రమునం దున్న ‘వా’ అను శబ్దమును బట్టి యీ యౌపవిభక్తి కార్యము ప్రయోగైకశరణ మగుట చింతామణ్యాభిప్రేత విషయమే యని చెప్పెను. దానికి వ్యాఖ్య చేయుచు నహోబిలపతి “వాశబ్దతః ప్రసిద్ధ వ్యర్థక వాశబ్ద ప్రయోగాత్” అని మాత్రము చెప్పి యూరకుండెను. కాని దాని వివరించి చూపలేదు. మఱియు “తత్ర ద్వితీయా షష్ఠీ చ విభక్తీ సమ్మతే ఉభే” అను నథర్వణ కారిక “న తుణా భవేచ్చ లోపో ణ్యర్థే యో వర్తతే పరే తస్మిన్” అను చింతామణికారికకు వివరణము. కావున ‘తత్ర’ అను పదమునకు ‘ప్రేరణార్థకమునందు’ అని యర్థము. అహోబిలపతిపండితుఁ డీ కారికను “కర్మణ్యానుబంధ స్స్యాత్ప్రతిధాతుః కర్తృవచ్చ తద్విధయః” అను కారికక్రింద వ్రాసి “తత్ర” అను పదమునకుఁ గల సంబంధమును వివరింపక “తత్ర ద్వితీయా షష్ఠీ చ విభక్తీ సమ్మతే ఉభే” ఇత్యథర్వణవచనా ద్విభక్తిద్వయమ్. మాచే ఘటియింపఁ బడియెన్-మాకది ఘటియింపఁ బడియెన్, ఇతి’ అని మాత్రము వ్రాసి యూరకుండెను.

మఱియు “స్త్రీపశుజడా న్యినాన్యే మహదాఖ్యా స్తద్విశేషణా శ్చాపి” అను మున్నగు కారికలు వివరించుచు నథర్వణాచార్యులు “మేఘుఁడు-పర్వతుఁడు-సముద్రుఁడు” మున్నగు రూపముల సాధుత్వము నకై “వివక్షాతః ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్ భవేత్” అను కారికను, “వాయసుఁ డోడెను-మర్కటుఁడశోకవనమును బెకలించెను.”

అను రీతిని వాయసమర్కటాది శబ్దములకు మహద్రూప సిద్ధి నిమిత్తము "భవే దమహతోఽప్యర్థ విశేషే మహదాకృతిః" అను కారికను "తక్షకుఁడు (పాముపేరు) పులియఁడు (కుక్కకు నామము) మున్నగు రూపములు సిద్ధించు నిమిత్తము" 'కేచి చ్చామహత శ్శబ్దా మతే కవిశిఖామణేః। పురుషాఖ్యా భవ న్త్యత్ర ప్రయోగ స్తత్ర కారణమ్" అను కారికను నుపదేశించెను. ఈ కారికల కన్నింటికిఁ బ్రత్యేక ప్రత్యేక ప్రయోజనము లున్నవి. ఈ యంశములను గుర్తింపక యహోబలపతిపండితుఁడు 'వివక్షాతః' ఇత్యనేనైవ సిద్ధే భవే దమహత ఇతి కేచి చ్చామహత ఇతి వచనద్వయం స్పష్టార్థమ్. ఉరగులు-ఉరగములు. ఇత్యాది" అని ప్రత్యాఖ్యానము చేసెను. చింతామణి కారికల కివి వివరణము లని తెలిసియున్న నట్లుచేసి యుండఁడు గదా.

ఈ విధముగఁ జింతామణ్యాథర్వణ కారిక సంబంధమును దేటపఱుపకుండ గ్రంథమునం దంతటను వ్రాసినను బీఠికలోఁ జెప్పఁబడిన 'అప్పార్యప్రు స్తకారూఢ పాఠభేదా ద్య దుత్థితమ్, మయా సంగృహ్యతే రూపం తదప్యాథర్వణోక్తితః' అనియు 'యస్సారో ఽథర్వణగ్రంథే సోఽప్యత్రైవ విధీయతే, తేనతత్ఫక్కికాలోకలోలతా త్యజ్యతాంబుధైః' అనియుఁ జెప్పినవచనద్వయమునుబట్టి సంపూర్ణ మగు నథర్వణగ్రంథ మొకటి కల దనియు నందలి సార మిందు గ్రహింపఁబడిన దనియుఁ దోఁచుచున్నది. కాని యట్టిరీతి కవిశిరోభూషణమునం దగపడనందున సారభూతము లగు కొన్ని యథర్వణకారికలు సంగ్రహింపఁబడిన వనియు నముఖ్యము లగు కొన్ని విడువఁబడిన వనియు నూహింపవలసి యున్నది. దీనినిబట్టి యథర్వణప్రోక్త మగు నొక స్వతంత్ర సమగ్ర వ్యాకరణము కల దను నభిప్రాయ మహోబలపతిపండితునకుఁ గల దని నిశ్చిత మగుచున్నది. ఈతనికిఁ గలిగిన యీ యభిప్రాయ మీతని గ్రంథమునఁ గొన్ని పట్టుల బాధింపఁబడకున్నను 'జోపవిభక్తిక సంజ్ఞావర్ణాః' అను మున్నగు పెక్కుచోట్ల బాధిత మగుటచే నీతఁ డట్టి పట్టులను వివరింపక విడిచికొనవలసివచ్చెను.

అహోబలపతిపండితుఁడు 'చింతామణి కథర్వణకారికలు వివరణము లని చెప్పకున్నను నే చింతామణికారిక కే యథర్వణకారిక వివరణమో పరిశీలించి చాలవఱకు వానిని సరిగనె జోడించి వ్యాఖ్య వ్రాసెను. కొన్ని కారికలను మాత్రము తత్కాలమం దనఁగా నాఘట్టము వ్యాఖ్యానింపఁబడుసమయమున గుర్తింపఁబడకుండుటచేతఁ గావలయుఁ గొన్ని పరిచ్ఛేదముల చివరఁ బొందుపఱచెను. వాని వ్యాఖ్యానమును సైతము సరిగనె వ్రాసెను.

పై రీతిని నన్నయాథర్వణకారికల సంబంధము మిక్కిలి సన్నిహితముగ నున్నను గవుల చరిత్రమును వ్రాసిన రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమ పరిశీలనమున కిట్టి విషయములు దొరక కుండుటచేతఁ గావలయుఁ జింతామణి నన్నయకృతము కా దనియు బాలసరస్వతి యా కారికలను వ్రాసి నన్నయ పేరఁ బ్రసిద్ధికిఁ దెచ్చె ననియు నట్లే యహోబలపండితుఁడు మఱికొన్ని కారికలను వ్రాసి గ్రంథప్రాశస్త్య ప్రసిద్ధికొఱ కథర్వణాచార్యుల పేరు పెట్టె ననియుఁ దమ కవులచరిత్రమునందు వ్రాసిరి. ఐహికాముష్మికములు రెంటికిని దూరము చేయునట్టి పనిని బాలసరస్వత్యహోబలపతిపండితులు చేసి రని చెప్పుట యెంతమాత్రము సరికాదు. మీఁద వివరింపఁబడిన 'స్త్రీపశుజడాన్వినాఽన్యే మహదాఖ్యాః' అను చింతామణి సూత్రవివరణములగు నథర్వణకారికలవలన నివి యహోబలపండితుఁడు రచించినవి కా వను నంశము తెల్లమగుచున్నదిగదా! నాఁటినుండియు ననఁగా వీరేశలింగముపంతులుగా రీ యభిప్రాయమును వెలువఱచినప్పటినుండియుఁ బల్వురు విమర్శకులును నాంధ్రవైయాకరణులును దద్విషయమునఁ బరిశోధనములను జరుపుచునేయుండిరి. అందుఁ గొందఱు తమ పరిశోధన ఫలితములును వీరేశలింగముపంతులుగారి యభిప్రాయములతో సంవాదము నొందుటచే వా రా యభిప్రాయములతో నేకీభవించి యూరకుండిరి. మరికొందఱు విద్వాంసులు తమ పరిశోధనములఫలితములు పంతులుగారి యూహలను బ్రతిఘటించుటచే నా సిద్ధాంతములను ఖండిం

చుచు వచ్చిరి. వారిలో ముఖ్యులు శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు.

శ్రీవజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు తాము రచించిన యథర్వణకారికావళీవిమర్శనము, బాలసరస్వతీయపీఠిక, చింతామణీవిషయపరిశోధనము, వైయాకరణపారిజాతము, నను గ్రంథములలో సందర్భానుసారముగాఁ జింతామణి నన్నయభట్టారకకృతము కాదని వీరేశలింగముపంతులుగారు చూపిన యుక్తులను సయుక్తికముగ ఖండించి యా గ్రంథము నన్నయభట్టారకకృతమే యని సిద్ధాంతము చేసియున్నారు. చింతామణి నన్నయకృతమే యని సిద్ధాంతిత మైనచో కావున దానివివరణమే యగు నథర్వణకారికావళి వీరేశలింగముపంతులుగారు చెప్పినట్లుగ నహోబలపతిపండితకృతము కాదనియు నన్నయభట్టారకునకుఁ బిమ్మట రచింపఁబడిన దనియు స్థిరపడుచున్నది. శ్రీవజ్ఝల చినసీతారామశాస్త్రిగారు తమ వ్యాకరణసంహితాసర్వస్వమునందుఁ జింతామణికారికలలో లేని కేయథర్వాణకారికలు వివరణములోఁ బరిశీలించి వానిని జోడించి వ్యాఖ్యానించుచు వాని కుదాహరణములుగాఁ బూర్వకవుల ప్రయోగములను దత్త్కవులు ప్రయోగించినవే యని విశ్వసింపఁదగినవానిని యతిప్రాస స్థలనిబద్ధము లగువానిని జూపియున్నారు. సద్గ్రంథ విధానము చింతామణ్యథర్వణకారికల సంబంధమును దత్కారికాకర్తల పాండిత్యమును నా కారిక లుద్భవించిన సమయవిశేషాదులను వ్యక్తము చేయుచున్నది. దీనినిబట్టి చింతామణికారికలు నన్నయభట్టారకకృతము లనియు నథర్వణకారిక లథర్వణాచార్యకృతము లనియు స్థిరీకరింపఁ బడినది.

ఈ విధముగ నహోబలపతి వ్రాసిన కవిశిరోభూషణము వలనను నథర్వణకారికలవలనను జింతామణ్యథర్వణకారికావళులలో వ్రాసిన వారిరీతులు వ్యక్తమగుచున్నను, శ్రీవజ్ఝల చినసీతారామస్వామి

శాస్త్రిగారు తమగ్రంథములలో గ్రంథస్థ నిదర్శనములను బట్టి స యుక్తికముగఁ జింతామణ్యాథర్వణ కారికలను వ్రాసినవారు నన్నయ భట్టారకాథర్వణులే యని నిర్ణయించినను దుర్బలము లగు బాహ్య నిద ర్శనములను జూపి కవితరంగిణిని వీరేశలింగము పంతులుగారి పాతధోర ణిని బునరుద్ధరించుటకుఁ బట్టుదల వహించుట యాశ్చర్యము.

అహోబలపండితీయమునం దథర్వణకారికలను సమన్వయిం చుటలో నహోబలపతిపండితుఁడు పెక్కుతావులయందుఁ బొర పడెను. ఆ యంశము మచ్చుగా నొకటి చూపఁబడినది. ఆకారికలకుఁ గర్త తానే యగునపు డాతఁ డట్టి పొరపాటునకు గుఱికాఁ డని నా నమ్మ కము. ఈ యంశములను బాగుగఁ బరిశీలింపక కేవలము కవితరంగిణి వ్రాతలను జూచి భ్రమించి కొందఱు కళాప్రపూర్ణ శ్రీవజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారిని జయించిన బిరుదుపట్టమును బత్రికల యందును గ్రంథములయందును బ్రకటించుకొనుట సరికాదు. అట్టివారి డాంబికమును జూచి మోసపోవునట్టి దురదృష్టమున కింకను నాంధ్ర దేశము పాల్పడలేదు. ఆంధ్రరాష్ట్రము వచ్చి యాంధ్రభాషకుఁ బ్రాధా న్యము కలుగుచున్న యీ రోజులలో నట్టి యనర్థము కలుగ దనియే యాశింపవలసియున్నది.

ఓం శాంతి శ్శా



శివాయ గురవేనమః

# మాతృభాష—వ్యాకరణము

దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

భాషాసంప్రదాయాభిజ్ఞులు, భాషాభ్యుదయకాములు, నగు పండితవరేణ్యులకుఁ బ్రణామములతో విజ్ఞాపనము. ఆర్యా:— మన మాతృభాషావ్యాకరణస్వరూపమును, తదనుసరణమార్గములను బరిశోధించి ప్రకృతకాలమున భాషాభ్యుదయమునకు వలసిన యుపాయము లన్వేషించుటకై పరిషదాహ్వానమున మన మిచట సమావిష్టుల మైతిమి. మనకుఁ బ్రత్యేకముగ సిద్ధించిన రాష్ట్రము భాషామూలకము గావున దేశవిశిష్టతకు మూలమయిన మనభాషను జక్కఁబఱుచుకొని దాని యభ్యుదయమునకు మార్గములను గల్పించుకొనవలసిన భారము నేడు భాషాభిజ్ఞులపైనఁ బడినది. సర్వభాషా సాధారణములగు స్వాభావికపరిణామపరిస్థితులను విశాలదృష్టితోఁ దొలుత గమనింపవలయును. సుమారు వేయి సంవత్సరముల కాలవాహినిలోఁ బ్రచారమొందిన మన మాతృభాషాగతి విశేషములపయి నొక్కపరి సింహావలోకనము గావింపవలయును. అధునాతనదేశీయుల యభిరుచులను గుఱుతింపవలయును. గ్రంథరచనా సందర్భమున సర్వసమాదరణార్హమగు భాషాస్వరూపమును గూర్చి పక్షప్రతిపక్షములు, చీలికలు, వైషమ్యములు, వైమత్యములు, పదేపదే బయలువెడలకుండ సమంజసమగు సాధుభాషాస్వరూపము నెడ దూరదృష్టితో సామరస్యముతో సరళమార్గమున సంప్రతింపులు గావించి పండితు లెల్లరును దమ సమ్మతిని దేశీయులకుఁ దెలిపి భాషావిషయమున దేశమున కైకమత్యము చేకూర్పవలయును.

ఈ కార్యము కొంతవఱకయిన నిరపాయముగ నెఱవేఱినపుడే యీ పరిషత్సమావేశములు సార్థకములు. లేకున్న వ్యయప్రయాస హేతువులు. ఇంచుమించు నిరర్థకములు.

ఆంధ్రవాఙ్మయము గోచరించుచున్న యీ పది శతాబ్దులనుండియు మన కవులెల్లరును దమ పూర్వుల గ్రంథములలోని భాషను గ్రహించుచుఁ దమ తమ కాలములందలి వ్యవహారభాషలో, అభిజ్ఞులు వ్యవహరించు పదజాలము గైకొని దానిని వినియోగించుకొనుచు గ్రంథ రచనము గావించియుందురు. ఆ గ్రంథములలో ప్రాజ్ఞుల యాదరము నందినవి నేఁటికిని నిలిచియున్నవి. అల్పాయుష్కము లంతరించినవి. వ్యవహారభాషనుండి గ్రంథోపయుక్తమగు భాషను ఎంచుకొనుటలోఁ గొన్ని మతభేదములు గలుగుటయు నట్టి విప్రతిపత్తులను గొన్ని సభల యందు భాషాభిజ్ఞులు చర్చించి యేదోయొక నిర్ణయము తేల్చుకొను చుండుటయు నది పలువురకు సమ్మత మగుచోఁ బరిగ్రాహ్యమగుటయు, కానియెడఁ బ్రతిఘటనము లేర్పడుటయు నిట్టివి యెల్ల భాషావినోదము లు. సార్వకాలికములు. గ్రంథముల కెక్కిన భాష మఱి మార్పుల నొందక యటులే నిలిచియుండును. వ్యవహారభాష నిత్యము మాఱు చుండును. కావుననే నన్నయాదుల నాఁడు సన్నిహితము లయిన గ్రాంథిక వ్యావహారిక భాషలు క్రమేణ విప్రకృష్టము లయినవి. కాలము గడచినకొలఁది యీ రెంటను వేఱువేఱు భాషలా యనుపించునంతటి భేదముకూడ నేర్పడుట కవకాశము గలదు. ఈ వేయి వత్సరముల పరిణామములోనే యీ యంశము సుస్పష్టముగ గోచరించును. ఇంకను గాలము గడచినకొలఁది యీ భేదము మఱింత హెచ్చగుటయు సంభావ్యము అనివార్యము.

పది శతాబ్దులనుండి గ్రంథస్థమగుచున్న యీ భాషకు నడుమ నడుమఁ గొందఱు లక్షణప్రియులు వెలసి, తమకు గోచరించిన గ్రాంథిక భాషా స్థూలరూపమును గొంతకుఁ గొంత సూత్రప్రాయముగ నితరులకు బోధింపఁదలంచి సంగ్రహముగ వ్యాకరణములు రచించుచు వచ్చిరి. ఆ లాక్షణికులు తమతమ సమ్మతులం బట్టి కొన్నియెడలఁ

గవులప్రామాణ్యము నెడను, పదపరిగ్రాహ్యతానిర్ణయమునను, భిన్నాభిప్రాయు లగుటవల్లను ఆత్మాభిరుచుల కనుకూలముగ శబ్దసాధుత్వమును నిరూపించిన వారగుటవల్లను వారిలో మతభేదములు గొన్ని యేర్పడుట తటస్థించినది. మఱియుఁ బరిణామస్వాభావికతచేఁ గాల భేదమును బట్టి నూతనరూపసిద్ధి తప్పనిది గావున భిన్నభిన్నకాల విరచితములగు జీవభాషావ్యాకరణములలో మతభేదము లుండుటయు వింత గాదు. ఇటు లనేకహేతువులచేఁ గొన్ని తావుల నైకమత్యము గొఱవడిన, ఆంధ్రశబ్దచింతామణి, వికృతివివేకము, ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకారచూడామణి, అప్పకవీయము, అహోబలపండితీయము' సర్వలక్షణసారసంగ్రహము, కవిసంశయ విచ్ఛేదము, బాల వ్యాకరణము, ప్రౌఢవ్యాకరణము మున్నగు ప్రసిద్ధలక్షణ గ్రంథములలోఁ గొన్నిటిని గొందఱును, మఱికొన్నిటిని మఱికొందఱును బండితు లనుసరించుట తటస్థించినది. కాఁగా లక్షణగ్రంథానుసారముగ శబ్దసాధుత్వమును నిర్ణయించుకొనునెడఁ బండితులు తమ యిచ్చవచ్చిన లక్షణమార్గముల నవలంబించుటలోఁ, గొందఱకు సాధువులైన శబ్దములు గొందఱకు నసాధువు లగుటయు ననివార్యముగఁ దటస్థించినది. ఉదాహరణమునకు;

'ఏకత్వే చ భవేద్వారుః తథాతౌచ భవేత్క్వచిత్' అను నథర్వణకారికను వివరించుచు 'కూఁతురు, కూఁతు, కూఁతురులు, కూఁతులు, అని యుదాహరించిన యహోబలపండితుని మతము ననుసరించి ప్రథమైకవచనేతర విభక్తులందు నయితము రేఫఘటితటిరూపములను సాధువులుగా గ్రహించు పండితులు కొందఱు గలరు.

"కూఁతురు పదము రుకారము। బ్రాఁతిగఁ దాఁజెడు విభక్తి పైఁ బెట్టినచోఁ। గూఁతురు గూఁతుంగనియెను। గూఁతులచేఁ గూఁతు వలనఁ గూఁతుల ధనముల్" అను భాషాభూషణ మతమును బట్టియు "కూఁతురులు, కూఁతుళ్ళు- కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది- అను సూరివచనము మున్నగువానిం బట్టియు రేఫ

ఘటితములు ప్రథమైకవచనేతర స్థలములందు సాధువులు కావను నిర్ణయము గలవారును గొందఱు గలరు.

2. "పాడుఁగుందేలు గో రను పలుకులెల్లఁ। బ్రాల్లుఁ గుం గోళ్లు నాఁబడు ధరిత్రి" అను చూడామణిని బట్టియు,

"రులుడుడు ______ నకా
లుల నడఁచి తదంత్యముల కుళ్ళుల్దుగు బహుళతకా
బలుగోళ్ళని కొనవేళ్ళని
కల గూళ్లుకా వేళ్లునాఁగఁ గ్రమమై యునికిన్."

అను భాషాభూషణ మతమును బట్టియు 'రోలః' రేఫస్య లాదేశస్స్యాల్లులయోః- గోరు- గోళ్లు- గోళ్ల జిగి- గోళ్లకొనలు- ఇత్యాది- లళయో రభేదః- అని వివరించిన యహోబలమతమును బట్టియు - గోళ్లు- ఊళ్లు మున్నగు రూపములు సాధువు లనుకొనువారు కొందఱు- సూరి గారి ప్రక్రియా సందర్భమును బట్టి యిట్టి రూపముల నాతఁడు సమ్మతించి నట్లగపడకుండుటచే నివి యసాధువులని యెంచువారు కొందఱు.

3. "అనుబంధప్రార్థనయోఃణౌ వ్యతిరేకాది కేచచోః పస్స్యాత్" అను చింతామణి కారికను వివరించుచు, 'నుతింపుచున్నాఁడు' మున్నగుచోట్ల, చువర్ణపర్వతమున, చకారమునకు, పత్వమును నహోబలపతి చూపియుండెను. ప్రేరణేంచుక్కు, ముజ్జీత్తులు, దుగాగమము పరమగునపుడు చకారమునకుఁ బత్వాదేశమును విధించి పచింపించు, పచింపుము, పచింపఁడు, ఆకర్ణింపుదురు, మున్నగు రూపములు సూరిగారు చూపియుండిరి. ఈ పత్వము ముజ్జీత్తులు పరమయినను రాకుండుటయుఁ శత్రర్థక చువర్ణము పరమయినపుడు వచ్చుటయుం గలదని ప్రౌఢవ్యాకరణకారులు ప్రయోగములు ప్రదర్శించియున్నారు. ఇట్టి భేదములవలన నెచటఁ బత్వము నుపయోగించుట సాధువు? ఎచట నసాధువు? అను సంశయము నిర్ణయింప గజిబిజి పడు పండితులు పెక్కండ్రు గోచరింతురు.

4. క్త్వార్థకసంధిని జింతామణి స్పష్టముగ నిషేధింపకున్నను 'ప్రాయస్తు సా త్కిమాదికస్యైతః' అను సూత్రమునందలి ప్రాయఃపద

ముచే నీ నిషేధమును గ్రహింపవలయునని యహోబలపండితులు వివరించి యుండిరి.

'క్త్వార్థేతో నభవే త్సదా' అని వికృతి వివేకకారులు ప్రకటముగ నిషేధించి యుండిరి.

'ఇడఁగవచ్చును ల్యప్పపై నిత్యసంధి
మాత్ర మొక్కొక్కచోటను మట్టుమీఱఁ
గొలుతు నఘమడంపఁ గోరిందుశేఖరు

నన్నయట్లు కవిజనానుమతిని' అని కవి సంశయ విచ్ఛేదకారులు క్వాచిత్కముగ దీనిని సమ్మతించి యున్నారు. క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు—అని సూరిగారు బాలవ్యాకరణమున స్పష్టముగ నిషేధించి యున్నారు. 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుం జూపట్టెడి' అని సీతారామాచార్యులు క్వాచిత్కముగ దీనిని సమ్మతించియున్నారు.

దీనిని గూర్చి యిన్ని భిన్నాభిప్రాయము లున్నను సూరిగారియెడఁ బ్రామాణ్యముగల పండితు లధికసంఖ్యాకు లగుటవల్ల నీ సంధి పెక్కుమంది దృష్టిలో నిషిద్ధకోటికే చెందియుండెను. కాని సూరిగారు సవర్ణాచ్చుల, అనఁగా ఇ ఈ ఎ ఏ లు పరమగునపుడు సంధి శ్రావ్యతకు భంగము కలుగదని యెంచియు, అట్టి ప్రయోగములు గొన్ని గాంచియు గావలయును తమ సూత్రాంధ్ర వ్యాకరణమున 'వాసవర్ణే' అని సూత్రించి క్త్వార్థకసంధికిఁ గ్వాచిత్కముగఁ దమ సమ్మతిని దెలిపి యున్నారు. ఈ గ్రంథము చిరకాలము మఱుఁగుపడి పరిషత్తుచే నిన్న మొన్న ప్రకటితమగుటచేఁ దగిన ప్రచార మింకను గలుగక క్త్వార్థక సంధి సర్వత్ర నిషిద్ధమను భావమే పెక్కుమంది హృదయముల నాఁటుకొని యున్నది. ఈ రీతిగాఁ గొన్నియెడల శబ్దముల సాధుత్వాసాధుత్వములను నిర్ణయించుట, లక్షణగ్రంథానుసారులగు పండితులకు సయితము క్లిష్టసమస్యగా నేర్పడినది.

మఱియు లక్షణగ్రంథములలో సాధింపఁబడని శబ్దముల విషయమున 'శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే। అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం మతమ్' అను నిర్ణయమొకటి కలదు;

గాన దానినిబట్టి ప్రాచీనలక్ష్యానుసారముగ శబ్దసాధుత్వమును గ్రహింప వలసియుండును. ఈ విషయమునఁ గూడ 'ప్రాచీనకృతులలో' ఏవేవి ప్రామాణికములు? ఈ ప్రామాణికత కవికాలమును బట్టియా? కవి ప్రసిద్ధిని బట్టియా? కృతిప్రశస్తిని బట్టియా? అని రకరకముల వికల్పించు కొను పండితులును బెక్కుమంది గలరు.

వ్యవహారదశనుండి భ్రష్టములయిన భాషల వ్యాకరణములలో నిన్ని చిక్కులు సంభవింపవు. వ్యవహారప్రవాహము సాగుచున్న భాషల విషయమున, ఈ తికమక యెప్పటికిని దప్పనిదే.

ఇట్టి చిక్కులు లెక్కింపక, చీకాకును జేరనీక, గజిబిజిని గణింపక, మన మాతృభాషా కృతికర్తలు దేశమున సకలమండల సాధారణ మయి శాశ్వతమగు గ్రాంథికస్వరూప మొకటి మన భాషకు సమ కూర్పనెంచి ఆలక్ష్యమును వీడక గ్రంథరచనమును సాగించుచు వచ్చిరి. భాషకు సుస్థిరమగు నేకరూపతను సంపాదించు నీలక్ష్య మెప్పటికిని గృతినిర్మాతల కుండఁదగినదే.

ఈ రీతిగ రూపొందిన మన పూర్వాపూర్వ గ్రంథములందలి భాష నవగతము గావించుకొనుటకును దాని స్వరూపము గ్రహించుటకును నుత్తరోత్తరకాలికులు గొంత భాషాపరిశ్రమ మొనర్చుటయు నావశ్యకమైనది. మాతృభాషాసక్తిగల మన పూర్వులెల్లరును నట్టి పరిశ్రమ మొనర్చుచునే యుండెడివారు.

సుమారు నూటయేఁబది వత్సరములనుండి మన దేశమున నాంగ్ల భాషాప్రభావము ప్రాముఖ్యము ప్రబలమగుటచే మాతృభాషా గౌరవ ము రానురాను సన్నగిలి క్రమేణ వినష్టమయినది. విద్యాలయము లందుఁ జదివెడు బాలురకు భాషాసక్తి శూన్యమయినది. పరిశ్రమ యంతరించినది. కొనకు మాతృభాషలో మాటలాడుటయు వ్రాయు టయు హేయ మన్నంత దూరముగ విద్యాభ్యాసకుల మతులు మాఱి పోయినవి. కిం బహునా? పాఠశాలలోఁ బది సంవత్సరముల పాటు పండితులు పరిశ్రమింపఁ జేసినను B. A. తరగతిలో నుత్తీర్ణతగాంచు బాలు రకు సయితము, అనాసక్త్యనాదరములు కారణములై యర్థబిందు వగ

పడిప నవహేళనముఁగా, బండితా కానవచ్చినఁ బరిహాసముగాఁ జిత్త వృత్తులు మాఱి సాధారణ సంధిసూత్రముల సారమైనను దలకెక్కని పండితుల పరిశ్రమంతయు బధిర శంఖారావముగఁ బరిణమించినది.

ఇట్టి స్థితిలో రమారమి యేఁబది వత్సరములనాఁడు దేశమున భాషావిషయమున వాద మొకటి యుద్భవిల్లినది. అదే వ్యావహారిక భాషావాదము. అది పొడసూపినతోడనే గ్రాంథికవాదులు వ్యావహా రికవాదులు నని భాషాభిజ్ఞులలో రెండు చీలిక లేర్పడినవి. ఆ వాదము నకు నుద్భావకులైనవారు మన వాఙ్మయము నంతను బరిశోధించిన వారు- మనకున్న లక్షణసామగ్రిని ఆకలించినవారు- కాలానుగుణముగ భాషాభ్యుదయము నాకాంక్షించినవారే గాని యన్యులు కారు. కాని తదనుచరులు వాదస్వరూపము గుర్తింపక దొరకినదే సందుగా నోటికి వచ్చినదెల్ల మాట్లాడనగును. మాటలాడినదెల్ల లిఖింపఁదగును. అన్నంత దూరముగ నా వాదస్వరూపమును గూర్చి పలువురు ప్రచారము సాగింపఁ దొడంగిరి. ఆ స్వేచ్ఛ యించుమించుగ నాంధ్రబాలుర కెల్లర కును రుచించినది. లోకమున, ఏ సంస్కార మవతరించినను సామాన్య జనులు సంస్కర్తల మూలసూత్రములు సమగ్రముగ గుర్తింపక, వా రేర్పఱిచిన హద్దులకు బద్ధులుగాక, మఱికొంత స్వాతంత్ర్యము తాము కల్పించుకొని తమ యిచ్చవచ్చినరీతిని బ్రచారము సాగించుట సహ జము. ఎప్పుడును సాధారణలోకము సౌకర్యము నభిలషించును గావున నట్టి ప్రచారముల నామోదించువారును, అనాలోచితముగ ననుసరించు వారును పెక్కుమంది యేర్పడుటయు నైసర్గికము. ఒక్కమాట; వ్యావ హారికవాద మూలపురుషులు ప్రాజ్ఞులు చిన్నయసూరి పాండితీకౌశల ముల నెఱింగినవారు వాదసందర్భములో నచ్చటచ్చటఁ జాలవఱకు మార్దవము తప్పకుండ సూరిగారిని బరిహసించుచు ఛలోక్తులతోఁ బ్రసంగింపఁగా దాని నూఁతఁగొని సూరిగారి ముక్కుమొగము నెఱుంగని, ఎఱుంగ శక్తి చాలని, అల్పజ్ఞులును, అజ్ఞులును గూడ సూరిగారి కక్షరములే రావన్నంత దూరముగ దూషణములు ఘోషింపఁ దొడం గిరి. ఇట్టి దూషణములను విజ్ఞు లెట్లు సహించుట ? సహింపక యేమి

చేయుట ? అది కాలప్రభావము. ఒకరి ననరాదు. అనఁ బనిలేదు.

ఈ మాదిరి వాదకాలము సాగినకొలఁది కొన్ని మార్పులతో వాదరూపము తేలినకొలఁది గ్రాంథిక వాదులు మఱింత బిఱ్ఱబిగియుట తటస్థించినది. ఉభయవాదుల వారును భాషాభ్యుదయాభిలాషులే గావున నల్పములగు మార్పులకు నందఱును సమ్మతించి యైకమత్యము కూర్చుకొనవలసినవారు-కలసిమెలసి యభ్యుదయ మార్గముల నన్వే షింపవలసినవారు-క్రమముగ మఱింత భిన్నాభిప్రాయులగుట పర్యవ సన్నమైనది.

ఇదంతయు గతించిన ప్రసంగము- అది యొక్కసారి స్మరణ కుఁ దెచ్చుకొనుట ప్రస్తుత సమాలోచనమునకు నావశ్యకము గదా యని పూర్వరంగము సంగ్రహముగ జ్ఞప్తికిఁ దెచ్చుకొంటిమి. ప్రకృత మనుసరామః.

మన రాష్ట్రము భాషామూలకముగ విభక్తమగుటచే భాష విషయమున దేశీయు లెల్లరును నెక్కుడు గౌరవము- ఆదరము- శ్రద్ధ చూపవలసిన యవసరము నేఁడు కలిగినది. రకరకములగు నూతన భౌతిక శాస్త్రీయ విషయములతో నెన్నో గ్రంథములు రచించి యావి జ్ఞానమును మన దేశమున వ్యాపింపఁజేయు నావశ్యకత మిక్కిలి ఏర్పడి యున్నది. అట్టి విషయములతో గ్రంథములు రచించు నుత్సాహము పెక్కుమందిలోఁ బొడసూపుచున్నది. శాస్త్రీయ విషయములే గాక యితర విషయములందును గ్రంథరచన చేయు కుతూహలము నేఁటి యువకులలో నధికముగాఁ గానవచ్చుచున్నది. భాషావిషయమున భిన్నాభిప్రాయములతో ననేకములు పరిషత్తులు మూలమూలల వెల యు చున్నవి. గ్రాంథికవర్గము నెట్లును మెప్పింపలే మనియు లక్షణ గ్రంథముల నిర్బంధములకు లోఁబడఁ జాలమనియు మన యిచ్చవచ్చిన భాషలో గ్రంథరచనము సాగించుకొందమనియుఁ బలువురు సన్నద్ధు లగుచున్నారు. గ్రాంథిక భాషాప్రియుల మందఱమును, ఆధునిక రచ యితలకుఁ గొంతకుఁ గొంత లక్షణసౌకర్యము కలిగించి మనతో వారికిఁ జేరిక కల్పించుకొని గ్రంథస్థభాషకు నేకరూపతను భద్రపఱుచుకొనుట

సమంజసమా ? లేక మునుపటిపట్లు పీడక యెవరిమార్గము వారిదని యుపేక్షాభావము వహించుట సమంజసమా ? ఏది భాషోన్నతిసాధన మౌ ? యోజింపుఁడు- లక్షణ నిర్బంధము సడలించుట యనఁగా నది యొక్క సభలో తేలునదికాదు. ఒక్కరు నిర్ణయింపవలసినది కాదు. మన మెల్లరమును నట్టి సంస్కారమునకు సమ్మతించినచో గ్రాంథిక భాషోన్నతికై బద్ధకంకణమైన యీ యాంధ్రసాహిత్యపరిషత్తు సంస్కారరూపమును జర్చించి నిర్ణయించుటకై భాషాభిజ్ఞ సంఘము నొకదాని నేర్పఱుచుకొనవలయును. ఆ సంఘము పరిశీలింపవలసిన యంశములు పెక్కు లుండును. ఆ యంశములను స్థూలరూపముగ నిటఁ బరామర్శించుకొందము.

ఇప్పటికి మన కుపలబ్ధములైన లక్షణగ్రంథము లెల్లను ననుసరణీయములగునా ! కావా ? ఏదే నొక యంశము కొన్ని లక్షణ గ్రంథములలో సాధితమైనను ఒక్కదానిలో నిషిద్ధమయినచో దాని నసాధువుగ భావించుటయా ? సాధువని సమ్మతించుటయా ? లక్షణ గ్రంథములలో నిష్పత్తి కానరాని శబ్దముల విషయమునఁ గవుల ప్రయోగములను బట్టి సాధుత్వమును గ్రహించుటకు విప్రతిపత్తి యేమేని గలదా ? లేనియెడ, ఏయేకాలములకుఁ జెందిన యేయే కవులు ప్రామాణికు లని ఈ వఱకు గ్రంథస్థములు కాకున్నను భాషాపరిణామ పద్ధతులను బట్టి పరిశీలించినచో సహేతుకములు సోపపత్తికములునగు మార్పులతోఁ గానవచ్చుచు అర్థస్ఫురణము గలిగి విజ్ఞులచే లోకమున వ్యవహరింపఁబడు పదజాలము పరిగ్రాహ్యమా ? కాదా ? అర్థస్పష్టత, విపరీతార్థ నిరాసము, మున్నగు ప్రయోజనములకై యాధునికులు పాటించుచున్న విసంధి యంగీకార్యమా ? కాదా ? అర్ధబిందు శకటరేఫల విషయమున నేపాటిదైన సౌకర్యము కలిగింపనగునా ? అది యెట్టిది ? మున్నగు నంశము లెన్నియో గలవు, వాని నన్నిటిని సవిస్తరముగ నివేదించుటకు సమయ సంకోచముగల యీ సభానియమములు సమ్మతింపవు. కావున దిఙ్మాత్రముగ విన్నవించితిని.

ఇట్టి విషయములెల్లఁ గోవిదులు సమాలోచించి చర్చించి నిర్ణయము తేల్చి ప్రకటింపక యుపేక్షించినచో రానున్న యనర్థ మెంతేని గలదని నా యభిప్రాయము. ఉచితమగు సౌకర్యమయినఁ గలిగింపక బింకముతో నుపేక్ష వహించినచో నెవరి యిచ్చచొప్పున వారు గ్రంథములు రచించుట తప్పదు. అవియే క్రమేణ బాలురకుఁ బఠనీయములు కాకను మానవు అందలి భాషయే బాలురకు నభ్యస్తము కాకను దప్పదు. భావికాలపు బాలురు మన మనుకొనుచున్న గ్రాంథికభాషకు మఱింత దూరస్థులగుటయుఁ దటస్థించును. అట్టి దుష్పరిపాకము రాకుండ నట్టి సదుపాయము మీ రెల్లరును సమాలోచింపవలసి యున్నది.

భాష కేర్పడియున్న నియమగ్రంధిని ఇట్టి తరుణములందు మఱింత బింకముగా బిగించుట లాభకారి కాదు. ఊఁచముట్టుగ నూడఁదీయుటయు యుక్తము గాదు. కొంచెపాటిగా సడలించుట యావశ్యకమని నా యభిప్రాయము. ఆ పనికి నభిజ్ఞులు పూనుకొన్నచో భాషాభిమానులకు భావభేదములు తొలంగును. భాషోన్నతికి బాట ఏర్పడును. విశేషజ్ఞులు సుదూరము పరికింతురుగాక.

---



# ద్రుతచరిత్రము.


కేశిరాజు వేంకట నృసింహ అప్పారావు

సంస్కృత కళాశాల, కొవ్వూరు.




ఆంధ్రవ్యాకరణములో ద్రుత మొక ప్రధానస్థాన మాక్రమించి యున్నది. దీని స్వరూపమునుగుఱించియుఁ బ్రయోగమును గుఱించియు ననేకమతభేదములు గలవు. ఆంధ్రశబ్దచింతామణి 'ద్రుతాఖ్యో నః' అనుసూత్రమున "నకారము ద్రుత మను పేరుగలది''అని నిర్వచించెను. నకారముపై నున్న 'అకారము' కచటతపాదులపై నున్న 'అకారము' వలె నుచ్చారణార్థమైనదేగాని యన్యము గాదు. కొందఱు దీనిని జూచియు, "న స్యాత్తద్ధర్మతః'' అను సూత్రమును "నసాత్యత్తద్ధర్మతః'' అని పఠించియు, అత్వవిశిష్టమైన నకారముకూడఁ జింతామణి మతమున ద్రుతమనిభ్రమించిరి (ఆంధ్రభాషాచరిత్రము. సం. I పుట 203) కాని యిది లక్ష్యలక్షణ విరుద్ధము. చింతామణికారునిమతమున, అజ్విరహితమైన నకారమే ద్రుత మని తోఁచుచున్నది. "లుగ్వా ద్రుతప్రకృతికాత్సరళే స్థిరేచ నస్యస్యాత్, అలుకి చ సంశ్లేషః స్యాత్'' అను సూత్రమునందు "సరళస్థిరంబులు పరంబు లగుచో లోపాభావంబున సంశ్లేషము''ను విధించుటచే నజ్విశిష్టమే ద్రుత మని సూచింపఁబడుచున్న దని కొందఱందురు. కాని "పరుషా ద్రుతప్రకృతికాత్సరళాస్స్యుస్తద్ధితం చ బిందుః స్యాత్'' అనుచో నాదేశసరళములు పరంబు లగునపుడు బిందువును మాత్రమే విధించి సంశ్లేషమును విధింపకపోవుటచే నకారపుఁబొల్లే ద్రుత మని తలంపవలసివచ్చుచున్నది "అలుకిచసంశ్లేషఃస్యాత్'' అనునది లోపమురానిచో సంశ్లేషరూపమే యుండునుగాని బిందువు రాదనుటకై చెప్పియుండును. "లుక్సంశ్లేషౌనాచి'' అనుసూత్రమున "అచ్చుపరమందుండఁగా లోపసంశ్లేషములురా''వనుట "సర్వత్రాజ్వత్కార్యం యస్య'' అను సూత్రముచే నేర్పడిన అచ్త్వముగల యకారముతో సంశ్లేషమును

వారించుట కని చెప్పవలయును. దీనినిబట్టికూడ నకారపుఁబొల్లే ద్రుత మని తేలుచున్నది.

"అన్యే ద్రుతప్రకృతయో యేస్యుర్వ్యాహృజీవితద్రుతా నిత్యం" అను సూత్రమున "ద్రుతమునకుఁ బ్రకృతు"లనుటచే ద్రుత మొక ప్రత్యయ మాత్రమే యని సూచింపఁబడినది. అందుచే శబ్దగతనకారమునకు ద్రుతత్వము లే దనికూడఁ దేలుచున్నది. ఈ విధముగా వర్ణసమామ్నాయమునఁ జెప్పఁబడకపోయినను దమిళమునందువలెనే రెండు నకారములు తెనుఁగునకును గల వని చెప్పవచ్చును. లఘ్వలఘుభేదము గల యవలలుగూడ వర్ణసమామ్నాయమున వేఱుగఁ జెప్పఁబడలేదుగదా! అట్లే "ద్రుతాఖ్యోనః, కచటతపాః పరుషాఖ్యాః, గజడదబాస్తు సరళాః, స్థిరా ఇతరే" అనుటచే ద్రుతనకారమునకు స్థిరసంజ్ఞకూడ లే దని చెప్ప వచ్చును. శబ్దగతమైన నకారముయొక్క స్థిరత్వమున కిది బాధకము గాదు. ద్రుత నకారమునకు స్థిరసంజ్ఞ విధించుటచేఁగల్గు ప్రయోజనమును గానంబడదు. లోపాదేశాదికార్యములచే నస్థిరమై ద్రుత మను సార్థకనామము గల నకారమునకు స్థిరసంజ్ఞ యుచితము కా దనియే చింతామణికారుఁ డిట్లు రచించియుండును, కావున "వాగనుశాసనుఁడు 'ద్రుతాఖ్యోనః' అని కేవల నకారగ్రహణముచేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయును" అను ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య విమర్శనీయము.

ప్రౌఢవ్యాకరణముప్రకారము "ప్రత్యయాగమావ్యయాత్మకమై, ఉత్వవిశిష్టమైన నకారంబు ద్రుతంబు" బాలవ్యాకరణముకూడ నకారంబు ద్రుత"మని చింతామణి ననుసరించి సూత్రించినప్పటికిని 'ను' వర్ణమునే ద్రుతముగాగ్రహించినది. "ఇకారంబుమీఁది కునువుక్రియా విభక్తుల యుత్వంబున కిత్వం బగు" అను సూత్రముచే 'ను' వర్ణమే 'ని' గాఁ గొన్నిచోట్ల మాఱినది. ఒక్క 'కన్' శబ్దములోని నకారమునకుఁ దప్ప మిగిలిన శబ్దగత నకారములకు ద్రుతత్వము బాలవ్యాకరణమున కిష్టముకాదు. కావుననే వర్గయుక్సూత్రమున వర్గయుక్కులకు 'వచ్చెం ధాత్రీపతి' యనియు, సరళములకు, పాడెం గంధర్వుఁ డనియు నుదాహర

ణము నిచ్చి పిమ్మటఁ 'కన్+దోయి=కందోయి' అను నుదాహరణ మును గూడ నిచ్చినాఁడు. సరళములకు రెండుదాహరణముల నీయ వలసిన యావశ్యకత లేదుగదా! దీనిచే 'కన్' శబ్దమునందలి నకార మునకు మాత్రము ద్రుతత్వ మిష్ట మని సూచింపఁబడినది. ఇదియైనను 'కందోయి' కందెఱ మున్నగు సమాసములందు మాత్రమే. కన్వాడు, కన్దెఱచి మున్నగుచోట్ల దుృతత్వము లేదు. పెంజీఁకటి మొదలైనవి ప్రాఁతాదులలోఁ జేర్పఁబడుటచే సాధింపఁదగినవి.

పై ప్రౌఢవ్యాకరణ సూత్రమునకుఁ గ్రమముగా నుదాహరణములు:-

ప్రత్యయాత్మకమైన ద్రుతమునకు:- నేను, తాను, ఉన్నాను, సీతను మొదలైనవి; ఆగమాత్మకమైన దుృతమునకు:- వానియందును వీనిచేతను మొదలైనవి. అవ్యయాత్మకమైన ద్రుతమునకు రాముఁడును మొదలగుచోట్లఁ గల సముచ్చయార్థక 'ను' వర్ణము చూపఁబడినది. కాని యిది 'ఉను' గాని 'ను' కాదు. 'ఉ' అను నవ్యయము సముచ్చ యార్థకము. ఇది ద్రుతప్రకృతికము. కావుననే ఉకారాంత పదములపై నిది వచ్చినప్పుడు నిత్యముగా సంధి యగుచున్నది. ఉదా:- రాముఁడు +ఉను=రాముఁడును. ఉకారాంతములు కాని పదములపై నిది యడా గమముతో వచ్చుచున్నది. ఉదా:- హరి+ ఉను=హరియును. ప్రౌఢ వ్యాకరణ ముకారాంతములుకాని పదములపై సముచ్చయార్థక ను వ ర్ణము యువర్ణ పూర్వకమై వచ్చు నని చెప్పుట భాషాచరిత్రకు విరుద్ధ ము. 'ను'వర్ణమే సముచ్చయార్థక మగు నవ్యయ మగుచో నిది ద్రుత ప్రకృతికమా? కళయా? శబ్దము లన్నియుఁ గళలు, ద్రుతప్రకృతికములు నని రెండు విధములే గదా! కళ యగుచో 'రాముఁడును' కృష్ణుఁడును' అను ప్రయోగము సాధువు కావలసియున్నది. ద్రుతప్రకృతిక మన్నచో 'రాముఁడునును గృష్ణుఁడునును' అను ప్రయోగము సాధు వగును. రెండు ను మన కిష్టముకాని ప్రయోగములే! కావున 'ఉ' శబ్దమే ద్రుతాంత మగు నవ్యయము. వాడుకలో మన ముచ్చరించు పద్ధతినిబట్టికూడ దీనిని గ్రహింపవచ్చును. 'వాడూవస్తాఁడు' మొదలగు వాక్యములలో 'వాడు+ఉ=వాఁడూ' అని అయినది. తమిళభాషలోఁ గూడ 'ఉమ్'

అనునది సముచ్చయార్థకము. ఈ 'ఉఙ్' శబ్దమునకుఁ బూర్వరూపసంధియే గాని పరరూపసంధి లేదు. ఉదా:- తల్లిదండ్రియు; వాఁడేసిన్ మొదలగునవి.

అవ్యయాత్మక మగు ద్రుత మీ విధముగా లేకపోఁగా నిఁకఁ బ్రత్యయాగమాత్మకద్రుతము మిగిలినది. భాషాశాస్త్ర దృష్టితో నాలోచించినచోఁ బ్రత్యయాత్మకమగు ద్రుతముకూడ లేదనియుఁ గేవల యాగమాత్మకమైన నకార మొక్కటియే ద్రుతసంజ్ఞ కల దనియుఁ దేలఁగలదు. అదెట్లో చూతము.

నేను, తాను, ఉన్నాను, సీతను మొదలగువానియందలి 'ను' వర్ణములు ప్రత్యయాత్మకము లని చెప్పఁబడినవి. కాని యివి నిజమునకుఁ బ్రత్యయాత్మకములు కావు. 'నేను మేము' అనువానికి మొదటి రూపము లగు 'ఏఙ్' 'ఏమ్' అను ఏకవచన బహువచనరూపములే 'నా' 'మా' అను రూపములతోఁ బ్రాదిపదికములుగా సర్వవిభక్తులందును గన్పించుచున్నవి. అనఁగా 'ఏన్' అను దానియందలి 'న' కారము ప్రకృతిగతమే యని యర్థము. అట్లే 'తాన్' అను దానియందలి నకారమును 'తన్+అ'=తన అను రీతిగా సర్వవిభక్తులందును బ్రకృతిగతమై కాన్పించుచున్నది. 'ఉన్నాను' అను దానియందలి 'ను' వర్ణము ఒకటే ఉన్న+ఆన్ (ఏఙ్కు మొదటిరూపము)=ఉన్నాన్=ఉన్నాను.

ఇఁక ద్వితీయావిభక్తి ప్రత్యయ మని భావింపఁబడు'ను' వర్ణము కూడ ననుచితవిభాగముచేత నేర్పడినదే గాని నిజమునకుఁ బ్రత్యయము గాదు. 'రాముఁడు' అను మహద్వాచకమునకుఁ దొలిరూపము "రామఙ్" అని భాషాచరిత్రము చెప్పుచున్నది. నేటికిని దమిళభాషయం దిదియే ప్రథమాంతరూపము. అదియే పిమ్మట "రాముఙ్"గా మారినది. మొదట నిదియే ప్రథమా ద్వితీయా విభక్తులు రెంటియందును వాఁడఁబడుచుండెను. కాలక్రమమునఁ బ్రథమా విభక్తికి "రాముండు" అను రూప మేర్పడఁగా 'రాముఙ్'అనునది ద్వితీయా విభక్తికి రూపముగా స్థిరపడినది. ఇందలి 'న'కారము శబ్దగతమే యనుటకు"రామునిచేత' (రాముఙ్+ఇ+చేత) మున్నగు సర్వవిభక్తులయందు నిది. కాన

వచ్చుటయే నిదర్శనము. అనుచితవిభాగముచే 'రాము' అనునది మాత్రమే ప్రాతిపదికముగా భావింపఁబడుటవలన నిగాగమవిధానమును, దానికి వైకల్పికత్వమును గలిగినవి. అచట నున్నది సంబంధార్థమున వచ్చు 'ఇ' వర్ణకము గాని 'ని' వర్ణము గాదు. గావుననే నుగాదులం దిది నిత్యముగాఁ గన్పించుట. పిమ్మట నీ 'నిగాగమమే' ద్వితీయా విభక్తియందును బ్రయుక్తమై "రామునిన్"వంటి రూపములను గల్గించినది. ప్రాచీనగ్రంథములఁ బరిశీలించినచో "రామునిన్", "రామున్" అనునవి రెండే ద్వితీయాంతరూపములుగాఁ గాననగును. "రామునిఁ గని" మున్నగుచోటులం దర్ధబిందువు ప్రాచీనగ్రంథములందుఁ దప్పక గానవచ్చును. నేఁటి యచ్చునం దిది కానరాదు. దీనికిఁ గారణము 'ని' వర్ణముకూడ ద్వితీయా విభక్తి ప్రత్యయముగా భావింపఁబడుటయే. ఇది చింతామణి నాఁటికే జరిగినది. చింతామణి ప్రకారము 'ని' వర్ణకము ద్రుతాంతము కావున 'రామునిన్' అని యేర్పడిన, బాలవ్యాకరణము ప్రకారము 'ని' వర్ణకమే ద్రుతము కావున ద్రుతముపై ద్రుతము చేరుటచే "రామునిన్" అయినది. పైనఁ దెల్పిన విధముగా "రామున్" అనునదంతయుఁ బ్రాతిపదికయే యయినను 'రాము' అనునంతవఱకే ప్రాతిపదికగా గ్రహింపఁబడుటచే "న్" ద్వితీయా విభక్తి ప్రత్యయమని భావింపఁబడుటయు, అది అమహత్తులపైఁగూడఁ జేర్పఁబడుటయుఁ దటస్థించినది. ఉదా:- సీతన్, చెట్టున్. తెలుఁగు అజంత భాష కావునఁ దెలుఁగునకు సహజాంత్యవర్ణ మగు 'ఉ'కారమును జేర్చుకొని ఈ 'న' కారమే క్రమముగా 'ను' వర్ణముగా రూపొందినది. (ఉదా:-వాక్ - వాకు;జనాబ్ -జనాబు,స్టేషన్-స్టేషను;చెట్టున్=చెట్టును) ఈ 'ను' వర్ణమే ఇకారైకారములకుఁ బరముగా వచ్చినపుడు 'కు' ప్రత్యయము 'కి' అయినట్లు 'ని' వర్ణముగా మాఱినది. కావున ద్వితీయావిభక్తికిఁ దెలుఁగునఁ బ్రత్యయము లే దని సిద్ధాంతము. ఇంగ్లీషు మున్నగు కొన్ని భాషలయందు ద్వితీయా విభక్తికి వేఱుగాఁ బ్రత్యయము లేదు. సంస్కృతమునందును నపుంసకము లగు శబ్దముల ప్రథమా ద్వితీయారూపము లొక్కవిధముగనే యుండును. ఇంతయేల?

తెలుఁగుననే జడంబు ద్వితీయకుఁ బ్రథమ యగుచున్నదిగదా !

అట్లే, చేసెను, చేయును, చేయుదును మున్నగు క్రియలయందలి 'ను' వర్ణములు గూడ శబ్దగతములే కాని ప్రత్యయములు కావు. ఇవన్నియు ధాతుజవిశేషణపూర్వపదసమాసము. చేసి+ అవ఩=చేస్య (వ) న్=చేయు఩='చేయును' అనఁగా "చేయువాఁడు" అని అర్థము, చేయు+ తా఩=చేయుదు఩ చేయుదాన (ప్రాచీనకాలమున నేను, తాను శబ్దములు పర్యాయపదములుగా వాడఁబడెడివి. 'అవ఩'అనునది 'వాఁడు అగు తచ్ఛబ్దార్థకమునను మొదటిరూపము.) భాషాశాస్త్ర ప్రకారము పై రూపముల చరిత్ర గమనించినఁ బ్రత్యయాత్మక ద్రుతముకూడ మిథ్యయే యని తేలినది.

ఇఁక నాగమాత్మకద్రుతము లని చెప్పఁబడునవి కూడ నన్నియు నట్టివి కావనియు, సంధియందు వచ్చు నుగాగమములు మాత్రమే ద్రుత సంజ్ఞకర్హములనియు నిరూపింపఁబడును. ప్రథమా కయి షష్టి యొక్క తరములైన విభక్తు లన్నియు ద్రుతాంతము లని బాలవ్యాకరణము చెప్పుచున్నది. ద్వితీయావిభక్తి ప్రత్యయమును గూర్చి యింతకుమున్నే చెప్పఁబడినది, ఇఁక ద్వితీయాదులగు చేత, తోడ, కొఱకు, వలన, కంటె, కు, లోపల, అందు, న, అనునవి ద్రుతాంతము లని తేలుచున్నది. భాషాచరిత్రముప్రకారము చివరి 'న' అనునది తప్పఁ దక్కిన వన్నియు శబ్దములే గాని విభక్తిప్రత్యయములు కావు. చేతి+ అ఩=(అందు)=చేత఩; తోడు+అ఩=తోడ఩; కొఱ+(అ)కు=కొఱకు; వలను+అ఩=వలన఩; కంటి+ఏ఩=కంటే఩=కంటె఩;(అ)కు('అగు'కుఁ బూర్వరూపము) (రాము఩+అకు=రామునకు-అనుచిత విభాగముచే రామున+కు; రాముని+కు=రామునికి' అనురూపములు గల్గినవి.) లోపలి+అ఩=లోపల఩; అందు+ఉ఩=అందున్; (జలము)న఩=(జలము+ఉ఩=అ఩)=జలమున఩- అనుచితవిభాగముచే "జలము+న఩' అని యేర్పడెను. 'అ఩, ఉ఩' ఈ రెండును సమానార్థకములు. తమిళమున 'ఇ఩' ప్రత్యయము కూడఁ గలదు. ఉదా:- 'సురత్తి఩' 'అ఩- ఇ఩- ఉ఩' అను ఈ మూఁడును సప్తమ్యర్థకములు. ఇవి 'అంతః,

'ఇంటర్' (Inter) 'ఇన్' (In) అను ఆర్యభాషాపదములకు సంబంధించిన వనియుఁ జెప్పవచ్చును. ఈ యొక్క సప్తమ్యర్థకము నాధారము చేసికొనియే తెలుఁగున నన్నివిభక్తులు నేర్పడినవి. కావున నీ విభక్తి గత నకారము లన్నియు శబ్దగతములే కాని యాగమములు కావు.

వలె ప్రభృతులయందలి నకారముకూడ శబ్దగతమే. "పోలెన్" (బోలెన్) అను పోలు ధాతువుయొక్క భూతార్థకక్రియ యవ్యయముగా మాఱి 'అచ్చోటు' 'అచ్చట' అయినట్లుగా 'బలెన్' అని మాఱి పిమ్మట 'వలెన్' అయినది.

ఇఁక భాషాశాస్త్రదృష్టిచే ద్రుతస్వరూప మెట్లుండఁదగునో చర్చింతము. మనము వర్ణోచ్చారణము చేయు సమయమున నొక వర్ణసముదాయము నుచ్చరించుచుఁబోవునపు డా సముదాయముల మధ్య మన చెవికిఁ దెలియకపోయినప్పటికిఁ గొంత యవకాశ ముండును. వర్ణోచ్చారణలో నవకాశ మున్నప్పటికిని వాయుప్రసార మాఁగదుగనుక నా యవకాశములోఁ గొన్ని స్పష్టాస్పష్ట శ్రవణముగల ధ్వనులు పుట్టును. వీనికి భాషాశాస్త్రములో 'గ్లైడ్సు' (Glides) అని పేరు. దీనికి సరియగు నాంధ్రపదము 'ద్రుతము'. గ్లైడు (Glide) 'ద్రుతము' అను నీ రెంటికిని గూడ 'జారునది' అనియే అర్థము. అనఁగా నుచ్చరింపఁబడిన రెండు వర్ణసముదాయముల మధ్య వినఁబడనట్లు జారుచుఁబోవున దని యర్థము. అంతేగాని చాలమంది చెప్పునట్లు అక్కఱలేనప్పుడు మఱుఁగుపడునదిగనుక ద్రుత మని చెప్పు నర్థము సరిపడదు. 'ద్రు- గతౌ' అను ధాతువునకు 'త్వరితగతి, కరఁగిపోవుట' అను నర్థములు కలవుకాని 'మఱుఁగుపడుట' యను నర్థము కాన్పింపదు. ఈ 'గ్లైడ్సు' రెండు విధముల పరవర్ణసముదాయము నాధారముగాఁ జేసికొని పుట్టువానిని "ఆన్ గ్లైడ్సు" (On- glides) అనియుఁ బూర్వవర్ణసముదాయము నాధారముగాఁ జేసికొని పుట్టువానిని "ఆఫ్ట్ గ్లైడ్సు" (oft- glides) అనియుఁ జెప్పుదురు. వీనిని మన వైయాకరణులు చెప్పిన 'టిత్తుల తోను, 'కిత్తు'ల తోను బోల్పవచ్చును. తెలుఁగులోని యడాగమమును "ఆన్ గ్లైడు" అనియు నుగాగమమును "ఆఫ్ట్ గ్లైడు"

అనియుఁ జెప్పవచ్చును. ద్రుత మను పేరును బట్టియు, లఘుయకార శ్రుతి మున్నగువానిని బట్టియుఁ పాశ్చాత్యసంపర్కము లేనప్పుడే మన వ్యాకరణవేత్తలు భాషాశాస్త్రములోఁ గృషిచేసినట్లు స్పష్టపడుచున్నది. రెండు వర్ణసముదాయములమధ్యఁ బుట్టు నీ 'గ్లైడ్సు' వాస్తవమునకు వర్ణసమామ్నాయములో నెన్ని ధ్వను లున్నవో అన్ని యుండును. కాని యవియన్నియు మన చెవులకు వినఁబడవు. కొన్ని మాత్రమే స్పష్ట శ్రవణము కలవై యుండును. వానిని గూర్చియే భాషాశాస్త్రము విమర్శించును. "హరి అతడు" అను వర్ణ సముదాయముల నుచ్చరించు నపుడు 'ఇ'కారము మొదలు 'అ'కారము వఱకుఁ గొన్ని ధ్వనులు త్వరితగతిని దొరలుచుఁ బోవును. అందులో లఘూచ్చారణ గల యకారము మాత్రము మనకు స్పష్టముగా వినఁబడుచున్నది. వ్యాకరణములు ప్రయోగశరణములు గాన నిట్టియుచ్చారణమును జూచి యడాగమ సూత్రమును విధించినవి. వాడుకభాషలో "మావూరు" మొదలగు చోట్ల వకారముకూడఁ గాన్పించుచున్నది. అయినను వ్యాకరణములు దానిని గ్రహింపలేదు. తమిళభాషలో యకారవకారములు రెండును గ్రహింపఁబడినవి. ఈ విధముగా సంధివశమున వచ్చిన యీ లఘు యకారమును బోలినదే ద్రుతనకారమును. చిగురు+కైదువు; సింగపు +కొోధము; తెల్ల+తనము మున్నగు పదసముదాయముల నుచ్చరించు నపుడు వానిమధ్య దంత్యానునాసికమై సులభోచ్చారణముగల నకారము 'గ్లైడు'గా వచ్చుట స్వాభావికమే. (చిగురుంగైదువు; సింగపుంగొదము; తెల్లందనము) ఈ నకారము సరళమైన ధ్వనిగల 'గ్లైడు' కావుననే దీని తరువాత వచ్చు పరుషములు నిత్యముగా సరళములగుట. దీని కాదేశముగాఁ జెప్పఁబడిన బిందుపుకూడ నొక విధమగు గ్లైడు ధ్వనియే.

కావున మొట్టమొదటి ద్రుతస్వరూప మాగమాత్మకమైన, అర్థములేని నకారపుఁబొల్లుమాత్రమే యని తేలుచున్నది. ఈ ద్రుతనకారము క్రమక్రమముగా నుత్వవిశిష్టమై, అర్థసూచక మగు ప్రత్యయమై, రానురాను 'కందోయి' మొదలగు రూపములలో శబ్దగతత్వమును

గూడఁ బొందుచున్నది. తాను దన 'గ్గిడు' స్వభావమును మఱచి పోయి తనపైఁ దిరిగి 'గ్గిడు'ను గూడఁ జేర్చుకొనుచున్నది. ఇదియే కొన్ని యెడల ద్రుతంబుపై నకారం బయి కానంబడుచున్నది. జీవద్భాష విషయములో నిట్టి మార్పులు స్వాభావికములే. ఎప్పటి వాడుకను బట్టి యప్పుడు వ్యాకరణసూత్రములలో మార్పులు చేసికొనవలసినదే గాని గంగాస్రవంతివలె బ్రవహించు భాషావాహిని కడ్డుకట్ట గట్ట నెవరితర ము? కాని భాష యెప్పు డే విధముగా మాఱుచున్నదియు, నెందులకు మాఱుచున్నదియుఁ దెలిసికొననిదే దానిని నియమించుట సాధ్యము కాదు. దీనికి భాషాశాస్త్రజ్ఞాన మావశ్యకము. ఉదాహరణార్థము 'ను' 'ని' 'న్' వర్ణముగా మాఱు ననియుఁ జెప్పనియెడలఁ గొంతకాలమునకు రెండును ద్రుతములే గనుక నేఁడువాడినను వాడవచ్చు నను నుద్దేశముల తో 'సీతని', 'చెట్టుని' మొదలగు నపప్రయోగములు వాడుకలోనికి వచ్చును. ఇట్టివి వారించుటకు భాషాశాస్త్రదృష్టితో వ్రాయఁబడిన వ్యాకరణము లావశ్యకములు. తద్జ్ఞులిందులకుఁ బూనుకొని తెలుఁగు భాషకు సమగ్ర మగు వ్యాకరణము లే దనుకొఱఁతను దీర్తురుగాక !

---

# ★ లిపిసమస్య

శ్రీమాన్ కోమాండూరి శఠకోపాచార్యులుగారు ఎమ్. ఏ., బి. ఎల్.

మన భారతదేశములోఁ జాల భాషలు కలవు. దాదాపు ప్రతి ముఖ్యభాషకును బ్రత్యేక లిపియు నున్నది. కనుక మన యిరుగుపొరుగు భాషలను నేర్చుకొనుముందు వానిలిపిని నేర్చుకోవలెను. ఈ లిపిశిక్షణము కష్టసాధ్యము, కాలహరణమునకుఁ గారణము నయి, భాషాభ్యాసమునకు నిరుత్సాహము గల్గించుచున్నది.

యూరపు అమెరికా ఖండములలో స్వతంత్రదేశము లనేకము లున్నవి. వానిలో నింగ్లీషు, ఫ్రెంచి, జర్మను, స్పానిషు మున్నగు చాల భాషలును గలవు. ఈ భాష లన్నియు నొకే రోమకలిపిలో వ్రాయఁబడును. కనుక, ఆయా పొరుగుభాషలను, ఆయా దేశములవారు సులభముగానే నేర్చుకొనుచున్నారు. ఇందువలన విద్యయుఁ జాల త్వరలో వ్యాపించును. విద్యార్థులకును శ్రమతగ్గుచున్నది. అన్నిప్రాంతములలిపి యేకము గనుక వ్యాపారస్థుల వ్యవహారములును జక్కఁగ సాగిపోవును. సంస్కృతిసమన్వయము నేర్పడినది. అక్కడి సెకండరీస్కూళ్ళలో విద్యార్థులు స్వభాషతోపాటు మరిరెండు యాధునికభాషలను, ఒక యున్నత ప్రాచీనసాహిత్యభాషనుగూడ విధిగ నేర్చుకోవలెను. కాని క్రొత్త లిపిని నేర్చుకొనుట యుండదు. అన్ని భాషలలోని పుస్తకాదుల చదువును వ్రాఁతయు ధారాళముగ సాగిపోవును. ఆయా భాషలలోని విజ్ఞానాదులు నేర్చుకొనుటయు సుకరముగనే యున్నది. మన దేశపుస్థితి యట్లు కాదు. మన పొరుగున నున్న యాంధ్రము, తమిళము, కన్నడము, మహారాష్ట్రము, ఇత్యాదులకు వేర్వేఱు లిపులు వాడుకలో నున్నందున నా భాషను మాటలాడనేర్చియున్నను, వానివ్రాఁతకు వాడుచున్న యాయా లిపులను ముందుగ నేర్చుకొన్నమీఁదనే యాయా భాషల రచనలను మనము చదువఁగల్గుదుము.

లిపి యనునది కేవల మొక యుపకరణమే. దానికిఁ బ్రత్యేక భాషతో నవినాభావ సంబంధము లేదు. సంస్కృతమును, నాయా ప్రాంతములలో వేర్వేఱు లిపిద్వారా లోఁగడ నేర్చుచుండిరి. ఆంధ్రులు తెలుఁగులిపిద్వారా, బంగాళీలు బంగాళీ లిపిద్వారా, తమిళులు వారి ప్రాంతపు 'గ్రంథలిపి'ద్వారా, నేర్చుచుండిరి. ఇప్పు డన్ని ప్రాంతముల విద్యార్థులకు దేవనాగరిద్వారానే సంస్కృతము నేర్పఁబడుచున్నది. యూరపుఅమెరికాలలో విద్వాంసులు తమ రోమకలిపిలోనే సంస్కృతము నభ్యసించుట వారల సాంప్రదాయము. కనుక, నీ భాష కీ లిపియే యుండవలె నను నావశ్యకత లేదు.

యథార్థమునకుఁ బ్రాచీనకాలములో మన దేశములో నింత లిపివిభేదము లేదు. వాయవ్యసీమా ప్రాంతములో 'ఖరోష్ఠ్రి'లిపి యుండెను; దానిని (ఇప్పటి పారసీ, అరబ్బీలవలె) కుడినుండి యెడమ వైపునకు వ్రాయుచుండిరి. తక్కినయాసేతుహిమాచలమును 'బ్రాహ్మీ' లిపిలోనే వ్యవహార మంతయు నడచుచుండెను. క్రీ॥ పూ॥ అశోక చక్రవర్తి శిలాస్తంభముపైన ధర్మోపదేశముల ప్రచురణలు (edicts) దేశమం దన్ని ప్రాంతములలోను నొకే బ్రాహ్మీలిపిలోఁ జెక్కించెనుగదా! అంత కింకనుబూర్వము పాణినిమహర్షి కాలమందును నార్యులు లిపిజ్ఞానము గల్గియుండిరి. ఆ కాలపుగ్రీకులను యవను (అయోనియను) లనియు; గ్రీకులిపిని 'యవనానీ' యనియుఁ జెప్పుచుండిరి. ('యవనాల్లిప్యాది'అని వరరుచి ప్రత్యేకకారికను చేసెను) కాలక్రమమున బ్రాహ్మీలిపియే ఆ యా ప్రాంతములందు వేర్వేఱుగఁ గ్రమ పరిణామము పొందినందుననే యిప్పటి మన లిపు లన్నియు నేర్పడిన వని ఆయా శతాబ్దుల తామ్రశాసనాదుల యక్షరములపోలికనుబట్టి తేలినది. ఈ విభేదమునకు నా యా ప్రాంతీయులరుచిభేదము కొంత కారణము కావచ్చు. కాని వారలవ్రాఁతపరికరములు వేర్వేఱుగ నుండుటయుఁ

గొంత భేదహేతు వైన దని తోఁచును. ఆదిమార్యులు 'భూర్జ'పత్రములపైన నీక కలములతో వ్రాయుచుండిరి. యూరపు శాఖకుఁజెందిన యార్యులును భూర్జతపుబెరడుల యాకులపైన వ్రాసినందునఁ బుస్తకములకు నాంగ్లాదిభాషలో 'బుక్'అను పదము నేఁటికిని నిల్చియున్న దని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు). బ్రాహ్మీలిపినుండియే దేవనాగరి లిపియు మన తక్కిన తెలుఁగు మున్నగు ప్రాంతీయలిపులును నేర్పడినవి. తెలుఁగు, ఓఢ్రము, బెంగాలు, గుజరాతు, మున్నగు ప్రాంతాలలో భూర్జవృక్షములకు బదులు తాళవృక్షములే హెచ్చుగ నున్నవి. కనుకఁ, దాటాకులపైననే యినుపగంటములతో వ్రాయుచుండిరి. తాళపత్రములపైన లోహలేఖనితో నదిమి లిఖించుటలోఁ గొన్ని చిక్కులుండును. శిరోరేఖ లనఁబడు (తలకట్టు) నడ్డుగీఁతలను గట్టిగ గంటముతో వ్రాసినప్పుడు తఱచు తాటాకు చిట్లి పగులును; కనుక మార్పు చేయుట సహజము. గుజరాతీలిపిలోఁ దలకట్టు నసలే మానిరి. ఓఢ్రులు శిరోరేఖకు గుండ్రఁదన మిచ్చిరి. కన్నడులు నాంధ్రులుఁ దలకట్టు నొక ప్రక్కకు వంచి వ్రాసిరి. ఇట్లే, బ్రాహ్మీ, దేవనాగరులలోఁ బైనుండి క్రిందికి వ్రాయు నిలువుగీఁతలను దాళపత్రములపైన గంటముతో వ్రాయుట కెక్కువ శ్రమ కల్గును. పరికరనిరోధమే యిందులకుఁ గారణము. కనుక సరిగ నిలువుగీతఁను గీయక వంపుతో వ్రాయుట బంగాళీలిపిలో నేర్పడినది. ఓఢ్రులు, ఆంధ్రులు (నాగరిలో గన్నడు) సరాసరి నిలువు గీఁతను వంచి గుండ్రఁదనముతో వ్రాసిరి. కనుక మన యక్షరములు గుండ్రనిరూప మొందియున్నవి. ఇట్లాయా ప్రాంతములలోఁ(ఒక్కసారిగ కాక) గాలక్రమమున లిపులు భేదించి, ప్రాంతమున కొక లిపి వచ్చినది. ఈ కాలమందా పరికరములస్థితి మాఱినది. కాకితములవాడుక యన్ని ప్రాంతములలోను వ్యాపించినది. తాటాకులు భూర్జపత్రములు వ్రాఁత కీ రోజులలో నెవరును వినియోగించుట లేదు. మరియు బైపు

ముద్రణకళ విరివిగ నన్ని ప్రాంతములలోను నలవడుచున్నది. కనుక, ఈ నవ్యపరిస్థితిలో నొకే భారతదేశములో నాయా ప్రాంతముల వేర్వేఱు భాషలకు వేర్వేఱు లిపులు పెట్టుకొనుచు బాధపడుట యనావశ్యకము. ఒకే లిపిని మన భాష లన్నిటికిని నిర్ణయించుకొని వ్రాయుట లాభకరము, నావశ్యకము, సుసాధ్యమును. ఏకలిపి యేర్పడుటవలన విద్వాంసులు వ్యాపారస్థులు పొరుగుభాషలను (లిపిశ్రమ లేకుండ) సులభముగా నేర్చుకోవచ్చును. ముఖ్యముగా విద్యార్థుల కిది చాల క్షేమకరము. మన సెకండరీస్కూళ్లలో నీ నాఁడు ప్రాంతీయ భాషతోపాటు దేశమంతటి జాతీయ భాష యగు హిందీని, విజ్ఞానభాష యగు నాంగ్లమును ననివార్యముగ నేర్పవలెను. ఇవిగాక సంస్కృతమును గొందఱైనను నేర్చుకోవలెను. మన భాషలకు నొకే లిపి యుండుటవలనఁ గోమల మనస్కులగు మన విద్యార్థులకు జాలఁ సౌకర్య మేర్పడును. తక్కువ శ్రమతోనే వారీ భాషలను విషయములను నేర్వఁగల్గుదురు. కనుక విద్యార్థులు, ముందుతరముల జనులు బాగుపడుటకును, మన భారతజాతి సంఘటితమై, సంస్కృతిలో సమన్వయ మేర్పడుటకును, ఈ సంస్కరణమును దీక్షతోఁ ద్వరలో సాధించుట యావశ్యకము కనుక విద్వాంసులు సంఘక్షేమపరులును విశాలదృష్టితోఁ బరిశీలించి యిప్పటి వ్యావహారికక లిపులలో నొక దానిని యావద్భారతసామాన్యలిపిగఁ జేయింపవలెను.

ఇందు కే లిపి తగినది ? ఏ ప్రాంతపువారి కక్కడి లిపిపైఁ బ్రేమాదరము లుంచుట సహజము. చిరకాలాభ్యాసమువలన నా లిపియే సుకర మైన దనియువారికిఁ దోఁచును. కాని, యిట్టి సమస్యను బ్రాంతీయదృక్పథముతోఁగాక, జన సామాన్య మగు విశాల దృక్పథముతోఁ బరిశీలించి పరిష్కరింప వలెను. ఇదివఱకే యీ దేశములో విశాల వ్యాప్తి గల సులభలిపి నిందుకు నిర్ణయించుట యుక్తము. ఈదృష్టిని,

రెండే లిపులు సామాన్య లిపియగుటకర్హములుగ నున్నవి. రోమక లిపి. (అనఁగా నిప్పటి ఇంగ్లీషు చిన్న అక్షరములు) ప్రపంచములోని ప్రాంతములన్నిట వ్యాప్తము. ఇంగ్లీషుతోపాటు, ఫ్రెంచి జర్మను, స్పానిషు ఇటానియను ఇత్యాదులకును రోమక లిపియే వాడుకలో నున్నది. తుర్కవారును నిప్పుడీ లిపిని స్వీకరించినారు. జపానులోను దీని కిప్పుడు వ్యాప్తి గలదఁట. మనదేశములోఁ జిరకాలము, ఆంగ్ల పాలన, ఇంగ్లీషు భాషా వ్యాప్తి వలన, రోమకలిపి మనదేశాలలోను ముఖ్యంగా నగరములలో వ్యాపించు చున్నది. సెకండరీ స్కూళ్ళలో నింగ్లీషు బోధనకై రోమకలిపిని నేర్పుచునే యున్నారు, మరియు, 26 మాత్ర మక్షరములు గల రోమక లిపి చాల సులభమైనది. టైపు ముద్రణలకును జాల సుకరమైన దని యందఱును నంగీకరింపవలెను. అందుకొన్ని ధ్వనులకై కొంత మార్పు ఆవశ్యకమగును. పాశ్చాత్య విద్వాంసులీ విషయమును గుర్తించి, కొన్ని చిహ్నములు చేర్చి, ఆ పద్ధతితో సంస్కృతము, హిందుస్తానీ యిత్యాదుల గ్రంథములను రోమక లిపిలో ముద్రించి యున్నారు. కాని యీ లిపి మనదేశపు లిపి కాదు; అది మన కభ్యస్తమగు దేశీయ లిపులలో దేనికిని సంబంధము, పోలిక, కలది కాదు. అది కేవలము భిన్నమైనందునను వర్ణ క్రమ భేదమును బట్టియు, ముఖ్యంగా గ్రామ జనుల కది సరికొత్తయై, కష్ట మగును; మరియు మొత్తంమీద ప్రజాభిప్రాయము రోమక లిపిని మన జాతీయ లిపిగ జేయుట కంగీకరించుటలేదు. ఈ లిపి తెలిసిన వారిప్పటికిఁ గొద్దిమంది మాత్ర ముందురు. అక్షరలోపమును వ్యతిరేక ప్రజా భావమును బట్టియు నీ దేశంలో రోమక లిపిని సామాన్యలిపిగఁ జేయుట యాచరణయోగ్యము కాదని తోఁచును.

ఇఁక, దేవ నాగరలిపి మన దేశీయుల లిపి. అది భారతీయ సంస్కృతిలోఁ జిరకాలమునుండి గౌరవాదరములఁ బొందుచు వ్యాపించి

యున్నది. సంస్కృత హిందీ భాషలను, ఈ లిపి ద్వారానే యీ నాఁటి విద్యార్థు లందరు నేర్చుకొనుచున్నారు. ఆ సేతు హిమాచలమును, అన్ని ప్రాంతములలోను నాగరలిపి వ్యాపించు చున్నది. మన దేశభాష లన్నిటిలో నెక్కువ వ్యాప్తిగల హిందీ భాషయు. మహారాష్ట్రమును నాగర లిపిలోనే వ్రాయఁబడును. ఇది యుత్తరమధ్య దేశము లంతటను వ్యాపించినది. మరియు, గుజరాతీ, బంగాలీ లిపులకు నాగరికి నంతగా భేదము లేదు. కనుక, అక్షర జ్ఞానము కలవారిలోఁ జాల హెచ్చుమంది శ్రమ లేకుండ నాగరిలిపి నిప్పుడు ధారాళముగఁ జదువ గలరు. ఇంతేగాక, మన తెలుఁగు, ఓఢ్రము, ఇత్యాది లిపులును దేవ నాగరియు నొకే బ్రాహ్మి లిపి నుండి యేర్పడినవి, వర్ణక్రమము, గుణింతము, అక్షర నిర్మాణము లొకేరీతిని మన దక్షిణలిపులకును నాగరి లిపికిని జాల పోలిక కలదు ; అందువలన, దేవనాగరినే దేశమంతటి సామాన్య లిపిగ నెఱుఁగుట యుక్తముగఁ దోఁచును.

ఇప్పటి దేవనాగరి లిపిలోఁ గొన్ని సంస్కరణలు జరుగవలె నని కొంద ఱభిజ్ఞులు, గుర్తించి యందుకు యత్నించు చున్నారు. మన దక్షిణ భాషల లిపులలో గల హ్రస్వ 'ఎ, ఒ' ధ్వనులు తెల్పు నక్షరములు దేవనాగరిలో నుంచవలెను. మరియు, టైపు, ముద్రణముల సౌకర్యమునకును, సులభముగ వ్రాఁత సాగించుటకును, కొలఁది మార్పులు సూచింపఁబడి, యిప్పు డింకను జర్చలో నున్నవి. అట్టి యావశ్యక మగు సంస్కరణతో సహా. నాగరి లిపిని మన ప్రాంతీయభాష లన్నిటికిని వాడుటకుఁ గొంద ఱిప్పుడే కొన్ని సూచనలు చేసి యున్నారు.

ఇట్టి లిపిసమత్వమునుదెచ్చి సాధించుట కీ తరము జను లెక్కువ శ్రమపడవలసియుండును; ఈతరములోఁ బ్రాంతీయలిపియు నాగరిలిపియు రెండును నమలులో నుండవలెను. ఈ రెండు లిపులలోను మన సాహిత్య

గ్రంథములు ముద్రింపఁబడవలెను. కనుక, మన తరమువారందఱు మీ శ్రమకు సిద్ధముకావలెను; నిజమే, కాని ఈ సంస్కరణను సాధించుట వలన, ముందుతరములవారు శాశ్వత సదుపాయమును బొందుదురు. ఇట్టి ప్రయత్నము ప్రభుత్వనిర్ణయముతో, నన్నిభాషల ప్రాంతములవారి సహకారముతో జరుగవలెను. అందు కీ సమస్యను మన శాసనసభ లన్నిటిలోఁ జర్చించి, నిర్ణయము చేయవలెను. అందుకు ప్రజానుకూలత ముందుగ నేర్పడవలెను. కనుక, నీలోఁగా విద్వాంసులు ముఖ్యముగ భాషాశాస్త్రజ్ఞులు, తమ యభిప్రాయములు తెలిపి, ప్రజాభిప్రాయము సరిగ నిర్మాణ మగుటకు దోహద మీయవలెను. బలీయ మగు ప్రజాభిప్రాయ మేర్పడిననే, ఇట్టి సంస్కరణ మాచరణలో బెట్టుటకుఁ బ్రజాయత్త మగు ప్రభుత్వములు పూనుకొనును. కనుక, బండితులు, విద్వాంసులు ప్రజాసామాన్య మంతటి క్షేమను కోఱి కీ సమస్యను గూర్చి విశాలదృష్టితో నాలోచించి నిర్ణయముకు వచ్చి సామాన్య జనులకు మార్గదర్శకులు కావలెను.



# మోటుపల్లి

నోరి నరసింహశాస్త్రి.

మోటుపల్లినిగూర్చి ప్రసంగించుటకుఁ జరిత్రకాములకు నపూర్వమైన విషయములు ప్రస్తావింపఁగల నను సాహసము నాకు లేదు. మోటుపల్లి ప్రాముఖ్యమునుగూర్చి పలువురు చరిత్రకారులు బహుపర్యాయములు వివరించియుండిరి. ఐనను నది విద్యావంతులకే దృఢముగా నాటుకొనినట్లు లేదు. మోటుపల్లికి బహుసమీపమున నున్న యున్నత పాఠశాలలలో నీ విషయము ప్రస్తావింప నచ్చటి యుపాధ్యాయులే యాశ్చర్యముతోఁ దలయెత్తి చూచుట నా యనుభవములో నున్నది. అందుచేఁ గాకినాడవంటి మహానగరములోఁగూడ నిట్టి మహాసభలో దీనిని నేను బ్రస్తావించుచుండుటకుఁ గారణ మేమని విభ్రమము పొందువా రుండుటలోఁ జిత్రము లేదు. ఆంధ్రుల నౌకాజీవనము తెలిసికొనవలెనన్న మోటుపల్లి సంగతి ప్రత్యేకముగఁ దెలిసికొనవలెను. ఇన్నివందల మైళ్ళ తీరభూమి గల యాంధ్రభూమిలో వెలసిన యన్ని రేవుపట్టణములలో నతి ప్రాచీనమైనది మోటుపల్లి యనుట యతిశయోక్తి కాదు. అథమపక్షము క్రీస్తుశతాబ్దారంభమునుండియు నది ప్రసిద్ధిచెందిన రేవుపట్టణము. అది యుత్తరమునఁ దామ్రలిప్తితోడను దక్షిణమున నాగపట్టణముతోడను సమాన మగు ప్రాముఖ్యము వహించియుండెను. తూర్పున జావా, బోర్నియో, సుమిత్రా, మలయా, ఇత్యాది ప్రదేశములతో మన దేశమున కున్న సంబంధ మంతయుఁ బ్రధానముగా మోటు

పల్లి ద్వారముననే సాగుచుండె ననుటకు సందియము లేదు. ఆ దేశములలో మన సంస్కృతి నేటికి ననేకవిధముల స్థిరముగా ముద్రితమై యున్నది. అంతేకాక అరబ్బీ పారసీకములు, ఈజిప్టు, గ్రీకు, ఇటలీ దేశములతోఁ గూడ విశేషవ్యాపారము మోటుపల్లిగుండనే చాలకాలముగ జరుగుచువచ్చినది. ఇవిగాక మరియొక విశేషము కలదు. కాకతీయ సామ్రాజ్యము పడిపోయినవెంటనే యాంధ్రదేశము భయంకరమైన యంధతమిస్రములోఁ బడిపోయి దిక్కులేక కొంతకాల మలమటించెను, ఆంధ్రదేశ సముద్ధరణమునకుఁ బ్రథమ ప్రయత్నము చేసి కృతార్థులైనది వేమారెడ్డియు నాతని సోదరులును, బంధువులును. అదియు మోటుపల్లిని తమ స్వాధీన మొనర్చుకొనుటతోడనే ప్రారంభ మైన దనుటకును నాధారము కలదు, అట్లే మరియెన్నిమారు లది యుపకరించినదో తెలియదు. ఈ విధముగా మోటుపల్లి యాంధ్రుల నౌకాజీవనమునకే గాక యాంధ్రులకు విదేశసంస్కృతులతో ననాదిగాఁ గల సంబంధములకును నాంధ్రచరిత్రలో ననేక ప్రధానఘట్టములకును నాటపట్టయిన పట్టణము మోటుపల్లిని సంపూర్ణముగాఁ దెలిసికొనిననేగాని యాంధ్రులకీ విశాల ప్రపంచమునఁ గల యున్నతస్థానము విస్పష్టము కాదు. ఆంధ్రుల యాంతరంగికచరిత్రకుఁ గూడ నది యెక్కువ యుపయోగపడును.

మోటుపల్లి ప్రస్తుతము గుంటూరుమండలములో నొక గ్రామము. అది యొక యుప్పుటేరు సముద్రములో గలియుచోట నున్నది. అక్కడ నిప్పటికిని నొక యోడరేవు వున్నది. 1864సం॥ నవంబరు 1వ తేదీన నొక పెద్ద యుప్పెన వచ్చి కృష్ణా గుంటూరు మండలముల తీర ప్రదేశమును ముంచివేసినది. దానికి బందరుగాలివాన యని ప్రసిద్ధమైన పేరు. అప్పుడు బందరు మునిఁగిపోయినదే యందఱకుఁ దెలియును గాని దానితోపాటు మునిఁగిపోయిన యెన్నో రేవుపట్టణముల సంగతి పలువురకుఁ దెలియదు. ఆ మునిఁగినవానిలో మోటుపల్లి రేవొకటి.

## మోటుపల్లి

ఇందులో నే నుదహరించు మోటుపల్లి యీ సమీపమ్మున నిప్పు డా పేర నున్న కుగ్రామము కాదు. ఆ గాలివానకు నుప్పెనకు నిరువది ముప్పది యడుగుల యెత్తునను, గొన్నిమైళ్ళ పొడవునను, వెడల్పునను, పెద్ద యిసుకదిబ్బ వేసినది. దాని యడుగుననుండి తన రహస్యములు విను వారు లే రని లోపల కుములుచున్న మోటుపల్లి వేలానగరము నుద్దేశించి పలుకుచున్నాను. పూర్వము కుశావతీనగరములోఁ గుశమహారాజును దర్శించి తన దీనదశను నివేదించుకున్నట్లు మహాకవి కాళిదాసు వర్ణించిన యయోధ్యానగరలక్ష్మి కంటెను దీనముగా నా వేలానగరలక్ష్మి వాపోవుచున్నది.

"వస్వౌకసారా మభిభూయ సాహం సౌరాజ్యబద్ధోత్సవయా
విభూత్యా। సమగ్రశక్తౌ త్వయి సూర్యవంశ్యే సతి ప్రపన్నా
కరుణా మవస్థామ్"

"విశీర్ణతల్పాట్టశతో నివేశః పర్యస్తశాలః ప్రభుణా వినా మే।
విడంబయ త్యస్తనిమగ్నసూర్యం దినాంత ముగ్రానిలభిన్నమేఘమ్'

వెనుక కుశమహారాజా దీనాలాపము లాలకించినాఁడు. అట్లే మోటుపల్లి దీనాలాపము లాలకించు మీ బోంటి మహారాజులకై వెదకుచున్నది.

మోటుపల్లి రేవు నుద్ధరింప మని కోరుట నా యభిమతము కాదు. మోటుపల్లి రేవును నేఁ డుద్ధరించుట సాధ్య మని నాకును దోఁచదు. ఆ స్థితి దాఁటిపోయినది, కాని మోటుపల్లిలో నడఁగియున్న యాంధ్రుల చరిత్ర నుద్ధరించుటమాత్రము సాధ్యము. ఇప్పటికిఁ దొంబది సంవత్సరములవఱకు నున్న యాంధ్రుల యవిచ్ఛిన్నచరిత్ర యీ దిబ్బలో దాఁగియున్నది. ప్రయత్నములేకయే వెలువడిన మూఁడు శాసనములవలననే మూఁడాం

ధ్రిచరిత్రి యుగముల చరిత్రి యెంతయు వివరముగఁ దెలియవచ్చినది. కాకతీయయుగము, రెడ్డియుగము, విజయనగరసామ్రాజ్యయుగము, వానిచే వెలిఁగింపఁబడినవి. శోధించినచో మరియెంతయయిన బయలు పడగలదు.

క్రీస్తుశకము మొదటి శతాబ్దముతో మోటుపల్లి కథ ప్రారంభించుచున్నది. ఆ శతాబ్దములోఁబుట్టిన 'పెరిప్లసు' అను గ్రీకు గ్రంథములో మోటుపల్లిరే వుదాహరింపఁబడిన దని పలువురు పండితులనిశ్చయము. అందులో నది 'మసేలియా' యను పేరఁ బేర్కొనఁబడినది. ఆ ప్రాంతము తీరము వెంబడి లోభాగమునకు బహుదూరము వ్యాపించి యుండె ననియు, నక్కడ సన్నని వలిపములు నేయఁబడుచుండె ననియుఁ జెప్పఁబడినది. మోటుపల్లిసమీపమునఁ జాకలివానిదిబ్బ యనుచోటఁ బ్రాచీనరోమనుల నాణెములు దొరకినవఁట.

పిమ్మట రెండవశతాబ్దములోఁ బుట్టిన టాలెమీ భూగోళములో మైసోలియా యను నామముతోఁ బేర్కొనఁబడినది మోటుపల్లియే యని విద్వాంసుల నిశ్చయము. ఆ గ్రంథముననే కాకినాడ సమీపమునఁగల కోరంగిరేవు కూడ నుదాహరింపఁబడిన దని తద్విదుల యూహ.

తర్వాతఁ గొన్నిశతాబ్దములచరిత్రి మాఁగువడినది. కాని శాతవాహనులు రాజ్య మంతరించినతర్వాతఁగూడ చంపా, బోర్నియా, జావా, మలే ద్వీపకల్పములలో నిటీవల దొరకిన శాసనముల యాధారమున, నా ప్రాంతములకును నాంధ్రిదేశమునకును విశేష సంబంధమున్న దని చరిత్రికారులు నిశ్చయించుచున్నారు. ఆ సంబంధమునకు రాకపోకలు మోటుపల్లి మీఁదుగనే విశేషము జరిగియుండును. మన ప్రాంతములలో వృద్ధులు చెప్పుకథలలోఁ దఱచు యవద్వీపాదులకుఁ బోయిన యోడల కథలు వచ్చును. వానిలో ముకుళపుర మని చెప్పఁబడునది మోటుపల్లి యే.

చాళుక్యయుగములో మోటుపల్లి యే స్థితిలో నున్నదియుఁ దెలిసికొనుటకు స్పష్ట మగు నాధారములు లభింప లేదు. కాని చాళుక్యులబలమంతరించిన తర్వాతను, కాకతీయగణపతిదేవచక్రవర్తి యీ భాగమును జయించుటకుఁ బూర్వమును గల మధ్యకాలములో నది యే స్థితిలో నున్నదో గణపతిదేవుని శాసనమునఁ దెలియవచ్చుటచేఁ జాళుక్య పాలనములో నది యుచ్చదశ ననుభవించినట్లే యనుమేయింప వచ్చును.

తర్వాత మోటుపల్లిలో క్రీ. శ. 1244 సం॥న కాకతిగణపతి దేవచక్రవర్తి వేయించిన యభయశాసనము మోటుపల్లిని గూర్చి యొక్క గొప్ప వెలుఁగు ప్రసారించు చున్నది. అది యాతఁడు నౌకాయాత్ర చేయు సాహసికులకు సాంయాత్రికుల కిచ్చిన యభయశాసనము. అంతకుఁబూర్వ మక్కడి రాజులు నౌకా యాత్ర చేయు చుండఁ బ్రతికూలవాతముచే నావ యొడ్డుపట్టినను, బ్రమాదమున మెరకపట్టినను, నే కారణముననైనను భగ్నమైనను, అట్టి నౌకలలోని కనక కరి తురగ రత్నాది వస్తువులను బలవంతముగా హరించుచుండిరి. గణపతి యది మాన్పించెను. ప్రాణములకంటెను ధనమే యెక్కువ యనుభవముతో నావికులు సముద్రయానము చేయు మహాసాహసమున కొడఁబడుచున్నారని యాతఁడు గ్రహించి కీర్తికొఱకును ధర్మార్థమును వారి సరకులు వారి కిచ్చివేయు నట్లాతఁడు కట్టడిచేసెను. అట్టివారియొద్ద నాతఁడు క్లుప్తశుల్కముమాత్రము గ్రహింపఁబడు నని శాసించెను. క్లుప్తశుల్క మనఁగా నొక నిర్ణీత మైన సుంక మని నా యభిప్రాయము. ఆ పదముల తర్వాతనే ఏయే సరకున కెంత యీ శుల్కపరిణామమో తెలుపఁబడి యుండుటచే నీ యూహ సమంజస మని భావింతును.

ఈ శాసనములో సాంయాత్రికులకుఁ బ్రయోగించిన విశేషణ పదములు గమనింపఁ దగినవి.

"సకల ద్వీపాంతరీప దేశాంతర పట్టణేషు గతాగతం కుర్వాణే భ్యః సాంయాత్రికేభ్యః—"

ద్వీపము, అంతరీపము నిక్కడఁ బర్యాయపదములుగాఁ బ్రయోగింపఁబడలేదు. అవి మనకుఁ బ్రస్తుతము కాదు. ఈ నావికులు సకల ద్వీపములనుండియు దేశాంతరములనుండియు నొకచోటనుండి యొక చోటికి రాకపోకలు సలుపువా రనుటచే మోటుపల్లి యెట్టి దూరభూము లతో వ్యాపారము సలుపుచుండెడిదో కొంత యూహింప వచ్చును.

ఈ శాసనమువలన నెట్టి సరకులు వచ్చుచుఁ బోవుచుండెడివో కూడ నించుక యెఱుఁగ వచ్చును. కనక కరి తురగ రత్నాదులు—శ్రీగంధము, చీని కర్పూరము, పన్నీరు, దంతము, జవాది, కర్పూరతైలము, తగరము, సీసము, పట్టు నూలు, పవడము, మిరియాలు, పోకలు.

ఈ సందర్భమున గణపతిదేవచక్రవర్తికిఁ బూర్వరాజు లేల దొంగలవలెఁ బ్రవర్తించు చుండిరో కూడఁ గొంత యూహింప వలెను. మొదటికారణము, అరాజకముగా నున్న కాలమున బలముగల దొంగలే దొరలై పాలింతురు. వారికి నౌకాభంగమైన యనాథుల ద్రవ్యములు హరించుట సులభ సాధ్యముగా నుండుటచే నట్లు చేసి యుందురు. ఐనను వా రెంత చెడినవారైనను రాజులుగదా! ఏల నట్లు చేసి యుందురు?

తీరభూమి యరాజకముగా నుండెను. రేవులకు వచ్చు నౌకలను సమర్థతతో శాసించు నాథులు లేరు. అందుచే సముద్రపు దొంగలు తఱచుగా వచ్చి యలజడి చేసి యుందురు. ఆకస్మికముగా వచ్చి ధన ధాన్యములనే కాక మనుష్యులను గూడ బానిసలుగాఁ బట్టుకొని పోయి యుందురు. అందుచే నచ్చటివారికి సముద్రమునుండి వచ్చువా రందఱి యెడ ద్వేషము కలిగి యట్లు ప్రవర్తించి యుందురు. ఏమైనను గణపతి

దేవుఁడు ప్రజల కుపద్రవములు లేకుండ రక్షచేసి నావికుల కభయ ప్రదానము చేసెను. మరల నా రేవు పూర్వవైభవము నందెను.

ఆ శతాబ్దము చివరికాలమున రుద్రమదేవి రాజ్య మేలుచుండఁగా 'మార్కొ-పోలో' యను నిటలీ యాత్రికుఁడు చీనానుండి వచ్చుచు మోటుపల్లిలో దిగెను. దాని నాతఁడు 'ముటఫలి' యని నిర్దేశించెను. ఆ భాగము రాజ్య మేలుచున్న రాణి ధర్మదీక్షను గొని యాడెను. ఆ ప్రాంతములో సాలెపట్టువంటి సన్నని రవసెల్లాలు నేయుదు రని వర్ణించెను. ఇప్పటికిని నా ప్రాంతమును జుట్టియున్న చీరాల, వేటపాలెము, పేరాల. యిత్యాది పట్టణములు సేతవస్త్రములకుఁ బ్రధాన కేంద్రములై యుండుట గమనింపఁ దగినది. అక్కడ విశేషముగా వజ్రములు దొరకునని చెప్పుచు వజ్రములు సంపాదించు విధమును నరేబియనునైట్సు కథలలో వలె వర్ణించినాఁడు. ఐన నేమి? అక్కడ వజ్రముల వ్యాపారమున్న దని యైన నూహింప వచ్చునుగదా !

పిమ్మటఁ గొలఁదికాలమునకే ప్రతాపరుద్రుని యాంధ్రరాజ్య మస్తమించెను. ఆంధ్రదేశము మహాంధతమిస్రములో మునిఁగిపోయెను. ఉద్ధరించు నాథుఁడు లేక యలమటించెను. మరల భారతధర్మవిజృంభణమునుముందు కృష్ణానదికి దక్షిణభాగమున గుండ్లకమ్మ కిరుపార్శ్వములను నున్న పుణ్య భూమిలోఁ బుణ్యాత్ము లైన వేమారెడ్డియు నాతని సోదరులయు బంధువులయు సాహసమున నారంభ మైనది. దాని కంతటికి ముఖ్యకారణము వేమారెడ్డికిఁ గడఁగొట్టు తమ్ముఁడును, ఎఱ్ఱయకుఁ బ్రియ మిత్రుఁడును నగు మల్లారెడ్డి మోటుపల్లి పట్టుకొనుటే. దీని కాధారము నన్నయభట్టారకునివలెనే నిత్య సత్య వచనుఁ డగు నెఱ్ఱయ పద్యమే.

"బాహాదర్పమునం బ్రతీపధరణీపాలావలిం దోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లిఁ గొని సప్తద్వీప సద్వస్తు సం
దోహంబుం దన కిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతి గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్"

ఆ జయించిన ప్రతీపధరణీపాలు రెవరో యెఱ్ఱయ చెప్ప లేదు కాని యీ కాలపు స్థితిగతులను బట్టి మహమ్మదీయ ప్రభువులో, వారి యాశ్రితులో, యై యుండక తప్పదు. వా రెవ రైనను దానిచే వేమారెడ్డికి సముద్రుఁడు నెచ్చెలియై సప్తద్వీప సద్వస్తు సందోహంబును దెచ్చి యిచ్చినాఁడు. అవి యేవి? గణపతి శాసనములో నుదహరింపఁ బడిన యితరవస్తువులతో పాటు కనక కరితురగాదు లై యుండును. ఆయుధములు కూడ నుండి యుండును. ఇది యేదో యొక పద్యములో నన్న మాట గాదు. ఎఱ్ఱయ మరల మరల నాశ్వాసాంతపద్యములతో దీనిని సూచించినాఁడు.

"సకల ద్వీపాంతర ర
త్న కలాప నిరంతరార్చనా కలనారం
భక కుసుమలూరి పుర నా
యక మల్లచమూవ రేణ్య హరిని షేవ్యా!

"బహు జలధి ద్వీపాంతర
మహేశ్వర ప్రహిత కనక మణి మౌక్తిక హ
స్తిహయాద్యర్పణసేవా
బహుమతమల్లరథినీశభక్తిప్రీతా!

"జలధి వలయ సేవాశాలి నిర్నిద్రకీర్తీ!

"రత్నాకర నాయక గుణ
రత్నోజ్జ్వల రెడ్డి మల్ల రాజిత శశ్వ
ద్యత్నార్థ ద్వీపాంతర
రత్నా లంకృత సమస్త రాజ్యరమాంగా!

"సకల జలధివేలా శైలవప్రావమాతా!"

ఈ విధముగా నెఱ్ఱయ శ్రీమదాంధ్ర క్షేమదకరవాలుఁడైన వేమారెడ్డిని సంబోధించి మల్లారెడ్డి వలన సముద్రునితో నెట్లు నెయ్యము కుదిరినదో వర్ణించి యుండుట గమనింప దగినది.

ఈ సాయ మెట్లు లభించినది? ఎఱ్ఱయ వ్రాసిన రామకథ దొరకినచో నెన్నియో యజ్ఞాత విషయములు తెలియఁ గలవు. ప్రస్తుతమునకీ ప్రశ్నకు శ్రీనాథ మహాకవి కొంత యుత్తరము చెప్పుచున్నాఁడు.

"శ్రీపర్వత సోపాన స్థాపకుఁ డగు రెడ్డి వేమ జగతీపతికిన్ బ్రాపైన యవచిదేవయ యాపావాణికి జనించె నభ్యుదయముతోన్" అవచితిప్పయ తండ్రి దేవయ యీ వేమారెడ్డికిఁ బ్రాఁపుగా నుండెనఁట. తిప్పయ బేహారమును శ్రీనాథుఁడు హరవిలాస పీఠికలో విపులముగా వర్ణించినాఁడు. శ్రీనాథుఁడు స్తోత్రపాఠక కవికోటిలోనివాఁ డని కొంద ఱాక్షేపింతు రేమో! ఆ మహాకవి వాక్కులోఁ గొంత వ్యాఖ్యాన ధోరణి యున్నదే కాని యబద్ధము లేదు. ఎఱ్ఱయ మాటలకు వ్యాఖ్యానమే యాతని పద్యము లన్నియు! తిప్పయ వర్తకము తండ్రి తాతల నాఁటినుండి యనూచానముగా వచ్చుచుండినదై యుండవలెను. అవచి తిప్పయ కున్న వర్తక మంతయు దేవయనాఁడును గల దని యించుక యూహించిన నాతని సహాయము మల్లారెడ్డికిని వేమారెడ్డికి నెంత యుపక్తమైనదో యర్థము చేసి కొనవచ్చును. అతని యాన పాత్రిలు కప్పలి జోగులు సంపానులు, పల్లినలికలు. ఆ యాన పాత్రిలు పోవు ప్రదేశములు 'పంజాబు జలనోన్న సింహళము గోవా చోటంగి చీని తరుణాసేరి తవాయి రమణ' మొదలైనవి. అతఁడు తెచ్చు ద్రవ్యములు మిగిలిన వానితోపాటు 'సింహళంబున గంధ సింధురంబులు, హురుమంజి బలుతేజి హరులు."

మార్కోపోలో వర్ణనలుకూడ శ్రీనాథుఁ డతిశయోక్తి పలుకలే దని సూచించును. ఇక్కడి నౌకలను వర్ణించుచు నాతఁ డొక్కొక దానిలో 300 మంది వఱకు నావికు లుందు రని, 60 గదుల వఱకు నుండు ననియుఁ బెద్ద నావకుఁ బది చిన్న పడవలు వ్రేలాడఁ దీయువా రనియు బహు విధముల వాని గట్టితనము వర్ణించెను. ఇతర విదేశ యాత్రికులు

చెప్పిన దానిని బట్టి యా కాలమునఁ బ్రతి సంవత్సరమును నరేబియా పారసీక దేశములనుండి మన దేశమునకుఁ బదివేల గుఱ్ఱములు దిగుమతి యగుచుండెడి వని తెలియ వచ్చుచున్నది. కొందఱు వర్తకులకు నలువది యోడలవఱకు నట్టివి వుండెడి వనియు వారు వర్ణించిన దానిని బట్టి శ్రీనాథుడు చేసిన తిప్పయ వర్ణనలు స్వభావోక్తులే యని నిశ్చయింప వచ్చును.

ఎఱ్ఱయ తర్వాత మోటుపల్లికి సంబంధించినది క్రీ. శ. 1358 నాఁటి యనపోతారెడ్డి శాసన మక్కడఁ గలదు. ఇతఁడు వేమారెడ్డి కుమారుఁడే. యువరాజుగా హరివంశములో వర్ణింపఁ బడినవాఁడే. ఈ శాసనమునుబట్టి చూడ నా మధ్యకాలములో విదేశ వర్తకుల కక్కడి యుద్యోగులు కొన్ని చిక్కులు కలిగించుచుండి రని తోఁచును. అతఁడవి సరిచేసెను. అందులో 'ద్వీపాంతరాల న్యవహారులను వారు మన్నించి పెద్దచేసి, ఎప్పుడు, ఎక్కడనుండి మరియొక ప్రదేశమునకుఁ బోవుద మన్నను నడ్డుపెట్టక యనుపుటకును, ఏ యూరి సరకు తెచ్చినను విచ్చలవిడిగా నమ్ముకొని వలసినచోటునకుఁ దీసికొని పోవుటకు నడ్డుపెట్టకుండుటకును' గట్టడి చేసెను. దీనిచే ద్వీపాంతరములతో వర్తక మెంత యవసరమో వారు గుర్తించినది స్పష్ట మగును. అఁతడు కొన్ని పన్నులు కూడఁ దీసివేసి పూర్వ మర్యాదలు పాటింపఁబడు నని వర్తకులకు నభయహస్త మిచ్చెను. ఈ శాసనము సంస్కృతములో నాంధ్రములోఁ గూడ నుండుట గమనింపఁ దగినది.

క్రీ. శ. 1390 నాఁటికిఁ దాత్కాలికముగనో శాశ్వతముగనో మోటుపల్లి విజయనగర ప్రభువులు పశపఱచుకొనిరి. ఆ సంవత్సరమున హరిహరరాయల కుమారుఁ డగు దేవరాయ యొడయఁడు మోటుపల్లికి వచ్చి యక్కడి పన్నుల మర్యాద నిర్ధారణ చేసి శాసనము చెక్కించెను.

ఇట్లు మనకు యదృచ్ఛగా లభించిన కొలఁదియాధారముల చేతనే మోటుపల్లి యుజ్జ్వల చరిత్ర కొంత విశదమగుచున్నది. పిమ్మటఁ గొలఁది కాలముననే దాని కుత్తరమున మచిలీపట్టణము దక్షిణమునఁ

జెన్నపట్టణము పుదుచ్చేరి మొదలగు రేవు లాంగ్లేయులయు, పరాసు వారియు నాధ్వర్యమున వృద్ధినొందుటచేఁ గ్రమ క్రమముగా మోటుపల్లి ప్రాముఖ్యము క్షీణింప సాగినది, ఐనను 1-11-1864 న, ఉప్పెన వచ్చు వఱకు నామమాత్రావశిష్టముగ నైన నది నిలిచి యుండెను. ప్రస్తుత మచ్చటఁ బెద్ద యిసుకతిప్ప మిగిలినది. మోటుపల్లి యింటిపేరు గల వా రన్ని కులములవారును నాంధ్రదేశ మంతట వ్యాపించి దానికీర్తి యింకను గల దని ప్రకటించుచున్నారు.

చారిత్ర పరిశోధకులకు నేలనో గాని బౌద్ధచైత్యములపై నభిమాన మెక్కువ. అందులో దొరకు వస్తువులలో నెల్ల నెక్కువ యమూల్యమైనవి, మహానుభావులవే కావచ్చును, అస్థులు, చితాభస్మము. మోటుపల్లిచుట్టుపట్టులఁ జిన గంజాం, కొల్లితిప్ప, ఫిరంగిదిబ్బ మొదలగు స్థలములలో నట్టి బౌద్ధమత శేషములుకూడఁ దొరకినవి. అవే యమూల్యము లనుకొన్న చో మోటుపల్లి దిబ్బ త్రవ్వించినచో నివియు దొరకఁ గలవు.

అంతేకాదు. ఆ దిబ్బ త్రవ్వించినచో నంధ్రదేశ చరిత్ర, జీవచ్చరిత్ర, అవిచ్ఛిన్న చరిత్ర, ఉజ్జ్వల చరిత్ర దొరకఁ గలదు. వేమారెడ్డికి నత్యుత్తమ జ్యోతిం గూర్చిన దఁట ఎఱ్ఱయ్య రామకథ! అందులో వేమారెడ్డి సాధించిన శత్రువిజయము లెంత వర్ణింపఁ బడి యున్నవో! ఆ మోటుపల్లి యిసుకమేటలోఁ బూడి పడి యున్నయేదే నొక గృహములో నెఱ్ఱయ రామాయణప్రతి లభించినను లభింప వచ్చును. ఆగ్రంథము విలువ యెంతయో కవిత్రయమువారి కవిత్వము విలువ తెలిసిన వారే నిర్ణయింపఁ గలరు!

మోటుపల్లిని గూర్చి యేమాత్రము సహృదయ లోకములో నాలోచన రేకెత్తించినను నా యీ ప్రయత్నము కృతార్థముగా భావింతును.



# చరిత్ర - సంస్కృతి -

వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి
తాపురము.

మహాజనులారా! ఇప్పు డుపన్యసింపవలసినదిగా నిర్దేశింపఁబడినది 'చరిత్ర-సంస్కృతి-' అను విషయము. ఇందు, చరిత్రకును సంస్కృతికిని సంబంధ మున్న ట్లూహ్య మగుచున్నది.

ఇచ్చటఁ జరిత్ర యను సామాన్యశబ్దమే యుపయోగింపఁబడినది. చరిత్ర యనేకులది యనేక విధములుగాఁ గానఁబడుచున్నది. వారి వారి దృక్పథములలోని భేదమే వారివారి చరిత్ర భిన్నభిన్న మగుటకుఁ గారణము. వారివారి దృక్పథముల భిన్నత్వమునకు వారువారు పరిగ్రహించిన ప్రమాణముల భిన్నత్వమే మూలము.

అది యెట్లనఁగా,—ప్రత్యక్ష మొక్కటే ప్రమాణమని కొందఱు. వీరిమతములో నప్రత్యక్షము లైన పదార్థముల కభావమే. దేహమే యాత్మయని, యిక్కడ సుఖపడుటే స్వర్గమని, యిక్కడ దుఃఖపడుటే నరకమని, మరణమే మోక్ష మని వీరిసిద్ధాంతము. వీరి చరిత్ర వేఱు, వీరి సంస్కృతి వేఱు.

ప్రత్యక్ష మొక్కటే కాక యనుమానముకూడఁ బ్రమాణమే యనువారు కొందఱు. వీరిమత మప్రత్యక్షము లయినను, అనుమానగమ్యము లైన పదార్థము లున్న వనియే. వీరి సిద్ధాంత మిట్లున్నది—

"అర్థా నుపార్జ్య బహుశో ద్వాదశాయతనాని వై
పరితః పూజనీయాని కి మన్యై రిహ పూజితైః॥
"జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి
మనో బుద్ధి రితి ప్రోక్తం ద్వాదశాయతనం బుధైః

ధన మార్జించి జ్ఞానేంద్రియపంచక కర్మేంద్రియపంచక మనో బుద్ధు లనఁబడు ద్వాదశాయతనములనే పూజింపవలయును, (తృప్తిపఱుప వలెను) శివ-విష్ణ్వాది పూజలు నిష్ఫలములు, అని. వీరి చరిత్రి వేఱు. వీరి సంస్కృతి వేఱు.

ప్రత్యక్షము, అనుమానము రెండే ప్రమాణము లనరాదు. వేద ముకూడఁ బ్రమాణమే. ప్రత్యక్షగోచరములు కాఁబట్టి విషయము లనుమానగమ్యము లగుచున్నట్లు ప్రత్యక్షానుమానములకు గోచరింపని విషయములు వేదప్రతిపాద్యము లగుచున్నవి. కనుక వేదము ప్రమాణమే యనువారు కొందఱు.

వీరిమతములో — "ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్" అని చెప్పఁబడిన పంచాయతనపూజయే కర్తవ్యము కాని ద్వాదశాయతన పూజ కాదు.

పరమేశ్వరుఁడు, పరలోకము, పుణ్యాపాపములు, పునర్జన్మము, ముక్తి, యనువానిని ప్రధానలక్ష్యములుగాఁ బెట్టికొని వేదోక్త కర్మాను ష్ఠానమే శ్రేయస్సాధన మని వ్యవహరించునట్టి వీరి చరిత్రి వేఱు. వీరి సంస్కృతి వేఱు, సంస్కృతి సంస్కృతి యని నేఁడు ప్రచురముగా వాడఁ బడుచున్న శబ్ద మపూర్వము కాదు. స్మృతులలో నున్నదే చూడుఁడు.

"స్వే స్వే గృహ్యే యథా ప్రోక్తా స్తథా సంస్కృతయోఽఖిలాః
కర్తవ్యా భూతికామేన నాన్యథా సిద్ధి మృచ్ఛతి
సంస్కారరహితా యే తు తేషాం జన్మ నిరర్థకమ్"

దీనినిబట్టి సంస్కృతి-సంస్కార- శబ్దము లేకార్థకములును క్రియా విశేషబోధకములును నని స్పష్టము.

"సంస్కారోనామ సంస్కార్యస్య గుణాధానేన వా స్యా ద్దోషా పనయనేన వా"

అను బ్రహ్మసూత్రభాష్యమునుబట్టి గుణమును గలిగించునట్టి యుఁ గ్రియావిశేషమే సంస్కార మనఁబడును.

గుణ మని దేనికిఁ బేరో, దోష మని దేనికిఁ బేరో చెప్పఁబడినది—

"నిత్యకర్మాణ్యనుష్ఠీయమానాని పురుషే ధర్మాఖ్యం గుణ మాదధతి, స చ ధర్మః, పాపాఖ్యం మల మాకర్షతి। తతో గుణాధాన మలాపకర్షణ- సంస్కారాభ్యాం సంస్కృతః పుమాన్ బ్రహ్మ విచారేఽధిక్రియతే"

దీనినిబట్టి ధర్మ మని చెప్పఁబడు పుణ్యమే గుణము. పాపమే దోషము. పుణ్యమును గలిగించునట్టిదియు బాపమును దొలఁగించునట్టిదియు నగు సత్కర్మానుష్ఠానమునకే సంస్కృతి యని సంస్కార మని పేరు. సత్కృతి, సత్కారము లేకార్థము లైనట్లు, సంస్కృతి, సంస్కారము లేకార్థకములే.

ఇం కొకటి యాలోచింపవలసియున్నది—

చరిత్ర యొకవ్యక్తిని నాధారపడియుండవలెనా? వ్యక్తియే చరిత్ర నాధారపడియుండవలెనా? చరిత్ర వ్యక్తి నాధారపడియే యుండుపక్షములో వీనిచరిత్ర మంచిది; వీనిచరిత్ర చెడ్డది; యను విభాగమెట్లు? ఒకనిచరిత్ర గ్రాహ్య మగుట, యింకొకనిచరిత్ర గ్రాహ్యము కాకుండుట యెట్లు? కనుక వ్యక్తియే చరిత్రను నాధారపడియుండవలసినట్లు కనఁబడుచున్నది, అయితే చరిత్ర అనఁగా నడవడిక కదా? దానికి వ్యక్తిని విడిచి స్వతంత్రమైన స్వరూప మేమున్నది? అని ప్రశ్న పుట్టును. కాని దానికిఁ బ్రమాణానుగతమైన స్వరూప మొకటి యున్నది. కనుకనే ప్రమాణానురుద్ధమైనవు డీతనిచరిత్ర మంచి దనుట, ప్రమాణవిరుద్ధ మైనవు డీతని చరిత్ర చెడ్డ దనుట సంభవించుచున్నది.

కనుకనే శ్రీమద్రామాయణములో నారదమహర్షిని గూర్చి వాల్మీకి ప్రశ్న యిట్లున్నది—

"కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ క శ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణ చ కో యుక్తః" అని

ఇచ్చటఁ జరిత్రముతోఁగూడియున్న పురుషుఁ డెవ్వ డనియే ప్రశ్న. దీనినిబట్టి ప్రమాణానుసారి చరిత్రము, చరిత్రానుసారి పురుషుఁడు; అనియేకాని పురుషానుసారి చరిత్ర మని లేదు. ఈప్రశ్నపై సమాధానముగా నారదమహర్షి యిట్లు చెప్పెను—

"ఇక్ష్వాకువంశప్రభవో రామోనామ జనైః శ్రుతః" అని. దీనిని బట్టి రామప్రభువుది ప్రమాణానుగత చరిత్ర మని తేలినది.

చరిత్ర, సంస్కృతి, ఈ విధముగా నుండుటచేత నెవ్వని చరిత్రను, సంస్కృతిని లోక మాదరించుటచేత నాత్మోన్నత్యము, దేశోన్నత్యము కలిగి లోకక్షేమము కలుగునో ప్రాజ్ఞు లాలోచింతురుగాక !



# శ్రీపతి పండితుఁడు

నేలటూరి వెంకటరమణయ్య, ఎం. ఏ; పి. హెచ్. డి.

శ్రీపతి పండితుఁడు ఎవ్వఁడు? ఎప్పటివాఁడు? అను విషయములను మొదట విచారింతము. పండితత్రయమని ప్రఖ్యాతినందిన ఆంధ్రశైవాచార్యులు మువ్వురిలో నితఁడు ప్రథముఁడు.

'హరభక్తి యుత్పత్తి కధిపతినాఁగఁ - బరగెను దొల్లి శ్రీపతిపండితయ్య
"చెనసి భక్తిక్రియాస్థితికర్త యనఁగఁ-జనియెను లెంక మంచన పండితయ్య
దూరాన్యసమయసంహారుఁడై చనియెశూరుఁడు మల్లికార్జునపండితయ్య"

అని పాల్కురికి సోమనాథుఁడు మువ్వురిని బ్రశంసించియున్నాఁడు. (చూ. పండితా. భా ౧. పుట ౭.) ఇతఁడు బెజవాడ వాస్తవ్యుఁడని యీతని మాహాత్మ్యమును బ్రకటించుగాథల వలన దెలియ వచ్చుచున్నది. ఇతని కాలమునిర్ణయించుటకుఁదగిన సాక్ష్యము లభించు చున్నను ఇటీవలఁ గొందఱు వాఙ్మయవిమర్శకులు దానిని తాఱుమాఱు చేసి తమ వీరశైవ మతాభిమానముపెంపునను నిజమౌలికత్వ ప్రకటనాభిలాష చేతను వాఙ్మయచరిత్రయందు లేనిపోని చిక్కులను దెచ్చిపెట్టుచున్నారు. శ్రీపతి పండితుని కాలనిర్ణయ సందర్భమున మొట్టమొదట దృష్టియం దుంచుకొనవలసిన విషయ మొకటి కలదు. అతని కాలమును దెల్పు సమకాలిక శాసనాద్యాధారము లెవ్వియు లేవు. అర్వాచీనాధారముల మూలముననె అతని కాలమును దెలిసికొనవలసి యున్నది. శ్రీపండితుని బేర్కొనిన యర్వాచీనులలో బ్రథముఁడు మల్లికార్జున పండితారాధ్యుఁడు - ఇతఁడు లింగాయత మత స్థాపకుఁడైన బసవనికి

సమకాలికుఁడను నైతిహ్యము గలదు; గనుక బసవనివలెనే యితఁడును క్రీ. శ. ౧౨ వశతాబ్ద్యుత్తరార్ధమునందు, అనఁగా క్రీ. శ. ౧౧౫౦-౧౧౬౦ సంవత్సరముల ప్రాంతమున వర్ధిల్లె నని వాఙ్మయచరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. ఇతఁడు తన శివతత్త్వసారములో

'ఒక్కఁడె దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా!'[1]

యని చెప్పియున్నాఁడు. క్రీ. శ. ౧౩ వ శతాబ్దారంభమున, కాకతీయ ప్రతాపరుద్రుని కాలమునఁ దెలింగాణమున వెలసిన పాల్కురికి సోమనాథుఁడు శ్రీపతి పండితుని వృత్తాంతమును వర్ణించియున్నాఁడు. 'భక్తుండు శ్రీపతి పండితుఁడీశు - భక్తుని కిల కోటి బ్రాహ్మణులైన నెన యన్న నాలుక నేఁ గోసివైతు - ననుచు ననంతపాలుని సభాస్థలిని నెక్కొనఁగాఁ జంద్రనిప్పులుగా దెచ్చక్కనిపొత్తి పచ్చడమున ముడిచె'?[2]

మఱియు బెజవాడ మల్లేశ్వరస్వామి యాలయమున, పల్లకేతఁడను మాండలికుఁ డొక్కఁడు నెలకొల్పిన శిలాశాసనమున శ్రీపండితుని యుదంతము గలదు.[3] శాసనకాలమును దెల్పు భాగము చెడిపోవుటవలన నది యెప్పటిదో నిర్ణయించుటకు సాధ్యముగాక యున్నది. క్రీ.శ. ౧౪ వ శతాబ్దము వాఁడైన సోచిరాజు తనమనువంశపురాణమున శ్రీపండితుఁడు బెజవాడ తెలిక కులమువారికే కాక అప్పు డాప్రాంత దేశమును బాలించుచుండిన చాళుక్య విష్ణువర్ధన మహారాజ దేవ భల్లాన వీరపెరుపెరుమాళ్ ప్రతాప చోళునకును గురువనియు వారిరువురు శకాబ్దము ౧౧౦౫ వ సంవత్సరమున నుండిరనియు వ్రాసియున్నాఁడు.[4] తరు

1. శివతత్త్వ.
2. బస. పు. ఆ ౭. పుట ౨౧౦.
3. ARE. 536 of 1909, SII. X. 22.
4. Madras Govt. of. MSS. Library, Tel. Des. cat. I. No. 160.

వాత కీర్తి కాయులైన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి పూర్వికులలో నైదవ తరమువారైన కాశీనాథుని వీరనారాధ్యుఁడు తన ధర్మగుప్తాభ్యుదయములో మల్లికార్జున పండితారాధ్యాదులు చెప్పిన కథనే పెంచి వ్రాసియున్నాఁడు. సంగ్రహముగ నతఁడు చెప్పు వృత్తాంత మిది- శివాద్వయపారగుఁడగు శ్రీపతి పండితుఁడు విజయవాటియందు శైవాగమ నైగమ బోధాయోగమునఁ జరింపుచుండెను. శివుఁడే దైవమనియు, శివ భక్తులె సత్కులీన సిద్ధాంతపరులనియుఁ జెప్పుచు ననంతపాల మహీంధవాది శిష్యతతి గొలువ విజయవాటీపురంబున విజయధ్వజం బెత్తి యుండెను. అతఁ డొకప్పుడు శైవుఁ డగు గొడగరియింట భుజించెను. పరవాదు లది కనిపెట్టి యతని ననంతపాలుని సభకుఁ గొనిపోయి యీ విషయ మతని కెఱుకపఱచి మాదిగవాని యింటఁ గుడిచినవాఁడు మీ కెట్లు గురువు కాఁగలఁడని యడిగిరి. శ్రీపతి పండితుఁడు దనకార్యము నెంత చక్కఁగ సమర్థించు కొన్నను వినక పౌరు లాతని బహిష్కరించి పచనాదుల కగ్ని నొసఁగ రైరి. దానికిఁ గినిసి శ్రీపతి పండితుఁడు మల్లికార్జున దేవాలయమున కాగ్నేయభాగమునం దుండు జమ్మి వృక్షము చెంత కేఁగి యగ్ని నాకర్షించి తనపైపచ్చడమును జెట్టుకొమ్మకుఁ గట్టి పట్టణమున నెవ్వరింటను వెలుఁగరా దని యాజ్ఞాపించెను. తత్కారణమున బెజవాడ యందు నగ్ని కఱవయ్యెను. పురజను లెల్లరు వచ్చి శరణార్థు లైరి. అంతట నతఁ డగ్నిని విడిచిపుచ్చెను.[5]

శ్రీపతి పండితుని కాలమును గూర్చి పైఁ బేర్కొనిన యాధారములైదింటి మూలమున నిర్ణయింపవలసియున్నది. క్రీ. శ. ౧౧౫౦-౧౧౬౦ ల ప్రాంతమున వర్ధిల్లిన మల్లికార్జునపండితారాధ్యు లితనిని బేర్కొని యుండుట వలన నితఁ డతనికిఁ బూర్వుఁడనుట నిశ్చయము. అతని కెంతకాలము ముం దుండెనో నిశ్చయించుటకుఁ బాల్కురికి సోమనాథుఁడును నతఁడు

5. ప్రభాకరశాస్త్రిల బస. పు. పీఠిక. పుటలు ౬౪-౬౬.

చెప్పిన కథనే పెంపందించి వర్ణించిన వీరనారాధ్యుఁడును, దోడ్పడుచు న్నారు. శ్రీపతి పండితుఁ డనంతపాలుని సభాస్థానమున నుండె నని యొక రును, ననంతపాలుని గురు వని మఱియొకరును దెల్పుచున్నారు. ఈ య నంతపాలుఁ డెవ్వఁ డనునది విచారింపఁదగిన యంశము. ఇతఁడు క్రీ. శ. ౧౦౭౬ మొదలు ౧౧౨౬ వఱకును, కల్యాణ కటకము రాజధానిగఁ బశ్చి మ చాళుక్య సామ్రాజ్యమును మహావైభవముతోఁ బాలించిన త్రిభువన మల్ల బిరుదాంకితుఁడైన యాఱవ విక్రమాదిత్యుని సేనాధిపతి - క్రీ. శ. ౧౧౨౦ వ సంవత్సర మందు మొదటి కులోత్తుంగ చోళచక్రవర్తి దివం గతుఁడైన పిమ్మట ననంతపాల దండనాయకుఁడు దన ప్రభువు నాజ్ఞఁబడి వేంగి దేశమును సమస్తమును జయించి స్వాధీన పఱచుకొనెను. క్రీ.శ. ౧౧౨౦-౧౧౩౦ మధ్య నితఁడు నెలకొల్పిన శాసనములు పెక్కులు తీరాం ధ్రదేశమునఁ బలుతావులఁ గానవచ్చుచున్నవి. కావునఁ బాల్కురికి సోమనాథాదులు వచించు నట్లు శ్రీపతి పండితుఁ డనంతపాలుని సభా స్థానమం దుండినది వాస్తవమేని యతఁడు క్రీ. శ. ౧౧౨౦-౧౧౩౦ సం॥ల ప్రాంతమువాఁడు కావలయును; కాని పై సిద్ధాంతమునకుఁ గొన్ని ప్రతిబం ధకములు గలవు. ప్రథమమునఁ బేర్కొనఁదగినది పోచిరాజు వీరన్న గారి వ్రాఁత. ఆతఁడు శ్రీపతిపండితుఁడు బెజవాడ తెలిక వారికిని చాళుక్య విష్ణువర్ధన మహారాజ దేవ భల్లాన వీర పెరుమాళ్ ప్రతాపచోళునికిని గురు వనియును, నతఁడును నతని శిష్యుఁడైన చాళుక్యవిష్ణువర్ధన ఇత్యాది బిరుదాంకితుఁడైన రాజును శకాబ్దము ౧౧౦౯ (క్రీ. శ. ౧౧౮౭-౮) సంవత్సరమున మనియుండి రనియుఁ జెప్పియున్నారు. వీరన్న వ్రాఁత చరి త్రకు విరుద్ధమైనది. శకాబ్దము ౧౧౦౯ ప్రాంతమునం దింకను చోళసా మ్రాజ్యమును జాళుక్యచోళవంశజుఁడైన ముమ్మడికులోత్తుంగ చక్ర వర్తి పాలించుచుండెను. అతని పక్షమున నెల్లూరున కుత్తరమున నుండు తీరాంధ్రదేశమును వెలనాటి చోళరాజులు పాలించుచుండిరి. ఈ వంశ

ములలోఁగాని దక్షిణదేశమందలి మఱి యే వంశమునఁగాని పైఁ బేర్కొని న రాజొకఁడు కానరాఁడు. కావున నతఁడు చరిత్రకతీతుఁడైన కల్పిత పురుషుఁడు; అట్టి కల్పితపురుషుఁడు శ్రీపతిపండితునకు శిష్యుఁ డగుట యసంభవము. కాఁబట్టి యతని వ్రాఁతనుబట్టి శ్రీపతి పండితుని కాలము నిర్ణయముసేయఁగడఁగుట వ్యర్థము.

శ్రీ సి. హయవదనరావుగారు శ్రీపతిపండితుఁడు క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతమువాఁడని నిర్ధారించినారు. వీరి కాలనిర్ణయము శ్రీకరభాష్య మందలి మధ్వద్వైతసిద్ధాంతఖండనముపై నాధారపడియున్నది. హయ వదనరావుగారును వారివలె మఱికొందఱును శ్రీకరభాష్యము శ్రీపతి పండితకృత మని యభిప్రాయపడుచున్నారు. ఇది విచారణీయము. పేరు నుబట్టి చూడఁగా నది శ్రీకరవిరచిత మగునేమో యను సంశయమున కెడము గల్గుచున్నది. శ్రీపతియే శ్రీకరుఁడు కాఁగూడదా యను ప్రశ్న యొకటి బయలువెడలవచ్చును. కావచ్చునేమొ అగు నని దృఢముగఁ బల్కుటకుఁ దగినసాక్ష్య ముండినఁగదా. వాదమునకై యొకవేళ శ్రీకరుఁ డే శ్రీపతి యని యొప్పుకొన్నను భాష్యకారుఁడే పండితత్రయములోని శ్రీపతి యని నిశ్చయించుట కాధార మెద్ది? కీ. శే. కళాప్రపూర్ణ శ్రీ చిలుకూరి నారాయణరావుగారు శ్రీకరభాష్యమునందు మాధ్వద్వైత మతఖండనము లేనేలే దని వాదించుచున్నను, భాష్యమును బఠించినవారికి నారాయణరావుగారి వాదము సత్యాత్మకము గా దని తెల్లము గాఁగలదు. శ్రీకరుఁడు మాధ్వద్వైతమును ఖండించినదేమొ వాస్తవమె. అతఁడె శ్రీపతి యగుట నిక్కువమేని యతఁడు పండితత్రయములోని శ్రీపతి పండితుఁడు కాఁజాలఁడు; అన్యుఁడు కావలయును. అట్టివాఁడును కలఁడా? కలఁ డనియే శాసనములు సాక్ష్యము పల్కుచున్నవి. కృష్ణరాయలనాఁటి యొకానొక శాసనమున

"ద్రవిడదేశదల్లి మహాగ్రహారవప్ప పొదటూరుగ్రామాధిపం వేద శాస్త్రపారంగతం బ్రహ్మచర్యవానప్రస్థగృహస్థ యత్యాద్యాశ్రమ ప్రతిష్ఠం ఆశ్వలాయన సూత్రోత్పన్నతం భారద్వాజగోత్రోద్భవం ఋక్శాఖాధ్యాపకం ఉదయగిరి కన్నడిగకుల తిలకం విప్రాగ్రగణ్యం సత్కుల ప్రసూతం శ్రీపత్యాచార్యుణం" అనియున్నది.[7] ఈ శ్రీపత్యాచార్యులు కృష్ణదేవరాయల సుప్రసిద్ధసేనాపతులలో నొక్కఁడైన రాయసం కొండమరసయ్యగారి పితామహుఁడు. కొండమరసయ్య నరసానాయకుని కాలముననే సేనాధిపత్యము వహించియుండుటచే నతని పితామహుఁడగు శ్రీపత్యాచార్యుఁడు క్రీ. శ. ౧౫ వ శతాబ్దపూర్వార్ధమున జీవించియుండె నని మనము నిశ్చయముగఁ జెప్పవచ్చును. మాధ్వద్వైతమును ఖండించిన శ్రీపతి యితఁడు కావచ్చును గాని పండితత్రయములోని శ్రీపతి కాఁజాలఁడు.

శ్రీపతిపండితుఁడు క్రీ. శ. ౧౦ వ శతాబ్దమున యుద్ధమల్లుని కాలమున క్రీ. శ. (౯౨౯-౩౫) బెజవాడయం దుండె ననియు నారాజు మల్లేశ్వరాలయమున నెలకొల్పిన శిలాశాసనగ్రంథ మాతనిచే రచియింపఁబడె ననియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వక్కాణించియున్నారు.[8] మొదట వేంకటరావుగారు చెప్పినట్లు శ్రీపతిపండితుఁడు క్రీ. శ. ౧౦వ శతాబ్దమున యుద్ధమల్లునికాలమున నుండెనేమొ కనుఁగొందము. వేంకటరావుగారి సిద్ధాంతమును నిల్పుటకుఁ దగినసాక్ష్య మొందును గానరాదు. (1) మల్లికార్జున పండితారాధ్యుఁడు శ్రీపతిపండితుని బేర్కొని ప్రశంసించినాఁడని యందఱును నొప్పుకొనువిషయమే. మల్లికార్జున పండితారాధ్యుఁ డెప్పటివాఁడు? క్రీ.శ. ౧౧౫౦ ప్రాంతమువాఁడని యొకచోటను, నంతకంటెఁ గచ్చితముగ క్రీ. శ. ౧౧౦౦-౧౧౭౦ ల మధ్య మనియె నని

7. SII. IX. Part ii. No. 507, ARE. 87. of 1912
8. Lives of Telugu Poets. pp. 68-82.

మఱియొకచోటను వ్రాసియున్నారు.[9] ఇంతవఱ కుపలబ్ధమైనసాధన సామగ్రినిబట్టి మల్లికార్జునపండితారాధ్యుఁడు క్రీ. శ. ౧౨ వ శతాబ్ది మధ్యమున వర్ధిల్లె నని స్థూలముగఁజెప్పుటకే సాధ్యపడునుగాని క్రీ.శ. ౧౧౦౦ మొదలు ౧౧౭౦ వఱకును జీవించియుండుటకు వలనుపడదు. మల్లికార్జున పండితారాధ్యుఁడు శివతత్త్వసార మను గ్రంథమును రచియించియున్న నుసందుమూలమున నతనికాలమును నిర్ణయించి చెప్పుటకు వీలుగాదు. కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగా రన్నట్లు మల్లికార్జునపండితారాధ్యుని కాలమును, పాల్కురికి సోమనాథ కృత పండితారాధ్య చరిత్రయందుఁ బేర్కొనఁబడిన యాతని సమకాలికుల కాలమునుబట్టి నిర్ణయింపవలయును. కల్యాణమందలి బసవేశ్వరుఁడును, చందవోలులోని వెలనాటిచోడుఁడును, పానుగంటియందలి యుదయావనీశుఁడును ముఖ్యులు. బసవేశ్వరుఁడు కల్యాణరాజ్యము నాక్రమించి క్రీ. శ. ౧౧౬౦ మొదలు ౧౧౬౭ వఱకును బ్రజాపాలన మొనర్చిన కాలచుర్య బిజ్జలరాజుముఖ్యమంత్రి. క్రీ. శ. ౧౧౬౭ వ సంవత్సరమున బసవని శిష్యులు బిజ్జలుని దెగటార్చిరి. మఱుసటి వర్షమున బిజ్జలుని పుత్రుఁడు బసవని వధించెను. వెలనాఁటిరాజులు చందవోలు రాజధానిగఁ దీరాంధ్రదేశమందు విశేషభాగమును బాలించిరి. వీరు చాళుక్య చోళ చక్రవర్తుల కరిగాపులై వారి నామములనె ధరించుటచేత వీరికి వెలనాటి చోళు లను పేరు వచ్చినది. వెలనాటి రాజులలో చోడ నామధారు లిరువురు గలరు. మొదటి వెలనాటిచోడరాజు క్రీ. శ. ౧౧౧౫ నుండి ౧౧౩౬ పర్యంతము పాలించినట్లు తెలియవచ్చుచున్నది. ఇతనిమనుమఁడు రెండవ వెలనాటి చోడరాజు. అతఁడు క్రీ. శ. ౧౧౬౩ మొదలు ౧౧౮౦ వఱకును రాజ్యమును బాలించెను. ఈ యిరువురిలో మల్లికార్జున పండితారాధ్యుని సమకాలికుఁడు రెండవవాఁడని తోఁచుచున్నది. ఏల యనఁగా

9 Ibial pp. 69, 73.

నీరెండవ వెలనాటి చోడరాజే బసవకిని బిజ్జలునికిని సమకాలికులు. ఇట్లనుటకు మఱియొక కారణముగూడఁ గలదు. పండితారాధ్యుఁడే కుపితుఁడై వెలనాటిచోడుని శపించె ననియుఁ దత్కారణమున వ్రణబాధితుఁడై మృతినందఁగా రాజ్యమునం దంతఃకలహములు పెచ్చుపెరిగె ననియు—

'అంత రాజ్యార్థమై యనిఁ బోరి యతని
సంతాన మెల్ల ని స్సంతాన మయ్యెఁ
బా డయ్యెఁ దద్భూమి పండితవిభుని
యీాడితశాపమహిష్ఠతఁ జేసి,'

యనియుఁ బాల్కురికి సోమనాథుఁడు దెల్పుచున్నాఁడు.[10] వెలనాటి చోళుల రాజ్యము ఖిలపడిపోయినది రెండవచోడని యనంతరమే కాని మొదటిచోడని తరువాతఁగాదు; కావునఁ బాల్కురికి సోమనాథుఁడు చెప్పినట్టి యైతిహ్యము సత్యాత్మకమేని మల్లికార్జున పండితారాధ్యుఁడు క్రీ. శ. ౧౧౮౦ తరువాతఁగూడ జీవించియుండవలయును. పానుగంటి యుదయావనీశుఁడు శకాబ్దము ౧౧౮౪ (క్రీ. శ. ౧౧౬౨) వ సంవత్సరమున రాజ్యముసేయుచుండినట్లు జడచర్ల శాసనమువలనఁ దెలియుచున్నది.[11] ఆసంవత్సరముననే వ్రాయించిన కాకతీయ రుద్రదేవుని యనుమకొండ శాసనమున నీ యుదయరాజును జయించి యతని రాజధానియైన కందూరును దగులఁబెట్టితి నని చెప్పుకొనియున్నాఁడు.[12] కావున మల్లికార్జున పండితారాధ్యుని సమకాలికు లెల్లరును క్రీ. శ. ౧౨ వ శతాబ్దపు టుత్తరార్ధమున నుండినట్లు తెలియవచ్చుచుండుటవలన నతఁడును నప్పుడె వర్ధిల్లియుండవలయును. క్రీ. శ. ౧౧౪౦ నుండి ౧౨౦౦ వఱకును నతని జీవితకాలమని మన మూహ సేయవచ్చును. మల్లికార్జున పండితా

10. పండితా మహిమ. (ఆం. గ్రం. మా. ప్రచురణ) పుటలు ౬౮-౯౯
11. తెలిం. శాస. ఇతర నెం. 6 రు.
12. తెలిం. శాస. కాక: నెం. 5 రు.

రాధ్యునిచేఁ బొగడ్తనందిన శ్రీపతిపండితుఁడు తత్పూర్వుఁడనుట నిస్సంశయము; కాని యెంతపూర్వుఁడో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు.

శ్రీ నిడదవోలు వేంకటరావుగారు శ్రీపతిపండితుని కాలమును కచ్చితముగ నిర్ధారించుటకు నడుముగట్టి నూతన మార్గమును ద్రొక్కియున్నారు. బెజవాడ మల్లేశ్వరుని యాలయమున బల్లకేతఁ డను మాండలికుఁడు నిల్పిన శిలాశాసనముపై నాఁతగొని శ్రీపతిపండితుని క్రీ. శ. ౧౦ వ శతాబ్దములోనికి నూకివేయ సమకట్టినారు. అందు,

'తతః శ్రీపండితారాధ్య నామ్నా భక్తోత్తమేనచ
శివభక్తా ఏవ నూనం దేవర్షిభ్యో ధికాఇతి
చీనాంబరే గ్నిం సంస్థాప్య శమీకోమలశాఖయా
బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్ష స్సమజాయత' 13

యని పండితారాధ్యుఁడు పచ్చడమునం దగ్నిని ముడిచినకథ ప్రస్తావింపఁ బడినది. ఈ శాసనమునఁ బేర్కొనఁబడిన పండితారాధ్యుఁ డెవ్వఁడు? పండితారాధ్యనామము వాఙ్మయమున మల్లికార్జునున కొక్కనికె చెల్లుచున్నది. అజ్ఞానముచే శాసన గ్రంథకర్త శ్రీపతిపండితుని యుదంతమును మల్లికార్జునున కంటఁగట్టినాఁడా? లేక పండితారాధ్య నామము బండితత్రయమువారి కెల్ల సామాన్యమా? ఇందలి వాస్తవ మెట్లుండినను శాసన మెప్పటిదో చెప్పుటకు వీలుగాదు; కాని వేంకటరావుగారు యిట్లు పలుకుచున్నారు. 'ముందు నే నుదాహరించిన బెజవాడ మల్లేశ్వరాలయమునందలి పల్లికేతని శాసనమున కాలము తెలుపఁబడియుండలేదు గాని యది ౧౧వ శతాబ్దమునాఁటి దని శాసనపరిశోధకులు దెలుపుచున్నారు. కాఁబట్టి యీతఁడు (శ్రీపతి) యంతకు (౧౧వ శతాబ్దమునకు) ముందటివాఁడగుట నిశ్చయమే' యని దృఢముగఁ దీర్మానించినారు.[14]
పల్లకేతని శాసనము క్రీ. శ. ౧౧ వ శతాబ్దమునాఁటిదని శాసన పరి

13. SII. X. No. 12
14. Lives of Telugu Poets. P. 73

శోధకులు దెలుపుచున్నా రనుట వట్టి యపోహము. శాసనపరిశోధకు లట్లు చెప్పలేదు. వా రది క్రీ. శ. ౧౩ వ శతాబ్దము నం దాంధ్రదేశమును బాలించిన కాకతీయ గణపతిదేవ రుద్రాంబల కాలము నాఁటివి కావచ్చు ననిరి. చూడుడు.

'These were Palla Keta- bhupala and siddhayadeva Maharaja to whom belong Nos. 536, 606 (saka 1153), and 609 (saka 1199). The two latter (ie. Nos. 606 and 609) recording grants for the merit of the Kakatiya King Ganapati and his daughter, Rudramba, show that these Pallava chiefs were subordinates of the Kakatiyas No. 536 (that is the inscription of Palla Keta at Malleswaraswami temple at Bezwada cited above) the date of which is lost may have to be referred to the same period, though the chief mentioned therein belonged to a different branch of the family whose members were worshippers of the feet of Malleswara of Bezwada and not the devotees of Kamakotyambika of Kanchi.' [15]

కావున పల్లకేతని శాసనము భగ్నమైన యూఁతకోల యైనది. శాసనమున కాలము దెలుపలేదు. శాసన పరిశోధకు లది క్రీ. శ. ౧౧ వ శతాబ్దమునాఁటి దని చెప్పనులేదు. ఇఁక దాని నాధారపఱచుకొని శ్రీపతి పండితుని ౧౦ వ శతాబ్దములోనికి నెట్టుట కెట్లు సాధ్యపడునో శ్రీ వేంకటరావుగారే సెలవియ్యవలయును.

లేని ప్రాచీనతను శ్రీపతిపండితునకుఁ గల్పింప గడఁగుటచే శ్రీ వేంకట్రావుగారికి పాల్కురికి సోమనాథుని సాక్ష్యము కంటక ప్రాయమైనది. కావున నతఁడు చరిత్రజ్ఞానములేక వ్రాసెననియుఁ దత్కారణమున నతఁడు చెప్పు వాక్యములు సత్యముకా వనియు నిరసించినారు. చూడుఁడు.

15. ARE, 1910. Part ii, Para 8.

'సోమనాథుఁడు వ్రాసినది చరిత్రమే యైన నది వింతతీరులు గలది. ఆతఁడు వ్రాసిన వన్నియు సత్యమైన చరిత్రకింద పరిగణింపరాదు. ఉదాహరణముగ బసవపురాణమున కల్యాణకటకమును బాలించిన బిజ్జలుని వంశమువారు కాలచుర్యులు. వారిని సోమనాథుఁడు చాళుక్య లని చెప్పినాఁడు. ఇది చరిత్ర విరుద్ధముగదా!' యని యబ్బురపడిరి. మఱియు ననంతపాల దండనాయకుని శాసనములలో శ్రీపతిపండితుని ప్రస్తావన లే దనియుఁ దత్కారణమున వా రేకకాలమువారు కాఁజాల రనియు, శ్రీపతిపండితుఁ డనంతపాలుని కాలమునకు ముందువాఁ డనియే చెప్పనగు ననియు శాసించినారు.[16] సోమనాథుఁడు బిజ్జలునికిఁగాని యతని యనంతరము రాజ్యమేలిన కాలచుర్యవంశజులకుఁగాని సమకాలిఁకుఁడు. పదునాల్గవ శతాబ్ద ప్రారంభమున వెలసినవాఁడు. ఇప్పటివలె నప్పుడు చరిత్ర గ్రంథములు వ్రాయుట యాచారముగాదు. అప్పటి వారి చరిత్రజ్ఞానమంతయు దరములఁబడి పరంపరగ వచ్చు నైతిహ్యముల రూపమున నుండెడిది. బిజ్జలుఁడు చాళుక్యుఁ డను నమ్మకము సోమనాథుని కాలమున జనసామాన్యమందు వాడుకయం దుండి యుండవల యును. దానినే యతఁడు గ్రంథస్థము గావించెను. చాళుక్యవంశజులైన యారె వీటిరాజు లీ కారణముననే బిజ్జలుని దమ పూర్వీకులలో నొక్కనిగఁ బరిగణించిరి. సోమనాథుఁడు బిజ్జలుని చాళుక్యుఁ డనుటకు మఱి యొక కారణముగూడఁ జెప్పవచ్చును, కల్యాణకటకము చాళుక్యులది. చాళుక్య సింహాసనము నాక్రమించి యధిష్ఠించుటచే నతఁడు చాళుక్య సామ్రాజ్యాధిపతి యాయెను. ఈ కారణమున సోమనాథుఁ డతని చాళుక్యునిగఁ బరిగణించియుండవచ్చును. ఇందు వింత యేమియు లేదు. పూర్వ చాళుక్య వంశజుఁడైన రాజేంద్రుఁడు చోళసింహాసనము నాక్రమించుకొనిన పిమ్మట దాను చోళుఁడ నని చెప్పుకొనలేదా? క్రీ. శ. ౧౬, ౧౭ శతాబ్దములలో తంజాపుర మధుర రాజ్యములఁ బాలించిన

16. Lives of Telugu Poets, pp. 78-79.

యాంధ్రనాయకులు మహారాష్ట్ర ప్రభువులును దాము చోళ పాండ్య భూపాలుర మని చెప్పుకొనలేదా? వారి సమకాలిక గ్రంథకర్తలును వారిని నట్లె పేర్కొనలేదా? కావున సోమనాథుఁడు బిజ్జలుని చాళుక్యుఁ డని చెప్పిన దొక దొడ్డతప్పుగ గ్రహించి తత్కారణమున నాతఁడు చెప్పిన దంత సత్యాత్మకము గా దని త్రోసిపుచ్చుట పాడియా?

అనంతపాలుని శాసనములలో శ్రీపతిపండితుని ప్రస్తావన లేక పోవుట వాస్తవమే. లేకపోయినంత మాత్రమున నతని యాస్థానమున లేఁడని వాదించుట సరియా? సమకాలికుల నెల్ల ననంతపాలుఁడు శాసనములందుఁ బేర్కొనియున్నాఁడా? అట్లు పేర్కొని శ్రీపతిపండితుని బేర్కొనకపోయినఁగదా యతఁ డనంతపాలుని యాస్థానమున లేఁడని యనుకొనఁ దగును. బిజ్జలుని శాసనములలో బసవని యడ పొడ గానరాదే. బిజ్జలుని ముఖ్యప్రధానిగదా బసవఁడు. వేంకటరావుగారి మార్గము నవలంబించిన బసవఁడు బిజ్జలుని కాలమువాఁడు గాఁ డనికదా చెప్పవలయును. సమకాలిక శాసనములం దెచ్చటను మల్లికార్జున పండితారాధ్యులు పేర్కొనఁబడియుండలేదే. తత్కారణమున మల్లికార్జున పండితారాధ్యు లప్పటివారు కా రని చెప్పవలయును. శాసనములు చరిత్రలుగావు; రాజకీయ మత సాంఘికార్థికవిషయములను వర్ణించుట వాని యుద్దేశము గాదు. రాజులుగాని వారి యధికారులుగాని ధర్మపోషణార్థము దేవబ్రాహ్మణాదుల కొసఁగిన భూదానాదికములను బ్రకటించుట కొఱకె యవి పుట్టినవి. శాసనోక్త దానాది ధర్మకార్యములతో సంబంధము గలవారే యందుఁ బేర్కొనఁబడుదురు. అన్యుల కందు తావులేదు. కావున శ్రీపతిపండితుని ప్రస్తావన యనంతపాలుని శాసనములలో లేనంతమాత్రమున వారు సమకాలికులు గా రని యెంచుట సరికాదు. పాల్కురికి సోమనాథుని కాలమునుండియు శైవగ్రంథములు శ్రీపతిపండి

తుఁ డనంతపాలునియొక్క గురు వని చాటుచున్నవి. శ్రీ వేంకటారావు గారు చూపిన యాధారములకంటెఁ బ్రబలమైనవి వెలువడునందాక శైవగ్రంథములలోఁ జెప్పియుండునట్లు శ్రీపతి యనంతపాలుని గురు వని యు వా రిరువురును క్రీ. శ. ౧౧-౨౦-౧౧౩౦ ప్రాంతమున మనియుండి రనియుఁ దలంచుట సమంజసము.

ఇంతవఱకు శ్రీపతిపండితుని కాలమునుగూర్చి విచారించితిమి. ఉపలబ్ధమైన సాక్ష్యమును బరిశీలించిచూడఁగా నతఁడు శ్రీ హయవదన రావుగారు చెప్పినట్లు క్రీ. శ. ౧౮౦౦ల ప్రాంతమువాఁడు గాని శ్రీ నిడద వోలు వేంకటారావుగారు వచించునట్లు క్రీ. శ. ౯౩౦ ప్రాంతమువాఁడు గాని కాఁజాలఁడని తెల్లమైనది. పండితారాధ్య పాల్కురికి సోమనాథుల కాలమునుండియు శైవవాఙ్మయమునఁ బరంపరగ వచ్చు గాథలను బట్టి చూడ నతఁడు క్రీ. శ. ౧౨వ శతాబ్దారంభకాలమున వర్ధిలియుండునని తోఁచుచున్నది.

ఇఁక నిడదవోలు వేంకటరావుగారు వక్కాణించునట్లు శ్రీపతి పండితుఁడు కవియై యుద్ధమల్లుని బెజవాడ మల్లేశ్వరాలయ శిలాశాసన గ్రంథమును విరచించెనేమొ కనుఁగొందము. శ్రీపతిపండితుఁడు కవి యనుట కాధారమెద్ది?

'శ్రీపతిపండితుల్ శివుఁడమీఁకవులు
నాపండితయ్యగారనుఁగు పండితులు'

అను సోమనాథుని ద్విపద.[17] 'కవులు' అనునది ప్రభాకరశాస్త్రిలవారి సవరణ యని తోఁచుచున్నది. నేను బరిశీలించిన తాళపత్రప్రతులలోఁ 'గావ్య' డని యున్నది. కావ్యుఁ డను మాటకు 'శుక్రుఁ డను' నర్థ మొక్కటియే నిఘంటువులయందుఁ గానవచ్చుచున్నది. కావ్యుఁ డను

17. బస. పురా. పుట. ౪౬.

పాఠమునకు సందర్భశుద్ధి లేకపోవుటయే పైసవరణకుఁ గారణమై యుండ నోపు. కాని శ్రీ నిడదవోలు వేంకటావుగారు, "ఇచ్చట కవికిఁ గావ్య శబ్దము వాఁడఁబడినది. 'కావ్యుఁడు' అనునది కవి పరముగా వాడుట కలదు. చిత్రకవి పెద్దన అప్పనకవి దీనిని బ్రయోగించినారు"[18] అని చెప్పుచున్నారు. విచారణీయము. 'గాథలు పెక్కు-కువాఁడె కావ్యుఁడు సుమతీ' యని సుమతీ శతక ప్రయోగమును జూపినారు. ఇది సందే హాస్పదము. ఏలయనఁగా నాయొద్దనుండు సుమతిశతక ప్రతియందు, గాథ లు పెక్కు-డువాడె కథకుఁడు సుమతీ' యని యున్నది.

సోమనాథుఁడు శ్రీపతిని గవి యని చెప్పె ననియె గ్రహింతము - చెప్పినంత నేమాయె - సోమనాథుని వాక్యములకు లేనిపోని ప్రాధాన్య మును గల్పించి శ్రీపతి కవి యని చంకలెగురవైచినంత నేమిలాభము? మహారాజులు మున్నగు వారి కొలువునందువలె శివుని కొలువునందును నియోగములుండినట్లు వర్ణింపఁదలపెట్టినారు; ఒక్కొ-క్క- భక్తుని కొక్క- నియోగమును దగులఁగట్టినారు; శ్రీపతికి కవితఁజెప్పు నుద్యోగమును గల్పించినారు; కావున సోమనాథుని మాటల నాధారపఱచుకొని వాని పై నూహాసౌధ నిర్మాణము సేయుట సమంజసము గాదు. శ్రీపతి కవి త్వముఁ జెప్ప నేర్చినవాఁడేయని యొప్పుకొందము. ఆతఁడు సంస్కృతము న నేల కవిత్వమును జెప్పి యుండరాదు? తెనుఁగునందె యని నిశ్చయించి చెప్పుట యెట్లు? ఒక్క-కవియైన నితఁడు కవియని చెప్పియుండలేదు.

ఇఁక యుద్ధమల్లుని శాసనమునకు శ్రీపతి పండితుఁడు గర్తయగు నేమొ విచారింతము; శాసనము నందెచ్చటను దద్రచయిత ప్రస్తాప ము గానరాదు. శ్రీ నిడదవోలు వేంకటావుగారు ప్రతిపాదించిన మఱి యొక సిద్ధాంతము ననుసరించి శాసనమును నెలకొల్పిన యుద్ధమల్లుఁడే

18 Lives of Telugu Poets P. 79. No. 1.

శాసన గ్రంథమును రచియించి నాఁడని చెప్పవలసియుండఁగా నతని వదలి పెట్టి శ్రీపతిని బట్టుకొనిరి. ఏలయనఁగా

"1 ఈ శాసనము బెజవాడయందు నెలకొల్పఁబడుట, శ్రీపతి పండితుఁడు బెజవాడ వాస్తవ్యుఁడగుట.

2 ఇది మల్లేశ్వరస్వామి యాలయమున నెలకొల్పఁ బడుట. శ్రీపతి పండితుఁడు శైవమత ప్రాశస్త్యము నిరూపించుటకుఁ గొంగున నిప్పులు మూటఁగట్టి శివభక్తి మహిమను బ్రదర్శించుట మల్లేశ్వరుని యాలయమున జరుగును. 19

19 ఈయంశమును మల్లికార్జున పండితారాధ్యు లిట్లు చెప్పియున్నారు.

'.........ముడిచె నిప్పులు చీరన్
స్రిక్క_క శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నలజమ్మి శివా'

ఇందు మల్లేశ్వరాలయము మాటలేదు. పాల్కుర్కి సోమనాథుఁడు రెండు పర్యాయము లీ విషయమును బ్రస్తావించియున్నాఁడు.

(1) బసవ పురాణమున,
'అనుచు ననంతపాలుని సభాస్థలిని
నెకొ్కనఁగాఁ జండ్ర నిప్పులుగాదె
చక్కనఁబొత్తిపచ్చడమున ముడిచె'

(2) పండితారాధ్య చరిత్రమున,
వెండియు శ్రీపతి పండితుల్......
తోరఁగి పైపొత్తి పచ్చడమున నిప్పు
లడరంగ ముడిచిన నదియేమి చేసె

సోమనాథుఁడు మల్లేశ్వరుని యాలయమునుగాని జమ్మిచెట్టును గాని పేర్కొనలేదు. మీఁదు మిక్కిలి యనంతపాలుని సభాస్థలమున నిప్పులు కొంగున ముడిచినట్లు చెప్పినాఁడు. అర్వాచీనుఁడైన కాశీనాథుని

వీరనారాధ్యుఁడొక్కఁడె యీసందర్భమున 'విజయవాటికాపుర మల్లికార్జునాగ్నేయ భాగంబున నున్న శమీశాఖి సమీపమున కరిగి' యని వచించినాఁడు. ఇతఁడైనను శ్రీపతిపండితుని మాహాత్మ్య ప్రదర్శనము మల్లేశ్వరాలయమున నడచినట్లు చెప్పలేదు; దాని కాగ్నేయము నందున్న జమ్మికడ నడచినట్లు వక్కాణించినాఁడు; కావున నీ ప్రదర్శనము వేంకటార్యుగారన్నట్లు మల్లేశ్వరాలయమున జరుగలేదు.

(3) ఈ శాసనమున గొరగలను గూర్చిన ప్రశంస యుండుటచే వీరశైవమతమునకు సంబంధించినది యగుట.[20] శ్రీపతిపండితుఁడు తెనుఁగు దేశపు పండితత్రయములో మొదటివాఁడుగ నుండుట.

(4) ఇందులోనున్న మధ్యాక్కరలు మాత్రాచ్ఛందస్సునుండి యేర్పడిన దేశివృత్తములగుట ఈరచన తెలుఁగుకవితా పరిణామ ప్రారంభదశను సూచించుట శివకవులు దేశీయచ్ఛందస్సులో మతవ్యాపనకు కవితారచన నుపయోగించుట.[21]

20. గొరగలనుగూర్చి ప్రశంస యుండినంతమాత్రమున వీరశైవులకు సంబంధించినదనుటకు వలనుపడదు. 'గొరగ' సంస్కృత గురుశబ్దభవము - గొరగలు వీరశైవము పుట్టుటకు ముందె శాసనాదులందు పేర్కొనఁబడియున్నారు. మఱియు యుద్ధమల్లుఁడు గట్టించినది కార్తికేయుని యాలయము. దానికి సంబంధించిన మఠముననె గొరగలుఁ బేర్కొనఁబడినది. వీరశైవమున కార్తికేయునికిఁ బ్రాధాన్యములేదు; కావున నివి వీరశైవ నిర్మాణము లనుట తగదు. చాళుక్యులకు కులదైవము; యుద్ధమల్లుఁడా దేవునికి గుడి కట్టించుట సహజమె. మఱియు క్రీ. శ. ౯, ౧౦వ శతాబ్దమున నాంధ్ర కర్ణాట దేశము బలోఁ బెక్కుతావులఁ గార్తికేయస్థానము లుండినవి. బళ్ళారి మండలములోనికుడతని యందలి కార్తికేయ తపోవనము ముఖ్యమైనది. అందలి స్థానపతులు కాలాముఖులుగాని వీరశైవులు గారు.

21. వైష్ణవులుకూడ వాడినారు - అక్కరలను వ్రాసిన శివకవియొక్కఁడేనియు లేకపోవుటవింత.

(5) శ్రీపతి కవిగా మన కెఱుకపడుట.

వేంకటరావుగారు వచించినవన్నియు నిజమని యొప్పుకొన్నను నవి శ్రీపతి పండితుఁడు యుద్ధమల్లుని శాసనగ్రంథమును రచించెనని నిర్ధారించుట కెట్లు సాధనములు కాఁగలవో తెలియకున్నది.

శ్రీపతి పండితుఁడే యుద్ధమల్లుని శాసనగ్రంథమునకుఁ గర్తయని నిరూపించుటకు శ్రీ వేంకటరావుగారు మఱియొక ప్రబల కారణమును జెప్పియున్నారు. 'కీర్తిశేషులు ఆంధ్రగ్రంథాలయోద్యమ పితామహులు నిడదవోలు సుందర పండితుల వారిట్లు వ్రాసియున్నారు. శివకవులలో'

'అతులిత శివభక్తునితోఁ
బ్రతిసేయఁగ రారు కోటిబ్రహ్మలు లని శ్రీ
పతి పండితయ్య నిప్పలఁ
గుతుకమతి న్మూటఁగట్టెఁ గొంగునను శివా.
అలయుద్ధమల్లుఁ బనుపునఁ
దెలుఁగున మధ్యాక్కరలను దెలిపెను దొలిఁదా
నిల శ్రీపతిపండిత కవి
లలితగతి న్విజయనగర రామయలింగా.
అక్కరలఁ జెప్పె నాఁడె తెలుఁ
గక్కరములఁ యుద్ధమల్లుఁ డవి చెక్కించెన్
నిక్కమతఁ డొక్కశివకవి
రక్కొనన నుతియింతు విజయరామయలింగా. [22]

22. ఈ పద్యములనుగూర్చి వేంకటరావుగా రిట్లు వ్రాసినారు,

'పండితత్రయము' అను నా వ్యాసమున నిప్పటికి 21 యేండ్లనాఁడు శ్రీపతిపండితునిగూర్చి వ్రాసినపుడు దీనిని విద్వల్లోకమునకుఁ దెలిపితిని. (చూ. భారతి సం. 3. సంచిక 3. క్రోధన ఫాల్గున) (మార్చి 1926) 23-33 పుటలు' కాని వేంకటరావుగారు భ్రమపడినట్లున్నది. ఈ వ్యాసమును రచియించినవారు శ్రీ నిడదవోలు వెంకటరమణ గారు కాని వెంకటరావుగారు కాదు. ఈ పొరపాటును వారు సవరించుకొనుట యుక్తము.

పైపద్యములను జదువఁగనే,

'...నిలిపి రంధ్రవిషయమున, జనసత్యాశ్రయుని దొట్టి చాళు క్య నృపుల్" అనుకుమారసంభవపద్యము లేలనో స్మరణకు వచ్చినవి. పై కందపద్యములను రచించిన శ్రీ నిడదవోలు సుందరం పండితుల వారు ఈ శతాబ్దారంభ దశకములం దుండిరని మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగా రాంధ్రగ్రంథముల క్యాటలాగులను దిలకించువారి కెల్ల విదితమే. వారు మన వేంకటావుగారి జనకులుగాని యన్న్యాలు గారు. తమకు వెయ్యేండ్లకుముందున్న శ్రీపతిపండితుని విషయమున కాధార మెద్దియో తెలుపరైరి. నిప్పును గొంగునఁ గట్టిన కథ పండితా రాధ్యులకడ సంగ్రహించినది. యుద్ధమల్లుని శాసన గ్రంథరచనను గూర్చినది నిరాధారమైన వ్రాఁత. కేవల కల్పనాకథ. పితృవాక్య పరి పాలకులైన శ్రీ వేంకటావుగారికి దమయయ్యమాటలయం దెంత నమ్మ కము గల్గినను నిష్పాక్షికముగ నరయువారి కవి విశ్వాసపాత్రములు గాఁజాలవు. వీరి మాటలసత్యమును రుజువు సేయఁగల ప్రాచీన శాసన గ్రంథాద్యాధారము లభించునందాక నవి యంగీకార్యములు గావని డవిణగొట్టి పల్కవచ్చును.



# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.



శ్రీ పీఠాపురము మహారాజావారిధనసహాయముచే రచింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవ సంపుటమును, 980 పుటలుగల మూఁడవ సంపుటమును, 980 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున, అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చులాద్యమందుఁగల సంస్కృతాంధ్ర శబ్దము లన్నియుఁ గలవు. రెండవ సంపుటము "క" మొదలు "ఙ" వఱకుఁ గల శబ్దములను, తృతీయసంపుటమున "చ" మొదలు "తృ" వఱకుఁ గల శబ్దములును, చతుర్థ సంపుటమున "తె" మొదలు "న" వఱకుఁ గల శబ్దములునుగలవు. ఇది వఱకున్న నిఘంటువులన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈ పుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపుతో నీ క్రింది వెల నిర్ణయింపఁబడినది.

క్యాలికో బైండింగు, ఒక్కొక్క వాల్యూము రూ 6 లు.